A. P. G. O. M. L. & R. I. Series 8.

మంచెళ్ల వాసుదేవకవి విరచితా

# వైకృతచన్ద్రికా

## (ఆన్ధ్ర సిద్ధాన్త కౌముదీ)

ప్రధాన సంపాదకులు

వాఙ్మయ మహోధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"

సంపాదకులు:

తెలుగు వ్యాఖ్యాకర్తలు:

శ్రీ యన్. సి. యస్. వేంకటాచార్యులు

విశారద

డాక్టర్ అమరేశం రాజేశ్వరశర్మ, M. A., Ph. D.

భాషాప్రవీణ




ప్రచురణ :

డైరెక్టర్,

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్

లైబ్రరి అండ్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

హైదరాబాదు.

DIVINE

Every literary ma
feels proud of claiming
something about Gita
author Jayadeva. Tl
Sanskrit is famous f
transcendental philoso

Gita Govindam l
in most of the Indi
That proves that Gita
in India as that of
scarcely necessary to
cannot do without Ja

Dr. Vadlamud
prapoorna, in his for
to this book has prep
in which the Ashtapa
regions of the count
the popularity of thi
classic opera depicti
sweet and soft music.
of love between Rad
cribed in this work w
krishnaiah quoting
Mr. P. V. Narasimha
to the Doctor's own 1
Kriti,says that the Gop
in each other and that
Dr. Gopalakrishnaial
was the incarnation o
of the birth of Gop
previous birth, The
Gita Govindam (tl
with the passage of t
as Sri Harsha becan
as Kakula Swamy a
It was originally titled
the erotic songs su
and lovelorn Gopika
So also Jayadeva's o
according to Dr.

The second wor
is Gita Shankaram w
Kavi Ananta Naray
alive and active in
the Gita Shankaram v
in the mind.

*First Publication*

*Two Thousand*

**Price : Rs. 38/-**



*Copies available at:*

Director
Andhra Pradesh Government
Oriental Manuscripts Library and Research Institute
Afzal Gunj - HYDERABAD-12
A. P.

PRINTED IN INDIA
AT THE ANDHRA PRADESH GOVT. TEXT-BOOK PRESS,
MINT COMPOUND, HYDERABAD
ANDHRA PRADESH.

# విషయసూచిక


పుట

తొలిపలుకు ... ... ... ix

ఆముఖం ... ... ... xi

I. వైకృత చన్ద్రికా స్వరూప-స్వభావ మహాగవేషణ విషయసూచిక

1. భాష-వ్యాకరణం ... ... ... xxxi
2. త్రిలింగదేశం ... ... ... xxxiv
3. పురాతన వ్యాకరణాలు ... ... xxxix
4. సంస్కృతంలో తెలుగు వ్యాకరణాలు ... xLii
5. అష్టాధ్యాయి ? ... ... ... xLiv
6. వార్త్తికాలు ... ... ... xLvi
7. కారికలు ... ... ... xLvii
8. సూత్రరహిత భిన్నవృత్తి విషయ విభాగాలు ... xLix
9. క్రమరాహిత్యం ... ... ... L
10. సూత్రార్థ విరుద్ధ వృత్తులు ... ... Li
11. గ్రంథ వైశిష్ట్యం ... ... LXv
12. ప్రాకృతభవాలు ... ... ... LXv
13. విశేషాలు ... ... ... LXix
14. వాసుదేవుని కాలం ... ... ... LXxiii
15. వాసుదేవకవి ఒక్కడేనా ? ... ... LXxvii
16. వైకృత చంద్రిక-సంపాదన-ముద్రణ ... ... LXxxiv
17. తెలుగు వృత్తి ... ... ... LXxxvii

పుట

18. మన్నించండి ... ... ... xc

II. వైకృతచంద్రికా విషయసూచిక
సుబంత విభాగః

1. సంజ్ఞా ప్రకరణమ్ ... ... ... 3
2. సంధి ప్రకరణమ్ ... ... ... 13
స్వరసంధిః ... ... ... 13
హల్సంధిః ... ... ... 18
3. స్వాది ప్రక్రియా
అజన్త ప్రకరణమ్ ... ... ... 25
హలన్త ప్రకరణమ్ ... ... ... 52
అవ్యయ ప్రకరణమ్ ... ... 66
4. స్త్రీ ప్రత్యాయ ప్రకరణమ్ ... ... 75
5. విభక్త్యర్థ ప్రకరణమ్ ... ... 78
6. సమాస ప్రకరణమ్ ... ... ... 86
7. తద్ధితాదేశ ప్రకరణమ్ ... ... 96
8. తద్భవ ప్రకరణమ్ ... ... ... 103
సంస్కృత భవాః ... ... 103
ప్రాకృత భవాః ... ... 123
శౌరసేనీ భవాః ... ... 133
మాగధీ భవాః ... ... 135
పైశాచీ భవాః ... ... 136

పుట

xc

3

13

13

18

25

52

66

75

78

86

96

103

103

123

133

135

136



| | | |
|---|---|---|
| | | పుట |
| | చూళికా పైశాచీ భాషాః ... ... | 144 |
| | అపభ్రంశ భాషాః ... ... ... | 147 |
| | వైకృత విశేషాః ... ... ... | 153 |
| | తిజన్త విభాగః | |
| 9. | తిజన్త ప్రకరణమ్ ... ... ... | 156 |
| | కృదన్త విభాగః | |
| 10. | కృదన్త ప్రకరణమ్ ... ... ... | 201 |
| 11. | అకారాది సూత్ర సూచిక ... ... | 209 |
| 12. | మా యితర ప్రచురణలపై వివిధాభిప్రాయాలు ... ... | 233 |

# సూత్ర సంఖ్య

| ప్రకరణం | | సూత్రాలు |
|---|---|---|
| 1. | సంజ్ఞ ... ... ... | 34 |
| 2. | సంధి ... ... ... | 46 |
| 3. | స్వాది-అజంత ... ... ... | 81 |
| 4. | స్వాది-హలంత ... ... ... | 36 |
| 5. | స్వాది-అవ్యయ ... ... ... | 30 |
| 6. | స్త్రీ ప్రత్యయ ... ... ... | 10 |
| 7. | విభక్త్యర్థ ... ... ... | 18 |
| 8. | సమాస ... ... ... | 39 |
| 9. | తద్ధితాదేశ ... ... ... | 37 |
| 10. | తద్భవ - సంస్కృత భవ ... ... | 91 |
| 11. | ప్రాకృత భవ ... ... ... | 53 |
| 12. | శౌరసేనీ భవ ... ... ... | 10 |
| 13. | మాగధీ భవ ... ... ... | 4 |
| 14. | పైశాచీ భవ ... ... ... | 41 |
| 15. | చూళికా పైశాచీ భవ ... ... | 14 |
| 16. | అపభ్రంశ భవ ... ... ... | 29 |
| 17. | వైకృత విశేష ... ... ... | 9 |
| 18. | తిజన్త ... ... ... | 207 |
| 19. | కృదన్త ... ... ... | 35 |
| | సూత్రసంఖ్యా మొత్తం | 824 |

# తొలిపలుకు

గతంలో సీతాకల్యాణం (యక్షగాన నాటకం), శృంగార పదములు, ఇందుమతీ పరిణయము, శ్రీ గీతగోవిందము-గీతశంకరము, రాధావంశీధర్ విలాస్ నాటక్ (హిందీ), ఏనుగుల వీరాస్వామీస్ జర్నల్ (ఇంగ్లీషు), శ్రీ విరూపాక్ష-శ్రీరామ తామ్రశాసనములు-విజయనగరసామ్రాజ్యం-ఆరవీటి వంశ చరిత్ర (తెలుగు-ఇంగ్లీషు) అన్న యేడు గ్రంథాలను పరిశోధనాత్మకాలైన విమర్శావిషయాలతో ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరి అండ్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ పక్షాన ప్రకటించాము. క్రీ. శ. 16వ శతాబ్దంలో వున్న సంస్కృతాంధ్ర ప్రాకృతాది అష్టభాషా కవిపండిత శిరోమణి అయిన మంచెళ్ల వాసుదేవకవి రచించిన 'ఆంధ్ర సిద్ధాంత కౌముది' అనే నామాంతరంగల 'వైకృత చంద్రికా' అనే అపూర్వ, అసాధారణమై సంస్కృతభాషలో రచింపబడిన తెలుగు వ్యాకరణ గ్రంథాన్ని ఎనిమిదవ గ్రంథంగా ప్రచురిస్తున్నందుకు సంతోషిస్తున్నాము. ఆంధ్రదేశంలో వివిధప్రాంతాలలో లభించిన యేడు వ్రాతప్రతుల ఆధారంగా యీ గ్రంథం సంపాదించబడింది. దీనికి ఆధారభూతాలయిన వ్రాతప్రతుల వివరం యిది: 1. తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్‌లో వున్న శిథిల తాళపత్రప్రతి ఒకటి-కాగితపు వ్రాతప్రతి ఒకటి. 2. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తులో వున్న ఒక కాగితపు ప్రతినిచూచి పుత్రికను రచించిన డాక్టర్ అమరేశం రాజేశ్వరశర్మ గారి వద్దనున్న కాగితపు వ్రాతప్రతి. 3. నా వద్దనున్న తాళపత్ర గ్రంథం. 4. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు లోని శ్రీ వాసిరెడ్డి శ్రీ కృష్ణ స్మారక గ్రంథాలయంలో ఉన్న ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని S. 1145 నెంబరు గల కాగితపు వ్రాతప్రతి, S. 1263 నెంబరు గల కాగితపు వ్రాతప్రతి. 5. పొన్నూరు శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కళాశాల ఆంధ్రోపన్యాసకులు కళాప్రపూర్ణ డాక్టర్ కొండవీటి వెంకటకవిగారి వద్ద నున్న ఒక కాగితపు వ్రాతప్రతి. మొత్తం యీ యేడు గ్రంథాలలోను, నావద్ద ఉన్న తాళపత్ర గ్రంథం అన్నింటికంటె ఉత్తమమైన ప్రతి. ఈ ప్రతులు ఆధారంగా వైకృత చంద్రికను శ్రీ ఎన్. సి. యస్. వేంకటాచార్యులు, డాక్టర్ అమరేశం రాజేశ్వరశర్మగారలు నా పర్యవేక్షణలో ఎడిట్ చేశారు. వారే వాసుదేవుని వృత్తికి తెలుగువ్యాఖ్యకూడా రచించారు. అందుకు వారికి నా కృతజ్ఞతలు. ఈ వైకృతచంద్రికను సంపాదించడంలో, సందేహాలు వచ్చినచోట గ్రంథపాఠాలు సంభవించినచోట అనేక సందర్భాలలో ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయంలో వున్న వ్రాతప్రతులతో సరిపోల్చి చూడడంలో అవసరమైన భాగాలన్నింటిని యెత్తి వ్రాసి కాపీలు పంపడంలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు తెలుగుశాఖలోని లెక్చరర్, ప్రముఖ భాషావేత్త డాక్టర్ లకంసాని చక్రధరరావు, ఎమ్.ఏ., పిహెచ్.డి. గారు

యెంతో సహాయపడ్డారు. అందుకు డాక్టర్ చక్రధరరావుగారికి మా హృదయ పూర్వకమైన కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తున్నాము.

ఆంధ్ర సాహిత్యాన్ని, సంస్కృత సాహిత్యాన్ని, ఆంధ్రుల చరిత్ర-సంస్కృతులనూ బహుముఖంగా వికసింపజేసి అభ్యుదయ ముఖంలో నడిపించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యెంతో కృషిచేస్తున్నది. ఈ కృషిలో తొలిమెట్టుగా ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టుల లైబ్రరి అండ్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్‌ను స్వతంత్రప్రతిపత్తిగల ఒక ప్రత్యేక డైరెక్టరేటుగా-మన ముఖ్యమంత్రి గౌరవనీయులైన శ్రీ జలగం వెంగళరావుగారు యేర్పరచి, నా మీద అమేయమైన గౌరవాభిమానాలుంచి నన్ను డైరెక్టర్‌గా నియమించినారు. అందుకు వారికి నా కృతజ్ఞతాభివందనాలు. మన భాషా సంస్కృతీ చరిత్రలను వికసింపచెయ్యడంలో గౌరవనీయులైన ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారితో పాటు సోషల్ వెల్‌ఫేర్, ఓ. యమ్. ఎల్ & ఆర్. ఐ. ఆర్కియాలజీ, & మ్యూజియమ్స్, స్టేట్ ఆర్కైవ్స్, సాంకేతిక విద్యాశాఖా మాత్యులు, రచయితలు-విమర్శకులు అయిన శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు, విద్యాశాఖ కార్యదర్శి అయిన శ్రీ ఎమ్. వి. రాజగోపాల్, I.A.S., ఆర్థిక-ప్రణాళికశాఖ కార్యదర్శి శ్రీ బి. పి. ఆర్. విఠల్, I.A.S. గార్లు, అత్యంత సమర్థులు, విశాల సహృదయులు అయిన విద్యాశాఖ ఉపకార్యదర్శి శ్రీ బూరుగుపల్లి రామచంద్రారెడ్డి, ఆర్థికశాఖ ఉపకార్యదర్శి శ్రీ బి. ఆర్. భూషణం గార్లు యెంతో చేయూత నిస్తున్నారు. అందుకు వీరందరికీ మా హృదయ పూర్వకమైన ధన్యవాదములు. అభ్యుదయకరమైన కార్యక్రమాలలో అవసరమైనప్పుడల్లా అండగా నిలుస్తున్న ముఖ్యమంత్రి జాయింట్ సెక్రటరీ, సహృదయులు మిత్రులు శ్రీ బి. వి. యస్. ప్రకాశరావుగారికి, ముఖ్యమంత్రి ప్రత్యేకాధికారి సహృదయులు శ్రీ యస్. సీతాపతిగారికి మా కృతజ్ఞతలు.

ప్రభుత్వం ప్రచురిస్తున్న యీ గ్రంథాలను ఓర్మితో, శ్రద్ధతో ముద్రిస్తూ అడుగడుగునా సహకరించి తోడ్పడుతున్న ఆంధ్రప్రదేశ్ టెక్స్టుబుక్ ప్రెస్ డిప్యూటీ డైరెక్టర్ శ్రీ జి. రామకృష్ణారావుగారికి అసిస్టెంట్ డైరెక్టర్లు శ్రీ పి. నారాయణన్, శ్రీ ఎం. ఆర్. సభాపతిగార్లకు కృతజ్ఞతలు. ముద్రణ సమయంలో అనేకవిధాల సహకరించిన శ్రీ వి. గంగాధరం, శ్రీ కె. నరసింహారావు, శ్రీ వై. శ్రీరాములు, శ్రీ బి. జేమ్సు ప్రభృతులకు శుభాకాంక్షలు.

వాఙ్మయ మహోధ్యాయ
వడ్లమూడి గోపాలకృష్ణయ్య
కళా-ప్రపూర్ణ
డైరెక్టర్
ఓరియంటల్ మాన్యుస్క్రిప్టుల లైబ్రరి అండ్
రిసర్చి ఇన్‌స్టిట్యూట్.

హైదరాబాద్,
*15-8-1975.*

# ఆముఖం

తెలుగు భాషకు చాలా ప్రాచీనమయిన వ్యాకరణ చరిత్ర వున్నది. దీనిలోని విశేషాలను గూర్చి వ్రాసేముందు అసలు భాషకు వ్యాకరణ మోటి అవసరమా ? అనేదాన్ని గూర్చి కొంచెం పరిశీలిద్దాం.

ఏ భాషయినా వ్యాకరణం వుంటేనేకాని వృద్ధిపొందదనే నియమంలేదు. వ్యాకరణం నేర్చుకున్నాకగాని, భాష మాట్లాడరాదనే శాసనం ఎక్కడా వుండదు. ఉన్నా దాన్నెవరూ ఖాతరు చేయరు. నిజమాలోచిస్తే భాషను మాట్లాడేవారిలో వ్యాకరణమనేది ఒకటి వుండాలని తెలిసినవారి సంఖ్య చాలా చాలా తక్కువ. అయినా వారి వాగ్వ్యవహారంలో బాధ ఏమీ కలగడంలేదు. అభిప్రాయ ప్రకటనకు అంతరాయమూ యేర్పడ్డంలేదు. అయినప్పుడు యీ వ్యాకరణం ఎందుకు ? నిష్ప్రయోజనంకదా అనవచ్చు. కాని చిత్రమేమంటే ప్రపంచంలో నాగరకాలయిన అన్ని భాషలకూ వ్యాకరణాలున్నాయి. అన్ని వ్యాకరణాలూ "యిలా అంటే తప్పు, యిలా అంటే ఒప్పు" అని నియమాలు యేర్పరచనూ యేర్పరచినయి. ఆ నియమాలను అందరూ తు. చ. తప్పకుండా పాటించారా అంటే మళ్లీ అదేం లేదు. కొందరు పాటించనూ పాటించారు. కొందరు వాటినేమీ లెక్కచెయ్యకుండా తమ దారిని తాము వెళ్లినవారూ ఉన్నారు. ఇలాగ ఏ భాషా వ్యాకరణ చరిత్ర తీసికొన్నా, కొద్దో, గొప్పో, యీ పద్ధతే కనిపిస్తుంది. అంతేకాదు. ఉన్న వ్యాకరణ నియమాలను కాదని, వ్యాకరణంమీద దండెత్తేవారు కూడా మళ్లా వ్యాకరణం భాషకు బొత్తిగా అవసరంలేదని ఒప్పుకోరు. వ్యాకరణం వుండాలనేదే అందరూ అంగీకరించే సిద్ధాంతం. అయితే అది ఎల్లా వుండాలె ? అనే విషయంలో మాత్రం యెవ్వరి దారి వారిదే.

నాకు చూస్తే భాషకు వ్యాకరణం దేశానికి రాజ్యాంగం లాంటిదని పిస్తుంది. నాగరిక దేశాలన్నింటికీ, లిఖితాలుగానో-అలిఖితాలుగానో రాజ్యాంగా లున్నాయి. రాజ్యాంగం ఉండాలనే అందరూ అనేది. అయితే ఎలా వుండాలె ? ఎంతవర కుండాలె ? మార్చవచ్చునా ? ఈ మొదలైన విషయాలు అభిప్రాయ భేదా లుండడానికి వీలయినవి. వ్యాకరణం సంగతీ అంతే! అందులోను కవులూ రచయితలూ నిరంకుశులనేది నిజంకదా! కాబట్టి వారు కనుక సమర్థులయి ప్రతిభావంతులయితే ఏ రచయిత వ్యాకరణం ఆ రచయితదే! ఆ రచయిత యిట్లా

వ్యాకరణకర్తలు సహజంగా ఏర్పడ్డ నియమాలను ఉన్నవి ఉన్నట్లుగా చూపి ఊర్కోవడంలేదు. ఆ నియమాలను క్రమబద్ధంచేసి ఆ క్రమానికి భంగం కలిగినచోట్ల అలా చేయరాదని శాసించడం ప్రారంభించారు. ఆ శాసించడం మరీ ఎక్కువయి వ్యాకరణం శాసనంగా తయారయింది. శాసనమే తప్ప స్వేచ్ఛ బొత్తిగా లేకపోతే ఎక్కడయినా జరిగేది తిరుగుబాటే. వ్యాకరణ విషయంలోనూ అంతే జరిగింది. అయితే స్వేచ్ఛకే ప్రాధాన్యం యిచ్చి శాసనం అసలే లేకపోతే వచ్చే ప్రమాదం కూడా సామాన్యమయింది కాదు. కాబట్టి యీ రెంటికీ మధ్యేమార్గం ఒకటి వుండడం అత్యావసరమనిపిస్తుంది.

సంస్కృత వ్యాకరణశాస్త్రం చూస్తే ప్రధానంగా పాణినీయం శాసనం చేయడంలో చాలా గట్టిదిగా కానవస్తుంది. అందులోనూ ముందటివారి నియమాలను తరువాతివారు సవరిస్తూపోయినా మొత్తంమీద భాషను శాసించి క్రమభంగాన్ని సహించకపోవడమే ఎక్కువగా కానవస్తుంది. అందువల్ల కలిగిన గొప్ప ప్రయోజనంకూడా ఒకటి లేకపోలేదు. అదే దాని సంస్కృతత్వం. అది కొన్ని శతాబ్దాలపాటు చెక్కు చెదరకుండా ఒకే రూపంతో నిలిచివుండడం. అయితే ఎంతమందిని యీ విధంగా క్రమశిక్షణకు కట్టుపఱచి వుంచడానికి వీలవుతుంది? అది ఎంతకాలం సాధ్యమవుతుంది? అంటే కొంతకాలమే కొంతమంది మాత్రమే అలా వుండగలుగుతారు. భాష ఏ కొంతమందికో చెందిన స్వంత ఆస్తికాదు. కాబట్టి కడమ వారవలంబించిన స్వేచ్ఛవల్ల భాషలో మార్పులురాక మానవు. సంస్కృత భాషలో అదే జరిగింది. మార్పుల మానాన మార్పులు జరిగిపోతూ క్రమంగా అవన్నీ ఎన్నో కొత్త భాషలుగా రూపొందినాయి. సంస్కృతం మాత్రం మడికట్టుకొని క్రమశిక్షణతో మెలగుతూ అలాగే నిల్చిపోయింది.

మరో విశేషంకూడా యిక్కడ గమనించవలసింది వుంది. ఎవరి యిష్టం వచ్చినట్లు వాళ్లను మాట్లాడనిచ్చి, వ్రాయనిచ్చి భాషా నియమాలను నిర్బంధం చేయకుండా స్వేచ్ఛ యిస్తే యేం ప్రమాదం? అనేదే అది. దీనివల్ల మాట్లాడే వారికేమీ వ్యవహార భంగంరాదు. వారు మాట్లాడింది ఎవరితోనో, వారికది అర్థమవుతుంది. కనుక అప్పటికేమీ యిబ్బంది వుండదు. అయితే భాషకు మాత్రం స్థిరత్వం నశిస్తుంది. అందువల్ల మార్పులు మరీ త్వరత్వరగా వచ్చి కొంతకాలానికి ఆ భాష 'అంతర్వాహిని' గా మారిపోతుంది. మన దేశంలోనే యిల్లాంటి భాషలు కొన్ని అంతర్వాహినులుగా అంటే పూర్తిగా అంతరించిపోయినవి లేకపోలేదు. ఒకప్పుడవి చాలా గొప్పగా ఎంతో సాహిత్య సంపదతో వెలసినవే అయినా యీనాడు వాటి పేర్లే తప్ప మనకు అంతకంటే ఏమీ తెలియదు. వ్యాకరణ నియమాలను క్రమబద్ధంగా పాటింపజేయకపోవడంవల్ల కలిగే అనర్థమిది. ఇది కొన్ని శతాబ్దాలలో జరిగే ప్రక్రియ కనుక దీని ప్రమాదాన్ని యెప్పటికప్పుడు

| | | |
|---|---|---|
| 14. సూత్రాంధ్ర వ్యాకరణము | చిన్నయసూరి | క్రీ.శ. 1842 |
| 15. హరి కారికలు | శిష్టు కృష్ణ మూర్తిశాస్త్రి | క్రీ.శ. 1860 ప్రాంత |
| 16. హరికారికాశేషము | భాగవతము రామమూర్తిశాస్త్రి | క్రీ.శ. 1910 ప్రాంత |

పైవానిలో కొన్ని మూలగ్రంథములు, కొన్ని వ్యాఖ్యానములు కొ లభ్యమౌతున్నవి. కొన్ని నామమాత్రావశిష్టాలు. ఇవి కాక యింకా కొన్నికు సంస్కృతంలో వ్రాయబడివుండవచ్చు. కాని వాటినిగూర్చి మనకేమీ తెలియలే

తమిళానికి సంస్కృతంలో వ్రాయబడిన వ్యాకరణమున్నట్లు కానరా కాని కడమ మూడు ముఖ్యములైన దక్షిణ దేశభాషలు - తెలుగు - కన్నడం - యాళములకు - సంస్కృతంలో వ్రాయబడ్డ లక్షణ గ్రంథాలున్నాయి. మళ ళానికి సంస్కృతంలో వ్రాయబడ్డ లక్షణగ్రంథం లీలా తిలకం. కన్నడానికి మణి దర్పణం, శబ్దానుశాసనం సంస్కృతంలో వ్రాయబడ్డాయి. ఉత్తర భా భాషల్లో కడమవాటి విషయం తెలియరాదు కాని మహారాష్ట్ర భాషకుమా సంస్కృతంలో వ్రాయబడ్డ ఒక వ్యాకరణగ్రంథం వున్నదనీ, అది యిటీ ముద్రితమయిందనీ కూడా తెలుస్తున్నది. నేనా గ్రంథం చూడ్డం కుదరలేదు.

సరే దేశభాషలకు సంస్కృతంలో లక్షణం వ్రాయడమేమిటి ? అనేది ఓ ప్రశ్న ఆంధ్ర శబ్ద చింతామణి కర్త స్వస్థాన వేష భాషాభిమానముగల రసప్రలుబ్ధ బుద్ధు ఆంధ్ర కావ్యముల నాదరింతురని గ్రంథారంభంలో ఎంతో ఆంధ్ర భాషాభిమా ప్రకటించి తానుమాత్రం సంస్కృతంలోనే గ్రంథరచన చేశాడు. కావ్యా రసం ముఖ్యం గనుక, ఆంధ్ర కావ్యాల్లో దానికి తక్కువేమీ లేదు గనుక, వా నాదరించాలని చెప్పుతూనే వ్యాకరణాన్ని సంస్కృతంలో వ్రాయడం ఇక రసదృష్టి లేదుకనుక తెలుగులో వ్రాసే పనిలేదని ఆతడనుకొన్నాడేమో! అని ఊహిం డానికవకాశ మిస్తున్నది. అయినా యిది ఊహ మాత్రమే! తెలుగులో వ్రాయ తెలుగు వ్యాకరణాల సంఖ్యతో పోలిస్తే సంస్కృతంలో వ్రాయబడ్డ తెలు వ్యాకరణాల సంఖ్య తక్కువనే చెప్పాలి. అయితే ఆంధ్ర శబ్ద చింతామణి వెలు లోకి వచ్చింతరువాత దానికీ, దాని పరిశిష్ట గ్రంథాలయిన వికృతి వివేక, శిరోభూషణాలకూ మొన్న మొన్నటి దాకా వున్న ప్రశస్తి మరే తెలుగు వ్యాక గ్రంథాలకూ లేదు. ఈనాటికీ ప్రాచీన పండితవర్గంలో వాటి పలుకుబడి అట్లా ఉన్నది.

మన భాషకే గాక మరికొన్ని భాషలకూ సంస్కృతంలో లక్షణ గ్రంథా రావడం చూస్తే దీనికేదో కారణం ఉన్నదనే చెప్పాలి. బహుశః సంస్కృతం

లక్షణగ్రంథాలు వ్రాయడానిక్కారణం, ఈ భాషలమీద తజ్ఞులయిన పండితులకు ఆదరం పెంపొందింపజేయడం కావచ్చునేమో! లేదా సామాన్యంగా చదువుకోవడమంటే సంస్కృతం చదువుకోవడమే కనుక సంస్కృతం వచ్చిన వారికి సంస్కృతం ద్వారా యీ భాషాలక్షణాలు తెలియజేయడం సుఖం కనుక యీ లక్షణ గ్రంథాలను సంస్కృతంలో రచించడం జరిగిందని చెప్పవచ్చునేమో కూడా! అంతేకాక సంస్కృతానికేకాక, ప్రాకృతభాషకు కూడా వ్యాకరణ గ్రంథాలు సంస్కృత భాషలో అదివరకే వ్రాయబడివుండడంవల్ల వాటిని చూచిన దేశ భాషా వ్యాకరణ కర్తలు తమ భాషలక్కూడా సంస్కృతంలో వ్యాకరణగ్రంథాలుండడం యుక్తమని భావించి అట్లా చేసి ఉండవచ్చును. మన వ్యాకరణ కర్తలపై ప్రాకృత వ్యాకర్తల ప్రభావం తక్కువదేమీ కాదు. సూత్రరచనకుగానీ, కారికా రచనకుగానీ, సంస్కృతభాష చాలా అనువయినది కావడం, సూత్రాలూ కారికలూ సులభంగా జ్ఞాపకం పెట్టుకోవడానికవకాశముండడం కూడా యిందుక్కారణం కావచ్చు. అన్నింటికంటే ఆ గ్రంథకర్తలు సంస్కృతంలో నిరర్గళంగా రచన చేయగల్గివుండడం – ఇవి సంస్కృతంలో వ్రాయబడడానికి ముఖ్యమయిన కారణములని చెప్పవలసియున్నది. అయితే కాలక్రమాన మన దేశంలో విద్యావిధానం మారింది. ఈనాడు సంస్కృతానికి యిదివరకున్న స్థానం విద్యావిధానంలో లేదు. ఆ స్థానాన్ని ఇంగ్లీషు ఆక్రమించింది. కనుక ఈనాటివారికి సంస్కృతంలో తెలుగు వ్యాకరణాలు వ్రాయబడడం, కొంత వింతగా తోస్తుంది. అయితే భారతదేశ చరిత్రను, ఆంగ్లంలో వ్రాయడంగానీ, చదువడంగానీ, మనకు వింతగా కానరాదు. పైగా భారతదేశ చరిత్రను ఆంగ్లంలో బోధపరచినంత సులభంగా భారతీయ భాషల్లో చెప్పడం సాధ్యం కాదంటే కూడా మనం అంగీకరించగలం. ఇది అలవాటుకు సంబంధించిన విషయం. కాలానుగుణంగా అలవాట్లు మారుతూ ఉంటాయి. మనం వాటిని గుర్తించాల్సిందేకాని తప్పుగా అర్థం చేసుకోవడం మాత్రం తగదు. మన దేశంలో ఉద్యోగాలకోసం వచ్చే ఆంగ్లేయులకు తెలుగు నేర్పడానికి ఇంగ్లీషులో తెలుగు వ్యాకరణాలు వచ్చినయి. రేపు హిందీ భాషలో తెలుగు వ్యాకరణాలు రావచ్చు. రష్యా భాషలోనూ ఫ్రెంచి భాషలోనూ తెలుగు వ్యాకరణాలు ఇదివరకే వచ్చినయి.

కణ్వుడు వ్రాసిన తెలుగు వ్యాకరణాన్ని గూర్చి పైన ప్రస్తావింపబడింది. త్రిలింగ శబ్దానుశాసనమనే అముద్రితాంధ్ర వ్యాకరణమొకటి మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో నిద్రాణావస్థలో ఉన్నది. దానిలో కాణ్వ వ్యాకరణ ప్రస్తావనా, కాణ్వ వ్యాకరణ సూత్రాలూ ఉన్నాయి. మండ లక్ష్మీ నరసింహాచార్యులు వ్రాసిన ఆంధ్రకౌముదిలో కూడా కొన్ని కాణ్వ వ్యాకరణ సూత్రాలు కూడా ఉద్ధరింపబడి ఉన్నాయి. వావిలికొలను సుబ్బారావుగారు కూడా కాణ్వ వ్యాకరణాన్ని గూర్చి తమ సులభాంధ్ర వ్యాకరణంలో ప్రస్తావించి

ఉన్నారు. కాణ్వ వ్యాకరణంలోనిదని త్రిలింగ శబ్దాను శాసనంలో యీయబడి వున్న "ఆంధ్ర విష్ణోరనుజ్ఞా (కృత) తస్య మద్వ్యాకరణస్య ద్రోహీ, గురుద్రోహీ" అనే వాక్యం వల్ల యీ కణ్వుడు ఆంధ్ర విష్ణువు కాలంలో వుండే వాడని ఊహించడానికవకాశం కలుగుతున్నది. ఆంధ్ర విష్ణువు శ్రీకాకుళం రాజధానిగా ఆంధ్రదేశాన్ని పరిపాలించిన ఆంధ్ర రాజని చారిత్రకులు అంగీకరించి యున్నారు. సాతవాహన రాజులకు పూర్వయుగమునందున్నాడట యీ ఆంధ్ర విష్ణువు.

సాతవాహనులకంటే పూర్వమే తెలుగు వ్యాకరణం వున్నదా! అనే అనుమానం మనకు కల్గడం సహజం. ఎందుకంటే మనకు ఆంధ్రభాషాచరిత్ర 10 వ శతాబ్దం నుంచి మాత్రమే దొరుకుతున్నది. నన్నయభట్టే "ఆదికవి" అని మనమంతా నిత్యం జపం చేస్తున్నాం. అంతకు ముందు భాషాచరిత్ర తెలియదు. అయితే లభించిన శాసనాలు నన్నయకు పూర్వంలోను తెలుగు కవిత, తెలుగు భాష ఉన్నాయని తెలుపుతున్నాయి. ఎప్పటినుండి వున్నాయనేది యింకా పరిశోధించి కనుక్కోవలసి వున్నది. అట్లాగే మన చరిత్ర కూడా చాలా మరుగు పడి వున్నది. ఐతరేయ బ్రాహ్మణకాలం నుంచే వున్న మన జాతి స్థితిగతులను గూర్చి కానీ, సంస్కృతిని గూర్చి కానీ, చాలా కాలం దాకా అంటే సాతవాహనుల కాలం దాకా మనకు స్పష్టమైన పరిజ్ఞానం లేదు. తెలుగు దేశంలో లభించిన కైయిరనులు ఈ ప్రాంతం చాలా ప్రాచీన చరిత్రగల ప్రదేశమని తెలుపుతున్నాయి. ఆ చరిత్ర యెట్లాంటిదో మాత్రం తెలియదు. రామాయణం అరణ్యాకాండలో శ్రీరాముడు లక్ష్మణునికి వాతాపీల్వలులను గూర్చి చెప్పిన కథ వొకటి వున్నది. దానిలో,

"ధారయన్ బ్రాహ్మణం రూపమిల్వలః సంస్కృతం వదన్,
ఆ మంత్రయతి విప్రాన్ సశ్రాద్ధ ముద్దిశ్య నిర్ఘృణః॥"

అని యిల్వలుడు బ్రాహ్మణ రూపాన్ని ధరించి వాడు సంస్కృతభాష మాట్లాడుతూ మహర్షులను శ్రాద్ధానికి ఆమంత్రణం చేసేవాడని చెప్పబడింది. ఇల్వలుడు సంస్కృత మాశ్రయించి పిలిచేవాడనడంవల్ల అతడు మామూలుగా మాట్లాడే భాష సంస్కృతం కాదని తేలుతున్నది. అంటే వాతాపీల్వలులు సంస్కృతం మాట్లాడే ప్రాంతం వారు కాదన్న మాట! వారి దేశభాష మరేదోనన్న మాట! వాతాపీల్వలులు నివసించిన దేశం తెలుగు దేశమని విమర్శకులంటారు. అంటే రామాయణం నాటికే తెలుగు భాష ఉందన్న మాట! తెలుగువారైన వాతాపీల్వలులు మహర్షులతో సంస్కృతంలో మాటాడినారంటే, అప్పటికే తెలుగువారికి సంస్కృతభాషతో కావలసినంత పరిచయమేర్పడినదన్న మాట! అట్లాగే సుశ్రుతంలో పౌతన దేశాన్నిగూర్చి, పౌతన జనులను గూర్చిచెప్పబడి వున్నది. పౌతన దేశమంటే తెలుగు దేశమే! పౌతన జనులు తెలుగువారే! పౌతన నగరము 'బోధన్' అను

పేరితో నున్న గ్రామమేకాని వేరు కాదు. ఇది నిజామాబాద్ జిల్లాలో గోదావరికి దక్షిణ తీరంలో ఉన్న పురాతన చరిత్ర గల పట్టణం. తెలుగు దేశంలోనే ఒక భాగమయిన అశ్మక రాష్ట్రం పౌతన దేశమే! అశ్మక గణాన్ని గూర్చి, అశ్మక దేశాన్ని గూర్చి మహాభారతంలోనూ, విష్ణు పురాణంలోనూ వున్నది. కాబట్టి పౌతన పట్టణంలో పురాతత్త్వ శాఖవారు చేపట్టవలసిన కార్యక్రమం చాలా ఉన్నదన్నమాట! అప్పుడు మన జాతి చరిత్రను గూర్చి, మన భాషా సంస్కృతులను గూర్చి, కొన్ని విశేషాంశములు తెలియరావచ్చును. కనుక మనం క్రీ. శ. పదకొండవ శతాబ్దంనుంచే మన సాహిత్య సంస్కృతులు పెంపొందినాయనే విశ్వాసంతో అంతకు ముందును గూర్చి నిరాశ వహించి నిస్పృహచెందడం మంచి లక్షణం కాదన్న మాట! లభించిన సాక్ష్యాధారాలను భద్రపరచుకుంటూ, పరిశోధన కుపక్రమించితే రాగల కాలంలో యెన్నో సత్యాలు వెలువడవచ్చును.

వైకృత చంద్రికా రచయిత మంచెళ్ల వాసుదేవకవి లేదా వాసుదేవాచార్యులు. "ఇతి శ్రీ మద్బాలగోపాల కరుణాకటాక్ష సంప్రాప్తాష్ట భాషా కవిత్వ సామ్రాజ్య పట్టభద్రేణ మంచెళ్ల వంశార్ణవ పూర్ణిమా చంద్రేణ హిమవన్నగ సేతు మధ్యమహీవలయ విరాజమాన నానావిధ విద్యా ప్రవీణ విద్వత్కవి వితాన సంస్తూయమాన పాండితీ మణినా వాసుదేవ కవినా విరచితాయాం వైకృత చంద్రికాయాం కృదంత విభాగస్సమాప్తః" అనేది వైకృత చంద్రిక గ్రంథాంత గద్య. దీన్ని బట్టి కవిని గూర్చి, కొన్ని వివరాలు తెలుసుకోవచ్చు. ఒకటి ఈతడు బాలగోపాల భక్తుడనీ; రెండవది అష్టభాషా కవిత్వ పట్టభద్రుడని; మూడవది నానా విధ విద్యా ప్రవీణుడని; నాల్గవది గొప్ప పండితుడని. గ్రంథాంత గద్య బాలగోపాల భక్తుడని చెప్పుతున్నా గ్రంథారంభ శ్లోకంలో "జానకీ కర్ణతాటంక రత్నచుంబిత కుండలమ్, విశాలలోచనం ధ్యాయే శ్రీమద్రామ, ముఖాంబుజమ్" అని శ్రీరామునికి నమస్కారం చెయ్యడం చూస్తే తత్కర్త విష్ణుభక్తి కలవాడని మాత్రం స్పష్టంగా చెప్పడానికవకాశమిస్తున్నది. వాసుదేవకవి గ్రంథంలో అక్కడక్కడ నుదాహరించిన స్వీయ పద్యభాగములు కూడ నీ యభిప్రాయాన్నే బలపరుస్తున్నవి.

అష్ట భాషలంటే సంస్కృతాంధ్రాలూ, షడ్విధ ప్రాకృత భాషలూన్ను. అంటే వాసుదేవకవి సంస్కృతాంధ్ర ప్రాకృత భాషల్లో కవిత్వం వ్రాయగల దిట్ట అన్నమాట! వాసుదేవకవి సంస్కృతంలో నేవయిన కావ్యాలు వ్రాసినాడేమో మనకు తెలియరాలేదు కాని తెలుగులో మాత్రం చక్కని రసవత్కవిత వ్రాయగల వాడనుటకు గ్రంథమునందున్న ఉదాహరణ పద్యములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఇంతేకాక వాసుదేవకవి రచించిన మరో చిన్నగ్రంథం 'గంధవహ' మనే

నాయికా నాయక లక్షణాలను తెలిపేది పద్యాత్మకమయింది కూడా లభించింది. దానిలో కృతిపతి

"లలిత చమత్క్రియా సరసాలంకృతి కావ్యసముద్ర వీటికా
విలసిత శబ్దభాషణపు విశ్రుత చాటు కవిత్వ చాతురీ
ఖండహిరణీ నిదానమను సంతత కృత్యముచే నహర్ముఖా
నిలుడవు వాసుదేవకవి! నీ నిపుణత్వము లెన్నశక్యమే !"

అని కవితో అన్నట్లుగా చెప్పబడివున్నది. సామాన్యంగా శ్రీవైష్ణవ బ్రాహ్మణులు ఆచార్య శబ్దాన్ని తమ పేర్లకు చేర్చుకుంటూ వుండడం సంప్రదాయం కాగా వాసుదేవుడు తన పేరుకు 'కవి' అని చేర్చుకోవడం అతడు కవి యనుటను బలపరుస్తున్నది.

"వసుధ లోపల మంచెళ్ల వారి యిల్లు
శారదాదేవి నాటకశాల యండ్రు
వాసుదేవుని కవితా విలాస మచట
మ్రోల బంగారు గజ్జెల మ్రోతగాదె"

అనే పద్యంవొకటి యెవరు వ్రాసిందోకాని వాసుదేవుని కవితా విలాస వైశిష్ట్యాన్ని వర్ణించేదిగా ఉన్నది.

వాసుదేవ కవికి సంస్కృతాంధ్ర భాషల్లోగల పాండిత్యాన్నేకాక పాణినీయ సంస్కృత వ్యాకరణంలోను అతనికి సునిశితమయిన పాండిత్యం కలదని వైకృత చంద్రిక సాక్ష్యం యిస్తున్నది. అంతేకాదు, వైకృత చంద్రిక వల్ల అతనికి ప్రాకృత భాషా వ్యాకరణాల్లోగల పాండిత్యాన్ని గూడ తెలిసికోవచ్చు.

మంచెళ్లవారు శ్రీవైష్ణవుల్లోనూ, నియోగుల్లోనూ కూడా వున్నారు. కాని గంధవహం గద్యలో వాసుదేవకవి తండ్రి రఘునాథాచార్యులని చెప్పబడి వుండడం వల్ల ఈతడు శ్రీవైష్ణవ బ్రాహ్మణుడని స్పష్టంగా తెలుస్తున్నది. ఆ గద్య యిది: "ఇది సకలసుకవికుల మనోహర కవిత్వవైభవ మంచెళ్ల రఘునాథాచార్య తనూభవ వాసుదేవకవి విరచితంబైన గంధవహం బనియెడు నలంకార గ్రంథంబు సర్వంబు నేకాశ్వాసము సంపూర్ణము."

మంచెళ్ల వంశమునకు చెందిన శ్రీవైష్ణవ బ్రాహ్మణులు కృష్ణా జిల్లాలో ఉన్నారు. కాబట్టి వాసుదేవ కవి కూడా ఆ ప్రాంతమందున్న వాడనియే చెప్ప వలసివుంటుంది. దీనికి మరోబలమయిన కారణం కూడా వున్నది. వాసుదేవుడు గంధవహమనే మరోపుస్తకంకూడా వ్రాశాడని పైనచెప్పబడింది గదా! ఆ పుస్తకం

వాసిరెడ్డి రామలింగ ప్రభువు కోరిన విధంగా మంగళగిరి నరసింహస్వామికి అంకితం చేయబడింది. రామలింగ ప్రభువు కొలువుండి

"పిల్వఁ బనిచి యవార్య గాంభీర్య ధైర్య
సరస మాధుర్య చాతుర్య సౌకుమార్య
గుణ గణంబులు విలసిల్లఁ గూర్మితోడ
నలరి ననుఁ జూచి యిట్లని యానతిచ్చె.

- - - - - - - - - - - - - - - -

ఆదిని సంస్కృతాటవుల నంటిన మంజరి తేటగాఁగ స
మ్మోదము నింపఁగా మదికి మూఢు లెఱుంగరు, తత్తదర్థముల్
పొదుకొనంగ నాంధ్రజనభాషను బండిత పామరాళి కా
మోదము కాఁగ గంధవహమున్ రచియింపుము నేర్పు పెంపునన్.

శృంగార గతుల నీ కృతి
మంగళగిరి నాథు పేర మహి నంకితమై
సంగతిఁ గొనవలయును మా
ముంగిటి కులదైవమతఁడె మోదము లిచ్చున్."

అని వాసుదేవుని కోరినాడట! దీన్నిబట్టి వాసుదేవుఁడు వాసిరెడ్డి రామలింగ ప్రభువు సమకాలము వాడని తెలుచున్నది. వాసిరెడ్డి వంశంలో రామలింగ నామ ధారులు చాలామందివున్నారు. కాని వారందరు రాజ్యాన్ని పాలించిన ప్రభువులు కారు. ముక్త్యాలకోటను నిర్మించిన రామలింగ ప్రభువే యిరవై సంవత్సరాలు సుమారు రాజ్యపాలనం చేసిన రామలింగ ప్రభువు. ఈతని తమ్ముడు వీరన్న రాజ్యాన్ని వాసిరెడ్డి వెంకటాద్రినాయని తండ్రిగారైన జగ్గభూపతి లాగుకొన్నాడట! వాసిరెడ్డి వెంకటాద్రినాయడు క్రీ. శ. 1761-1816 సంవత్సరముల మధ్య జీవించినవాడని డాక్టర్ రమేశన్‌గారు నిర్ణయించినారు. కనుక అంతకు కొంచెం ముందుగా ముక్త్యాల రామలింగ ప్రభువు జీవించినాడు కాబట్టి క్రీ. శ. 1750 ప్రాంతం మంచెళ్ల వాసుదేవుని కాలంగా మనం నిర్ణయించవచ్చు. ఈ విషయాన్ని నా సిద్ధాంత గ్రంథంలో విపులంగా చర్చించడం జరిగింది. కనుక ఇంకా వివరాలు కావాలంటే అందులో చూడవలసిందిగా వేడుతున్నాను.

వాసుదేవకవి ఆంధ్రశబ్దచింతామణి కొక వృత్తి రచించినాడనీ, దానికి వాసుదేవ వృత్తి అనే పేరున్నదనీ శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులు గారు శబ్ద రత్నాకర పీఠికలో చెప్పినారు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో D 1241 నంబరుతో ఆంధ్రశబ్దచింతామణి వృత్తి ఒకటున్నది. ఆ

వృత్తి చివర "వసుధ లోపల మంచెళ్ళ వారి యిల్లు" అనే పద్యం వ్రాయబడి వున్నది. దానినే వాసుదేవ వృత్తి అని పండితులు భావిస్తూ వున్నారు. కాని గ్రంథంలో ఎక్కడా వాసుదేవకవి పేరు కానరావడం లేదు. గ్రంథాంతంలోవున్న పై పద్యమే తత్కర్తృత్వాన్ని వాసుదేవునికి కూర్చడానికి కారణమయితే అందుకు బలం చాలదనే నా అభిప్రాయం. పైగా స్పష్టంగా వాసుదేవునిదని స్థిరపడిన వైకృత చంద్రికలోని విధానాలు కొన్ని ఆంధ్రశబ్ద చింతామణి వృత్తికి భిన్నంగా వున్నాయి. వాసుదేవుడు కాలాన్నిబట్టి అహోబల పండితునికి తరువాత వచ్చిన వాడు. "ఏకత్వే సస్య వాచిత్వం, బహుత్వేధాన్య వాచితా" అనే అథర్వణ కారిక వాసుదేవుని వైకృత చంద్రికలో (41 వ పుట) కానవస్తున్నది. ఆంధ్ర శబ్ద చింతామణి వృత్తిలో అథర్వణ కారికల ప్రసక్తే కానరాదు. శేషషష్ఠి విభక్తి ప్రత్యయం 'ఒక్క' గా వైకృత చంద్రికలో యీయబడింది. 'యొక్క' అని వృత్తికారుఁడు చింతామణి ననుసరించి చెప్పినాడు. ఇప్పటివరకు లభించిందాన్ని బట్టి ఆంధ్రశబ్ద చింతామణి వృత్తికర్త వాసుదేవుఁడని అనడానికి బలం చాలదనే నిర్ణయించవలసి వున్నది.

వైకృత చంద్రికలోని 'కుంజ పాంచాలిక యోరరుగ్గృహే' (14 పు) అనే సూత్రం వికృతి వివేకటీక కవిజన మండనంలో వృత్తితోకూడా వుదాహరింపబడి వున్నది. (పు. 90) అంటే ద్వితింత్రిణీ సీతారామకవి వైకృత చంద్రికను చూచి నాడన్నమాట! వాసుదేవ కవికి ఆంధ్ర వ్యాకర్తగా ప్రసిద్ధి కలదనడానికి శ్రీమాన్ సీతారామాచార్యుల వారి వ్రాత సాక్ష్యమిస్తున్నది. అయినా వాసుదేవ కవి గ్రంథం వైకృత చంద్రిక కాని, వాసుదేవునిదని కొందరు భావించిన ఆంధ్రశబ్ద చింతామణి వృత్తికాని ముద్రణ భాగ్యానికి నోచుకోలేదు. గంధవహం మాత్రం నెల్లూరు సరస్వతీ ముద్రాక్షరశాలలో వాగ్వల్లీ పత్రికాధిపతులయిన శ్రీమాన్ కొమాండూరు వేంకట రామానుజ శర్మగారిచే 1900 సంవత్సరంలో ముద్రింప బడింది. అయినా వాసుదేవకవి పేరు కవుల చరిత్రలోని కెక్కలేదు. ఆ పుస్తకాలు కూడా లభించడంలేదు,

వైకృత చంద్రిక స్వతంత్ర ప్రణాళికగల తెలుగు వ్యాకరణ గ్రంథం. సూత్రకర్తా, వృత్తికారుడూ కూడా వాసుదేవకవే! మధ్య మధ్యవున్న శ్లోకరూప వార్తికాలూ, ఒకటి రెండు తప్ప ఉదాహరింపబడిన పద్యాలూ వాసుదేవ కవివే! వాసుదేవ కవికన్న పూర్వం యీ విధంగా మొత్తం గ్రంథాన్ని ఒక్కడే వ్రాసిన మరో ఆంధ్ర వ్యాకరణకర్త మండ లక్ష్మీనరసింహాచార్యులు. సంస్కృత వ్యాకరణ కర్తల్లో హేమ చంద్రాదులు స్వోపజ్ఞ వృత్తులతో వ్యాకరణ సూత్రాలు రచించిన వారు లేకపోలేదు.

వైకృత చంద్రికపై ఆంధ్రశబ్దచింతామణి ప్రభావం స్పష్టంగా కాన వస్తున్నది. అయినా దానికిది మక్కికి మక్కిగా అనుకరణం మాత్రంకాదు. ఆంధ్ర శబ్ద చింతామణిలో లేని పెక్కు విషయాలను వైకృత చంద్రిక స్పృశిస్తున్నది. కనుక వైకృత చంద్రికకు ఆంధ్ర వ్యాకరణాల్లో సముచిత స్థానం కల్పించవలసి వున్నదన్నమాట.

సంజ్ఞా ప్రకరణంలో వాసుదేవుడు ఆంధ్రశబ్దచింతామణి నుండి తెలుగు వ్యాకరణ సంజ్ఞలను తీసికొంటూనే వాల్మీకి ప్రాకృత వ్యాకరణంనుండి కూడా యెన్నో సంజ్ఞలను తీసికొన్నాడు. పెక్కు సూత్రాల్ని యథాతథంగా స్వీకరించాడు కూడా. ఈ విషయ మథస్సూచికల్లో ఎక్కడికక్కడ చూపబడింది కనుక మళ్ళీ యిక్కడ వివరించే పని లేదనుకొంటాను.

చింతామణిలో వలెనే దీనిలో కూడా అచ్ సంధి నిషేధంతోనే ప్రకరణం ప్రారంభించినా తరువాత ఒక క్రమం పాటింపబడింది. అ, ఇ, ఉ లతో అంతమయ్యే పదాల సంధి విషయం క్రమంగా చెప్పబడింది. పిదప అనుకరణ సంధులతో అచ్సంధి ముగింపబడింది. తరువాత హల్సంధులు చెప్పబడినవి. సమాసాల్లో వచ్చే సంధులు కూడ సంధి ప్రకరణంలోనే వుండడం గమనింపదగింది. స్వాది ప్రక్రియ ప్రకరణంలో అవ్యయాలను ప్రత్యేకంగా పేర్కొనడం దీనిలో వున్న మరో విశేషం. స్త్రీప్రత్యయములను గూర్చి కూడా వో ప్రకరణం చేర్చబడింది. విభక్త్యర్థ ప్రకరణం తరువాత సమాస ప్రకరణం దాని తరువాత తద్ధిత ప్రకరణమూ వున్నాయి.

సమాస ప్రకరణంలో "ఒక్క-శేషే" (పు. 86) శేష షష్ఠిలో వచ్చేది ఒక్కగాని యొక్క-కాదని చెప్పబడింది. ఇది దాని చరిత్ర తెలియడానికి చాల ఉపయుక్తమయిన విషయ మనడంలో సందేహంలేదు. తెలుగులో యొక్క చాలా కృతకమయిన విభక్తి ప్రత్యయము. ప్రాచీన వ్యాకరణములయిన ఆంధ్ర భాషా భూషణాదుల్లో యొక్క విభక్తి ప్రత్యయముగా కానరాదు. ఉదాహరణ కావ్యాల్లోను యొక్క కనిపించదు. కనుక చాల తరువాత ఇది భాషలో చోటు చేసికొన్నదనేది స్పష్టం. పోతే దీని చరిత్రను గూర్చి పరిశోధకుల్లో అభిప్రాయ భేదాలున్నాయి. తద్ధర్మ విశేషణమయిన 'అగు' కాలక్రమాన యొక్కగా మారినదని ఒక అభిప్రాయం. కాని అది ఏకార్థ వాచకమయిన ఒక్క-యే కాని భిన్నం కాదు. మంచెళ్ల వాసుదేవుడు 'ఒక్క' శేషషష్ఠి ప్రత్యయమనడం దీనినే బలపరుస్తున్నది. మొదట తరువాత పదం ఏకవచనంలో వున్నప్పుడు దానికి విశేషణంగా ఒక్క చేరుతూవుండేది. "నా యొక్కగుణం" అంటే నాదైన ఒక్క గుణం అన్న మాట. కాని క్రమంగా ఒక్క స్వార్థాన్ని కోల్పోయి విభక్తి ప్రత్యయంగా మారడం తోటే తరువాత పదం బహువచనంలో వున్నా యొక్క చేరి పూర్వపదాంగమయింది. దుగాగమం స్థితి కూడా యిల్లాంటిదే గదా! యొక్కకు ప్రయోగార్హత

లేదని వ్యాకరణ కర్తలు గుర్తించారు. కాని అది షష్ఠీ విభక్తిగానే కాక "ఆ యొక్క రాజుగారు, ఆ యొక్క మంత్రి" ఇత్యాది విధంగా గూడ కృతక వ్యవహారోపయోగాన్ని పొంది వాడబడుతూ వుండడం కనిపిస్తున్నది. ఏమయినా వాసుదేవుడు చెప్పినట్లు అది మొదట ఏకార్థకమయిన 'ఒక్క' అనడమే సముచిత మయిందిగా కానవస్తూంది.

వైకృత చంద్రికలో తద్భవ రూప సాధనకై గణనీయమయిన కృషి చేయ బడింది. ఇది ఒకవిధంగా గ్రంథ గౌరవాన్ని పెంపొందించడమేకాక తెలుగు వ్యాకరణాల్లో దీనికో విశిష్ట స్థానాన్ని సంపాదించి పెట్టుతున్నది. సంస్కృత భవ రూపాలనే కాక ప్రాకృత భవాల్లోనూ మళ్లీ షడ్విధ ప్రాకృత శబ్దాల నుంచీ తద్భవ పదములెట్లా ఏర్పడిందీ ప్రక్రియా పూర్వకంగా చూపబడ్డాయి. వీనిలో కొన్నింటి తద్భవత్వమును గూర్చి కొంత అభిప్రాయ భేదముంటే ఉండవచ్చుగాని వాసుదేవుడు ఎన్నుకొన్న విధానము మాత్రము గణనీయమైనదే అని చెప్పవలసి వున్నది.

క్రియా ప్రకరణంలో ప్రక్రియ సంగతి ఎట్లా ఉన్నా వాసుదేవుడు "ఉండో వసేః అస్తేః కలగః అయోభువేస్తు" ఇత్యాది విధంగా సంస్కృతధాతువుల స్థానంలో తెలుగు ధాతువులు ఆదేశంగా వస్తాయని చెప్పడంలో ప్రక్రియా గౌరవం తప్ప ప్రయోజనం వేరుగా కానరాదు. ఉండ, కలగ, అయ, ఇత్యాది విధంగా దీనిలో అన్ని తెలుగు ధాతువులు అదంతాలుగా ఉపదేశింపబడ్డాయి. ఈ ప్రక్రియ కడమ వ్యాకరణాలకు భిన్నమయింది కావడంవల్ల కొంత తికమకగా కానవస్తున్నది. గ్రంథం కృదంత ప్రకరణంతో అంతం కావడం గ్రంథప్రణాళికా సమగ్రతకు నిదర్శనం. నిజానికింత విపుల ప్రణాళిక గల తెలుగు వ్యాకరణం సంస్కృత సూత్రాంధ్ర వ్యాకరణాల్లో మరి యొకటిలేదు.

వైకృత చంద్రికలో చెప్పబడివున్న కొన్ని రూపాల సాధుత్వం కొంత వివాదాస్పదంగావుంది. రామునికి యభివాదము (పు.15) తారలు, తమ్ముల, తనను, తమల (పు. 38) వళులు – వళ్లు (వడ్లనుటకు) (పు. 41) కెలనులు, మీనులు (పు. 43) జాతుల, ఆవులు, ఆవుల (పు. 49) కుండము (కుండ అనుటకు) (పు.50) మొదలయినవి యిట్లాంటివి. అయితే యిట్లాంటివి కొంచెం ఎక్కువ తక్కువలుగా అన్ని వ్యాకరణాల్లోను కనవస్తున్నవి. వైకృత చంద్రికా కర్త 'మనము' అను దాన్ని ద్వంద్వంగా సాధించడం (పు. 95; 61) హృదయంగమంగా వున్నది. ఇట్లాగే యిందులో సర్వనామ శబ్దాల కన్నింటికి ప్రక్రియ చూపబడింది.

గ్రంథం సాధ్యమైనంత నిర్దుష్టంగాను, సులభావబోధ కనుగుణంగాను ఉండేటట్లు ప్రయత్నం చేయబడింది. శ్రీ పి. సీతాపతిగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

స్టేట్ ఆర్కైవ్స్‌శాఖకు డైరక్టరుగా ఉన్నప్పుడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరి & రిసర్చి ఇన్‌స్టిట్యూట్ పక్షాన యీ వైకృత చంద్రికను ముద్రించాలనే అభిప్రాయంతో శ్రీ ఎన్.సి.యస్. వెంకటాచార్యులుగారికీ, నాకూ యీ గ్రంథ ప్రథమార్థభాగ సంపాదకత్వం బాధ్యత అప్పగించబడింది. తరువాత మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీకి 1971లో జాయంట్ డైరక్టర్‌గా నియమితులైన వాఙ్మయ మహోధ్యక్షు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు దీనికి సంపూర్ణ స్వరూపం యివ్వడానికి ఎంతో కృషిచేశారు. శ్రీ పి. సీతాపతి, I.A.S. గారికి ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరి & రిసర్చి ఇన్‌స్టిట్యూట్ డైరక్టర్ పదవి నధిష్ఠించి దాని గౌరవాన్నీ, యీ గ్రంథ గౌరవాన్నీ పెంపొందిస్తున్న మా మిత్రులు కళాప్రపూర్ణ శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికి మా కృతజ్ఞతల నర్పిస్తూ ముగిస్తాను.

హైదరాబాదు,
3-4-1975.

డా॥ అమరేశం రాజేశ్వరశర్మ,
ఎమ్.ఏ., పిహెచ్.డి.

# వైకృతచన్ద్రికా

(ఆన్ధ్ర సిద్ధాన్తకౌముదీ)

# స్వరూప-స్వభావ మహాగవేషణ

రచన:

వాఙ్మయ మహోధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

డైరెక్టర్
ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మ్యాన్యుస్క్రిప్ట్సు
లైబ్రరి అండ్ రిసర్చి ఇన్‌స్టిట్యూటు
అఫ్‌జల్‌గంజ్ - హైదరాబాద్

## అంకితం

అలౌకిక దుశ్శక్తులు కారణంగా
ఒకానొక అసాధారణ పరిస్థితుల్లో
నేను కోల్పోయిన
నా మహత్తరమేధాసంపదను
జ్ఞాపకశక్తిని నాలో
పునరుజ్జీవింపజేయడంలో- నా
అనల్పాలౌకికశక్తులతోపాటు తమ
అద్భుతాంగ్లవైద్య పరిశోధనాంశాలను మేళవించి-
రెండుసంవత్సరాలకు పూర్వం
నా మేధస్సులో పరిగర్భితమై వున్న
యీ అమేయ పరిశోధనా రచనకు
రూపకల్పన చేసే అవకాశం కల్పించిన
అశేషశేముషీధురంధరులు
GREAT-PSYCHIATRIST
డాక్టర్
పి. టి. చంద్రమౌళి, M. D., D.C.H., D.P.M.
గారికి

నా యీ
వైకృతచన్ద్రికా స్వరూప-స్వభావ
మహాగవేషణా
రచన
ప్రేమాంకితం

వడ్లమూడి గోపాలకృష్ణయ్య

# వైకృతచన్ద్రికా
# స్వరూప-స్వభావ
# మహాగవేషణ

## భాష - వ్యాకరణం

ఏ భాషకైనా అసలు పుట్టుకతోనే వ్యాకరణమనేది అంతర్గతమై ఉంటుంది. అక్షరాలకుగాని, అక్షరాలలోవచ్చే మార్పులు - చేర్పులకుగాని, తదితర కార్యాలకుగాని, సంజ్ఞలు బుద్ధిమంతులైన మానవులు సౌలభ్యం కోసం పెట్టుకున్న వే గాని, మిగిలిన సంధి, తత్సమ, తద్భవ, దేశిపద, విభక్తి, సమాస, తద్ధిత, అవ్యయ, క్రియ, కృత్ ప్రత్యయాదులకు సంబంధించిన కార్యాలు ఒక భాషాశాస్త్రజ్ఞుడుగాని, వ్యాకరణ కర్తగాని కృతకంగా, బలవంతంగా కల్పించినవికాని, శాసించినవికాని కానేరవు. ఒక కాలంలో వున్న సంధులు, విభక్తి పరిణామాలు మొదలైనవి యథాతథంగా మరొక కాలంలో వుండకపోవచ్చును. మార్పులతో, చేర్పులతో మారు రూపు దాల్చి వుండవచ్చును. కాని వ్యాకరణ కార్యాలు తద్రూపంగా వ్యాకరణం కృతకమూ, కల్పితమూ ఎన్నటికీ కానేరదు.

అచ్చులకచ్చులు పరమైనా, హల్లులు పరమైనా, హల్లులకచ్చులు పరమైనా, హల్లులు పరమైనా యీ రెండింటికీ అవసానమే పరమైనా జరిగే సంధి కార్యాలను కొనబడేవి భాషలో భాషా పరిణామంలో అత్యంత సహజంగా, యాదృచ్ఛికంగా యెప్పుడో ఒకప్పుడు వచ్చిన పరిణామాలే - భావ వ్యక్తీకరణలో, ప్రజలమధ్య పరస్పరం వుపయోగించబడే శబ్దాలు, సమాసాలు, వాక్యాలు వాటిలోని వివిధ విభక్తులు తదితర ఆగమాదేశాది కార్యాలు - ముందు వెనుకలుగా పదాలనుపయోగించే తీరు తెన్నులు - వివిధ విభక్తి ప్రత్యయాలు - ఔపవిభక్తికాలు - ప్రథమ, మధ్యమోత్తమ పురుషలు - భూత, భవిషద్వర్తమాన తద్ధర్మాద్యర్థకాలు - ఆశీశ్చాపాద్యర్థకాలు - ఏకబహువచనాలు - అన్నీ సహజంగా మానవులు మాట్లాడుకునే భాషాంతర్గతాలే. కాగా భాష యే విధంగా ప్రకృతి సిద్ధమో, సహజోద్భవియో అదేవిధంగా ఆ భాషతోపాటు దానిని పడుగు పేకలుగా - చంద్ర చంద్రికలవలె అవినాభావంగా అంటి పెట్టుకునివుండే వ్యాకరణం కూడా ప్రకృతి సిద్ధమే, సహజోద్భవియే.

ఒక వ్యక్తి ఒక భాషకు వ్యాకరణం వ్రాశాడంటే, భాషలో లేని దానిని అలౌకికంగా అందరానిదానిని, ఎక్కడోదూరతీరాల నుంచి ఏదో అసలు మూలమే లేని దానిని క్రొత్తగా, కృత్రిమంగా సృష్టించి చూపించాడనుకోరాదు. వ్యాకరణ మంతా బహుముఖంగా భాషతో విలీనమైవున్నదే. భాషలో పద, సమాస వాక్యాదులలో, క్రియా ప్రత్యయాదులలో, జరిగే మార్పులను గుర్తించి సంధి కార్యాలలోగాని, ఇతర ఆగమాదేశాది కార్యాలలోగాని వున్న సహజవర్గ భేదాలను, వివిధాలైన తెగలను గుర్తించి ఆయా వర్గీకరణలను ఒక క్రమ పద్ధతిలో, సూత్రపద్ధతిలో పెట్టినవాడే వ్యాకరణకర్త అవుతాడు. సామాన్యంగా నిజానికి భాష అందరూ మాట్లాడేదే! ప్రతివారి భాషలోనూ అక్షర, పదవాక్య, సమాసాలు, విభక్తి, క్రియావిభక్తి ప్రత్యయాదులు, కర్త కర్మ క్రియలు వుంటాయి. అవి లేకుండా ఎవరూ మాట్లాడనే లేరు. అందరూ మాట్లాడుతున్న, వింటున్న లేదా వ్రాస్తున్న, చదువుతున్న భాషలోనే వ్యాకరణం వుంటుంది. కారకంలేకుండా కర్త, కర్మ క్రియలు, లేకుండా యెవరూ భాషా వ్యవహారం నెరపలేరు. అయితే వ్యవహారంలోవున్న, అందరూ యెరుగున్న భాషనే, ఒక మేధావి పరిశీలించి, వివిధ దృక్కోణాలతో, ఆలోచించి "ఇక్కడిక్కడ ఈ విధంగా మార్పు వస్తుంది–ఫలానా ఫలానాచోట్ల ఇది జరుగుతుంది" అని వివేచనతో చక్కగా, వర్గీకరించి మాటల్లోవచ్చేమార్పులను చేర్పులను సూత్రీకరణతో చెపుతాడు. అందరూ వ్యవహరించే భాషలోనుంచే అన్నింటినీ ఎత్తి చూపిస్తాడు. అందరూ ఉపయోగిస్తూనే వుంటారుమరి. ఎవరూ అంతగా పట్టించుకోరు. ఆలోచించరు. ఆ అందరూ ఉపయోగించే భాషలో నుంచే వ్యాకరణాన్ని గుర్తించి యెత్తి చూపిస్తూ ఒక మేధావి ఒక క్రొత్తగ్రంథంగా, భాషాశాస్త్రంగా వ్యాకరణాన్ని వెలయిస్తాడు. అందుకే అతడు మౌలికతతో గొప్పవాడవుతాడు. ఒక కాలంలో వున్న భాష మరొక కాలంలో శీతోష్ణాది వివిధ వాతావరణ ప్రభావాలకు, పరిణామాలకులోనై యథాతథంగా వుండలేక పోవచ్చును. కొంత మార్పు చెందవచ్చును. భాషలో మార్పులు వచ్చినప్పుడు వ్యాకరణంకూడా మారుతూ వుంటుంది. జీవత్స్వరూపమైన భాషతోటిదే గదా వ్యాకరణంకూడా. అయినప్పటికీ పురాతన వ్యవహారానికి చిహ్నలుగా అసహజ భాషవలె కొన్ని రచనల రూపంలో భాష నిలువ వచ్చును. మనకు దృశ్యమాన మవ్వవచ్చును. అంత మాత్రంచేత అప్పటి భాష, భాషకాదనలేము. అందులో వ్యాకరణం లేదనలేము. ఏక బహువచనాలు, విభక్తి ప్రత్యయాలు, కర్త కర్మ క్రియలు లేవనలేము. కాగా భాషతోపాటే ఉన్నదనికాదు అసలు భాషలోనే వ్యాకరణం ఇమిడివున్నదని మనం ఆమోదించక తప్పదు. భాషలోవున్న ఈ సహజ స్వభావ స్వరూప వ్యాకరణాన్ని ఒకప్పుడు యెవరో ఒకరు తొలుతనే గుర్తించవచ్చును. మరొకప్పుడు చాలాకాలానికిగాని

వాఙ్మయ మహోద్యతుని

యెవరూ గుర్తించకపోవచ్చును. ఒకచోట రత్నమే వున్నదనుకుందాము. అది రత్నమని తెలియక చూచిన వారందరూ గాజురాయి అనుకున్నా రనుకుందాము. తరువాత కొంతకాలానికి దాన్ని రత్నంగా ఎవరో ఒకరు గుర్తించారే అనుకోండి. అప్పటివరకూ అది రత్నం కాకుండా పోతుందా? గాజురాయే అవుతుందా? అదే విధంగా భాషలో సహజంగావున్న వ్యాకరణ వ్యవస్థను వెంటనే గుర్తించనూవచ్చు గుర్తించలేకపోనూవచ్చు. భాషాగతమైె వ్యాకరణం ఉండనే ఉంటుంది. అయితే చరిత్ర కందినంతలో మనకు తెలిసినంతలో, ఆంధ్రభాషలోవున్న వ్యాకరణ వ్యవస్థను మొట్టమొదట గుర్తించి వ్యాకరణం రచించిన మహానుభావుడెవరో ఇదమిత్థంగా తేల్చి చెప్పలేము.

మామూలుగా కావ్యభాషకు శ్రీకారంచుట్టి క్రీ.శ. 11వ శతాబ్దంలో నన్నయభట్టు మనకు సాహిత్య భిక్షపెట్టాడని చాలామంది భావం. నన్నయభట్టే ఆంధ్రశబ్దచింతామణి రచించిన తొలి వ్యాకరణకర్త అని మరికొందరి భావం. వాస్తవం పరిశీలిస్తే నన్నయకు అత్యంత ప్రాచీన కాలంలోనే ఆంధ్రభాష మూడు పూవు లారుకాయలుగా వికసించి ఫలించి, అనంతరం మతకల్లోలాలతో, దేశ కల్లోలంతో అప్పటి ఆంధ్ర సాహిత్యం కాలగర్భంలో కలిసిపోయి తిరిగి కొన్ని శతాబ్దాల తరువాత రాజరాజ నరేంద్రుని కాలంలో మొగ్గతొడిగి, పూచికాచిందే మోనని అనిపిస్తుంది.

క్రీ.శ. 1050 ప్రాంతంలోవున్న నన్నయభట్టునకు పూర్వమే - కాస్తా కూస్తా కాదు, దాదాపు పధ్నాలుగు వందల సంవత్సరాలకు పూర్వమే, అంటే క్రీస్తుకు పూర్వం 4వ శతాబ్దిలోనే ఆంధ్రవిష్ణువు రాజ్యకాలంలో తెలుగుదేశం త్రిలింగదేశంగా ప్రసిద్ధిచెంది తెలుగు సాహిత్య సంస్కృతులు మహోచ్చదశనందు కున్నట్లు తెలుస్తున్నది. సుచంద్రుని కుమారుడైన ఆంధ్రవిష్ణువు రాక్షస స్వభావం కల నిశుంభుడనే దుష్టరాజును ఓడించి కాకుళంలో - అంటే నేటి కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో రాజ్యాన్ని స్థాపించి నిష్కంటకంగా పరిపాలన కొనసాగించాడట. ఆ ఆంధ్రవిష్ణువు తన రాజ్యానికి శ్రీశైలం, భీమేశ్వరం, కాళేశ్వరం అనే మూడు పుణ్యక్షేత్రాలను తన దేశ ముఖద్వారాలుగా యెన్నుకొని వాటి పరిధిలోని దేశాన్ని పరిపాలించాడట. అతని కాలంనుంచే ఆంధ్రదేశం త్రిలింగ క్షేత్రమని ప్రసిద్ధి చెందిందని తెలుస్తున్నది. ఈ విషయాల కుపబలంగా ఈ క్రింది బ్రహ్మాండ పురాణాంతర్గతమైన సుచంద్రుని గాథ కనిపిస్తున్నది.

"ఆంధ్రనాథో మహావిష్ణుర్నిశుంభదనుజాపహా
పురా స్వయంభువమనోః కాలే కలియుగేహరిః

కాకులే రాజవర్యస్య సుచంద్రస్య తనూభవః
అభవత్సర్వ దేవైశ్చ వేష్టితో లోక పూజితః
శ్రీశైల భీమకాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహత్కృత్వా త్రీణిద్వారాణి చాకరోత్
త్రిలోచనో మహేశస్సత్రిశూలంచ కరే వహన్
త్రిలింగ రూపీన్యవసత్ త్రిద్వారేషు గణైర్వృతః
ఆంధ్ర విష్ణుస్సురయుతో దనుజేన నిశుంభునా
యుద్ధ్వాత్రయో దశయుగాన్ హత్వా తం రాక్షసోత్తమా
అవసత్తత్ర ఋషిభి ర్యుతో గోదావరీతటే
తత్కాల ప్రభృతి క్షేత్రం త్రిలింగమితి విశ్రుతమ్"–

వేదంలోనే ఆంధ్రజాతి ప్రసక్తివున్నప్పుడు-ఉన్నదని చారిత్రకులందరూ శిరసావహించి ఆమోదించినప్పుడు – బ్రహ్మాండ పురాణాంతర్గతమైన ఈ ఆంధ్ర విష్ణువు ప్రస్తావనను అప్రామాణికమని, పుక్కిటి పురాణమని త్రోసిపుచ్చలేము. బ్రహ్మాండ పురాణం తక్కిన పురాణాలతోపాటు వేదకాలానికి యెన్నో వేల సంవత్సరాల తరువాత అవతరించిందే కదా! ఆంధ్ర సాహిత్యం సంస్కృతి ఎంతో అభివృద్ధి చెందిన దశలో ఆంధ్రవిష్ణువు పరిపాలకుడుగా రంగంలోకి వచ్చినట్లు అతని పేరే చెప్పక చెప్పగలదు. ఆంధ్రజాతి బహుముఖంగా అభ్యుదయం చెందకుండానే వుంటే ఏ విధంగానూ అభ్యుదయం చెందని ఆ జాతిని దృష్టిలో పెట్టుకొని ఆ జాతి దేవుని పేరుమీద ఆంధ్రవిష్ణువు తలయెత్తే వాడేకాడు. సృష్టి స్థితికీ, అభ్యుదయానికీ మూలకారకుడు మహావిష్ణువు. ఇదే విధంగా ఆంధ్రజాతి స్థితికీ, అభ్యుదయానికీ బహుముఖ వికాసానికి మూలభూతుడవుతాడన్న దృష్టితో వేదజ్యోతిశ్శాస్త్రజ్ఞుల సలహాపై సుచంద్రుడు తన సుపుత్రునికి "ఆంధ్రవిష్ణువు" అని పేరు పెట్టి వుండవచ్చును. అందువల్ల ఆంధ్రవిష్ణువు రాజ్యకాలంలో ఆంధ్ర సాహిత్యమూ, సంస్కృతీ యెంతగా అభివృద్ధి చెంది వుంటాయో మన వూహకైనా అందని విషయం.

## త్రిలింగదేశం

శ్రీశైల, దాక్షారామ, కాళేశ్వరాలలో వున్న మూడు ప్రసిద్ధ లింగాలు (త్రిలింగాలు) కారణంగా త్రిలింగ దేశమని ఆంధ్రదేశానికి పేరు వచ్చినట్లు చాలామంది అభిప్రాయ పడుతూ వచ్చారు. ప్రసిద్ధి వుండడం లేక పోవడం అనేది చరిత్రలో ఏ క్షేత్రానికైనా వున్నదే. సృష్టిలోనే వెలుగు

వాఙ్మయ మహోధ్యాతుని

చీకట్లున్నట్లు, ఈ పుణ్యక్షేత్రాలకు ప్రసిద్ధాప్రసిద్ధ స్థితులనదగిన వెలుగు చీకట్లు లేవని యెవరూ అనలేరు. ఎన్నో, యెన్నెన్నో శివలింగ క్షేత్రాలున్న ఆంధ్రదేశం, కోటిలింగాలక్షేత్రమేవున్న ఆంధ్రదేశం కేవలం మూడు ప్రసిద్ధక్షేత్రాలు కారణంగానే త్రిలింగదేశమని పేరుగాంచిందంటే మనకు ఆశ్చర్యకరంగానే వుంటుంది. అంతేకాదు. ప్రసిద్ధి చెందిన క్షేత్రాలు యెన్నెన్నో వుండగా చతుర్లింగ దేశమనిగాని, పంచలింగ దేశమనిగాని అంత కెక్కువగాగాని ఉన్న సంఖ్యావాచకంతో ఆంధ్రదేశానికి పేరెందుకు రాలేదు ? అన్నింటికంటే మహాప్రసిద్ధి వహించిన కోటిలింగాల క్షేత్రముండగా "కోటిలింగ దేశమని" అసాధారణంగా, అపూర్వంగా పేరు పెట్టుకొని వుండవచ్చునుగదా ! ఆంధ్రదేశమంతటా అనేక శివలింగ క్షేత్రాలున్నందువల్ల అసలు "లింగదేశ"మనేపేరు యెందుకు పెట్టరాదు ? బ్రహ్మాండ పురాణంలో శ్రీశైలం, భీమేశ్వరం కాళేశ్వరం అనే క్షేత్రాలు మూడూ పేర్కొనబడడం చూస్తే అప్పుడవి ప్రసిద్ధాలుగానో, హద్దులుగానో వుండివుండవచ్చునని అనిపిస్తుంది. ఆంధ్రవిష్ణువు రాజ్యకాలంలో, శ్రీశైల, భీమేశ్వర, కాళేశ్వరాలు మూడూ మూడు ద్వారాలుగా పరిగణింపబడ్డాయనడంలో వాస్తవికతను సందేహించవలసి వస్తుంది. ఏ దేశానికైనా, రాజ్యానికైనా పరిపాలనా దృష్టితోగాని, సరిహద్దుల దృష్టితోగాని పరిశీలిస్తే, నాలుగు దిక్కులుండి తీరుతాయి. ఇదే విధంగా నాలుగు ముఖద్వారాలు కూడా వుండితీరాలి. అయితే ఆంధ్రవిష్ణువు రాజ్యానికి మూడింటినేముఖద్వారాలుగా యెంచినట్లు కనిపిస్తున్నది. తూర్పు దిక్కున సముద్రమున్నందువల్ల ఈ మూడింటినే ముఖద్వారాలుగా ఆంధ్రవిష్ణువు భావించి వుంటాడని కొందరనవచ్చు. ఈ దృష్టితో చూచినా శ్రీశైల, భీమేశ్వర, కాళేశ్వర క్షేత్రాలు మిగిలిన మూడు దిక్కుల లోనూ వున్నాయని చెప్పలేము. అందువల్ల బ్రహ్మాండ పురాణంలోని త్రిలింగ నామ నిర్వచనం సరైనదని అనలేము. కొన్ని తరాలుగా మరికొందరు భీమేశ్వర కాళేశ్వరాలకు మారుగా కాళహస్తి దాక్షారామాలు త్రిలింగాలలో రెండు లింగాలుగా భావించడం జరుగుతున్నది. (భీమేశ్వరమంటే వేములవాడని కొందరు దాక్షారామమని కొందరు భావించిన వారుకూడా లేక పోలేదు.) త్రిలింగ నిర్వచనంలోనే ప్రసిద్ధ క్షేత్రాలన్న దృష్టిలో ఏకవాక్యత కుదరడంలేదు. అసలు ప్రసిద్ధ క్షేత్రాలన్నవి మూడు మాత్రమే వుండాలని యెక్కడ వున్నది ? ఎన్నెన్ని క్షేత్రాలైనా సుప్రసిద్ధాలు కావచ్చును కదా. అందువల్ల ప్రసిద్ధ క్షేత్రాలన్న దానిని దృష్టిలో పెట్టుకొని "త్రిలింగదేశ"మని పేరు వచ్చి వుండదేమోనని సందేహం కలుగుతున్నది.

పంచభూతాత్మకాలైన లింగాలు అయిదున్నాయి. ఈ అయిదూ పృథివ్యప్ తేజో వాయు రాకాశాత్మకాలు–పృథ్వీ లింగం తిరువళ్లూరులోనూ - జల లింగం

జంబుకేశ్వరంలోనూ- అగ్నిలింగం అరుణాచలంలోనూ-వాయులింగం కాళహస్తిలోనూ-ఆకాశలింగం చిదంబరంలోనూ ఉన్నాయి-కాళహస్తి యెలాగూ ఆంధ్ర దేశంలోనే ఉన్నది కాబట్టి అరుణాచల-చిదంబరాలు తెలుగుదేశంలోఉన్న కాలంలో అగ్ని - వాయురాకాశాత్మకాలైన త్రిలింగాలతో కూడిన దేశం కాబట్టి తెలుగుదేశానికి త్రిలింగదేశం అని పేరు వచ్చిందా అని కూడా సందేహంగా ఉన్నది. అంతేకాదు - ఒకప్పుడు "తిరువాళ్లూరు" కూడా తెలుగు దేశంలో ఉన్నదే-అయితే మరి చతుర్లింగదేశం అని యెందువల్ల పేరు రాలేదా అని అనిపించడం సహజం-ఏమైనా యివన్నీ కేవలం ఊహలే కాని ఖచ్చితంగా యిదమిత్థంగా యిది యిది అని తేల్చి చెప్పలేము - కాళహస్తి-అరుణాచల - చిదంబరం - తిరువళ్ళూరుల్లో యేవో ఒక మూడుగాని - కాళహస్తితో మరొక రెండు కలుపుకుని - యేవో ఒక మూడు క్షేత్రాలుగాని తెలుగు దేశంలోఉన్న కాలంలో "త్రిలింగ దేశం" అని పేరు వచ్చి ఉండాలి-ఇటువంటి విశిష్టతయేమీ లేకుండా "త్రి"శబ్ద ప్రాధాన్యంతో "త్రిలింగ" దేశనామం వచ్చి ఉండదు. అయితే పంచభూతాత్మకాలైన లింగాలు కేవలం పైన పేర్కొన్న ప్రదేశాలలో మాత్రమే ఉన్నాయని చెప్పడానికి ఆస్కారం లేదు. యెందువల్లనంటే కంచిలోకూడా "పృథ్వీ"లింగమే ఉన్నదని ప్రసిద్ధి. యిటువంటి వెన్నిచోట్ల ఉన్నాయో తెల్సుకోవాలంటే అది గవేషించవలసిన విషయం.

త్రిలింగాలంటే ఇష్టలింగం ప్రాణలింగం భావలింగం అనీ గురులింగం, -జంగమలింగం-శివలింగం అనీ మూడు మూడు భిన్న లింగ నిర్వచనాలున్నాయి - వీటిల్లో యే మూడింటివల్లనైనా త్రిలింగ దేశనామం వచ్చిందా అంటే అవుననలేము. —ఇష్ట—ప్రాణ—భావలింగాలు ఒక్క తెలుగు దేశంలోనే కాదు మరేదేశంలోనైనా ఉండవచ్చును.ఇదేవిధంగా గురులింగ-జంగమలింగ-శివలింగాలుమూడూ-ఒక్క తెలుగు దేశానికి మాత్రమే పరిమితాలని యెవ్వరూ చెప్పలేరు—అందువల్ల యీ ఇష్ట, ప్రాణ, భావ—గురు, జంగమ, శివలింగాలవల్ల తెలుగుదేశానికి త్రిలింగదేశమని పేరు వచ్చిందని చెప్పడానికి వీలులేదు—అయితే శ్రీశైలంలోని లింగం తారకలింగమని-దాక్షారామం లోని లింగం మహాకాళ లింగ మని—కాళేశ్వరంలోని లింగం హాటకలింగమని ఒక సాంకేతిక నిర్వచనం ఉన్నది. ఈ త్రివిధ తారక, మహాకాళ, హాటకలింగ త్రిస్వరూపాలను దృష్టిలో పెట్టుకుని యే తత్త్రిలింగ సంకలితమైన తెలుగుదేశం త్రిలింగదేశమని పేరు వచ్చిందేమోననడానికి ఆవకాశాలున్నాయి—అయితే ఒక్క శ్రీశైల దాక్షారామ కాళేశ్వరాలలోనే తప్ప మిగతా చోట్ల మరెక్కడా తారక— మహాకాళ—హాటక లింగాలు లేవని సుదృఢంగా మనం నిరూపించవలసి ఉన్నది — యీ నిరూపణ అంత సులభ సాధ్యమైన విషయం కాదు—అందువల్ల యీ తారక—

మహాకాళ — హాటక లింగాల పేరు మీద తెలుగుదేశానికి త్రిలింగదేశమని పేరు వచ్చి ఉంటుందని నిక్కచ్చిగా చెప్పలేము —

సుప్రసిద్ధ సంస్కృత పండితులు, ఉపాసకులు అయిన కీర్తిశేషులు శ్రీ భాగవతుల అన్నపూర్ణశాస్త్రిగారు 1956లో, ఒకసారి నాతో మాట్లాడుతున్నప్పుడు త్రిలింగ దేశ నామ నిర్వచనంపై చారిత్రకులలోవున్న అభిప్రాయాలపట్ల నేను నా సందేహాన్ని వెల్లడించగా అందుకు వారు నవ్వుతూ "త్రిలింగ దేశమని పేరు రావడానికి అసలు మూలకారణం వేరు. నీలో రేకెత్తిన సందేహాలు అకారణంగా వచ్చినవి కావు. అతి ప్రాచీన కాలంలో అటు తమిళదేశంలో చాలా భాగం వరకూ, ఇటు ఒరిస్సా రాష్ట్రంలో చాలాభాగం వరకూ, ఆంధ్రదేశం విస్తరించి వుండేది. మన దేశం, శ్వేతలింగ-పీతలింగ-కృష్ణలింగాలనే మూడు రకాల లింగాలున్న దేశం అవడంవల్ల త్రిలింగదేశమని పేరు వచ్చింది" అని సమాధానం చెప్పారు. "శ్రీ కాళహస్తిలోనిది కృష్ణ లింగం-దక్షిణ ఆర్కాటు జిల్లాలో ఒక శ్వేతలింగ క్షేత్రముండేది. గంజాం జిల్లాలో ఒక పీత (పసుపుపచ్చ) లింగ క్షేత్రముండేది. అప్పటి ఆంధ్రదేశం ఈ మూడు లింగాల క్షేత్రాలతో వుండేది కనుక దానికి "త్రిలింగదేశ" మని పేరు వచ్చిం" దని కూడా శ్రీ అన్నపూర్ణశాస్త్రి గారు వివరించారు. శ్రీ అన్నపూర్ణ శాస్త్రిగారు త్రిలింగదేశమని పేరు రావడానికి చెప్పిన నిర్వచనం అసాధారణమైనది. ఈ దృష్టితో ఎన్నెన్ని ప్రసిద్ధ క్షేత్రాలున్నా కోటి లింగాలే కావు కోట్లకొలది లింగాలున్నా శ్వేత, పీత, కృష్ణలింగాలు మూడే కాబట్టి త్రిలింగ దేశమని పేరు వచ్చిందనడంలో ఆక్షేపణీయమైన విషయం కాని, సందేహించవలసిన విషయం కాని మనకు కనపడదు. శ్వేత లింగాలు, కృష్ణలింగాలు సామాన్యంగా యెన్నైనా ఉండవచ్చుగదా అని యెవరైనా సందేహించవచ్చును. ఏ రంగులో యెన్నెన్ని లింగాలున్నా లింగాలున్నది యీ మూడు రంగులలోనే గాని, మిగతా రంగులలో లేవన్న విషయం మనం ముఖ్యంగా గుర్తించాలి. కాగా పై సందేహాని కవకాశం ఉండదు.

ఇది ఈవిధంగావుండగా షడ్విధప్రాకృత సంస్కృతాంధ్ర భాషావేత్తయై, కవిశేఖరుడై క్రీ.శ. 1650 ప్రాంతంలో ఉండి "ఆంధ్రపాణిని" అని బిరుదుపొందిన నివర్తి శేషసుమతి (శేషాచలపతి) ఆంధ్రశబ్దానుశాసనం అనే పేరుతో సంస్కృతంలో వ్రాసిన వ్యాకరణంలో త్రిలింగ పదం గురించి నిర్వచనం వ్రాస్తూ "పదస్థానం త్రిలింగ మిత్యుప్రపన్నమ్. అత ఏవత్రైలింగా ప్రాప్తగంగా..............లింగ త్రయం స్త్రీపున్నపుంసకాఖ్యం తేనావిభక్తకతా త్రిలింగా" (775 ఆంధ్ర వ్యాకరణం. **B.** 10010. **S**–17½ × 1; **L**–920. 11-4-G-1200. **THE DESCRIP-**

TIVE CATALOGUE OF TELUGU MANUSCRIPTS. 333 పుట. ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ప్రచురణ) అంటూ కొంత వ్రాశాడు. స్త్రీపున్నపుంసక లింగాలు లేని, అంటే మహన్మహత్యమహద్వాచకాలులేని, భాష లేదు. కాబట్టి త్రిలింగ భాషాయుక్తమైన దేశం త్రిలింగ దేశమని పిలవబడిందనడం హాస్యాస్పదమైన విషయం. అయితే మూడులింగస్థానాలనుంచి ప్రారంభమైన నదీ ప్రవాహాలు కలదేశం కాబట్టి త్రిలింగ దేశమనబడిందనడం కొంత తర్కసహంగా కనిపిస్తున్నది. అయితే భౌగోళికంగా మూలస్థానంలో లింగాలున్న తెలుగుదేశంలోని మహానదుల ఉత్పత్తిని గురించి పరిశోధించ వలసి వున్నది.

యీ సందర్భంలో ఒక విషయాన్ని మనం గుర్తించాలి. తెలుగు దేశంలో ఉన్న సుప్రసిద్ధాలైన జీవనదులు మహా నదులు మూడుఅని చెప్పవచ్చు - అవి కృష్ణ - గోదావరి-పినాకినీ నదులు-కృష్ణానది పశ్చిమ కనుమల్లో మహబలేశ్వరంవద్ద పుట్టింది- గోదావరినది కూడా పశ్చిమ కనుమల్లోనే పుట్టింది. పినాకినీ(పెన్నా)నది మైసూరులో పుట్టింది - యీ మూడు నదులకూ కూడా అసలు మూల పుట్టుకస్థానంలో శివలింగాలున్నాయోలేవో పరిశోధించవలసివున్నది. ఈ మూడు నదుల్లోనూ కలిసే ఉప నదులు యెన్నైనా ఉండవచ్చును. కాని కృష్ణానదికి ఒక ప్రత్యేకత ఉన్నది-కృష్ణానది పుట్టుక దగ్గరనుంచి యెన్నెన్నో ఉపనదులు వాగులు అందులో కలిసిపోయాయి - అయితే "వేణ్ణా"నది ఒకటి కృష్ణానదితో కలవడంవల్ల కృష్ణానది "కృష్ణ వేణ్ణి" అయి "కృష్ణ వేణి"గా సుప్రసిద్ధమైనది-రెండు నదుల కలయికతో "కృష్ణ వేణి" అనిపించుకున్న యీ నదికి మూలస్థానాలు రెండు అని అంగీకరించవలసి ఉంటుంది. మరి కృష్ణానదికి మూలస్థానంలోనూ వేణ్ణా నదికి మూలస్థానంలోనూ శివలింగాలున్నాయో లేవో పరిశోధించవలసిన విషయం - గోదావరి మూలస్థానంలోనూ పినాకిని మూలస్థానంలోనూ రెండు శివలింగాలుండి కృష్ణ-వేణ్ణా నదులు రెండింటి మూలస్థానాలలోనూ రెండు లింగాలుండివుంటే మొత్తం నాలుగు లింగాలవుతాయి - అయితే కృష్ణా-వేణ్ణా నదులలో ఒకే ఒక్క నది మూలస్థానంలో మాత్రమే శివలింగం ఉండి ఉంటే అప్పుడు కృష్ణవేణి - గోదావరి - పినాకినీ నదీత్రయ మూలస్థానాలలో మూడు లింగాలున్నాయని చెప్పడానికి అవకాశం యేర్పడుతుంది. యింతకూ అసలీ మూడు నదులకూ మూలస్థానాలలో శివలింగాలున్నాయో లేవో పరిశోధించి యీ త్రిలింగాల విషయమై ఒక నిర్ణయానికి రావలసి ఉన్నది. యీత్రినదులకూ మూలంలో త్రిలింగాలున్నప్పుడు నివర్తిశేష సుమతి ఆంధ్రశబ్దానుశాసనంలో వ్రాసిన త్రిలింగదేశ శబ్ద నిర్వచనం సార్థకమై నిలవడానికి అవకాశం యేర్పడగలదు.

వాఙ్మయ మహోధ్యక్షుని

ఏదియేమైనా మూడు సుప్రసిద్ధ శివలింగ క్షేత్రాలున్నందువల్ల త్రిలింగదేశమని పేరు వచ్చిందనడం తర్కసహంగా కనిపించదు. అయితే త్రిలింగ దేశాధినాథుడైన ఆంధ్రవిష్ణువు కాలంలోనే కణ్వుడు సంస్కృతంలో తెలుగు వ్యాకరణం వ్రాసినట్లు కొందరు భావిస్తున్నారు. మూడు పూవులారు కాయలుగా ఆంధ్రభాషా సంస్కృతులు విస్తరిల్లిన ఆంధ్రవిష్ణువు కాలంలో ఇటువంటి వ్యాకరణం అవతరించిందంటే మనం ఆశ్చర్యపడవలసినదేమీలేదు.

## పురాతన వ్యాకరణాలు

తిక్కనకు సమకాలికుడై క్రీ. శ. 1250 ప్రాంతంలో వున్న అథర్వణుడు "త్రిలింగ శబ్దానుశాసనం" అనే తెలుగు వ్యాకరణాన్ని సంస్కృతంలో రచియిస్తూ ఈ క్రింది విధంగా పేర్కొన్నాడు.

"బార్హస్పత్యాని సర్వాణి కాణ్వం వ్యాకరణం విదన్
కరోమ్యాథర్వణం శబ్దం సర్వలక్షణలక్షితమ్.॥"

దీనివల్ల బృహస్పతి, కణ్వుడు అనబడేవారు తెలుగుకు వ్యాకరణాలు రచియింపగా వాటిని అథర్వణుడు క్షుణ్ణంగా చదివి సర్వలక్షణ లక్షితమైన "త్రిలింగ శబ్దానుశాసన" గ్రంథాన్ని రచించినట్లు స్పష్టంగా తెలుస్తున్నది. "బార్హస్పత్యాని సర్వాణి" అని అనడం వల్ల బృహస్పతి రచించినవి సూత్రాలేమో అన్న సందేహం కలుగుతున్నది. ఒకవేళ కారికలైనా కావచ్చును. క్రీ.శ. 1650 ప్రాంతంలో వున్న మండలక్ష్మీ నరసింహకవి రచించిన "ఆంధ్ర కౌముది" లో సైతం ఈ క్రింది విధంగా వక్కాణించబడింది.

"ఆథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్
కౌముదీ మాంధ్రశబ్దానాం సూత్రాణి చ కరోమ్యహమ్"

త్రిలింగ శబ్దాను శాసనంలోని శ్లోకం కంటే దాదాపు నాలుగు వందల సంవత్సరాల తరువాత అవతరించిన ఈ ఆంధ్రకౌముది శ్లోకం ప్రామాణికమనినేను చెప్పడంలేదు. కాని బృహస్పతి, కణ్వుల వ్యాకరణాలున్నట్లు అథర్వణుని తరువాత చాలాకాలం వరకూ సైతం అనుస్యూతమైన అభిప్రాయం వున్నట్లు మనకు స్పష్టపడుతుంది. నరసింహ కవి కూడా అథర్వణ వ్యాకరణమే కాక బృహస్పతి-కణ్వ వ్యాకరణాలు సైతం అధ్యయనం చేసినట్లు స్పష్టపరచాడు. వాటినుండి తన ఆంధ్రకౌముదిలో కొన్ని సూత్రాలను ఉదాహరించనుకూడా ఉదాహరించాడు. బార్హస్పత్య, కాణ్వవ్యాకరణాలు చదివి తాను "త్రిలింగ శబ్దానుశాసనం" వ్రాస్తున్నట్లు

అథర్వణుడు చెప్పగా అథర్వణుని వ్యాకరణంతో పాటు అతడు చదివిన కాణ్వ, బార్హస్పత్య వ్యాకరణాలు సైతం చదివి "ఆంధ్ర కౌముది" వ్రాస్తున్నట్లు లక్ష్మీనరసింహ కవి పేర్కొనడం చూడగా, లక్ష్మీనరసింహకవి అథర్వణ, కణ్వ, బృహస్పతుల వ్యాకరణాల మధ్య అనుస్యూతమైన ఒక ఏకవాక్యత యేర్పడినట్లు తోస్తుంది. వాక్యరణ రచనలో ఒక క్రమం ఈ గ్రంథాలలో మనకు గోచరం కాగలదు. కాణ్వ, బార్హస్పత్యాలను కొంత వివరించి, మరికొంత సవరించి అథర్వణుడు త్రిలింగ శబ్దానుశాసనం రచించి వుండవచ్చును. మరి మండ లక్ష్మీ నరసింహ కవి యేంచేశాడో త్రిలింగ శబ్దానుశాసన, ఆంధ్ర కౌముది గ్రంథాలను సరిపోల్చి చదివితేనేకాని యేమీ చెప్పలేము.

అథర్వణుని త్రిలింగ శబ్దానుశాసనంవల్ల కణ్వ, బృహస్పతుల వ్యాకరణాలు వున్నట్లు దృఢంగా స్పష్టపడింది. "వికృతి వివేకము" అనే పేరుగల సంస్కృత కారికావళితోకూడిన వ్యాకరణాన్ని అథర్వణుడే రచించాడని ప్రసిద్ధివున్నది. ఈ వికృతి వివేకాన్నే "అథర్వణ కారికావళి" అనికూడా అంటారు. అథర్వణుని త్రిలింగ శబ్దానుశాసనం ముద్రితంకాలేదు కాని దీని తాళపత్ర ప్రతి మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోవున్నది. ఈ త్రిలింగ శబ్దానుశాసనానికి, అథర్వణ కారికావళికి (వికృతి వివేకానికి) పోలికవున్నట్లు కనపడదు. వికృతి వివేకాన్ని అథర్వణుడు రచించలేదని అహోబలుడుగాని, వేరెంకెవ్వరైనాగాని రచించి, అథర్వణుని పేరు పెట్టివుండవచ్చునని నావంటి కొందరు విమర్శకుల వూహ. క్రీ. శ. 1750 లో గాని అంతకు పూర్వమేగాని అవతరించిందనుకుంటున్న ఈ అథర్వణ కారికావళిలో శ్రీకవి, విష్ణుశర్మ, హరి, శృంగార భూషణుడు, ధూర్వహుడు, కవిశిఖామణి, శౌరికవి, అనే ఏడుగురు వ్యాకరణకర్తల పేర్లు మత భేదాలుగా ఉటంకించడంవల్ల మనకు తెలుస్తున్నవి. అథర్వణ కారికావళిలో వివిధ సందర్భాలలో ఈ వ్యాకరణకర్తలపేర్లు పేర్కొన్న కారికలివి.

వికృత్యాదిగతోయోఽత్రతస్యాచ్ఛబ్దాంతరయోగతః
ప్రాణమాత్రావశేషస్యాదత్ర శ్రీకవి సమ్మతేః॥ (సంజ్ఞ)
అవ్యయస్యేతర స్యాపి ప్రయోగో విష్ణుశర్మణా
కథిత స్తద్భవస్యాపి దీర్ఘాన్తత్వంక్వ చిద్భవేత్॥ (సంజ్ఞ)
సర్వేశబ్దాః ప్రయోక్తవ్యాయదివాదోషవర్జితాః
అప్రయుక్తత్వ దోషస్తు న విరుద్ధో హరేర్మతే॥ (సంజ్ఞ)
శబ్దానామంత్య భాగేషుయోఽనుస్వారః ప్రదృశ్యతే
తస్యాచి పరతో మస్స్యాత్సర్వత్ర హరి సమ్మతేః॥ (సంధి)

వాఙ్మయ మహోధ్యాఉని

స్యుర్భిన్నా దేవ తస్మాత్తే వినాద్వంద్వం హరేర్మతే॥ (సంధి)
పరుషా వాస్వరూపేణ ప్రథమాంతో పరిస్థితాః

......................................

అచేతనార్థకే శబ్ద ఇతి *శృంగారభూషణః*॥ (సంధి)
*ధూర్వహస్య* మతే తత్ర కవివాజ్మాన ముచ్యతే॥ (సంధి)
కేచిచ్చామహచ్ఛబ్దా మతే *కవిశిఖామణేః*॥ (అజన్త)
ఆనజ్‌స్స్యాద్రృతో ద్వంద్వే రేఫ *శ్శౌరి* కవేర్మతే॥ (అజన్త)

ఆంధ్రశబ్ద చింతామణి యెప్పటిదైతేనేమి? యెవ్వరు రచించిందయితేనేమి ? 'కవి భల్లటాదీనాం' అంటూ కవి భల్లటాది వ్యాకరణ కర్తలపేర్లు చింతామణిలో సైతం పేర్కొనబడ్డాయి – ఇంతేకాక అహోబలపండితుడు అహోబల పండితీయ మనబడే తన కవిశిరోభూషణంలో "తమ్మి గుజ్జులు ఇత్యాదౌ ఉత్వం సాధుత్వమశ్నుత ఇతిధ్యేయమితి నృసింహః" (అహో–సంధి–వాంతః–సూత్రవ్యాఖ్య) అని నృసింహుడనే వ్యాకరణకర్త వున్నట్లు పేర్కొన్నాడు – "ప్రాకృతే తద్భవే చాపి ఇత్యధర్వణ సూత్రే ప్రాకృత శబ్దస్య – ప్రాకృత సమపరత్వం *నరసింహ గ్రంథరీత్యా* వ్యాఖ్యాతం–వస్తుతస్తు ప్రాకృత శబ్దస్య పాకృత సమపరత్వమేవ–" చ జౌతజ్జే ప్రాకృతేచదంత్యావేవ నసంశయః "ఇత్య *ధోక్షజా*చార్యా వచనాత్"–(అహో–సంజ్ఞ–12 సూత్రం వ్యాఖ్య) అని మరొకసారి నరసింహుని పేరుతోపాటు అధోక్షజుడనే తెలుగు వ్యాకరణకర్త పేరును సంస్కృతకారికను సైతం అహోబలుడుదాహరించాడు.

అంతేగాదు. అహోబలుడు "యద్వపభ్రంశః" (అహో–సంజ్ఞ–10సూత్రం) అన్న సూత్రానికి వ్యాఖ్య వ్రాస్తూ – "బహువః ప్రాచీనాచార్యాః ప్రకాశితాః–అధర్వణ గ్రంథేఽపి బహవః పురాత *నాంధ్ర శిక్షకాః కవిశిఖామణ్యాదయః*" అని వ్రాసి పురాతనకాలంలో రచించబడిన తెలుగు వ్యాకరణాలు తాను చూచినట్లు భంగ్యంతరంగా తెలుపడమేకాక – అధర్వణ గ్రంథంలో అనేకమంది కవిశిఖామణ్యాది ఆంధ్ర శిక్షకులు అంటే వ్యాకరణకర్తలు పేర్కొనబడినట్లు కూడా వక్కాణించాడు. ఈ విధంగా యెన్నెన్నో తెలుగు వ్యాకరణ గ్రంథాలు పురాతన కాలంలో ఉన్నట్లు మనకెన్నో ఆధారాలు కనిపిస్తున్నాయి.

అధర్వణ కారికావళిలో ఉదహరింపబడిన కారికలలోనూ అహోబలపండితీయంలో పేర్కొనబడిన సందర్భాలలోనూ సిద్ధాంతపరంగా గ్రంథకర్తృనామం పేర్కొనబడిందే గాని గ్రంథనామం యెక్కడా ఉటంకించబడలేదు. త్రిలింగ శబ్దా

నుశాసనకర్తయైన అథర్వణునికి తరువాత అథర్వణకారికావళి మాత్రమేగాక సంస్కృతంలో ఆంధ్ర శబ్ద చింతామణికి మంచెళ్ల వాసుదేవకవి రచించిన "వాసుదేవ వృత్తి" "వైకృతచంద్రిక" నివర్తి శేషసుమతి వ్రాసిన "ఆంధ్ర శబ్దానుశాసనం" వంటి గ్రంథాలుకొన్ని వున్నాయి.

## సంస్కృత భాషలో తెలుగు వ్యాకరణాలు

ఒక్క వైకృతచంద్రిక సూత్రాలు దాని వృత్తి మాత్రమే కాదు-ఆంధ్ర శబ్ద చింతామణి-వాసుదేవ వృత్తి-కవిశిరోభూషణనామక అహోబలపండితీయం మాత్రమే కాదు అనేక ఆంధ్ర వ్యాకరణాలు అత్యంత ప్రాచీనకాలంనుంచి సంస్కృత సూత్రాలలోనూ కారికలలోనూ రచించబడినట్లు స్పష్టపడుతున్నది. ఆంధ్రభాషా భూషణం-ఆంధ్ర కౌముది వంటి కొద్ది గ్రంథాలు మాత్రమే క్రీ.శ. 13వ శతాబ్ది తరువాత తెలుగులో అవతరించాయి. ప్రాచీనకాలంలో తెలుగు భాషలో తెలుగు వ్యాకరణం రచించబడినట్లు కనపడదు. అయితే తెలుగు వ్యాకరణాలు రచించిన ఋషితుల్యులైన మహానుభావులందరూ తెలుగులోనే వ్యాకరణాలు వ్రాయకుండా సంస్కృత సూత్రాలలోనూ కారికలలోనూ యెందుకు రచించినట్లు? ఆ తరువాత ఆ సూత్రాలమీదా కారికలమీదా వచ్చిన వృత్తులు భాష్యాలవంటి వ్యాఖ్యానాలు సైతం-యే యెలకూచి బాలసరస్వతి వ్యాఖ్యవంటివి సకృత్తుగానే తప్ప-మిగిలినవి సంస్కృతంలోనే యెందుకు అవతరించినట్లు? అనే ప్రశ్నలు మనల్ని చిరాకుపెడతాయి.

అసలు సంస్కృత భాష ఇటు లౌకిక భాష కానివ్వండి అటు అలౌకిక వైదిక భాష కానివ్వండి, యేదైనా అత్యంత ప్రాచీనమైనది. సూత్ర కారిక భాష్యాది రూపాలలో యే రూపంలో సంస్కృత వ్యాకరణ గ్రంథం అవతరించినా అది సంస్కృతభాషలోనే అవతరించేది. సంస్కృతం చదువుకున్న వారంతా ఈ సంస్కృత వ్యాకరణాలనే అధ్యయనం చేసేవారు. కొందరు భావిస్తున్నట్లు సంస్కృత భాషకంటే ప్రాకృతాది భాషలు అతిప్రాచీనమైనవిగాని ప్రాచీనమైనవిగాని కానేరవు-ఒక్క మామూలు ప్రాకృతభాషకేకాదు-మాగధ్యాది ప్రాకృతభాషలలో యే ప్రాకృతభాషకైనా అవతరించిన వ్యాకరణ గ్రంథాలు సంస్కృతంలోనే అవతరించాయి. సకృత్తుగా యేవైనా ప్రాకృతాలలో కేవల ప్రాకృతుల కోసం వ్యాకరణాలు అవతరిస్తే అవతరించి ఉండవచ్చును గాని వాల్మీక్యాది ప్రామాణిక ఋషుల రచనలైన ప్రాకృత వ్యాకరణాలన్నీ సంస్కృతంలోనే ఉన్నాయి. అటు సంస్కృత వ్యాకరణాలు యిటు వివిధప్రాకృత వ్యాకరణాలు అన్నీ సంస్కృతంలోనే

అవతరించగా వాటిని చూచి అధ్యయనం చేసిన తెలుగువారు-తెలుగుబుధులు-తమ భాషా వ్యాకరణాలను సైతం సంస్కృతంలోనే వెలయించి వుంటారు. వ్యాకరణ రచనకు సంస్కృతంలో ఒక విశిష్టసౌకర్యం ఉన్నది. సంస్కృతం అతి సంగ్రహంగా సూత్రం రచించడానికి వీలైన భాష. సూత్రస్వరూపంలో సౌందర్యాన్ని సమకూర్చుకొనడానికి వీలైన భాష-భావవ్యక్తీకరణకు-తార్కిక విమర్శనా పాటవానికి-చాకువలె ఉపయోగపడగల అందమైన భాష. పైగా సంస్కృతంలో ఉన్నంత బహుముఖమైన విజ్ఞానం-యే దృక్కోణంతో చూచినా పూర్వం మరే ప్రపంచ భాషలోనూ ప్రాకృతాలలోనూ లేదు-అందువల్ల ప్రాకృతభాషలకు వ్యాకరణాలు రచించినా సంస్కృతంలోనే రచించి- సంస్కృతాధ్యయనావశ్యకతను బలపరచడమేకాక దృఢపరచినట్లు కనిపిస్తున్నది. అంటే యే ప్రాకృతం వచ్చినా రాకపోయినా సంస్కృతం వస్తే ఆ సంస్కృతభాషలో రచించబడిన ప్రాకృత వ్యాకరణాల ద్వారా వివిధ ప్రాకృత భాషలు నేర్చుకొనడానికి సులభంగా వీలవుతుంది-అంతేకాదు-వివిధ ప్రాకృత భాషలు సంస్కృతంలోనుంచే ఉద్భవించాయన్న భావం ప్రబలంగా ఉన్నది కాబట్టి-సంస్కృత పదాలకు ప్రాకృత పదాలకు-సంస్కృతంలోనుంచి ప్రాకృతాలు వచ్చినా ప్రాకృతాలు సంస్కరించడంవల్ల సంస్కృతమే రూపొందినా-ఒక అవినాభావసంబంధ బంధం వున్నది కాబట్టి సంస్కృతంలో వ్యాకరణాలు రచియించినట్లు కనిపిస్తున్నది. సంస్కృతంలోనే వ్యాకరణాలుంటే ఒక్క సంస్కృతీయులు - ప్రాకృతీయులు మాత్రమే కాక- యే సంస్కృత ప్రాకృతేతర భాషీయులైనా సంస్కృతం వచ్చినవారైతే-సంస్కృతం అందరి భాష కాబట్టి-సామాన్య భాష కాబట్టి-ప్రాకృతాది భాషా విశేషాలు తెలుసుకొనడానికి వీలవుతుందన్న దృష్టితో సంస్కృతంలో రచించబడినట్లు కనిపిస్తున్నది. అంతేకాదు. "శాస్త్ర రచన చేసినా-శాస్త్రాధ్యయనం చేసినా సంస్కృతభాషలోనే చెయ్యాలి. తద్రచనాధ్యయనాలు సంస్కృతంలో జరిగితేనే దానికి శాస్త్రీయత తగు సమున్నత గౌరవభావం సమకూరుతాయి. దేశ భాషల్లో రచనాధ్యయనాదులు జరిగితే అంత పటుత్వం గురుభావం యేర్పడదు. పైగా సంజ్ఞా పరిభాషాపదాలు సంస్కృతంలో యెన్నో ఉన్నాయి. అవన్నీ విషయ సంగ్రహీకరణకు భావ వ్యక్తీకరణ సౌలభ్యానికి యెంతైనా ఉపయోగకరంగా ఉంటాయి. కంఠస్థం చెయ్యడానికి సులభంగా జ్ఞాపకంవుంచుకొనడానికి శైలీ-శయ్యా సౌభాగ్యంతో యెంతైనా ఉపయోగపడతాయి"-అన్న అభిప్రాయాలతో ప్రాకృత వ్యాకరణ కర్తలు తదనుసారులైన తెలుగు వ్యాకరణ కర్తలు తమ దేశభాషా వ్యాకరణాలను సైతం సంస్కృత భాషలోనే రచించినట్లు కనిపిస్తున్నది. మరొక విశేషం యిక్కడ మనం గుర్తించవలసింది ఉన్నది. యిప్పుడు మనకు అంతర్జాతీయ భాషగా ఇంగ్లీషు ఉన్నది. యే దేశభాషా

వ్యాకరణం వ్రాయాలన్నా-వివిధ దేశాలవారు అవగాహన చేసుకొనడానికి అధ్యయనం చెయ్యడానికి యింగ్లీషులోనే వ్రాయడం జరిగింది. యిప్పటికీ జరుగుతున్నది-ఇదే విధంగా సంస్కృతభాష ప్రపంచం మొత్తందృష్టితో అంతర్జాతీయభాష కాకపోయినా –నిజానికి "లాటిన్" మొదలైన భాషలు సంజనితాలుకాకపూర్వం సంస్కృతం అంతర్జాతీయ భాషగా విరాజిల్లింది. ఇందుకు చాలా నిదర్శనాలున్నాయి – యిది వేరుమాట-అతి ప్రాచీనకాలపు విషయం. అయితే ప్రాచీన కాలంలో భారత జాతీయ భాషగా విరాజిల్లినమాట అసలే కాదనలేము. అందువల్ల వివిధ దేశ భాషా ప్రజలకు పండిత కవులకు పరిశోధకులకు తమ మాతృభాషకు భిన్నమైన ఇతర దేశ భాషలగురించి తెలియడానికి వీలుగా ఒక్క తెలుగు భాషకేకాదు – ఒక్క ద్రావిడానికితప్ప – మిగిలిన దేశభాషలన్నింటికీ ఇటు దక్షిణ భారత భాషలకు – అటు ఉత్తర భారత భాషలకు కూడా సంస్కృత భాషలోనే వ్యాకరణాలు రచియించినట్లు కనిపిస్తున్నది – ద్రావిడులు కేవల సంస్కృత విద్వేషకులైనందువల్ల ఆ భాషకు సంస్కృతంలో వ్యాకరణాలు రచియించలేదని అనిపిస్తున్నది. అసలు ఆర్య ద్రావిడులే ఉన్నా, ద్రావిడార్య భేదాలు యెన్నెన్ని ఉన్నా ప్రాచీన ద్రావిడానికి మూలం వేద సంస్కృతమేనని నా అపూర్వ అమేయ పరిశోధనలవల్ల తిరుగులేని విధంగా నిరూపితమైనది – (యీ పరిశోధనారచన అద్యతన భవిష్యత్తులోనే వెలువడుతుంది) ఏది యేమైనా భారతదేశంలో ఉన్న వివిధ దేశభాషలకు సంస్కృతంలోనే వ్యాకరణాలు వ్రాయడం ఆయాభాషీయుల మధ్య సంస్కృతీ సాహిత్యాల మధ్య ఒక అవగాహనను ఐకమత్యాన్ని పెంపొందించాలన్న సల్లక్ష్యంతో కూడా జరిగి ఉంటుందని భావించడంలో పొరపాటు లేదు.

## అష్టాధ్యాయి ?

"వైకృత చంద్రిక" లోని చంద్రికా శబ్దాన్ని చూడగానే సంస్కృతంలో భట్టోజీ దీక్షితులు రచించిన "సిద్ధాంత కౌముది" లోని "కౌముది" శబ్దం స్థూల దృష్టితో మనకు గోచరమవుతుంది. పూర్వం వైకృత చంద్రికా గ్రంథాన్ని చూచి సంస్కృతాంధ్రాలలో కవియైన మరొక పండితుడెవరో దానిని ప్రతి వ్రాయడానికి ఉద్యమించి అందుకు శ్రీకారంచుడుతూ ఈ క్రింది శ్లోకం మొదట రచించినట్లు కొన్ని వ్రాతప్రతులలో కనిపిస్తున్నది.

"ఆంధ్ర సూత్రార్థచాతుర్యం జ్ఞాతుం వైకృత చంద్రికామ్
మంచెళ్ళ వాసుదేవేన రచితాం విలిఖామ్యహమ్"

ఈ శ్లోకాన్ని చూస్తే ఆంధ్ర సూత్ర వ్యాకరణంవంటి యేదో ఒక పేరుతో ఎవరో సంస్కృత సూత్రాలలో వ్యాకరణం రచియించారనీ, ఆ "ఆంధ్ర సూత్రార్థ

చాతుర్యం" తెలియడంకోసం "వైకృత చంద్రిక"ను మంచెళ్ల వాసుదేవుడు రంచించాడనీ, మనకు సూటిగా బోధపడుతుంది. అంటే వైకృత చంద్రిక సూత్ర కర్త ఎవరో ఒక ప్రాచీన వ్యక్తియని, యెవరో రచించిన ఆ సూత్రాలకు వాసుదేవుడు వృత్తి రచించాడని సూత్రాలు మినహా మిగిలిన వ్యాఖ్యారూపమైన వృత్తి మాత్రమే వాసుదేవుని రచన అని మనం గుర్తించవలసి వుంటుంది. ఇందుకు తగినట్లు బహుముఖంగా లోతులలోకి వెళ్లి పరిశీలించగా వైకృత చంద్రికా సూత్ర కర్తా, వృత్తికర్తా విభిన్నులని స్పష్టంగా గోచరమవుతున్నది. వైకృత చంద్రిక తాళ పత్రగ్రంథాలు రెండు, కాగితపు వ్రాతప్రతులు ఐదు పరిశీలించి ఈ వైకృత చంద్రికను రూపొందించడం జరిగింది. ఇతర యే వ్రాతప్రతులలోనూ లేదుగాని కళాప్రపూర్ణ డాక్టర్ కొండవీటి వేంకటకవిగారివద్దవున్న ఒక కాగితపు వ్రాత ప్రతిలో పై అట్టమీద వైకృత చంద్రికకు "ఆంధ్ర సిద్ధాంత కౌముదీ" అని నామాంతరంకూడా వున్నది. గ్రంథాంత గద్యలలో "వైకృత చంద్రికాయాం" అని కేవల వైకృత చంద్రిక నామం మాత్రమే శ్రీ వేంకటకవిగారివద్దవున్న ప్రతిలో మాత్రమేకాదు అన్ని ప్రతులలోనూ వున్నది.

పాణిని పాదాలతోకూడిన అష్టాధ్యాయిగా వ్యాకరణ సూత్రాలను రచించగా వాటిల్లోవున్న కొన్ని లోపాలను వరరుచి (కాత్యాయనుడు) వార్తికాలను రచియించడం రూపంగా సవరించాడు. అనంతరం మహర్షి పతంజలి పాణిని సూత్రాలకు, వరరుచి వార్తికాలకు సమన్వయంతో మరింత విస్తృతార్థాన్ని ప్రవచిస్తూ మహాభాష్యం రచించాడు. పాణిని సూత్రాలను ప్రధానంగా తీసికొని వరరుచి వార్తికాలను సైతం జోడించి పాదాత్మకమైన "అష్టాధ్యాయి" సూత్ర క్రమపద్ధతికి భిన్నంగా విషయ ప్రధానంగా సంజ్ఞాది ప్రకరణ విభాగాన్ని వినూత్నంగాచేసి, మరొకవంక పతంజలి మహాభాష్యగత ముఖ్యవిషయాలను సైతం దృష్టిలో పెట్టుకొని భట్టోజీ దీక్షితులు "సిద్ధాంత కౌముది"ని విరచించాడు. సిద్ధాంత కౌముదిలో సంజ్ఞాది తద్ధితాంతం పూర్వార్థంకాగా, తిఙంత, కృదంత ప్రకరణాలు ఉత్తరార్థంగా రూపొందాయి. వాసుదేవుని ఈ వైకృత చంద్రికలో పూర్వోత్తరార్థ విభాగాలు పేర్కొనబడకపోయినా సంజ్ఞా-సంధి-స్వాది ప్రక్రియ-స్త్రీ ప్రత్యయ-విభక్త్యర్థ-సమాస-తద్ధితాదేశ-వివిధ తద్భవ ప్రకరణాలు సుబంత విభాగమై ప్రథమ భాగంగానూ, తిఙన్త ప్రకరణం తిఙన్త విభాగంగానూ-కృదన్త ప్రకరణం కృదన్త విభాగంగానూ మూడు భాగాలుగా వున్నాయి.

తద్భవ ప్రకరణంలో "సంస్కృతే" (1. సూ-103 పుట) అనే సూత్రానికి వాసుదేవుడు వృత్తి వ్రాస్తూ "ఇతః ప్రభృతి ఆపాద పరిసమాప్తేః సంస్కృతే

కార్యంస్యాత్" అని పాద ప్రసక్తితో వైకృత చంద్రికా సూత్రాల పాద వ్యవస్థ గురించి స్పష్టంగా ఉటంకించాడు. ఈ సందర్భాన్నిబట్టి వైకృత చంద్రికా సూత్రాలు వైకృత చంద్రికలోవున్న క్రమపద్ధతిలోకాక పాణిని అష్టాధ్యాయి పద్ధతిలో పాదసహితంగా రచించబడ్డాయని విస్పష్టంగా మనం గ్రహించవచ్చు. అంతేకాదు. అనేక సూత్రాలకు వ్రాసిన వృత్తులను పరిశీలిస్తే సూత్రాలలో లేని పదాలు యెక్కడెక్కడనుంచో అనువృత్తి వచ్చినట్లు పెక్కు సందర్భాలలో మనకు గోచరమవుతాయి. ఉదాహరణకు ఒక్క విషయం చెబుతాను.

"కుః ప్రార్థనాయామ్" (32 సూత్రం-తిజంతవిభాగం - 163 పుట) అనే సూత్రానికి వాసుదేవుడు వృత్తి వ్రాస్తూ "వ్యతిరేకార్థేకుః స్యాన్ ముడుజోః పరయోః" అని అంటాడు. దీని పూర్వ సూత్రంలో "ముడుజౌ ప్రార్థనాయామ్" (31. సూ. తిజంత-162 పుట) అని ప్రార్థనలో ఏకత్వ బహుత్వాలలో ముడుజ్‌లు వస్తాయని చెపుతాడు. ఈ 31 వ, సూత్రంలో వ్యతిరేకార్థ ప్రసక్తి లేనేలేదు. తిజంత విభాగం 159 వ పుటలోవున్న 15 వ, సూత్రమైన "తుముజ్ వ్యతిరేకయోరత్" అనే సూత్రంలోనుంచి 32 వ సూత్రంలోకి వ్యతిరేక శబ్దాన్ని అనువృత్తి తీసుకొని వస్తాడు. 15 సూత్రాలు దాటివచ్చిన ఈ అనువృత్తివంటి వాటిని దృష్టిలో పెట్టుకుంటే వైకృత చంద్రికలోని సూత్రాలు ఒక క్రమపద్ధతిలో లేవని మనకు స్పష్టపడుతుంది. ఇటువంటి అనువృత్తులు గ్రంథమంతటా మనకు గోచరమవుతాయి.

## వార్తికాలు

పాణిని సూత్రాలకు వరరుచి వార్తికాలను సవరణలుగా రచించినట్లు వైకృత చంద్రికా సూత్రాలకు రచించిన వృత్తులలో ఆయా సూత్రాలకు పూరకాలుగా కొన్ని వార్తికాలు రచియించబడ్డాయి. ఉదాహరణకు కొన్నిటిని పేర్కొంటున్నాను. సూత్రం — నాసజాతీయేస్తోః (సంధి 29. సూ. 19. పుట)
వార్తికం —సరళస్యానాదేశత్వం ఏపలోకోపకార్యం (ప్రమత స్యేప్యతే 19. పుట)
సూత్రం — నిలోపే నుమ్. (అజంత. 30. పుట. 22. సూ.).
వార్తికం — స్త్రీజడవాచకానామమహత్సంజ్ఞా. (30. పుట).
సూత్రం — ముమ్ముంబు నప్యతోఽమహతశ్చ. (అజంత. 30. పుట. 23. సూ.).
వార్తికం — యేభ్యోవుమూ విధీయతే తేషాంవుమువత్సంజ్ఞా. (31. పుట).
అవావౌ స్యా నావోః (అజంత. 76.సూ.47. పుట.) అనే సూత్రంలో అజంత పుంలింగ శబ్దాలు సాధించబడ్డాయి. ఈ సూత్ర వృత్తితుదిలో "ఆకారాంతస్యహ్రస్వః"

(48. పుట.) అని "క్లీబసమావిధా" (77. సూ) అనే సూత్రంపైన అజంత స్త్రీలింగ పదాలను సాధించడానికి ఒక వార్తికం ప్రత్యేకంగా వ్రాయబడింది. సూత్ర కర్త, వృత్తికర్త, వార్తికకర్త ఒక్కడే అయివుంటే సూత్రాలకు సవరణలుగా వార్తికాలను రచియించవలసిన అవసరం అణుమాత్రమైనాలేదు. అందువల్ల వార్తికాలకు బదులు సూత్రాలనే రచియిస్తాడు గదా! కాగా సూత్రకర్తా, వార్తికకర్తా ఒక్కరుకారని స్పష్టపడుతున్నది. గ్రంథమంతటావున్న వార్తికాలు చాలా తక్కువగా వున్నందువల్ల సూత్రాలకు పూరకాలుగా సౌలభ్యంకోసం వృత్తికర్తయైన వాసుదేవుడే వీటిని రచియించివుంటాడని భావించవలసివున్నది. సూత్రకర్తా, వృత్తికర్తా కాక వేరొకరెవరైనా ఈ వార్తికాలను రచించారేమో అని సందేహించడానికి అవకాశంలేదు. వేళ్లమీద లెక్కపెట్టడానికి తగినన్నిగావున్న ఈ సకృద్వార్తికాలను ఇతరులెవరో రచియించారనడం చాలా సందేహాస్పదకరంగానూ, అసంబద్ధంగానూ కనిపిస్తుంది. అందువల్ల వృత్తికర్తయైన వాసుదేవుడే ఈ వార్తికాలను రచించివుంటాడని భావించడం సముచితం కాగలదు. ఇంతకూ సూత్రకర్త, వార్తికకర్త ఒక్కరే అయితే అసలు వార్తికాలు రచియించవలసిన అవసరమే లేదని వాటి స్థానంలో సూత్రాలనే రచియించివుండేవాడని ముఖ్యంగా మనం గుర్తించాలి. కాగా సూత్రకర్త, వార్తికకర్త ఒక్కరుకాదని మనం గ్రహించక తప్పదు.†

## కారికలు

అంతేకాదు. వివిధ సూత్రాలకు వ్రాసిన వృత్తులలో వాసుదేవుడు కొన్ని కారికలను, కారికా భాగాలను ఉటంకించాడు. అవి ఇవి.

—అణేజౌ ద్వావనుస్వారౌయణ్ సహౌమణనాజశః ।
వర్గ ప్రథమ వర్ణాశ్చ వైకృతే పరికీర్తితాః ॥
(సంజ్ఞ 4 వ పేజీ)

—ఆమంత్రణే సోర్లోపః స్యాదుతో వాప్యదితోర్భవేత్
రోవాస్త్రీ వాచకాన్నిత్యం లింగాదిభ్యో ము వర్ణకః ॥
(అజంత - 27 పుట.)

---

† ఈ సందర్భంలో ఒక విషయాన్ని మనం గమనించవలసివున్నది. వివిధ సూత్రాలలో వృత్తులలో అక్కడక్కడావున్న ఈ వార్తికాలను సైతం వ్రాతప్రతులలో వున్నట్లుగా ఈ ముద్రితగ్రంథంలోసైతం వృత్తులుగానే పేర్కొనడం జరిగింది. ఇందులో అంతగా మనకు ఔచిత్యం కనిపించకపోయినా దీన్ని పెద్దదోషంగా పరిగణించవలసిన అవసరంలేదు.

—నామావయవతా ప్రాప్తౌ పూర్వాదేశస్య కుత్రచిత్ ।
సుజసోః పౌనరుక్త్యం స్యాత్తత్ర రేఫో న కథ్యతే ॥
(అజంత – 37. వ. పుట.)

ఏకత్వే సస్య వాచిత్వం బహుత్వే ధాన్యవాచితా ॥
(అజంత 41. వ. పుట.)

—యేషాం ప్రతీతి వైషమ్యం హలంతానాం న సంభవేత్ ।
తేషాం దిగాది మత్త్వేన కర్తవ్యా విధయః క్రమాత్ ॥
(హలంత 65 వ. పుట.)

—హేతౌ విదీయమానాయాః టాసశ్చేసీతి కథ్యతే ।
కర్మప్రవచనీయస్య కూర్చిత్యాదేశ ఉచ్యతే ॥
(విభక్త్యర్థ-83 వ. పుట.)

—ఛాయా సంబంధ సాదృశ్య శబ్దా వికృతి సంభవాః ।
గ్రామ్యా దేశ్యాస్తథా జాత్యాః కల్పనీయా యథాయథమ్ ॥
(వైకృత విశేషాః – 155 వ. పుట.)

వీటిని చూచినప్పుడు వృత్తి కర్తయే యీ కారికలు రచించి ఉంటాడని సామాన్యంగా మనకు అభిప్రాయం కలుగుతుంది. పైన ఉదాహరించబడిన వాటిల్లో "ఏకత్వే సస్యవాచిత్వమ్ బహుత్వే ధాన్యవాచితా" అన్న కారికా భాగం "వికృతి వివేక"మనబడిన అధర్వణ కారికావళిలోనిది. కాగా వ్యాకరణ గ్రంథ నామంకాని, కర్తృనామంకాని పేర్కొనకుండా ఈ కారికలను కొన్ని ఇతర వ్యాకరణ గ్రంథాల నుంచి పరిగ్రహించి వాసుదేవుడు ఉదాహరించినట్లు స్పష్టపడుతున్నది. వచన రచనగా వృత్తి రచించిన వాసుదేవుడు అక్కడక్కడా కారికలు రచించవలసిన అవసరంలేదు. కాగా యివి యితర వ్యాకరణ గ్రంథాలలోనివేనని మనం దృఢంగా అభిప్రాయపడవచ్చును. సూత్రకర్తయే వృత్తికర్త అయినట్లైతే ఆ యా కారికాగతాలైన విషయాలను సూత్రాలుగానే విరచించి వృత్తిని రచియిస్తాడుగాని సూత్రాలకు భిన్నంగా సూత్రాలలో చెప్పని విషయాలను కారికలుగా రచియింపవలసిన అవసరంలేదు. సూత్రాలు రచియించకుండానే సూత్రాలకు వివరణాత్మకాలో, పూరణాత్మకాలో అయిన కారికలను సకృత్తుగా రచించాలనే దృష్టి సూత్రకర్తకు కలిగిందనడం చాలా అసహజంగా కనిపిస్తుంది. అందువల్ల సూత్రకర్త ఈ కారికలను రచించాడనడానికి అవకాశం బొత్తిగా కనిపించదు. తాను స్వయంగా సూత్రాలు రచించి వ్యాకరణం వ్రాస్తూ మరొకరు

రచించిన కారికలను ఉదాహరించవలసిన అవసరం సూత్రకర్త కసలే ఉండదు. కాగా ఈ కారికలకు స్థానమిచ్చిన-ఇతర వ్యాకరణ గతాలైన కారికల నుదాహరించిన - ఈ వైకృతచంద్రికా వృత్తి కర్తా, మూలసూత్రకర్తా ఒక్కరు కారని తేటతెల్లమవుతున్నది.

## సూత్రరహిత భిన్న వృత్తి విషయ విభాగాలు

మీదు మిక్కిలి సూత్రకర్త, వృత్తికర్తకాడు అనడానికి ముఖ్యమైన మరి కొన్ని విషయాలు చాలా ఆధారంగా కనిపిస్తున్నాయి. అసలు సూత్రం లేకుండా-ఒక సూత్ర వృత్తిలో తత్సూత్ర విషయానికి భిన్నమైన విషయాలతో ఉపప్రకరణ భాగాలు వృత్తి మధ్యల్లో ప్రారంభించబడిన సందర్భాలు కూడా వైకృత చంద్రికలో కొన్ని వున్నాయి. అజంత ప్రకరణంలో "అవానౌరైనావోః" (76.సూ-47పుట) అనే సూత్రవృత్తితో అజంత పుంలింగ పదాలను సాధించి కొత్త సూత్రాన్ని చెప్పకుండానే మరొక వృత్తి వాక్యరచనతో అజంత స్త్రీలింగపదాల సాధుత్వానికి పూనుకున్నాడు. (చూ. 48. పుట.)-"అథ అజంతాః స్త్రీలింగాః" అనివ్రాసి 'ఆకారాంతస్యహ్రస్వః' "రమ-రమలు-లత-లతలు-" అని వృత్తిగా పేర్కొన్నాడు. ఇదేవిధంగా "మాయాదిర్వా" (80. సూ. 48. పుట) అనే సూత్రం క్రింద 48, 49, 50 పుటలలో అనేక వృత్తులను రచించి అజంత స్త్రీలింగ పదాలను సాధించాడు. అనంతరం సూత్రం ఏదీ లేకుండానే అజంత నపుంసక లింగపదాలను సాధించడానికి పూనుకున్నాడు. కొన్ని వృత్తి వాక్యాల తరువాత "స్త్రీవదృతః" (అజంత-81-సూ. 51-పుట) అని సూత్రం ఉటంకించబడింది.

అనంతరం హలంత ప్రకరణంలో పుంలింగ శబ్దాలను సాధించిన తరువాత సూత్రం లేకుండానే స్త్రీలింగ పదాల సాధుత్వానికి సంబంధించిన వృత్తి రచించబడి, ఆ వృత్తి తరువాత రెండు సూత్రాలు వృత్తులతో సహా పేర్కొనబడ్డాయి. అంటే హలంత స్త్రీలింగ పద ప్రకరణ భాగం వృత్తితోనే ప్రారంభం అయ్యిందన్నమాట. "వాచ ఉక్వ్యాదిః" (హలంత-36 - సూ. 64 పుట) అనే సూత్రానికి వృత్తులు రచించడం ద్వారా హలంత స్త్రీలింగ పదాలను సాధించడం ముగించి-అటుపిమ్మట సూత్రం లేకుండానే కేవల వృత్తులతోనే హలంత నపుంసకలింగ పదాలను ప్రకరణాంతం వరకూ (మూల సూత్రం లేకుండానే) సాధించడం జరిగింది. సూత్రకర్త, వృత్తికర్త ఒక్కడే అయితే సూత్రాలు లేకుండా కేవల వృత్తులతో సూత్ర లోప పూరకాలవలె వృత్తి వివరణలను రచించవలసిన అవసరంలేదు. ఇతరచోట్లవలె సూత్రాలు రచించి వాటికి వివరణ పూర్వకమయిన వృత్తులు రచించివుండేవాడు.

సూత్రకర్త, వృత్తికర్త విభిన్నులు కాబట్టే సూత్రాలలోవున్న లోపాలను గుర్తించి తల్లోపనివారకాలుగా వృత్తులను రచించినట్లు కనిపిస్తున్నది. వృత్తికర్తా, సూత్రకర్తా. ఒక్కడే అయితే సూత్రరచన చెయ్యకుండా వృత్తులమధ్య ప్రకరణ గత విభాగాలను ముగించడం ప్రారంభించడం జరిగివుండేదికాదు. ప్రారంభంలో ప్రకరణ గత భాగం సూత్రంతోనే మొదలయివుండేది. కాగా సూత్ర, వృత్తిరచనా కర్తృత్వంలో భిన్నత్వాన్నే ఈ సందర్భం మనకు గోచరింపజేస్తున్నది.

## క్రమరాహిత్యం

స్త్రీ ప్రత్యయ ప్రకరణంలో "నిత్యమాశాదిః" (1. సూ- 75 పుట) అనే సూత్రం మొదలు "వ్యత్యయశ్చ" (4. సూ- 76 పుట) ఇత్యాది సూత్రం వరకూ సంస్కృత స్త్రీ ప్రత్యయ పదాలను సాధించి అనంతరం "బహువచనాడిజ్" (5.సూ- 76 పుట) సూత్రం మొదలు ప్రకరణాంతం వరకూ తెలుగు స్త్రీప్రత్యయ పదాలను ఒక క్రమపద్ధతిలో సాధించాడు. కాని మరికొన్ని సందర్భాలలో శబ్దాలను సాధించడంలో వృత్తికర్త ఒక క్రమపద్ధతిని పెట్టుకున్నట్లు కనపడదు. హలంత ప్రకరణం "నాలుగు చతుర్ః" (సూ. 3. 53. పుట) సూత్రం మొదలు "తదిదమోరతయోర్వాట్" (14. సూ- 56 పుట) అనే సూత్రం వరకూ సంస్కృత పదాలకు తెలుగు పదాలను సాధించాడు. "సస్యచాశునః" (15. సూ- 56 పుట) అనే సూత్రం మొదలు "ఇము నిచోవా" (19. సూ- 57. పుట) అనే సూత్రాంతం వరకూ తత్సమ పదాలను అనగా సంస్కృత సమ పదాలను సాధించాడు. పిమ్మట "ఏన్వా ఊేద్వేనిమిది తొమ్మిదిపది పట్సంజ్ఞికానామ్" (20. సూ-58. పుట) అనే సూత్రం మొదలుకొని "ద్వంద్వే జసోము" (హలంత. 29- సూ-61. పుట) అనే సూత్రాంతంవరకూ దేశ్యపదాలను సాధించి అనంతర సూత్రాలలో తిరిగి సంస్కృత సమ పదాలను సాధించాడు. అంటే, హలంత ప్రకరణంలో 14-20 సూత్రాల మధ్య కొన్ని సంస్కృత సమపదాలను 30 వ, సూత్రం "(నరః-పుట 61) మొదలుకొని తుదివరకూ మరికొన్ని సంస్కృత సమ పదాలను సాధించాడన్నమాట. ఇదే విధంగా తద్ధితాదేశ ప్రకరణంలో "అరిమీమ్కా-మోమతుపః" (1. సూ- 76 పుట) అనే సూత్రం మొదలు "దేవవేగాభ్యామరేరా" (9. సూ. 97. పుట.) అనే సూత్రంవరకూ దేశి పదాలకు తద్ధిత ప్రత్యయాలను విధించి-పదవ సూత్రం మొదలు పదహారవ సూత్రం వరకూ సంస్కృత పదాలను తద్రూపంగా కొన్ని తద్భవ పదాలను పేర్కొని తద్ధిత ప్రత్యయాలను విధించాడు. తిరిగి 31 వ, సూత్రం వరకూ దేశి, తద్భవ సంస్కృత పదాలకు తద్ధితాదేశ ప్రత్యయాలను విధించి తిరిగి 32 వ, సూత్రం మొదలు తద్ధితాదేశ ప్రకరణం తుదివరకూ దేశ్య పదాలకు

తద్ధిత ప్రత్యయాలను విధించాడు. ఒక క్రమపద్ధతి లేకుండా అక్కడ కొన్నింటిని, యిక్కడ కొన్నింటిని సాధించడం చూస్తే వృత్తికర్త అసమర్థత కొంత మనకు వ్యక్తమవుతున్నది. అంటే, తాను వృత్తి వ్రాయదలచుకున్న సూత్రాలను వృత్తి కర్త ఒక క్రమపద్ధతిలో పెట్టుకొనలేకపోయాడని తేలికగా మనం వూహించవచ్చు. సూత్రకర్తే వృత్తి రచించివుంటే క్రమరహిత వ్యవస్థతో యిన్ని తికమకలుపడే అవకాశమే లేదు.

## సూత్రార్థ విరుద్ధ వృత్తులు

వైకృత చంద్రికలో సూత్రకర్త వ్రాయడానికి వీలులేని పొరపాట్లూ- అసలు మూలసూత్రార్థానికి విరుద్ధాలైన అర్థాలను ప్రతిపాదించే వృత్తులూ - కొన్ని కనిపిస్తాయి. అందువల్ల సూత్రకర్త, వృత్తికర్త ఒక్కరుకారన్న విషయం మరింతగా దృఢపడుతున్నది. ఈ వాస్తవికతను ప్రదర్శించడానికి కొన్ని వృత్తిదోషాలను పరిశోధకుల దృష్టిలోకి తీసుకువస్తున్నాను.

"సిద్ధిర్వ్యవహారాచ్చ" అన్న తొలి సూత్రానికి వృత్తి వ్రాస్తూ, వృత్తికర్త అక్షర వివేచనాత్మకమైన ఈ క్రింది శ్లోకాన్ని ఉటంకించాడు.

> "అణేజా ద్వావనుస్వారౌయణ్ సహౌమణనాజళః ।
> వర్గ ప్రథమ వర్ణాశ్చ వైకృతే పరికీర్తితాః"॥

అంతేకాదు. ఐ, ఔ అచ్చుల ఉత్పత్తి గురించి చెపుతూ, ఈ క్రింది విధంగా వ్రాశాడు.

> "అ ఇ, అ ఉ ఇత్యేతయో రాదేశత్వేన ప్రాప్త యోః.
> ఐకారౌకారయోః తాలవ్యత్వ మోష్ఠ్యత్వంచసంయోగ
> సిద్ధమ్, ఏజస్తు సమవాయ సిద్ధమ్, అతస్తయోః
> అకారస్యైవ ప్రాధాన్యమ్. వ్యస్తద్విమాత్ర కత్వాత్
> హ్రస్వాభావశ్చ. అకార పూర్వస్య ఏజోఽపి కంఠ్యత్వ
> స్యైవ ప్రాధాన్యమ్" (చూ. 4. పుట).

ఐ, ఔలు సంధి స్వరాలని వృత్తి కర్త అభిప్రాయం. ఇది కాదనడానికి వీలులేదు. అయితే, అయి - ఐ; అవు - ఔ; లుగా రూపొందాయిగాని అ ఇ, అ ఉల, మీద ఐ, ఔలు రూపొందాయనడం సమంజసంగా కనిపించదు. సంధి దృష్టితో చూచినప్పుడు అ ఇ - అ ఉల సంధి రూపంగా రూపొందిన ఏ, ఓలు కూడా స్వతంత్ర అక్షరాలని అనలేముకదా! అయినప్పుడు కేవల ఐ, ఔల సంధి స్వరూపాన్ని

మాత్రమే పేర్కొనడం సమంజసమనిపించుకోదు. అక్షరోత్పత్తిని దృష్టిలో పెట్టుకున్నప్పుడు అ, ఇ, ఉ స్వరత్రయమూ, అనుస్వారమూ తప్ప మనకు స్వతంత్రంగా నిలవగలిగిన అక్షరాలు వేరేలేవుకదా! "పదాదౌయకారః వకారస్య ఉద్ధోతా చన సంతి, లఘ్వలఘు భేదేన అన్తస్థాద్వివిధాః" (5-పుట) అని పదాది యకార, వకారాల వ్యవస్థ గురించి పేర్కొనగలిగిన వృత్తికర్త య, ర, ల, వ, ల లఘ్వలఘు విభేదాలను దృష్టిలో వుంచుకొని కూడా, అయి, - అవులలోని హల్ తత్వాన్ని విస్మరించి ద్విస్వర రూపాలయిన అ ఇ - అ ఉ ల కేవల స్వర తత్వ వ్యవస్థను వక్కాణించడం సముచితంగా కనిపించదు; అంతస్థాలయినా, హల్లులతో కూడిన అయి - అవులకు రెండింటికీ మూల ధాతువు 'అగు' ఒక్కటేకదా! మూల ధాతు రూప దృష్టితో చూచినప్పుడు అయి - అవులకున్న పరిణామ స్వరూపవ్యవస్థ అ ఇ - అ ఉ లకు వున్నదని చెప్పలేము. అయితే అసలు అయి - అవులకు మూలం "అగు" ధాతువు కానేకాదు - అ ఇ - అ ఉ లు మాత్రమే అని యెవరైనా అంటే వేరే మనం చెప్పగలిగిందేమీ ఉండదు- ద్రుతంనః (32 - సూ, 11 - పుట) అన్న సూత్రానికి వృత్తికారుడు "కృతాకృతో నకారోద్రుత సంజ్ఞః స్యాత్" అని నూతనంగా అక్షర వివక్షతో కృతాకృత విశిష్టతను పేర్కొన్నాడు. ఈ కృతాకృత వివక్ష ప్రత్యేకించి ఒక్క న కారానికే చెప్పవలసిన అవసరం కనపడదు. ఏ అక్షరానికయినా చెప్పవచ్చును. వ్యాకరణ సాధ్యంకాని అక్షరాలేముంటాయి ? అందువల్ల ఏ అక్షరానికైనా ఈ వివక్షను ఎత్తి చూపించవచ్చును. కాగా అచ్ - హల్, పరుష, సరళ, స్థిర, బిందుకాది సంజ్ఞలేవైనా కృతాకృతాలైన అక్షరాలకు అనువర్తిస్తాయని మనం గుర్తించక తప్పదు. కాగా వృత్తికర్త వివక్ష పరిగ్రహణీయం కాదు-

కర్మధారయ సమాసంలో సంస్కృత సమశబ్దాలకు 'ఆలు' శబ్దం పరమౌతుంటే అత్వానికి ఉత్వం, రుగాగమం వస్తాయి. వైకృత చంద్రికా సూత్రకర్త అత్వానికి ఉత్వం చెప్పకుండా మొత్తం 'ఉరుక్'ను ఆదేశంగా విధిస్తూ ''అవర్ణస్యాలావురుక్'' అని సూత్రం వ్రాశాడు. అవర్ణస్యా అన్నప్పుడు అత్వానికి అని అర్థం చెప్పుకుంటే ఆలు శబ్దం పరమయ్యేటప్పుడు రూపొందే తత్సమ, కర్మధారయ స్వరూపాలు సాధ్యాలౌతాయి. అవర్ణశబ్ద (అత్వ) అర్థ రహస్యాన్ని గుర్తించకుండా వృత్తికారుడు శుక్లాదివర్ణ (రంగు) రహితమయినది, అని అర్థం చెప్పి సూత్రార్థ స్వభావాన్నే తల్లక్రిందులు చేశాడు. కాగా ''శుక్లాదివర్ణ వాచక వర్జితశబ్దస్య ఉరుగాగమస్స్యాదాలౌపరే. ప్రియురాలు. అవర్ణ స్యేతికిమ్ ? ధవళమైనది. అసామానాధికరణ్యేతు. ప్రియునాలు వైకృతాలోపధాదపిన. ఇల్లాలు, చూలాలు

వాఙ్మయ మహోధ్యాతుని

(13. పుట. 3. సూ. వృ) అని వృత్తి వ్రాశాడు. పైగా "అవర్ణ స్యేతికిమ్?" అని ఆశంక తీసికొని ధవళమైనది అని ఉదాహరణ యిచ్చాడు. సూత్రంలో ఆలా అని స్పష్టంగానే ఆలు శబ్ద పరకత్వాన్ని వక్కాణించాడుకదా! ధవళ శబ్దం వర్ణ వాచకమే అయినా దానికి ఐనది అన్న పదం పరంగా వున్నదిగాని 'ఆలు' శబ్దం పరంగాలేదుకదా! అంతేకాదు. పైగా ధవళ శబ్దానికే ఆలు శబ్దం పరమైతే ధవళు రాలు రూపం సుసాధ్య మౌతుంది. సురూపమౌతుంది. శుక్లాది వర్ణార్థక పదమే పూర్వంలో వుండగా ఆలు శబ్దం పరంగా వుంటే 'ఉరుక్' రానటువంటి రూపాన్ని దేనైనా వృత్తికారుడు ఉదాహరించగలిగి వుంటే బాగుండేది. అయినా, అవర్ణస్య అంటే అత్వానికి అని అర్థం చెప్పుకుంటే ధీరురాలు, గుణవంతురాలు వంటి ఉరుక్ రూపాలు సాధ్యమౌతుండగా, శుక్లాది వర్ణరహితమైన అనే అర్థాన్ని చెప్పుకొని రూపసాధనంలో క్లిష్టత్వాన్ని, అసమంజసత్వాన్ని కొనితెచ్చుకో నవసరంలేదు. కాగా, సూటిగావున్న సూత్రార్థాన్ని గ్రహించలేక వక్రదృష్టితో అసమర్థవంతమైన వృత్తిని తత్కర్త రచించాడని స్పష్టపడుతున్నది.

"కుంజపాంచాలికయో రరు గ్గృహే" (సంధి - 4. సూ. 14-పుట) అన్న సూత్రానికి "కుంజపాంచాలికార్థయోః అరుగాగ మస్యాద్గృహార్థ శబ్ద సంబంధి న్యచి పరే" అని అర్థం వ్రాయడానికి మారుగా 'కుంజపాంచాలికాదేశయోః– గృహాదేశ సంబంధిని'– అని సంస్కృతశబ్దాలకు తెలుగు పదాలను ఆదేశంగా చెప్పాడు. వృత్తికర్త కుంజపాంచాలికార్థదాయకాలైన తెలుగు మాటలకు గృహార్థకమైన ఇల్లు శబ్దం పరమౌతుంటే, అరుగాగమం వస్తుందని చెప్పడానికి మారు ఆయా సంస్కృత పదాలకు ఆయా తెలుగు పదాలే ఆదేశంగా వస్తాయనడం సమర్థనీయం కాదు. ఈ సందర్భంలో రుగాగమం చెపితే సరిపోయేదానికి సూత్రకర్త అరుగాగమం చెప్పాడు. ఈ సూత్రానికి పూర్వంవున్న "అవర్ణస్య" ఇత్యాది సూత్రంలో "ఉరుక్" అని అజాదిగా, సంధి కార్యాన్ని విధించాడు. కాబట్టి యిక్కడ కూడా అరుక్‌ను విధించినట్లు కనిపిస్తున్నది. పూర్వసూత్రంలోని "అవర్ణస్య" అన్న పదం "కుంజ పాంచాలికా" ది సూత్రంలోకి అనువృత్తిగా వస్తే అరుక్ అనేది ఆగమంగా కాక ఆదేశంగానే వస్తుంది. ఈ అంతర్యాన్ని వృత్తి కర్త గుర్తించినట్లు కనపడదు. అరుక్ ఆగమంగానే వస్తే తిరిగి సంధికార్యం చెయ్యాలన్న సంగతి, రూపసాధనలో వృత్తికర్త విస్మరించాడు. అయితే కుంజపాంచాలికా, శబ్దాలకు పొద–బొమ్మ శబ్దాలు ఆదేశాలుగా వస్తాయని సూత్ర కర్త వుద్దేశించి ఈ సూత్రం రచించినట్లు కనపడదు. కాని, ఈ ఒక్కచోటనే కాక అనేక సందర్భాలలో సంస్కృత శబ్దాలకు తెలుగు శబ్దాలను ఆదేశాలుగానే వృత్తికర్త

పేర్కొన్నాడు. సూత్రకర్త "సుస్ సద్రుతః" (సంధి-6 సూ. 14 పుట) అనే సూత్రంచేత ప్రథమాది విభక్తి ప్రత్యయాలన్నిటికీ సద్రుత సంజ్ఞ పెట్టాడు. అనంతరం "న సద్రుతానాం" (సంధి 7 సూ. 15 పుట) అన్న సూత్రంచేత సద్రుతాలయిన విభక్తి ప్రత్యయాలలోని అ, ఇ, ఉ స్వరాలకు లోపం రాదని చెప్పాడు. అటు పిమ్మట "ద్రుతం సద్రుతాత్" (సంధి 8 సూ. 15 పుట) అనే సూత్రంచేత "అచ్చు పరమాతుంటే విభక్తి ప్రత్యయానికి ద్రుతం వుంటుంది" అని చెప్పాడు. అంటే విభక్తి ప్రత్యయగతాలయిన స్వరాలకు ఈ సూత్రంచేత సంధిరాదని సామాన్యంగా విధించాడన్నమాట. అయితే, ప్రథమేతర విభక్తి ప్రత్యయాలకు, శత్రర్థక చువర్ణానికి, ఏమ్యాదులకు సంధి విధించవలసిన అవసరంవున్నది. అందువల్ల "అందుకికుచుకావా" (సంధి 9 సూ. 15 పుట) అనే సూత్రంచేత అందు ప్రత్యయానికి "కి" "కు" వర్ణకాలకు, వర్తమానార్థక "చు" వర్ణకానికి, క్త్వార్థక కకారానికి వైకల్పికంగా సద్రుత సంజ్ఞ విధించాడు. అంటే, ఇవి ఒకసారి ద్రుతాంతాలయి, వేరొకసారి ద్రుత విరహితాలవుతాయన్నమాట. ద్రుతవిరహితాలయిన ప్రత్యయాలలోని 'ఉ' కారానికి అచ్చుపరమైనపుడు వైకల్పికంగా సంధి అవుతుందని "అసుసస్సుపోవా" (సంధి. 14సూ. 16 పుట) అనే సూత్రంచేత ప్రథమేతర విభక్తులకు సంధి విధించాడు. ఈ ప్రత్యయాలు ద్రుత సహితాలయినపుడు వీటికి సంధిరాదు. అందువల్ల ద్రుత సహితాలయిన వైకల్పిక రూపాలు సిద్ధిస్తాయి. అంటే "అందుకికుచుకావా" (సంధి. సూ. 9) అనే సూత్రంచేత సద్రుత సంజ్ఞ రానప్పుడు "అసుసస్సుపోవా" అనే సూత్రం వర్తించి సంధిభావ రూపం ఏర్పడుతుందని ద్రుతమున్నప్పుడు విసంధి రూపం ఏర్పడుతుందని గ్రహించాలి. "అసుసస్సుపోవా" అనే సూత్రంలో 'ఉ' కారానికి సంధి విధించాడు కాబట్టి 'కి' వర్ణకానికి ఏమ్యాదులకు వేరే సంధి విధించవలసి వచ్చింది. కాగా "క్యపితత్ కిమామితః" (సంధి 10 సూ. 15 పుట) అనే సూత్రంచేత వైకల్పికంగా ఇత్తునకు లోపం చెప్పడం ద్వారా సంధి విధించాడు. రామునికి + అభివాదము అన్నప్పుడు "అందు కికుచు కావా" అనే సూత్రంచేత 'కి' ప్రత్యయానికి వైకల్పికంగా సద్రుత సంజ్ఞ వస్తుంది. సద్రుత సంజ్ఞ వచ్చినపుడు "ద్రుతం సద్రుతాత్" అనే సూత్రంచేత "కి" ప్రత్యయం 'కిన్' అవుతుంది. కాగా సద్రుత సంజ్ఞ వ్యవస్థలో "రామునికి నభివాదము" అని విసంధి రూపం ఏర్పడుతుంది. 'కి' ప్రత్యయానికి సద్రుత సంజ్ఞ లేనప్పుడు "క్యపితత్ కిమామితః" అనే సూత్రంచేత 'కి' లోని 'ఇత్' కు లోపం వస్తుంది. కాగా 'రాముని కభివాదము' అనే సంధిరూపం ఏర్పడుతుంది. సద్రుత సంజ్ఞ వైకల్పికమై 'కి' వర్ణక "ఇత్వ" లోపం వైకల్పికమైనపుడు, అంటే, సద్రుత సంజ్ఞ వున్నప్పుడు 'ఇత్వ' లోపం జరగక, సద్రుత సంజ్ఞ లేనప్పుడు 'ఇత్వ' లోపం జరిగి సంధ్యభావ,

వాఙ్మయ మహోద్యతుని

సంధిభావ రూపాలు ఏర్పడతాయన్న మాట. ప్రథమేతర విభక్తి ప్రత్యయాలకు, శత్రర్థక చువర్ణానికి, ఏమ్యాదులకు సంధిభావ, సంధ్యభావ వైకల్పిక రూపాలను సాధించడంలో సూత్రకర్త ఎక్కడా పొరపాటుపడలేదు. అన్ని సూత్రాలనూ సవ్యంగానే రచించాడు. అయితే, వృత్తి కర్త "క్రియాపితత్ కిమామితః" అనే సూత్రానికి, వృత్తి వ్రాస్తూ "రాముని కభివాదము", "రామునికి యభివాదము" అని సంధి, విసంధి రూపాలను పేర్కొన్నాడు! రామునికి యభివాదము అనే యడాగమ రూపం సూత్రకారుని దృష్టిలో సాధ్యం కాదు. ఈ సందర్భంలో 'కి' ప్రత్యయానికి "అందు కికుచుకావా" అనే సూత్రంచేత సద్రుత సంజ్ఞ వస్తే "ద్రుతం సద్రుతాత్" అనే సూత్రంచేత చివర 'న' కారం వుంటుంది. కాగా, 'రామునికి నభివాదము' అనే రూపం సిద్ధిస్తుంది. "కి" ప్రత్యయానికి "అందుకికుచుకావా" అనే సూత్రంలో వైకల్పిక సద్రుతత్వాన్ని విధించాడు. కాబట్టి సద్రుత సంజ్ఞ రానప్పుడు "క్యపితత్ కిమామితః" అనే సూత్రంచేత 'రామునికి + అభివాదము' అన్నప్పుడు "ఇత్తు" నకు లోపంవచ్చి రాముని కభివాదము అనే సంధిరూపం సిద్ధిస్తుంది. ఈ దృష్టితో, పరిశీలించినప్పుడు సూత్రాలవల్ల 'రామునికి యభివాదము' అనే విసంధి యడాగమ రూపం ఏ పరిస్థితులలోనూ రూపొందదు. మరి వృత్తికారుడు యడాగమ రూపాన్ని సాధించి, అవాస్తవికమయిన అసాధు, సాధుత్వాన్ని ప్రతిబింబించాడు. సంధిభావ, సంధ్యభావ రూపాలను సాధించడంలో సూత్రకారునికున్న సమగ్ర నిశిత దృక్పథం వృత్తికారుని కున్నట్లు కనపడదు. రామునికి యభివాదము అన్న విసంధి యడాగమ రూపం సూత్రకర్తకు సమ్మతం కాదన్నమాట సుస్పష్టం. "సు సేసద్రుతః" అనే సూత్రంచేత ప్రథమాది విభక్తి ప్రత్యయాలన్నీ సద్రుత సంజ్ఞకాలవుతాయి. అందువల్ల ప్రథమావిభక్తి ప్రత్యయగతమయిన, ఉత్వానికి నయితం సంధి రాకుండా కృష్ణుడు + అడిగెను, అన్నప్పుడు 'కృష్ణుడడిగెను' వంటి రూపాలు సిద్ధించకుండా "కృష్ణుడు నడిగెను" వంటి అసాధు రూపాలు అసముచ్చయార్థంలో సిద్ధించే అవకాశం ఏర్పడింది. అందువల్ల సూత్రకర్త "ఉతోఽతద్ధర్మే" (నిత్యమ్)-(సంధి. 15. సూ. 16. పుట) అనే సూత్రాన్ని రచించడం ద్వారా సద్రుత సంజ్ఞకు భిన్నంగా ఉత్వానికి నిత్యంగా లోపం చెప్పడం ద్వారా నిత్య సంధి విధించాడు. ఈ సందర్భములో కూడా వృత్తికర్త సూత్రార్థాలను సరిగా అవగాహన చేసుకున్నట్లు కనపడదు.

"అందౌ" (సంధి. 17. సూ. 17. పుట) అనే సూత్రానికి వృత్తికారుడు "నామ్న ఉతోనుమ్స్యాదందౌ పరే" అని వృత్తి వ్రాసి "రామునందు" అని ఉదాహరణ యిచ్చి "ప్రైగ్రృణా ద్వికత్వే నేష్యతే" అని వ్రాసి 'వనమునందు' 'వనమందు'

అని ఉదాహరణలిచ్చాడు. 'వైకృతాత్' అనడంలో, వృత్తికర్త దృష్టి యేమో సుస్పష్టం కావడంలేదు. ఇచ్చిన ఉదాహరణనుబట్టి తెలుగు అక్షరమయిన "వనమునందు" లోని 'ము' సంస్కృతీయంకాదు కాబట్టి వైకృతమని భావించి నట్లు కనిపిస్తున్నది. మరీ లోతుగా పరిశీలించినపుడు "రామ" శబ్దంలోని తుది 'అ' త్వానికి వైకృతమయిన 'ఉ' త్వం రావడం కూడా వైకృతంగా పరిగణనకు రాదా ? వృత్తికర్త 'అందౌ' సూత్రం క్రింద 'రామునందు' అని పేర్కొని "నిలోపే నుమ్" (అజంత. 22 సూ. 30. పుట) అనే సూత్రంలో 'రామునందు' రూపాన్ని సాధించడంలో ఔచిత్యం ఉన్నట్లు కనపడదు. సూత్రకర్త 'అందౌ' సూత్రంలో సమాసాలలో మాత్రమే నుమాగమాన్ని విధించి "నిలోపేనుమ్" అనే సూత్రం ద్వారా నిఆగమ అభావ వ్యవస్థలో మహద్వాచకాలకు 'అందు' పరమౌతుండగా నుమాగమాన్ని సాధించినట్లు తోస్తున్నది. కాగా "అందౌ అనే సూత్రం క్రింద" రాముయొక్క + అందు = రామునందు వంటి సమాసనుమాగమ రూపాలు సాధించినట్లు కనిపిస్తున్నది. "అందౌనుమో వికల్పః" (అజంత. 25. సూ. 31 పుట) అనే సూత్రంలో అందు విభక్తి ప్రత్యయం పరమవుతుంటే అమహద్వాచకాలకు వైకల్పికంగా, నుమాగమం విధించాడు-కాగా వృక్షమునందు-వృక్షమందు, ఇత్యాది వైకల్పిక రూపాలు సాధ్యాలవుతాయి.

'అందౌ' (సంధి-17. సూ) "అందౌనుమోవికల్పః" (అజంత. 25-సూ. 31. పుట) అనే సూత్రాలలో 'అందు' పరమవుతుంటే 'ను' మాగమాన్ని విధించగా "నిలోపేనుమ్" (అజంత-22. సూ) అనే సూత్రంలో మహద్వాచకాలకు "ని" ఆగమం లోపించినపుడు తిరిగి "నుమ్" విధించాడు. ఈ మూడు సూత్రాలను దృష్టిలో పెట్టుకొని చూడగా "అందౌనుమో వికల్పః" "నిలోపేనుమ్" అనే రెండు సూత్రాలనే సూత్రకర్త రచించగా వృత్తికర్త పొరపాటున "అందౌ" అనేదాన్ని ప్రత్యేకించి విడదీసి ఒక సూత్రంగా వుంచుకొని వృత్తి వ్రాసి తరువాత అసలు పూర్తి సూత్రాన్ని పేర్కొని వృత్తి వ్రాసినట్లు కనిపిస్తున్నది.

"య్వాది రిత్యేకే" (సంధి 24. సూ. 18. పుట) అనే సూత్రానికి "య్వాది వర్ణకస్సద్రుత సంజ్ఞ స్స్యాదితి కేచిదాచార్యాః" అని వృత్తికారుడు వివరించాడు. సద్రుతం అంటే కేవలం ద్రుత సహితమయినది, అని మాత్రమే అర్థంకాని విభక్తి ప్రత్యయమని అర్థంకాదు. "సుప్ సద్రుతః" (సంధి. 6. సూ. 14. పుట) అనే సూత్రం ఈ సందర్భంలో వర్తించదు. "సముచ్చయార్థకోయ్వాది వర్ణక సస్యాదితి కేచి దాచార్యాః ప్రవదంతి" అని సూత్రకర్త అభిప్రాయమై వుంటుందనుకుంటాను. సముచ్చయ 'యు'వర్ణమయినా 'ను' వర్ణమైనాద్రుతాంతమేకదా! అంత్యంలో కానీ,

సరళ స్థిరాలు పరమయినప్పుడుగానీ ద్రుతానికి లోపంవస్తే సముచ్చయార్థక 'యు' 'ను' లు రావచ్చును గాని అవి ద్రుతప్రకృతికాలనడం అతఃరాలా వాస్తవం. 'యు' 'ను' వర్ణాలు ద్రుతప్రకృతికాలు కావని ఏ వ్యాకరణకర్తా చెప్పినట్లు కనపడదు. కాగా 'యు' మొదలయినవి ద్రుతప్రకృతికాలు కావని కేచిన్మతంగా సూత్రకర్త వక్కాణించి వుంటాడనడానికి అవకాశంలేదు. సముచ్చయ 'యు' వర్ణ విరహితంగా కేవల 'న' కార ప్రయోగమాత్రంతోనే సముచ్చయార్థాన్ని ప్రస్ఫుటం చేస్తూ ప్రయోగాలు కావించిన ప్రాచీన కవులు లేకపోలేదు.

సీ. 'ఎంతయు సంయమవంతుఁడు సహదేవు
డధ్యాత్మ విద్య నారాధ్యుఁ డెంత
ననఘుండు ధౌమ్యుండు'......

(భార. సభా. 5 ఆ. 282 ప.)

(ఎంతన్ = ఎంతయును)

తే.గీ. 'తమ్మికొలను ప్రవేశించు తలిరుఁ బోండ్ల
విలసనములెంత నెంతయు వింతలయ్యె'

(కళా. 6 ఆ. 228 ప.)

(ఎంతన్ = ఎంతయును)

క. 'ఒక గృధ్ర మెంతఁ బ్రియమున
నొక చర్మముఁ గఱచి కొలుచునుడు పణమునరా.'

(భోజ. 4 ఆ. 23 ప.)

(ఎంతన్ = ఎంతయును)

తే.గీ. 'అమరు లెల్లను జల్లిరి సుమములెంత

(అధ్యా. బాల. కాం. 142 ప.)

(ఎంత = ఎంతయును)

సీ. 'నిడుపునఁ దూర్పును బడమరనై రెండు
కడల నంభోనిధిఁ గదిసియుండు'.

(భార. భీష్మ. 1 ఆ. 21 ప.)

(పడమరనై =పడమరయునై)

'తేఁజిగురుఁగొమ్మం జేవగాకుండునే?'

(వసు. 3 ఆ. 73 ప.)

(కొమ్మన్ = కొమ్మయును)

'పురారిం జేరలేఁడు.'

(ఉ. హరి 6 ఆ. 65)

(పురారిన్=పురారియును)

'తప మిట్టిదిం గలదె'

(నిర్వ. 5 ఆ. 22)

(ఇట్టిదిన్=ఇట్టిదియును)

'నీ వేమిని వేగిరపడక.'

(హరి. పూ. 8. ఆ. 110)

(ఏమిని=ఏమియును)

చ.................. 'వెట్టిదీ ఘరోఁ,

కలిదలఁ జుట్టు మన్నక్రియగా నొకకొందఱు దాల్తురప్పటిన్

గలుష పథ ప్రవర్తనమె'.........

(కళా. 2 ఆ. 101 ప.)

(అప్పటిన్ = అప్పటియును)

ఉ. 'ఓట యొక్కింత యేనియు సుయోధను చిత్తమునందులేదు.'

(భార. ఉద్యో. 3 ఆ. 104 ప.)

(ఒక్కింత = ఒక్కింతయున్)

క. 'అమరఁగ జూదంబు నీకు నభిమత మేనిన్'

(భార. అర, 2 ఆ. 221 ప.)

(ఏనిన్ = ఏనియున్)

(ఏవిన్ = ఏవియున్)

'మఱిం దెనుఁగుంగబ్బము లెన్ని యేనియును'

(సభా. 1 ఆ. 9)

(మఱిన్ = మఱియును)

'ముక్కుండు వెండిన్ విపులఁ బొడమనీ'

(పాండు. 3 ఆ. 121)

(వెండిన్ = వెండియును)

అందువల్ల యిటువంటి ప్రయోగాలను-అంటే యీ ప్రయోగాలననేకాదు అత్యంత ప్రాచీనకాలంలో ఉన్నటువంటి యిటువంటి ప్రయోగాలను దృష్టిలో పెట్టుకుని సూత్రకర్త కొందరి మతంలో "యు"వర్ణం లేకుండానే సముచ్చయార్థక ప్రయోగాలుంటాయని పేర్కొని ఉంటాడని మనం భావించవచ్చును.

వాఙ్మయ మహోధ్యతుని

ద్రుతం మీది పరుష సరళస్థిరాల వ్యవస్థ గురించి చెపుతూ సూత్రకారుడు కొన్ని సూత్రాలు రచించాడు-"ద్రుతాత్సరళాః పరుషాణామ్" అని ద్రుతం మీది పరుషాలకు సరళాలు విధించాడు. తరువాత "స్థిరసరళయోర్ద్రుతస్య" అనే సూత్రంలో సరళస్థిరాలు పరమవుతుంటే ద్రుతానికి అర్ధ బిందువు, లోపం, ప్రకృతి భావం విధించినట్లు వృత్తికర్త పేర్కొన్నాడు (చూ. సంధి. 26, 27 సూ. 19 పుట). "ద్రుతాత్సరళాః" ఇత్యాది సూత్రంలో పరుషాలకు సరళాలు విధించాడు కాబట్టి ఈ సందర్భంలో సరళాలు ఆదేశసరళాలనడం సుస్పష్టం. కాని "స్థిరసరళయోర్ద్రుతస్య" అనే సూత్రంలో సరళశబ్దం చేత వృత్తికారుడు ఆదేశసరళాలను, సిద్ధసరళాలను సైతం పరిగ్రహించినట్లు కనిపిస్తున్నది. ఈ సూత్రంచేత ద్రుతానికి అర్ధబిందువు వస్తుందని అన్నాడంటే దానిమీద సరళం ఆదేశసరళం అనడం సుస్పష్టం. ఇదే సూత్రార్థంలో ద్రుతానికి లోపం వస్తుందన్నాడంటే, ఆదేశసరళానికి పూర్వంలోవున్న ద్రుతానికి లోపంరాదు. కాబట్టి సిద్ధసరళమని మనం భావించక తప్పదు. ఇదే సూత్రం క్రింద ద్రుతానికి బిందుకార్యం, పైగా అర్ధ బిందు కార్యం, లోపకార్యం రెండూ విధిస్తున్నట్లు వృత్తికర్త పేర్కొనడం సమంజసంకాదు. ఇక్కడ "స్థిరసరళయోర్ద్రుతస్య" (27 సూ.). అనే సూత్రమూ "హ్రస్వాద్బిందుశ్చ" (26సూ.) అనే సూత్రమూ ముందు వెనుకలుగా తారుమారు అయినట్లు కనిపిస్తున్నది. "ద్రుతాత్ సరళాః పరుషాణామ్" (26సూ ) అనే సూత్రం తరువాత "హ్రస్వాద్బిందుశ్చ" అనే సూత్రంవుంటే, ద్రుతానికి బిందు కార్యాన్ని ఆదేశసరళాలు పరమవుతుంటే 'చ' కారంచేత అర్ధ బిందు స్వత్వరూపాలను సాధించవచ్చును. ఈ కార్యాలు ద్రుతంమీది పరుషాలకు సరళాలు వచ్చినప్పుడే విధించినట్లై "స్థిర సరళయోర్ద్రుతస్య" అనే సూత్రంచేత, సహజ సరళ, స్థిరాలు పరమవుతుంటే ద్రుతానికి లోప, పూర్ణ బిందు, స్వత్వ, సంశ్లేష కార్యాలు విధించినట్లయ్యేది. "స్థిర సరళ యోర్ద్రుతస్య" అనే ఒకే సూత్రంలో సరళ శబ్దానికి సహజ సరళాలు, ఆదేశ సరళాలు అని రెండర్థాలు చెప్పుకొనవలసిన అవసరం యేర్పడదు. వృత్తికారుడు ప్రత్యేకించి "సరళ స్యానాదేశత్వ ఏవ లోపకార్యం ద్రుతస్యేష్యతే" అని ద్రుతలోపానికి ప్రత్యేకించి వార్తికం చెప్పుకొనవలసిన అవసరం యేర్పడదు. "హ్రస్వాద్బిందుశ్చ" అన్న సూత్రం పూర్ణబిందు విధాయక సూత్రమేగాని అరసున్నకు నెరసున్నను విధించేది మాత్రంకాదు. "నాసజాతీయేస్తోః" (సంధి 29 సూ. 19 పుట) అనే సూత్రంలో సజాతీయం కానటువంటి అక్షరం-అంటే-అచ్చు పరమవుతుంటే ద్రుతానికి ద్విత్వం లేదని నిర్ద్వంద్వంగా నిషేధించాడు. అంతేకాదు. సజాతీయమైన హల్లు పరంకానప్పుడు ద్రుతానికి బిందువును ఈ సూత్రంతో నిషేధించాడనికూడా మనం చెప్పుకొనవచ్చును.

పరిశోధనారచన

సూత్రకర్త అనేక సందర్భాలలో ద్రుతాన్ని వ్యంజనంగా భావించినట్లు కనిపిస్తున్నది. "ద్రుతస్యోత్" (సంధి 30 సూ. 20 పుట) అనే సూత్రంచేత వ్యంజన రూపంలోవున్న ద్రుత నకారానికి ఉత్వాన్ని విస్పష్టంగా విధించడం రూపంగా ద్రుతం వ్యంజనమేనని ఎలుగెత్తి చాటాడు. ఇదేవిధంగా "ఇత, ఇత్" (సంధి 31 సూ.) అనే సూత్రంచేత ఇకారానికి పరమయిన ద్రుతానికి ఇత్వాన్ని విధించడం ద్వారా ద్రుతం వ్యంజనత్వాన్ని మరొకసారి ధ్రువీకరించాడు.

"వాక్యాంతే నస్యలుగ్వా" (సంధి 35 సూ. 21 పుట) అని సూత్రకారుడు వాక్యాంతంలో ద్రుతానికి వైకల్పికంగా లోపం వస్తుందని స్పష్టంగా చెప్పగా వృత్తికర్త "కుత్రచిత్ పద్యభేదవాక్యావసానే ద్రుతస్యలుగ్వాస్యాత్" అని వృత్తి వ్రాశాడు. వాక్యాంతంలో ద్రుతలోపం ఒక్క పద్య పాదావసానంలో మాత్రమే వస్తుందని మనం భావించ నక్కరలేదు. గద్యంలో నయినా వచనంలో నయినా వాక్యం ముగిస్తే ద్రుతలోపం జరగవచ్చును. పద్యేతరాలలో వాక్యావసానంలో ద్రుతలోపం జరుగరాదని ఎవరూ చెప్పలేదు. కాగా, వృత్తికారుని వృత్తికంటే సూత్రకర్త సూత్రంలోనే భావవైశద్యం వున్నది.

"అచ ఉపధాయాశ్చుకి" (సంధి 36 సూ. 21 పుట) అనే సూత్రానికి "ఉపధాసంబంధినః అచః లుగ్వాస్యాచ్చుకి పరే" అని వృత్తి వ్రాయబడింది. 'చు' అంత్యవర్ణంగా కల పదాలలో ఉపధాగతమయిన అచ్చుకు వైకల్పికంగా లోపం వస్తుందని సూత్రార్థం. 'ఓరుచు' అన్నప్పుడు తుది వర్ణం 'చు' వర్ణం. దాని పూర్వపు అక్షరమయిన 'రు' వర్ణం ఉపధ. అందువల్ల ప్రస్తుత సూత్రంచేత 'రు' వర్ణగత మయిన అచ్చు లోపించి "ఓర్చు" అవుతుంది. ఈ సందర్భంలో 'చు' కారాన్ని అంత్య వర్ణంగా మనం పరిగణించినప్పుడు 'రు' వర్ణం ఉపధగా నిలుస్తుంది. వృత్తి కారుడు పేర్కొన్నట్లు 'చు' పరమయితే ఉపధాగతమయిన అచ్చుకు లోపం వస్తుందని చెప్పుకుంటే 'ఓరుచు' అన్నప్పుడు 'చు' పరమయినది కాబట్టి ఓరులోని 'రు' అంత్యవర్ణమయి, 'ఓ' కారం ఉపధ అవుతుంది. కాగా 'ఓ' కారానికి లోపం వస్తుంది. అయినపుడు 'చు' వర్ణం పరమయినప్పుడు, అని 'చు' వర్ణాన్ని వేరు చెయ్యకుండా " 'చు' అంత్యవర్ణం అయినపుడు ఉపధాగతమయిన అచ్చుకు లోపం వస్తుంది". అని అర్థం చెప్పుకుంటే ఎంతో సముచితంగా వుంటుంది. లోపం వైకల్పికమని విధిలోనే వున్నది కాబట్టి లోపరహిత, సహిత రూపాలు రెండూ సిద్ధిస్తాయి.

"మోః పుంపూ" (సంధి 41 సూ. 23 పుట) అని సూత్రకర్త సమాసంలో 'ము' వర్ణకానికి "పుంపు" లు విధించాడు. ఈ సందర్భంలో 'సరసపుఁబలుకు',

వాఙ్మయ మహోధ్యతుని

సరసంపుఁబలుకు, అని ఉదాహరణలిచ్చి వృత్తికర్త "నుమాగమత్వే అనిత్యత్వే సరసపు పలుకు" అని చిత్రంగా పేర్కొన్నాడు- సూత్రకర్త "సరళ, పరుషయో రుతో నుమ్‌నే". (సంధి 40 సూ. 22 పుట) అనే సూత్రంలో "ను" మాగమం నిత్యంగానే విధించాడు- 'ను' మాగమ అనిత్యత్వం గురించి వృత్తికర్త ఈ సూత్ర వృత్తిలో ప్రస్తావించనేలేదు. "మోః పుంపూ" సూత్రానికి వ్రాసిన వృత్తిలో "ను" మాగమ అనిత్యత్వం గురించి వక్కాణించి 'ను' మాగమ రహితమయిన అసాధ్య, అసాధు రూపమయిన "సరసపు పలుకు" సమాసాన్ని వృత్తికర్త పేర్కొనడం సమంజసంగా లేదు.

"సుప్ సద్రుతః" (సంధి 6. సూ. 14 పుట) అనే సూత్రంచేత ప్రథమాది విభక్తులన్నింటికి సద్రుత సంజ్ఞ విధించాడు. అందువల్ల ప్రథమా విభక్త్యంతాలు కూడా సద్రుత సంజ్ఞకలవై, ద్రుతప్రకృతికాలవుతాయి. ప్రథమా విభక్త్యంతాలు ద్రుతప్రకృతికాలు కావు కాబట్టి "సు నద్రుతః" (అజంత 5 సూ. 26 పుట) అనే సూత్రంచేత ప్రథమకు ద్రుత సంజ్ఞను నిషేధించాడు. ఇదే విధంగా "క్రియభ్యోఽపి" (అజంత-6. సూ.) అనే సూత్రంచేత ధాతువులమీదవచ్చే ప్రథమావిభక్తికి కూడా ద్రుతత్వాన్ని నిషేధించాడు. ఈ రెండు సూత్రాలలోను, ద్రుతనిషేధాన్ని మాత్రమే విధించాడుగాని, ప్రథమావిభక్తి అద్రుత సంజ్ఞ కలదని చెప్పలేదు. కాగా యివి ద్రుత నిషేధక సూత్రాలే కాని వృత్తికర్త భ్రమపడినట్లు అద్రుత సంజ్ఞా సూత్రాలు కావని గ్రహించాలి.

"అనితో న్వమః" (అజంత-10. సూ. 27. పుట) అనే సూత్రంచేత 'ఇ' దంతాలు కానటువంటి అమహద్వాచకాల 'అమ్' ప్రత్యయానికి 'ను' వర్ణకాన్ని విధించాడు. దీనివల్ల వనమును, ధేనువును, కొండను-ఇత్యాది ద్వితీయ 'ను' వర్ణకాంత పదాలు సాధ్యాలవుతాయి. 'డు' మంతాలయిన మహద్వాచకాలకు "నియ మోడుమతశ్చ" (అజంత-11. సూ. - 28. పుట) అనే సూత్రంచేత, రాముని, కృష్ణుని - వంటి "ని" వర్ణకాంత పదాలను సాధించాడు. ఈ సూత్రంచేత మహ ద్వాచకాల ద్వితీయకు ప్రత్యేకంగా 'ని' వర్ణకాన్ని విధిస్తూండగా, పూర్వ సూత్ర మయిన "అనితో న్వమః" అనే సూత్రవృత్తిలో "రామును" అని 'ను' వర్ణకాంత రూపాన్ని వృత్తికర్త ఉదాహరించడం సమంజసంగాలేదు. "ఇ" దంతాలు కానటు వంటి అమహద్వాచకాలకు మాత్రమే యిందులో 'ను' వర్ణకాన్ని సూత్రకర్త విధించాడని మనం భావించవలసివస్తుంది.

"లశసః" (అజంత - 12. సూ. - 28. పుట) అనే సూత్రంచేత ద్వితీయా బహువచనంలో 'ల' వర్ణకాన్ని విధించాడు. ఈ సందర్భంలో వృత్తికర్త కూడా "శసః" స్థానే "లవర్ణకః స్యాత్" అని 'ల' కారాన్ని వర్ణకంగానే అంటే ప్రత్యయం గానే పేర్కొన్నాడు. కాని "భిసాదౌలః" (అజంత - 15. సూ.) అనే సూత్రంలో 'ల' వర్ణాన్ని సూత్రకర్త ఆగమంగా విధించాడు. ఒక్క "ల" వర్ణ సంబంధంలో ప్రత్యేకించి "లశసః" అని "భిసాదౌలః" అని భిన్నసూత్రాలను విరచించడం ద్వారానే ఒక 'ల' కారం ప్రత్యయమని, మరొక 'ల' కారం ప్రత్యయంకాదని సూత్రకర్త స్పష్టపరచాడు. "లశసః" వృత్తిలో 'ల' వర్ణాన్ని వృత్తికర్త వర్ణకం గానే పేర్కొంటూ "భిసాదౌలః" సూత్రానికి వృత్తిరాస్తూ "సర్వస్మాన్ నామ్నః లవర్ణకః స్యాత్ భిసాదౌ బహువచనే పరే" అని తృతీయాదులలో సయితం 'ల' వర్ణాన్ని వర్ణకంగా పేర్కొనడం పొరపాటు. కాగా, "లశసః" సూత్రంలో సూత్రకర్త 'ల' ప్రత్యయాన్ని విధించాడని "భిసాదౌలః" సూత్రంలో 'ల' వర్ణాన్ని ప్రత్యయంకానటువంటి ఆగమవర్ణంగా విధించాడని మనం గ్రహించవలసి వుంటుంది.

"ఉతోనకౌ నిత్యమ్" (అజంత - 20. సూ - 30. పుట) అనే సూత్రంచేత 'ఉ' దంతాలకు 'కు' వర్ణం పరమవుతుంటే, 'న' వర్ణం నిత్యంగా వస్తుందన్నాడు. 'కు' ప్రత్యయం పరమయినప్పుడే 'న' ఆగమం వస్తుందిగాని 'కి' ప్రత్యయం పరమయినపుడు 'ఉ' దంతాలకు ఈ ఆగమంరాదు. "నిష్ఠాదౌ మహతోఽనితోవా" (అజంత - 13. సూ - 28. పుట) అనే సూత్రంచేత 'కి' వర్ణకం పరమవుతుంటే 'ని' ఆగమంగా వస్తుంది. కాగా, రామునికి, కృష్ణునికి - వంటి రూపాలు సాధ్యాలవుతాయి. 'ని' ఆగమం వైకల్పికం కాబట్టి పక్షంలో 'న' ఆగమం వచ్చి 'కు' వర్ణకంతో రామునకు, కృష్ణునకు - వంటి రూపాలవుతాయి. "ఉతోనకౌనిత్యమ్" అనే సూత్ర వృత్తిలో వృత్తికర్త "రామునకు" అని మహద్వాచకాన్ని మాత్రమే ఉదాహరించాడు గాని, ధేనువునకు, వనమునకు వంటి అమహద్వాచకాలుసయితం ఈ సూత్రంవల్ల సాధ్యాలవుతాయి. "వుమూతద్వతః" (అజంత-24. సూ-31పుట) అనే సూత్రంలో ప్రథమైకవచనేతర విభక్తి ప్రత్యయాలు పరమవుతుంటే వు, ము, లు ఆగమంగా వస్తాయని వృత్తికర్త పేర్కొన్నాడు. దీని పూర్వ సూత్ర మయిన "ముమ్ముంబునప్యతోఽ మహతశ్చ" అనే సూత్రంలో ము-మ్ము-ంబు, ప్రత్యయాలను విధించాడేగాని 'వు' ప్రత్యయాన్ని విధించనేలేదు. "యేభ్యోఽప్యుపసూ విధీయేతే తేషాంవుమువత్ సంజ్ఞా" అని వృత్తికారుడు 'వు' మువత్సంజ్ఞను విధించాడేగాని, అసలు ప్రథమైక వచనంలో 'వు' వర్ణక విధి విషయమై ప్రస్తావించనే లేదు.

వాఙ్మయ మహాధ్యక్షుని

"ధర్మాదేర్వ్వర్ణ్వాసోః" (అజంత. 31 సూ-33 పుట) అనే సూత్రంలో 'వు' వర్ణకాన్ని ధర్మాది శబ్దాలకు విధించినట్లు "ధర్మాదేః సోః స్థానే వుర్వ్వాస్యాత్" అని వృత్తికర్త వ్రాసి "ధర్మువు-ధర్మువులు" పక్షే "ధర్మము" అని ఉదాహరించాడే కాని, విష్ణుడు-గురుడు-వంటి సహజోకారాంత 'డు' మంత శబ్దాలలో "డుఙ్" విధి గురించి పాక్షిక 'వు' వర్ణక విధి గురించి ఆలోచించనేలేదు. విష్ణుడు-విష్ణువు-గురుడు-గురువు, వంటి రూపాలు అప్రసిద్ధాలేమీ కావుకదా! అయితే ధర్మాది శబ్దాలకు "వు" వర్ణకంతో పాటు తుది అత్వం ఉత్వమవుతుందని కూడా చెప్పవలసి వున్నది. కాని సూత్రకర్తతోపాటు వృత్తికర్త కూడా ఈ విషయాన్ని గుర్తించ లేదు.

"పురుష వ్యాఘ్రాదీనాముపమితసమాసాశ్రరుణేన మహత్త్వమ్"-(అజంత 26సూ.) "మేఘ పర్వతాదీనా" (అజంత-28 సూ.) "ముఖచంద్ర శబ్దస్య" (అజంత-29 సూ.-32 పుట) "లుగాదేర్హలః" (తిజన్త-206 సూ. 199 పుట) ఇత్యాది సూత్రాలకు వృత్తికర్త అసలు ప్రత్యేకంగా వృత్తి వ్రాయనేలేదు-వీటిని సూటిగా వివరించి వ్రాస్తే బాగుండేది.

"బాలాదేః లోపధా ద్రోలః" (అజంత-30 సూ. 32 పుట) అనే సూత్రంలో బాలాది శబ్దాలలో బహువచన "ల" కారానికి రేఫ విధించాడు. బాలురు, బాలుర చేత, బాలురకు, వంటి రూపాలు సాధు రూపాలుగానే సిద్ధిస్తాయి. "ఆర" గాగమం వచ్చినప్పుడు బహువచన 'ల' కారానికి రేఫ రాదని మనం గుర్తించవలసి వున్నది. కాగా 'బాలులారా' అని రూపసిద్ధి జరుగుతుందిగాని 'బాలురారా' అని సిద్ధించదు.

"మాయాదిర్వా" (అజంత-80 సూ. 48 పుట) అనే సూత్రానికి వృత్తికర్త వృత్తివ్రాస్తూ "లస్యరేఫే బాలా-బాలగు ఇత్యాది" అని రచించాడు. బాలశబ్దం మహద్వాచకమయినపుడు బాలురు అవుతుందేకాని, బాలరు కానేరదు. స్త్రీవాచక మయినపుడు బాలలు అవుతుందేకాని బాలరు కానేరదు.

"లే చేతనానామ్" (అజంత-46. సూ. 38 పుట) ఈ సూత్రానికి వృత్తివ్రాసి "తారలు, తమ్ములు" అనే రూపాలను వృత్తికర్త ఉదాహరించాడు. లకారం పరమ వుతుంటే చేతన వాచకాలకు 'ర' కారం వస్తుందన్నాడు. రేఫశబ్దాన్ని యెక్కడ నుంచి అనువృత్తి తీసుకవచ్చాడో, చేతన వాచకమంటే "తాము" శబ్దమని యేవిధంగా గ్రహించాడో తెలియదు. సూత్రాన్ని పరిశీలిస్తే "లెమ్ములెమ్ము-లేలెమ్ము" అన్నప్పుడు, లెమ్ముకు 'లే' రూపాన్ని సాధించినట్లు కనిపిస్తున్నది.

"నమౌస్వస్యటాసాదౌచ" (అజంత-45 సూ. 37 పుట) నవకాజసాదావ పీతికేచిత్ (అజంత-47 సూ.38 పుట) అనే రెండు సూత్రాలకు సంబంధం కనిపిస్తున్నది. కాని, మధ్యలో చేతన వాచకంతోవున్న "లేచేతనానామ్" సూత్రానికి ఈ రెండింటితోనూ సంబంధం కనపడదు.

"దురోర్వ్యోః సూర్యేటుడమాదేః" (అజంత-68. సూ.-45, పుట)అనే సూత్రంలో ఔపవిభక్తిక శబ్దాలను సూర్యగణ ప్రాతిపదికలుగా పేర్కొన్నాడు. సూర్య గణాలనగా, హగణ, నగణాలేకదా! అయినప్పుడు ఒక గురువు ఒక లఘువువున్న పదాలు, మూడు లఘువులున్న పదాలు పరిగృహీతాలవుతాయి. నాగలి, కొడవలి వంటి సూర్యగణేతర పదాలు పరిగృహీతాలుకావు. వృత్తికర్త "గోరు" శబ్దాన్ని గ్రహించి ఔపవిభక్తిక రూపాలు కొన్ని ఉదాహరించాడేకాని, పురుడు (పురిటిని, పురిటికి) వంటి నగణ రూపాలను ఉదాహరించలేదు.

సూత్రకర్తయే వృత్తికర్త అయివుంటే, యింత లోప భూయిష్ఠాలైన, దోష జుష్టాలైన వృత్తులను రచియిస్తాడనుకునే అవకాశం బొత్తిగాలేదు. స్వవచన వ్యాఘాతాలనడానికి పొరపాట్లకు సూత్రకర్త పాల్పడతాడనడానికి అసలే అవకాశంలేదు. కాగా సూత్రకర్త వేరు, వృత్తికర్త వేరు అని నిర్ణయించు కొనవలసివున్నది.

ఎవరో రచించిన ఆంధ్రవ్యాకరణ సూత్రాత్మకమైన సపాద "అష్టాధ్యాయి" ని తనకు తోచినట్లు సంజ్ఞాది ప్రకరణాత్మకాలుగా యేర్పరచి-తాను అవగాహన చేసుకున్నంతలో అవసరమైనచోట్ల వార్తికాలు రచియించి వృత్తితో రూపసాధన కొనసాగిస్తూ మంచెళ్ల వాసుదేవకవి "సిద్ధాంత కౌముది" వలె వైకృత చంద్రికను "ఆంధ్ర సిద్ధాంత కౌముది" గా విరచించాడని స్పష్టపడుతున్నది.

అయితే సూత్రకర్త యెవరో, అతని పేరు ఊహామాత్రంగానైనా తెలియ రావడంలేదు. అసలు వైకృత చంద్రిక అవతారికాదులున్న భాగం మాకు లభించిన యే ప్రతిలోనూ లేదు. సూత్రకర్త వాసుదేవుడే కాక మరొకరెవరో అయితే ఆ మహానుభావుని నామం-వాసుదేవునికి తెలిసేవుంటే-అతడు దాన్ని చెప్పకుండా వుంటాడా! చెప్పేవుండవచ్చును. ఆ నామాద్యంశాలు మనకు అలభ్యమైన అవతారికా భాగంలో వుండి వుండవచ్చును. లభించనిదానిని గురించి, తెలియనిదానిని గురించి యెంత చర్చించినా నిష్ప్రయోజనమే కదా!

వాఙ్మయ మహోధ్యాయుని

## గ్రంథవైశిష్ట్యం

మొత్తంమీద గ్రంథ సూత్రాలను పరిశీలించినపుడు సూత్రకర్త మనకు ఒక అసాధారణమైన మేధానిధిగా కనిపిస్తాడు. సూత్రీకరణమనేది సామాన్య కార్యంకాదు. అది ఒక మహత్తరమైన కార్యం.

అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతో ముఖం
అస్తోభ మన వద్యంచ సూత్రం (సూత్రవిదోవిదుః)॥

అని మన ప్రాచీనులు సూత్రలక్షణం నిర్వచించారు. ఈ లక్షణానుగుణంగానే వైకృత చంద్రికా సూత్రకర్త సూత్రరచన కొనసాగించాడు.

సుబంత, తిజంత కృదంత విభాగాలని మూడు విభాగాలుగా వున్న యీ గ్రంథంలో సంజ్ఞా-సంధి-(స్వరసంధి, హల్సంధి) స్వాది ప్రక్రియ-(అజంత-హలంత-అవ్యయ)-స్త్రీ ప్రత్యయ-విభక్త్యర్థ-సమాస-తద్ధితాదేశ-తద్భవ ( సంస్కృతభవ-ప్రాకృత-శౌరసేనీ-మాగధీ - పైశాచీ - చూళికా పైశాచీ-అపభ్రంశభవములు-వైకృత విశేషాలు) - తిజంత-కృదంత ప్రకరణాలున్నాయి.

ఆంధ్ర శబ్ద చింతామణి వంటి గ్రంథాలతో పోల్చి చూచినపుడు వైకృత చంద్రికా సూత్రకర్త కొన్ని సందర్భాలలో కేవల స్వతంత్ర దృక్పథాన్ని అనుసరించినట్లు కనిపిస్తున్నది. కొన్నిచోట్ల కేవల తెలుగు స్వరూపాన్ని దృష్టిలో పెట్టుకొని సూత్ర రచన చేసినా, మరికొన్ని సందర్భాలలో విభక్తి ప్రత్యయాలనూ, తదితర ప్రత్యయాలనూ, శబ్దాలనూ సైతం సంస్కృత విభక్తి ప్రత్యయాదులకు, శబ్దాలకు ఆదేశాలుగా పేర్కొంటూ వచ్చాడు.

## ప్రాకృత భవాలు

తెలుగు సంస్కృత భాష నుంచి, షడ్విధ ప్రాకృతాలనుంచి ఉద్భవించిందన్న అభిప్రాయం దృఢంగా సూత్రకర్తలో వున్నట్లు కనిపిస్తున్నది. ప్రాచీన వ్యాకరణ కర్తలందరిలోనూ "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అన్న భావం వున్న మాట వాస్తవమే, అయితే వైకృత చంద్రికా సూత్రకర్త చారిత్రకమైన దృష్టితో సంస్కృతాంధ్రాలనూ, షడ్విధ ప్రాకృతాలనూ పరిశీలించినట్లు కనిపిస్తున్నది. అనేకమంది కవి పండితులు దేశి పదాలని భావించిన పెక్కు-

పదాలను సంస్కృత పదభవాలుగానో, వివిధ ప్రాకృత పదభవాలుగానో నిరూపించడంలో వైకృత చంద్రికా సూత్రకర్త కృతకృత్యుడయ్యాడనే చెప్పవచ్చు. సంస్కృత, ప్రాకృత, తద్భవపద బాహుళ్య నిరూపణంతో ప్రదర్శనంతో తెలుగు ఆర్య భాషా కుటుంబంలోనిదన్న వాదం అజేయమవుతుందను కొనడం పొరపాటే- కాని, వైకృత చంద్రికా సూత్రకర్త బహుభాషాభిజ్ఞతను శబ్ద పరిణామ పరిశీలనా దృక్పథాన్ని కాదని త్రోసిపుచ్చలేము. ఆంధ్రశబ్ద రత్నాకర కర్త శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులు కేవల దేశి పదాలని భావించిన అరవై ఆరు పదాలు దేశీయాలు కావని సంస్కృతభవాలో, వివిధ ప్రాకృత పద భవాలో అయి తెలుగులో నిలదొక్కుకున్నాయని యేనాడో వైకృత చంద్రికా సూత్రకర్త నిరూపించాడు. ఒక్క సంస్కృతంనుంచే కాక, పైశాచీ-చూళికా పైశాచీ, అపభ్రంశ ప్రాకృతాల నుంచి కూడా వికృతి వ్యవస్థను ప్రకృతి పద ప్రదర్శనా పూర్వకంగా వైకృత చంద్రికా సూత్రకర్త పేర్కొన్న పదాలను పాఠకుల సౌకర్యార్థం ఈ క్రింద ఉదాహరిస్తున్నాను.†

| సంస్కృతం | — | తెలుగు |
|---|---|---|
| అంగణ | — | అంగడి |
| ఆతుర | — | ఆత్రము |
| ఆయత్త | — | ఆయితము |
| ఈషత్ | — | ఇంచు |
| ఓకస్ | — | ఇక్క |
| అంగుళీయకము | — | ఉంగరము |
| ఉత్స | — | ఊట |
| హేయ | — | ఏవము |
| కదంబ | — | కడిమి |
| కానన | — | కాన |
| కాల | — | కాలు |
| కురువక | — | క్రోవి |
| కుద్దాల | — | గొడ్డలి |
| గోపాల | — | గొల్ల |

† ప్రకృతి వికృతి పదాలలో తెలుగు పదాలను అకారాది క్రమంలో ఉదాహరించడం జరిగింది.

వాఙ్మయ మహోధ్యాతుని

| సంస్కృతం | | తెలుగు |
|---|---|---|
| శ్యామ | — | చేమ |
| టంక | — | టెంకి |
| తట | — | తట్టు |
| తూల | — | దూది |
| నేమి | — | నెమ్మి |
| పుత్ర | — | పట్టి |
| పర | — | పెర |
| అపత్య | — | బిడ్డ |
| మకర | — | మకురు |
| మేఘ | — | మొగులు |
| లఘు | — | లాగు |
| విస్మయ | — | విస్తు |
| వేసర | — | వేసడము |

| సంస్కృతం | — | ప్రాకృతం | — | తెలుగు |
|---|---|---|---|---|
| యశస్ | — | జసో | — | అసము |
| లఘుక | — | హాళజ్ | — | అళవు, అళవి, అళివి. |
| కర్కశ | — | కక్కసో | — | కక్కు |
| కూట | — | కూడో | — | గుడ్డ |
| శుక్తి | — | చిప్పి | — | చిప్ప |
| చతుష్కికా | — | చవుక్ఖి ఆ | — | చవుకియ |
| జాలకం | — | జాళ అం | — | జాళియము |
| జీర్ణ | — | జుణ్ణా | — | జున్ను |
| ప్రళయ | — | పళవో | — | పడవ |
| భ్రూ | — | భుమ అ | — | బొామ |
| బ్రహ్మ | — | బమ్హా | — | బొామ్మ |
| శ్మశ్రు | — | మంసూ | — | మీస |
| సదృశ | — | సరిసో | — | సరి |

| సంస్కృతం | — | పైశాచీ ప్రాకృతం | — | తెలుగు |
|---|---|---|---|---|
| అనిశ | — | అనిసో | — | అనయము |
| అనుగ | — | అనుగో | — | అనుగు |

| సంస్కృతం | | పైశాచీ ప్రాకృతం | | తెలుగు |
|---|---|---|---|---|
| ఊర్ణా | — | ఉన్నా | — | ఉన్ని |
| హేలా | — | హేలా | — | ఓలి |
| కల్య | — | కల్లం | — | కల్లు |
| కంఠ | — | కంఠో | — | గొంతు |
| యోగ | — | జోగో | — | జోగు |
| పల్యాణ | — | పల్లానం | — | పల్లము |
| పున్నాగ | — | పున్నాగో | — | పొన్న |
| నాళ | — | నాళం | — | నరము |
| నిలయ | — | నిలయో | — | నెలవు |
| అలక్త | — | అలత్తో | — | లత్త |
| స్రవణ | — | సవనం | — | సొన |

| సంస్కృతం | | ప్రాకృతం (చూళికా పైశాచి) | | తెలుగు |
|---|---|---|---|---|
| వ్రీహి | — | బీడి (?) | — | పయిరు, బిడియం |
| బాడబ | — | పాటప | — | పాఱఁడు |
| బృంద | — | పుందో | — | పిండు |
| భిదుర | — | భిదురో | — | పిడుగు |
| స్వర్ణ | — | పన్నో | — | పొన్ను |
| బలి | — | పలి | — | పొలి |
| పూగ | — | పూకో | — | పోక |

| సంస్కృతం | | అపభ్రంశ ప్రాకృతం | | తెలుగు |
|---|---|---|---|---|
| షార | — | చానం | — | చారు |
| శ్రుత | — | సుదు | — | చదువు |
| తాళ | — | తాళు | — | తాడు |
| అబద్ధ | — | అబద్దు | — | బద్దు |
| మాకంద | — | మాగందు | — | మావి |
| హిక్కా | — | వేక్కా (?) | — | వెక్కు |

ఇవి ఆంధ్ర శబ్ద రత్నాకర కర్త కేవల దేశిపదాలని పేర్కొన్న పదాలు-వీటికి మూలమైన ప్రాకృత సంస్కృత పదాలు మాత్రమే-వైకృత చంద్రికలో సాధించబడిన తద్భవపదాలు యివేకాక యింకా అనేకం ఉన్నాయి.

వాఙ్మయ మహోధ్యాయుని

వైకృత చంద్రికా సూత్రాలలోనూ కొన్ని సూత్రాలకు మంచెళ్ల వాసుదేవకవి వృత్తులు రచించడంలోనూ వున్న విశేషాలను కొన్నింటిని ఈ క్రింద ఉటంకిస్తున్నాను.

## విశేషాలు

"అతి ప్రాచీనమైనది సంస్కృతం. సంస్కృతమే ప్రజలనోళ్లల్లోపడి వికృతి రూపం చెంది ప్రాకృతంగా పరిగణించబడింది" అనే భావం వెల్లడించడానికి సూత్రకర్త "అపూర్వం వికృతమ్" (34—సూ. సంజ్ఞ. 12 పుట) అనే సూత్రాన్ని రచించినట్లు కనిపిస్తున్నది. వికృత రూపం ప్రాచీనమైనదికాదు, ఆధునికమైనది అన్న అభిప్రాయాన్ని యీ సూత్రంలో వెల్లడించాడు.

"గోగణ పరః" (11. సూ. సంజ్ఞ) అనే సూత్రానికి గణపరోయ ఆది శబ్దః స గ సంజ్ఞోభవతి. (7. పుట) అని వృత్తి వ్రాశాడు. ఇక్కడ గణ శబ్దంచేత మ, భ, న వంటి ఛందోగత గణాలు పరిగృహీతాలు కావు. ఇది సమూహవాచకం — ఇదే విధంగా వృత్తిలోవున్న ఆది శబ్దం 'తొలి' అన్న అర్థాన్ని ఇచ్చేదికాదు. మొదలైనవి అన్న అర్థాన్ని ఇచ్చేది. అనగా 'గ' అని యెక్కడ ఉపయోగించినా సమూహవాచకంగా పరిగణించాలనే తాత్పర్యం.

సంజ్ఞాప్రకరణంలో వ్యాకరణకర్త కేవల సంజ్ఞలను మాత్రమే పేర్కొనలేదు. కొన్ని నామమాత్ర సంజ్ఞా నిర్దేశకాలుగా గోచరమయ్యే సంధికార్యాలను కూడా సంధించాడు. "రితోద్విత్వమ్'' అనే సూత్రంతో రేఫ అనుబంధంగావున్న వ్యంజనం ఆదేశమైనపుడు నిత్యంగా ద్విత్వం వస్తుందని — "శితిదీర్ఘః" అన్న సూత్రంలో 'శ' వర్ణం ఇత్‌గావున్నప్పుడు పూర్వాన దీర్ఘం వస్తుందని — "సానునాసికోచ్చారం జిత్'' అనే సూత్రంలో 'జ' కారం ఇత్‌గా వున్నప్పుడు ఆ అక్షరానికి పూర్వం బిందువువస్తుందని పేర్కొన్నాడు (8, 9, పుటలు). ఈ సందర్భంలో రిత్—శిత్—జిత్ అన్నవాటిని సంజ్ఞామాత్రాలుగా పేర్కొన్నా ద్విత్వ—దీర్ఘ—బిందు కార్యాలను అనువర్తింపచేయడం రూపంగా సంధికార్యాలను కూడా సాధించడం జరిగింది.

"ప్రాణీహల్" (సంజ్ఞ—28. సూ. 11. పుట) అన్న సూత్రంలో హల్ ప్రత్యాహార వర్ణాలు ప్రాణులు అనబడతాయని పేర్కొన్నాడు. ప్రాణి శబ్దం అచ్చుతోకూడిన హల్లుకే సంజ్ఞగాని, వ్యంజనమైన హల్లుకు సంజ్ఞకాదు. ఈ విషయాన్ని సూత్రకర్తగాని, వృత్తికర్తగాని గుర్తించినట్లు కనపడదు.

"చుదోర్బిందుకశ్చ గ్రహాదేర్నః" (సంధి—37. సూ—22. పుట) అనే సూత్రములో బిందుక శబ్ద ప్రయోగంతో అర్ధ బిందువును విధించి "హైకాచోయుజి" (సంధి—35. సూ—22. పుట) అనే సూత్రం చేత పూర్ణ బిందువును విధించవసరం లేదు. "చుదోర్బిందుశ్చ గ్రహాదేర్నః" అని బిందు శబ్ద ప్రయోగంతోనే సూత్రం రచిస్తే సరిపోయేది. ఒక సూత్రం తగ్గివుండేది. "హైకాచోయుజి" అనే సూత్రంలో విధించిన పూర్ణ బిందువును "హ్రస్వా బిందుశ్చ (సంధి—28. సూ—19 పుట) అనే సూత్రంచేత కూడా సాధించవచ్చు. ఇందులో బిందు, బిందుకాలు విభాషగా విధించాడు కాబట్టి, వ్యవస్థిత విభాషచేత హ్రస్వమయిన ఏకాచ్చు మీదగాని, సంయుక్తాక్షరానికి పూర్వంలోగాని, అర్ధబిందువు రాకుండా, పూర్ణ బిందువే వస్తుందని మనం వివక్ష చేసుకొని, కేవల పూర్ణ బిందు రూపాలను సయితం సాధించుకొనవచ్చును. కాగా, సంధి—37వ, సూత్రంలో బిందుక విధానంవల్ల 38 వ, సూత్ర రచనతో వృథా శ్రమ యేర్పడిందని భావించవలసి వుంటుంది.

"రలడాముతాంశః" (అజంత-56 సూ. 41 పుట) అనే సూత్రవృత్తిలో నేడు ప్రసిద్ధంగా వున్న సస్య వాచకమైన 'వరి' శబ్దానికి రూపాంతరంగా 'వడి' శబ్దం సైతం పేర్కొనబడడంవల్ల వృత్తికర్త కాలంలో వడిశబ్దం బహుళ వ్యవహారంలో వున్నట్లు స్పష్ట పడుతున్నది.

"సేసూర్యే" (సంధి-11సూ. — 16 పుట) అన్న సూత్రంలో సూర్య శబ్దానికి "సూర్యగణ సంబంధమైనది" అని వృత్తికర్త అర్థం చెప్పాడు. కాని ఉదాహరణలలో పూరిల్లు—సరీడు అన్న రెండు పదాలుమాత్రమే ఉదాహరించాడు. సరీడు సూర్యగణ సంబంధ పదం కానేకాదు. ఈ సందర్భంలో వృత్తికర్త వేరొక పదాన్ని దేన్నో ఉదాహరించి ఉంటాడు. సూర్యగణ సంబంధం అన్నప్పుడు ఇల్లు—ఈడు వంటి కేవలహాగణ పదాలేకాక ఇటుక—ఇరుకు వంటి నగణ త్ర్యక్షర పదాలు సైతం పరిగృహీతాలవుతాయి.

తెలుగులో సంస్కృత మూలపదాల ప్రయోగంగురించి వక్కాణిస్తూ సూత్రకర్త నాలుగు సూత్రాలు రచించాడు. అవి యివి :

(1) "నావ్యయస్యావృథాదేః". (సంధి—20 సూ)

(2) "లుగ్విసర్గస్య", (సంధి—21 సూ)

(3) "సుప్తిఙామ్". (సంధి—22 సూ)

(4) "ద్విత్వమ్మః". (సంధి—23 సూ). (చూ. పుట. 17.18)

వాఙ్మయ మహోధ్యక్షుని

"నావ్యయస్య" ఇత్యాది సూత్రంలో "పృథా" మొదలయిన అవ్యయాలకు తప్ప మిగిలినవాటికి తెలుగులో స్వతంత్రంగా ప్రయోగం లేదన్నాడు. తరువాతి సూత్రాలు రెండూ తారుమారు అయినట్లు కనిపిస్తున్నది. "సుప్తిఙామ్" అన్న సూత్రంలో సంస్కృత సుబంత పదాలకు తిఙంతాలకు తెలుగులో స్వతంత్ర ప్రయోగార్హత లేదన్నాడు. "లుగ్విసర్గస్య" అనే సూత్రంలో "విసర్గాంత పదాల తుది విసర్గకు అనుకరణంలో లోపంవస్తుంది. ఇటువంటివి ప్రయోగార్హాలౌతాయి," అని ఒకానొక సంధి కార్యాన్ని విధించాడు. "సుప్తిఙామ్" అనే సూత్రం "లుగ్విసర్గస్య" సూత్రానికి పూర్వం - అంటే "నావ్యయస్యావృథాదేః" అనే సూత్రానికి తరువాత ఉండాలి. "సుప్తిఙంతాలకు అనుకరణం లేకుండా స్వతంత్రంగా ప్రయోగంలేదు" అని చెప్పిన సూత్రాన్ని 21. వ. సూత్రంగా వుంచితే, వాటి స్వతంత్ర ప్రయోగవ్యవస్థను "నావ్యయ" సూత్రంలో నుంచి "న" శబ్దాన్ని అనువృత్తి తెచ్చుకొనడం ద్వారా నిషేధించుకొనవచ్చును. ఆ తరువాత అనుకరణ ప్రయోగంలో విసర్గకు లోపకార్యమూ - అనంతరం అనుకరణలో 'మ' కారానికి ద్విత్వమూ చెప్పుకున్నట్లుగా సవ్యంగానే వుంటుంది. అందువల్ల సూత్రకర్త 22వ, సూత్రాన్ని, 21వ, సూత్రంగానూ, 21వ, సూత్రాన్ని 22వ, సూత్రంగాను రచించినట్లు కనిపిస్తున్నది. వృత్తికారుడుకాని, ప్రతివ్రాసిన వ్యక్తికాని ఈ సూత్రాలక్రమాన్ని తారుమారుచేసివుంటారని అనిపిస్తున్నది.

"గుజుమూనాం కచపాః" (సంధి - 46సూ - 24 పుట) ఈ సూత్రం చేత సమాసంలో గు, జు, ము, అనే అక్షరాలకు క్రమంగా క, చ, ప, అనే అవర్ణ యుక్త పరుషాలు వస్తాయని విధించాడు. వాగు + నీరు = వాకనీరు; రాజు + కొమరుడు = రాచకొమరుడు; వేము + పండు = వేపపండు; నాము + చేను = నాపచేను; వేము + పచ్చడి = వేపపచ్చడి; వంటి రూపాలవుతాయి. ఈ సందర్భంలో పూర్వ పదాంత్యంలోవున్న గు, జు, ము వర్ణాలకు క, చ, ప లు అవర్ణసహితాలయి ఆదేశాలుగా వస్తాయని మనం గ్రహించాలి.

"సుపి మహతోఽన స్యాత ఉత్" (అజంత-2 సూ. 25 పుట) అనే సూత్రానికి "అవర్ణక వర్జితస్య మహతోఽత ఉత్ స్యాత్ సుపి పరే" అని వృత్తి వ్రాశాడు. "అవర్ణక వర్జితస్య" అని అనడంలో మామూలు 'డు' మంత పదాల అదంతత్వనామరూపాలు పరిగ్రహీతాలుకావు. స్త్రీ సమపదాలయిన అదంత మహద్వాచకాలు, భ్రాత, దాత, కర్త, హర్త వంటివి పరిగ్రహీతాలవుతాయి. ఈ దృష్టితో అవర్ణకాంతాలు కాని శబ్దాల చివరి అత్తుకు ఉత్వం వస్తుందన్నప్పుడు అదంతాలుకాని పదాల చివర అత్తెక్కడ వుంటుందా అని సందేహించనవసరంలేదు.

అవర్ణాకాంతాలంటే, స్త్రీ సమాలయిన అదంత పదాలనీ – అత్తుకు, ఉత్వం వస్తుందంటే, డుమంత మహద్వాచకాల తుదినున్న అత్తునకు వస్తుందనీ గ్రహించాలి. కాగా భ్రాత-దాత-కర్త-హర్త ఇత్యాది రూపాల తుది అత్వానికి ఉత్వం రాదన్న మాట.

అవ్యయ ప్రకరణంలో దాదాపు అన్నింటినీ నిపాతలుగానే సాధించడం జరిగింది. తెల్లవారిలేస్తే, లాలనగా, ముద్దుగా పిల్లలను ఆడిస్తూ 'చీచీ' అనడం మనకు అలవాటు. కోపంతో అసహ్యంతో కూడా ఈ 'చీచీ' పదాన్నే ఉపయోగించడం కూడా కద్దు. తరచుగా 'చీచీ'లో రెండవ 'చీ' మహాప్రాణంగా కూడా అంటే "ఛీ" అని "చ్ఛీ" (చిచ్ఛీ) అని ద్విత్వరహితంగానూ, సహితంగానూ అనడం కద్దు. "ఛీ ఛీ" అని రెండింటినీ మహాప్రాణాలుగా వ్యవహరించడం కూడా లేకపోలేదు. బాలగ్రహ ఉచ్చాటనకై అసలీ పదాన్ని మొట్టమొదట ఉపయోగించే వారట. కాని తరువాత తరువాత అతి సామాన్యమయిన వాడుక పదంగా, వూతపదంగా సయితం యిది స్థిరపడిపోయింది. "చిచ్ఛీ బాలగ్రహాపనయే" (అవ్యయ-22సూ.-72 పుట) అని సూత్రకర్త దీన్ని బాల గ్రహాపనయార్థంలో నిపతించాడు.

విభక్త్యర్థ ప్రకరణంలో అన్నీ సంస్కృత విభక్త్యనుకరణలుగానే విధింపబడ్డాయి. కాని, "జడస్యాతోనుచతాజ్యోః" (విభ-14.సూ.-84 పుట) అనే సూత్ర వృత్తిలో 'రాముడు గదతో మోదును', 'రాముడు గదచేత మోదును' అనడానికి మారుగా 'రాముడు గదను మోదును' అని తెలుగుతనానికి అసహజమయిన కారకాన్ని పేర్కొన్నాడు. గదచేత మోదును అనే అర్థంరావడంకంటే "రాముడు గదనే మోదుతాడు కాబోలు" అనే అర్థం మనకు ఈనాడు ఝటితి స్ఫూర్తిగా వస్తుంది. ఈ సందర్భంలో చిన్నయసూరి "గొడ్డటనరికెను" అని ఉదాహరించాడు. గొడ్డట అన్నది ఔప విభక్తికం అవడంవల్ల కాబోలు మనకు గొడ్డలితో – గొడ్డలిచేత అనే అర్థమే స్ఫురణకువస్తుంది కాని "గొడ్డలినినరికెను" అన్న అర్థం మనస్ఫురణకు రానేరాదు.

ఆంధ్ర వ్యాకరణ కర్తలందరూ 'యొక్క' హలాది ప్రత్యయంగా ఏక కంఠంతో ఉద్ఘాటించారు. ఆధునిక భాషాశాస్త్రవేత్తలు "యొక్క" ప్రత్యయానికి మూలం ఏకవాచకమైన "ఒక్క" అజాదిశబ్దమే అయివుంటుందని ఊహించారు. వైకృత చంద్రికా సూత్రకర్త "ఒక్కశేషే" (సమాస-3.సూ-86 పుట) అని సూత్రించి అసలు షష్ఠీవిభక్తి ప్రత్యయం 'ఒక్క'యేగాని 'యొక్క' కాదని

వాఙ్మయ మహోద్యతుని

విస్పష్టంగా ప్రవచించాడు. నీయొక్క + కొడుకు = నీదుకొడుకు; నాయొక్క + కొడుకు = నాదుకొడుకు; తనయొక్క + కొడుకు = తనదుకొడుకు వంటి సమాస రూపాలను సాధిస్తూ "ఒక్కస్యదు వేత్యేకే" (సమాస-4సూ-86పుట) సమాసంలో శేషషష్ఠి అయిన "ఒక్క" స్థానంలో "దు" వర్ణం వైకల్పికంగా ఆదేశంగా వస్తుందని మరింత స్పష్టంగా వక్కాణించాడు. "ఇయో హేత్" (అజంత-34.సూ.34,35.పుటలు) అనే సూత్రవృత్తిలో ఏక-ఏక్కో-ఒక్క అని ఒక్కను ప్రాకృత భవంగా సాధించడం గమనింపవలసిన విషయం.

ద్విగు సమాసాలను వక్కాణిస్తూ సంస్కృత సంఖ్యావాచకాలకు తెలుగు సంఖ్యావాచకాలను ఆదేశాలుగా వచించి, ఇతర వ్యాకరణ కార్యాలు సాధించాడు. 'మనము' ఉభయ వాచకమనీ సమాసం కానటువంటి మామూలు పదమనీ వ్యాకరణ కర్తలు, భాషావేత్తలు భావించారు. వైకృత చంద్రికా సూత్రకర్త "అంత్యేఽస్మదః" (సమాస-40. సూ. 95 పుట) అని సూత్రించి 'మనము' ద్వంద్వ సమాసమని విశిష్టంగా పేర్కొన్నాడు.

## వాసుదేవుని కాలం

మంచెళ్ల వాసుదేవకవి కాలాన్ని గురించి పెక్కుమంది పెక్కు విధాలుగా వ్రాశారు. శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు ఆంధ్ర శబ్దచింతామణి గురించి వ్రాస్తూ యీ క్రింది విధంగా పేర్కొన్నారు.

"ఈ యాంధ్ర వ్యాకరణమున కెలకూచి బాలసరస్వతియను పండితుఁడు మొట్టమొదట తెలుఁగున టీక యొకటి వ్రాసెను. దానికి బాలసరస్వతీయమని పేరు. అటు తరువాత వాసుదేవుఁడను మఱియొక పండితుఁడీ వ్యాకరణమునకు వార్తిక మొక్కటి వ్రాసెను. దానిని వాసుదేవవృత్తియని వ్యవహరింతురు. తదనంతరము కాకునూర్యప్పకవి యీ వ్యాకరణమును దెనిఁగింపఁబూని సంజ్ఞా సంధి పరిచ్ఛేదములను మాత్రము తెనుఁగున నయిదాశ్వాసములుగల పద్యకావ్యమునుగా రచించెను. ఈతని యనంతర మహోబల పండితుఁడాంధ్ర శబ్దచింతామణికి సంస్కృత భాషలో నొక వ్యాఖ్యానముచేసి దానికిఁ గవిశిరోభూషణమని పేరు పెట్టెను. దానినిప్పు డహోబలపండితీయమని పిలుతురు. పిమ్మట నృసింహ పండితుఁడను నతడుకూడ నన్నయ భట్టీయమునకొక వ్యాఖ్యానము చేసెను. దానికి నృసింహ పండితీయమని నామము." (ఆంధ్రకవుల చరిత్రము-ప్రథమ భాగము. 41 పుట)

శ్రీ చాగంటి శేషయ్యగారు "పదునేడవ శతాబ్దివాడైన మంచెళ్ల వాసుదేవకవి ఆంధ్ర శబ్దచింతామణికి సంస్కృతమున వృత్తిని వ్రాసియుండెను." (ఆంధ్రకవి తరంగిణి—ప్రథమ సంపుటము. 44 పుట, అని తమ కవితరంగిణిలో వ్రాశారు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, శ్రీ చాగంటి శేషయ్యగార్లు, యిద్దరూ ఆంధ్ర శబ్దచింతామణికి సంస్కృతంలో వృత్తి రచించిన మంచెళ్ల వాసుదేవకవి అహోబల పండితుని కంటే పూర్వం వున్నట్లు పేర్కొన్నారు. కాని, గంధవహం అనబడే అలంకార (నాయికా- నాయక లక్షణ) గ్రంథం-ఆంధ్ర శబ్ద చింతామణీ వాసుదేవ వృత్తి- వైకృత చంద్రికలు రచించిన మంచెళ్ల వాసుదేవకవి వాసిరెడ్డివారి నాశ్రయించి క్రీ. శ. 1758 ప్రాంతంలో వున్నాడని సాధికారంగా కొందరంటున్నారు.

మిత్రులు డాక్టర్ తూమాటి దొణప్పగారు 1-5-1973 వ, తేదీన నాకొక లేఖ వ్రాస్తూ అందులో మంచెళ్ల వాసుదేవకవిని గురించి యీ క్రింది విధంగా వ్రాశారు.

—"వల్లూరు సంస్థానాస్థానకవి మతుకుమల్లి నరసింహశాస్త్రి (1816-1873) తల్లి జనకాంబ మతుకుమల్లివారి కుటుంబాన్ని ప్రశంసిస్తూ మంచెళ్లవారి కవితా విలాసానికి మతుకుమల్లివారే మూలకారకులని సూచించే పద్యం-

"అతి చమత్కృతి గలిగిన మతుకుమల్లి
వారు శబ్దము కొల్పిన కారణమున
వసుధ లోపల మంచెళ్లవారి యిల్లు
శారదాదేవి నాటకశాల యంద్రు
వాసుదేవుని కవితా విలాసమచట
మొలక బంగరు గజ్జెల మ్రోతగాదె!"

అని చాటువుగా వినిపిస్తున్నది. ఈ అంశాన్ని మాత్రం నా సంస్థానాల చరిత్ర పుట. 390 లో ఉటంకించాను. వాసుదేవకవి అహోబలున కిటీవలివాడు, పూర్వుడన టానికి ఆధారమేమీ లేదు."-

అంతేకాదు డాక్టర్ దొణప్పగారు తమ Ph. D. థీసిస్ అయిన "వైకృత పద స్వరూప నిరూపణము" అన్న సిద్ధాంతవ్యాసం 77, 78 పుటలలో మంచెళ్ల వాసుదేవ కవిని గురించి, వైకృత చంద్రిక గురించి ఈ క్రింది విధంగా కూడా పేర్కొన్నారు.

వాఙ్మయ మహోధ్యక్షుని

## మంచెళ్ళ వాసుదేవకవి-వైకృత చంద్రిక*

అష్టభాషా కవిత్వ సామ్రాజ్య పట్టభద్ర బిరుదాంకితుఁడు వాసుదేవకవి. తెలుఁగు నందలి తద్భవములకు మూల ప్రకృతులను జూపునెడల పరంపరాయుత పద్ధతిని పరిత్యజించి సంస్కృతముతోపాటు ప్రాకృతాదులనుసైతము ప్రదర్శించిన వారిలో ముఖ్యుఁడు వాసుదేవకవి. మీఁదు మిక్కిలి తద్భవ విభాగమును విపులముగా నిర్వహించిన వారిలో నితఁడే మొదటివాఁడు. సంస్కృత భవముతో ప్రాకృత శౌరసేనీ మాగధీపైశాచీ చూళికాపైశాచ్యపభ్రంశ భాషాభవములను వేర్వేరు ప్రకరణములలో ససూత్రముగా నిరూపించి వాసుదేవుఁడు తన బిరుదమును సార్థకపరచికొనినాడు.

'షడ్విధానా ప్రాకృతీచ శౌరసేనీచ మాగధీ
పైశాచీ చూళికాపైశాచ్యపభ్రంశ ఇతిక్రమాత్'
(26. శ్లో. అవతారికా. షడ్భాషా చంద్రికా)

అను లక్ష్మీధరుని (క్రీ.శ.1541-1565) అనుశాసనము వాసుదేవకవి ప్రక్రియా విభాగమును ప్రబలముగా ప్రభావితము చేసినట్లగుపడుచున్నది. లక్ష్మీధరుడు అచ్చముగా ఆంధ్రుఁడు. అందును కృష్ణాతీరవాసి, అష్టభాషాకవి పట్టభద్ర బిరుద విరాజితుఁడగు తిమ్మయసోమయాజి మనుమఁడు. లక్ష్మీధరుఁడు వాసుదేవకవి కించుక పూర్వుడు"-

ఇవి డాక్టర్ దోణప్పగారు తమ సిద్ధాంత గ్రంథంలో వ్రాసిన వాక్యాలు.

'గంధవహ' గ్రంథాన్ని దృష్టిలో పెట్టుకొని మంచెళ్ల వాసుదేవకవి అహోబలుని కంటే తరువాతివాడని డాక్టర్ దోణప్పగారు వంటివారు భావించారు. క్రీ.శ. 1320 ప్రాంతంలో భానుదత్తుడనే సంస్కృత పండితకవి నాయికా నాయక భేదలక్షణ గ్రంథమైన రసమంజరిని సంస్కృతంలో రచించాడు. ఈ రసమంజరిని దాదాపు మూడు వందల పద్యగద్యాలలో 'గంధవహము' అన్న పేరుతో తెలుగు లక్షణగ్రంథంగా మంచెళ్ల వాసుదేవకవి రచించాడు. ఈ గంధవహం క్రీ.శ. 1900, సంవత్సరంలో మొట్టమొదట ముద్రితమైనది. ఈ గంధవహాన్ని తెలుగులో రచించి తమ యిలవేల్పయిన మంగళగిరి శ్రీ నరసింహస్వామికి అంకితం యియ్యవలసిందని అమరావతి

* ఇది అముద్రితము. వాఙ్మయ మహోధ్యాయులు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి యొద్దనున్న తాళపత్ర ప్రతి ఈ పరిశీలనమున కాధారము. Ellis Dissertation on the Telugu Language, 1816. అను వ్యాసమున దీని సమీక్ష కొంతకలదు.

ప్రభువులలో ఒకడైన వాసిరెడ్డి రామలింగప్రభువు వాసుదేవకవిని కోరుతాడు. రామలింగ ప్రభువు కొలువు తీర్చి తనను ఆహ్వానించి సబహుమానంగా కోరిన విషయాన్ని వాసుదేవుడు గంధవహం అవతారికలో యీ క్రింది పద్యాలలో వర్ణించాడు.

అతులాంభోజ భవాంగనానఖముఖ వ్యాపృత్త పాళీమహో
న్నతవీణారవ మాధురీసధురీణ వ్యాహృతిం బ్రాగ్వినిం
దిత మందార మరంద బిందులహరీ నిష్యందనానంవ వం
దిత నందాత్మజు నన్నుఁ బిల్వఁ బనిచెన్ దీవ్యత్కటాక్షాకృతిన్.॥
పిల్వఁబనిచి యవార్యగాంభీర్యధైర్య
సరస మాధుర్య చాతుర్య సౌకుమార్య
గుణగణంబులు విలసిల్లఁ గూర్మితోడ
నలరిననుఁ జూచి యిట్లని యానతిచ్చె॥
లలిత చమత్క్రియా సరిదలంకృత కావ్య సముద్ర వీచికా
విలసిత కర్ణధారుఁడవు విశ్రుత చాటు కవిత్వ చాతురీ
జలరుహిణీ విలాసమను సంతతకృత్యముచే నహర్ముఖా
నిలుఁడవు వాసుదేవకవి! నీ నిపుణత్వము లెన్న శక్యమే॥
ఆదిని సంస్కృతాటవుల నంటిన మంజరిఁ దేటగాఁగ నా
మోదము గుప్పగా మదికి మూఢులెఱుంగరు తత్తదర్థముల్
పాదుకొనంగ నాంధ్రజన భాషను బండితపామరాళికా
మోదముగాఁగ గంధవహమున్ రచియింపుము నేర్పుపెంపునన్॥
శృంగార గతుల నీకృతి
మంగళగిరినాథు పేర మహిసంకితమై
సంగతి గొనవలయును మా
ముంగిటి కుల దైవమతఁడె మోదమిచ్చున్॥

ఈ పద్యాల వల్ల గంధవహకర్తయైన వాసుదేవకవి వాసిరెడ్డి రామలింగ ప్రభువు కాలంలో అంటే క్రీ.శ. 1758 ప్రాంతంలో వున్నాడని స్పష్టపడుతున్నది. గంధవహకృతి అంత్యంలో వున్న గద్య ఈ విధంగా వున్నది.

"ఇది సకల సుకవికుల మనోహర కవిత్వ వైభవ మంచెళ్ల రఘునాథాచార్య తనూభవ వాసుదేవకవి విరచితంబైన గంధవహంబను నలంకార గ్రంథంబునందు సర్వంబును సంపూర్ణము."

వాఙ్మయ మహోద్యమముని

ఆంధ్ర శబ్ద చింతామణి వాసుదేవ వృత్తి పరిచ్ఛేదాంత్య గద్యయిది—

"ఇత్యాంధ్ర శబ్ద చింతామణి వృత్తౌ
పంచమః క్రియా పరిచ్ఛేదః"—

వైకృత చంద్రిక సుబంత, తిఙంత, కృదంత విభాగాల అంత్యంలో వున్న గద్య యీ క్రింది విధంగావున్నది.

"ఇతి శ్రీ మద్బాల గోపాల కరుణా కటాక్ష సంప్రాప్తాష్టభాషాకవిత్వ సామ్రాజ్య పట్టభద్రేణ మంచెళ్ల వంశార్ణవ పూర్ణిమా చంద్రేణ హిమవన్నగ సేతు మధ్య మహీవలయ విరాజమాన నానావిధ విద్యా ప్రవీణ విద్వత్కవితా వితాన సంస్తూయ మాన పాండితీ మణినా వాసుదేవకవినా విరచితాయాం వైకృతచంద్రికాయాం సుబంత విభాగః సమాప్తః" ‡

## వాసుదేవకవి ఒక్కడేనా ?

'గంధవహ' కృతి అవతారిక పద్యాలలోనూ తుది గద్యలోనూ మాములుగా "సుకవికుల మనోహర కవిత్వ వైభవ" అని మాత్రమే వాసుదేవకవికి విశేషణం వున్నది. ఆంధ్రశబ్ద చింతామణికి వృత్తి రచించిన వాసుదేవుని పేరు పరిచ్ఛేదాంత గద్యలలో యెక్కడా లేదు. వైకృతచంద్రిక గద్యలో బాలగోపాలభక్తుడని, షడ్విధ ప్రాకృతాలలో సంస్కృతాంధ్రాలలో కవి చక్రవర్తియని, ఆసేతు హిమాచల పర్యంతం కీర్తి కలవాడని, విద్వత్కవులచేత ప్రశంసింపబడిన పండిత శ్రేష్ఠుడని వాసుదేవకవి తనకై తాను విశేషణాలు పెట్టుకున్నాడు. గంధవహం రచించిన వాసుదేవకవి రఘునాథాచార్య తనూభవుడని పేర్కొనబడడంవల్ల వైష్ణవుడన్న మాట యథార్థం. ఆంధ్రశబ్ద చింతామణి వృత్తి గద్యవల్ల వాసుదేవుని కుల మతాదులు తెలియవు. కాని వృత్తి గద్య చివర "శ్రీమతే రామానుజాయ నమః, శ్రీమతే వేదాంత దేశికాయనమః, శ్రీమతే హయగ్రీవాయనమః అని వుండడంవల్ల యీ వాసుదేవకవి వైష్ణవుడేనని కొందరు అనుకొనవచ్చును. వృత్తి గద్య తరువాత వున్న శ్రీమతే రామానుజాయనమః వంటివి ప్రతి వ్రాసిన వ్యక్తి యెవరైనా వ్రాయవచ్చును. వైష్ణవుడైనా వ్రాయవచ్చును. తన్మతాభిమాని యెవరైనా వ్రాయవచ్చును గదా! అందువల్ల గద్యలో బంధితాలై

---

‡తిఙంత విభాగాంత్యంలో — తిఙంతవిభాగః సమాప్తః॥—అనీ కృదంత విభాగాంత్యంలో — కృదంతవిభాగః సమాప్తః॥ — అనీ గద్య చివర తిఙంత—కృదంత పదాలమార్పు ఉంటుంది. ఈ విషయాన్ని పాఠకులు గుర్తించాలి.

లేకుండా వేరే వున్న యీ మాటను పట్టుకొని [illegible] డనుకొనడం—గ్రంథప్రారంభంలోనూ, లేఖల ప్రారంభంలోను "శ్రీ [illegible]" అని అలవాటుకొద్దీ మామూలుగా వ్రాసే దానిని చూచి తత్కర్త [illegible] భక్తుడనో, వైష్ణవుడనో అనుకొనడం వంటిదే కాగలదు. ఆంధ్రశబ్ద [illegible] వృత్తికి "వాసుదేవవృత్తి" అని మాత్రమే [illegible] పత్ర గ్రంథాలలో [illegible]. గంధవహ కర్తయైన వాసుదేవకవి కవితా పాండిత్య ప్రతిభకు, వైకృత [illegible] యైన వాసుదేవకవి బహుముఖ కవితా పాండిత్య ప్రతిభకు హస్తి [illegible] మున్నది. గంధవహాకృత్యంత్య గద్యను, వైకృత చంద్రికాంత్య గద్యను [illegible] చూస్తే బొత్తిగా పొంతన కుదరదు. ఒకడు సామాన్య ఆంధ్ర కవి [illegible] కనిపించగా మరొకడు సంస్కృతాంధ్ర ప్రాకృత-శౌరసేనీ-మాగ [illegible]-పైశా[illegible]-చూళికాపైశాచీ-అపభ్రంశనామక అష్టభాషా కవితా దురంధరుడుగా [illegible] పండితుడుగా కనిపిస్తాడు. గంధవహాకర్త రఘునాథచార్య [illegible] స్పష్టంగా చెప్పుకున్నాడు. వైకృత చంద్రికా కర్త గద్యలో రఘునాథ [illegible] తనూభవుడనని పేర్కొనలేదు. కాగా యీ యిద్దరు వాసుదేవకవులు [illegible] కారని, విభిన్నులని మనం భావించక తప్పదు. 'మంచెళ్ల' అన్నది గ్రామనామం [illegible] గ్రామనామం యింటిపేరుగా వున్నవారు ఏ వర్ణంలోనైనా వుండవచ్చును. ఒక్క శ్రీవైష్ణవులలోను నియోగులలోను మాత్రమే కాదు. తదితర బ్రాహ్మణేతర వర్ణాల వారిలో సైతం మంచెళ్ల వారుండి వుండవచ్చును. మంచెళ్ల వాసుదేవ [illegible] నామకులు యిద్దరున్నారా? ముగ్గురున్నారా? అన్నది కూడా కొంత సందేహాస్పదంగా వున్నది. "యుధిష్ఠర విజయం "అన్న సంస్కృత [illegible] వాసుదేవ కవికృతంగా యెనిమిదాశ్వాసాలతో మహత్తర ప్రౌఢ [illegible]గా వున్నది. అష్టభాషా కవిత్వ సామ్రాజ్య పట్టభద్రుడు, విద్వ[illegible] సంస్తూయమాన పాండితీమణి, వైకృత చంద్రికా కర్తయైన మంచెళ్ల [illegible] కవియే యీ సత్కృతికి కర్తఅయి వుండవచ్చును.

డాక్టర్ ఎస్. వి. జోగారావుగారు తమ 'ఆంధ్ర యక్షగాన [illegible] చరిత్రలో వాసుదేవకవి అనే శీర్షికతో 'పార్వతీ పరిణయము' అన్న [illegible] గురించి కొంత వ్రాస్తూ యీ క్రిందివిధంగా పేర్కొన్నారు.

పార్వతీ పరిణయము*

ఏతద్గ్రంథావతారికలో నొక సూత్రధార వచనమున శా[illegible] ప్రణీతమని యున్నది. కాని గ్రంథాంతమున శహాజీ పరముగానున్న [illegible]

* తం. స. మ. కే. నం. 515—553.

గీతమున "......శ్రీ వాసుదేవకవి వచస్సంతుష్టాయ మంగళ" మ్మని యుండటం బట్టియు, మహారాష్ట్రుడగు శహాజీ కృతులందెందును గన్పట్టని యాంధ్రకవిస్తుతి యిందుండుటనుబట్టియు వాసుదేవ నామధేయుడగు కవియొకడు శహాజీ యాస్థానమందుండి యుండుననియు నతడే దీనిని రచించి యుండుననియు నూహింపవచ్చును.

ఒక విశేషము :— బాలమనోరమాఖ్య సిద్ధాన్త కౌముదీ వ్యాఖ్య యొక్క చివర గద్యలో నిట్లున్నది.

"శ్రీ శహజి శరభోజి తుక్కోజి భోసల చోళ మహీమహేంద్రామాత్య ధురంధరస్య శ్రీమదానందరాయ విద్వత్సార్వభౌమస్య అధర్వణా .... లబ్ధ విద్యా వైశద్యేన ........ వాసుదేవ విదుషా విరచితాయాం సిద్ధాంత కౌముదీ వ్యాఖ్యాయాం బాలమనోరమాఖ్యాయాం ...."

అనగా బాలమనోరమకర్తయైన వాసుదేవ దీక్షితుని గురువైన యానంద రాయమఖిశహాజీ కాలమునుండి తంజావూరు మహారాష్ట్ర ప్రభువులయొద్ద మంత్రిగా నుండినట్లు తెలియుచున్నది. ఈ వాసుదేవ దీక్షితుడే గురువుగారి చలువ వలన శహాజీ యాస్థానమునకెక్కి యతని పేర నీ పార్వతీ పరిణయమును వెలయించెనేమో; అగుచో నీతడు శహాజీ రాజ్యకాలమగు క్రీ. శ. 1684-1712 ప్రాంతమున నుండెననవలెను. (ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర-ద్వితీయ భాగము. 302-303 పుటలు.

బాలమనోరమ వ్యాఖ్యా కర్తయైన వాసుదేవుడూ, వైకృత చంద్రికా కర్తయైన వాసుదేవుడూ ఒక్కరే నని చెప్పడానికి వీలులేదు. తంజావూరు రాజధానిగా పరిపాలించిన మహారాష్ట్ర వంశీకులలో శాహజీలు యిద్దరున్నారు. మాలోజీ పుత్రుడైన శాహజీ క్రీ. శ. 1640 ప్రాంతంలోను ఈ శాహజీ మనుమడైన శాహజీ క్రీ. శ. 1684 ప్రాంతంలోనూ తంజావూరును పరిపాలించారు. వీరి వివరాలను శృంగార పదములు* గ్రంథానికి నేను వ్రాసిన పీఠికలో (XLV–LIV పుటలు) చూడవచ్చును. వైకృత చంద్రికా కర్త తంజావూరు రాజులను ఆశ్రయించినవాడుకాడు. అటువంటి యే రాజాశ్రయమైనా వైకృత చంద్రికా కర్తకు వుండి వుంటే ఆ విషయాన్ని వైకృత చంద్రికాంత్య గద్యలో తప్పక వెల్లడించి వుండేవాడే. అయితే ఆసేతు హిమాచల పర్యంతం వున్న

* శృంగార పదములు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరి అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్ ప్రచురణ.

దేశంలో తాను వసిస్తున్న వ్యక్తిగా పేర్కొనడంవల్ల మొత్తంమీద తంజావూరు ప్రాంతంలోనూ, యితర ప్రాకృత భాషల నాదరిస్తున్న పరిసర రాష్ట్రాలలోనూ వైకృత చంద్రికా కర్త సంచరించి తన వివిధ కవితా విద్యా పాటవ ప్రదర్శనలతో పండిత మండలుల ప్రశంసలందుకుని వుంటాడని చెప్పవచ్చును. తంజావూరు రాజుల కాలంలో శాహజీ తరువాత 'శాహజీ రాజ విలాసం' 'సరస్వతీ కల్యాణం' వంటి యక్షగాన కృతులే కాక ఆంధ్ర శబ్దానుశాసనమనే తెలుగు వ్యాకరణాన్ని సంస్కృతంలో రచించి, "ఆంధ్ర పాణిని" అని బిరుదునందుకున్న నివర్తి శేషసుమతి (శేషాచలపతి) అష్ట భాషా కవితా కోవిదుడై కీర్తి వహించాడు. ఆ రోజుల్లో "అష్టభాషా కవిత్వంబు లమరుసుకృతు" లనేకమంది వుండే వారనడానికి మంచెళ్ల వాసుదేవకవితోపాటు నివర్తి శేషసుమతిని సైతం ఉదాహరణగా పేర్కొనవచ్చును.

ఆంధ్ర శబ్ద చింతామణికి వృత్తినీ, వైకృత చంద్రికనూ రచించిన మంచెళ్ల వాసుదేవకవి ఒక్కడేనని మనం భావించవచ్చును. గంధవహ కర్తయైన వాసుదేవ కవి, అహోబల పండితునకు తరువాత వాసిరెడ్డి రామలింగ ప్రభువు కాలంలో, అంటే క్రీ. శ. 1758 ప్రాంతంలో వున్నవాడు. ఆంధ్రశబ్ద చింతామణి వృత్తి, వైకృత చంద్రికల కర్త అయిన మంచెళ్ల వాసుదేవకవి, గంధవహ కర్తయేనన్న అభిప్రాయంలో వుండి, వ్యాకరణ కర్తయైన వాసుదేవుడు అహోబల పండితునికి తరువాతి వాడన్న అభిప్రాయాన్ని డాక్టర్ దోణప్పగారువంటి వారు పొరపాటున వెల్లడించారు.

వ్యాకరణ కర్తయైన వాసుదేవుడు అహోబల పండితునికి తరువాతివాడు మాత్రం కాదు. చాలా ప్రాచీనుడు. అహోబలపండితుడు తన అహోబల పండితీయంలో మంచెళ్ల వాసుదేవకవి పేరునుగాని, అతని ఆంధ్రశబ్ద చింతామణి వృత్తినిగాని యెక్కడా ప్రస్తావించలేదు. పెక్కు పాఠాంతరాలున్న ఆంధ్ర శబ్ద చింతామణి ప్రతులు అహోబల పండితునికి లభించినట్లు కనిపిస్తున్నది. ఏది వున్నా లేకపోయినా ఎలకూచి బాలసరస్వతి రచించిన "బాలసరస్వతీయము", మంచెళ్ల వాసుదేవకవి రచించిన "ఆంధ్ర శబ్ద చింతామణి సంస్కృత వృత్తి" తరువాత అప్పకవీయ రచనకై కాకునూరి అప్పకవి సాధించుకున్న ఆంధ్ర శబ్ద చింతామణి ప్రతి, యీ మూడూ అహోబల పండితునివద్ద తప్పక వుండి వుంటాయి. ఇవి మాత్రమేకాక, మరి కొన్ని ప్రతులు కూడా అహోబలునికి లభించి వుండవచ్చును. ఆంధ్రశబ్ద చింతామణి ప్రతులలో బహు పాఠ భేదాలున్నట్లు యీ క్రింది శ్లోకంలో అహోబలుడు స్పష్టపరచాడు.

వాఙ్మయ మహాధ్యాయుని

అప్పార్య పుస్తకారూఢ పాఠభేదాద్య దుత్థితం
మయా సంగృహ్యతే రూపం తదప్యా థర్వణోక్తితః॥

దీనివల్ల అహోబల పండితుని వద్ద ఆంధ్ర శబ్ద చింతామణి ప్రతులు అనేకం వున్నట్లు ధృఢపడుతున్నది. అయితే అహోబల పండితుడు వాసుదేవ వృత్తిని చూచాడో లేదో అని కొందరికి సందేహం కలుగవచ్చును. ఆంధ్ర శబ్ద చింతామణి సూత్రాలకు చాలా చిన్నచిన్న వృత్తులను రచించగా రూపొందిన గ్రంథం వాసుదేవవృత్తి. అహోబల పండితీయంతో దీనిని పోల్చిచూస్తే హస్తిమశకాంతర మున్నట్లు కనిపించగలదు. వాసుదేవవృత్తి మొత్తంపరిశీలిస్తే వ్యాకరణ విషయాల్లో అహోబల పండితీయంలోవలె చర్చనీయాంశాలతో వున్న ఘట్టాలేవీ మనకు కనిపించవు. అయితే ఒకచోట వాసుదేవకవి పొరపాటున పూరాలోచనలేక, తొందరపడి "స్థానివద్భావాదేశ" విషయమై చర్చించగా దీనిలో వున్న తప్పొప్పులను గుర్తించని అహోబల పండితుడు కూడా వాసుదేవుని పేరెత్తక పోయినా, అతడొనర్చిన చర్చను మాత్రం తెలివితేటలతో, ప్రతిభాపంతంగా అహోబల పండితీయంలో వివరంగా ప్రతిబింబించాడు. 'ప్రథమా వైభక్తిక మోర్బిందుశ్చమహాన్ పతిక్రియార్థేతు (షు)' అనే సూత్రానికి వాసుదేవకవి- ''పతిధాత్వగాభిధాయక శబ్దేపరేతు ప్రథమా వైభక్తికత్వేనవ్యవపాతస్య ముపర్ణకస్యలుగ్వాస్యాత్. లోపాభావే బిందుశ్చ. తస్య పూర్ణావా సంతోషపడి, సంతోషంపడి; సంతోషముపడి. సంతోషంపడి ఇత్యత్ర అనుస్వారస్యస్థానివద్భావేన పకారస్యవకారోన అనల్విధావితినిషేధాత్" అని వ్రాయగా దీన్ని చూచిన అహోబలుడు పై సూత్రానికి విపులమైన వ్యాఖ్య వ్రాస్తూ సంతోషంపడి అన్నప్పుడు స్థానివద్భావం గురించి యీ క్రింది విధంగా చర్చించాడు- "నను, సంతోషంపడీ త్యాదౌ తస్యాః ప్రథమాచజడపదానాం స్యాత్, ఇతి ప్రథమాత్వేసత్యనుస్వారస్యస్థానివత్త్వేన ముపర్ణకాంతత్వే 'గసడదవాస్యుః ప్రథమామాత్రాత్, ఇతిపకారస్య వకారస్స్యాత్-ప్రథమామాత్రాదితి మాత్రగ్రహణాల్లుక్యపిస్యాత్-నచవాచ్యంస్థానివద్భావ-ఆంధ్ర వ్యాకరణే నప్రసిద్ధ ఇతి-కుత్రచిత్సంస్కృతీయోఽపిప్రాణోప్యత్రచ్యుతో భవేత్, ఇత్యథర్వణోక్త్యాతత్ర సిద్ధేః-అన్యథా, గంగనుకాసె, ఇత్యత్రస్థాని వద్భావమంతరా దీర్ఘస్థాని కస్య హ్రస్వస్య సంస్కృతీయతానసిధ్యేదితిచేత్సత్యం-వకారవిధేరల్విధిత్వేన తదభావాన్నోక్త దోషప్రసక్తిః. 'స్థానివదాదేశోఽనల్విధౌ, ఇతిపాణినీయ సూత్రే అలివిధి రలావిధి రలోవిధి రలః పరస్యవిధి రితి చతురా వ్యాఖ్యాన మూరీకృతః-పదశాస్త్రపారీణై స్తస్తుతత్రైవ ద్రష్టవ్యమ్-నచలుక్యపిపకారస్యవకారః"—'సంతోషముపడి' అన్నప్పుడు 'ము' పర్ణకానికి పూర్ణబిందువు వస్తే ఆ బిందువుకు స్థానివద్భావం వస్తుందని తద్రూపంగా 'సంతోషంపడి' అన్నప్పుడు అనుస్వారానికి ప్రథమాత్వం వచ్చి ప్రథమమీది 'క చ ట

తప' లకు 'గసడదవ' లు వస్తాయని ఆశంకలు తీసి సమాధానం చెప్పిన యీ అహోబల పండితుని చర్చ గురించి ప్రశంసా పూర్వకంగా శ్రీ వేంపరాల సూర్య నారాయణ శాస్త్రిగారు యీ క్రింది విధంగా వ్రాశారు.

"ప్రథమా వైభక్తిక యోః" అను సూత్ర వ్యాఖ్యయందు 'సంతసంపడిరి' అను నుదాహరణమున 'ము' వర్ణకమున కాదిష్టమైన బిందువు ము వర్ణము వంటిదే యగును. (స్థానివదాదేశః) కావున 'గసడదవా దేశము వచ్చి "సంతసంవడిరి" అని కావలదా? అని శంకించి-'అనల్విధౌ' అను నిషేధముచే "బిందువు" అల్విధి యగుటచే వకారము రానేరదని సమాధానము చెప్పుట యెంతయు రమణీయము, శాస్త్రీయము"-(అహోబల పండితీయము-పీఠిక-13వ, పుట-ఆంధ్ర రచయితల సంఘము ప్రచురణ.)

కాని అసలిక్కడ యీ చర్చకు అవకాశమే లేదు. "సంతోషముపడి" ఇత్యాదులలో వున్న ప్రథమా విభక్తి సహజ ప్రథమా విభక్తి కాదు. "తస్యాః ప్రథమాచ జడపదానాంస్యాత్" అన్న సూత్రం ప్రకారం ద్వితీయా విభక్తికి ఆదేశంగా ప్రథమా విభక్తి వస్తుంది. స్థానివద్భావశంక వచ్చే అవకాశమే వుండి వుంటే ద్వితీయ ప్రథమగా మారిన సందర్భంలోనే వస్తుంది. అంటే ద్వితీయకాదేశమైన ప్రథమ స్థానివద్భావంతో ద్వితీయవంటిదే అవుతుందన్నమాట. అయినప్పుడు "ప్రథమా వైభక్తిక మోర్బిందుశ్చ పతిక్రియార్థేషు" అన్న సూత్రంచేత ము వర్ణకానికి అసలు బిందువు వచ్చే అవకాశమే వుండదు. మీదు మిక్కిలి సంతోషము + పడి అన్నప్పుడు సంతోషము "ము" వర్ణకానికి స్థానివద్భావంతో ద్వితీయత్వం వచ్చి ద్రుతం మీది పరుషాలకు వచ్చే సరళాదేశాది కార్యాలు జరిగే అవకాశం వస్తుంది. అప్పుడైనా "అనల్విధౌ" సూత్రంచేత స్థానివద్భావాన్ని నిషేధించక తప్పదు. 'సంతోషముపడి' అన్నప్పుడున్న ప్రథమ ద్వితీయకాదేశమైన ప్రథమగాని సహజ ప్రథమకాదని మొదట వాసుదేవకవి గుర్తించనట్లే అహోబల పండితుడు కూడా గుర్తించలేదు. నేలవిడిచిన సామువలె పప్పులో కాలు వేసి అహోబలుడు ప్రతిభావంతమైన మహాభాష్య రచనా పద్ధతిలో చర్చచేశాననుకున్నాడు. దీనినిబట్టి వాసుదేవ వృత్తిని అహోబల పండితుడు చూచాడనీ-చూచి సదసద్వివేకం లేకుండా వాసుదేవుని పేరెత్తక పోయినా-గుడ్డెద్దుచేలోపడినట్లు అతణ్ని అనుసరించాడనీ చెప్పక తప్పదు.

అహోబలపండితీయమును చదివి దానిననుసరించి మంచెళ్ల వాసుదేవకవి వాసుదేవ వృత్తిని సంగ్రహించి వ్రాశాడని కొందరంటారు. ఇందులో వాస్తవం లేదు. ఒక పెద్ద భాష్యం వంటి వివరణ గ్రంథాన్ని చూచి టిప్పటికవలె అతిసంగ్రహ

వాఙ్మయ మహోద్యతుని

గ్రంథంగా, అప్రసిద్ధునివలె వాసుదేవ కవి యీ వృత్తిని రచించవలసిన అవసరం లేదు. సంస్కృతాంధ్రాలలోనే కాక షడ్విధ ప్రాకృతాలలో సైతం కవితల్లజుడని, మహాపండితుడని ప్రశంసలందుకున్న వాసుదేవ కవి అహోబలపండితీయమును అతి సంగ్రహంగా కాపీకొట్టి వాసుదేవ వృత్తిని రచించి వుంటాడనడం అసమంజసమైన, అవాస్తవికమైన విషయం. మొట్టమొదట ఆంధ్రశబ్ద చింతామణికి అతి సంగ్రహ రూపమైన యీ వృత్తిని వాసుదేవుడు రచియించగా దీనిని దృష్టిలో పెట్టుకొని అహోబలపండితుడు మహాభాష్యంవంటి భాష్యం అనిపించుకోగల వ్యాఖ్యను రచించివుంటాడనడం సముచితంగా వుంటుంది. అహోబలపండితీయమును వాసుదేవకవి వాసుదేవ వృత్తిగా సంగ్రహించి వుంటాడేమోనని కొందరిలో సందేహం కలగడానికి కారణం అతని కవితా పాండితీ ప్రతిభలపట్ల తక్కువ అంచనా వేయడం మాత్రంకాదు. అహోబలునికి తరువాతి వాడే వాసుదేవ కవి అన్న అభిప్రాయంలో వున్నందువల్ల, గంధవహకర్త యైన వాసుదేవుడు వేరు అనే అభిప్రాయం లేనందువల్ల, తప్పనిసరిగా వాసుదేవ వృత్తి రచన అహోబలపండితీయ సంగ్రహీకరణకృతియే మో అన్న సందేహం కలగడానికి అవకాశం లభించింది. గంధవహకర్త యైన వాసుదేవకవి అహోబల పండితునికి తరువాతి వాడని, ఆంధ్రశబ్ద చింతామణి వృత్తిని, వైకృత చంద్రికను రచించిన వాసుదేవ కవి అహోబలునికి బాగా ప్రాచీనుడని మనం గ్రహించవలసి వున్నది. కాగా వాసుదేవ వృత్తి అహోబల పండితీయ రచనకు బీజ భూతమైన మూలగ్రంథమని మనం గ్రహించవలసి వున్నది.

ఆంధ్ర శబ్దచింతామణి రచనాపద్ధతులకు సిద్ధాంతాలకు వైకృతచంద్రికా రచనాపద్ధతులకు సిద్ధాంతాలకు పెక్కు సందర్భాలలో భిన్నత్వం మనకు గోచరం కాగలదు. ఆంధ్రశబ్ద చింతామణి సూత్రాల కనుగుణంగా వాసుదేవకవి యువకుడుగా ఉన్నప్పుడే వృత్తిని రచించి - ఆంధ్రశబ్ద చింతామణికంటే బృహత్తరమూ విజ్ఞానప్రదమూ స్వతంత్ర భావపరిపూర్ణమూ అయిన వైకృతచంద్రికా మూలసూత్రాలకు - ఆ సూత్రాలకు తద్రచనకు సిద్ధాంత పద్ధతులకు అనుగుణమైన విపుల వృత్తిని యీ వైకృతచంద్రికా రూపంలో పరిణతపు బుద్ధితో వాసుదేవ కవి రచించివుండవచ్చును. వైకృత చంద్రికారచనా కాలానికి వాసుదేవకవి విపులమైన విమలయశస్సు సంపాదించినట్లు అతని వైకృతచంద్రికా విభాగాంత్య గద్యలే చెప్పక చెప్పుతున్నాయిగదా! ఆంధ్రశబ్ద చింతామణి సూత్రాలకంటే వైకృత చంద్రికా మూలసూత్రాలు అత్యధిక విషయాన్వితాలు విశిష్ట విశేష విషయాన్వితాలనడం తిరుగులేని సత్యం. విభిన్న రచనా పద్ధతులు సిద్ధాంతాలు కొంతఉన్నంతమాత్రంచేత ఒకేరచయిత వాటికి వృత్తి వ్రాయకూడదని యెక్కడ

ఉన్నది? కాగా ఆంధ్రశబ్ద చింతామణి వృత్తిని - వైకృతచంద్రికా వృత్తిని వాసుదేవకవి ఒక్కడే రచించి ఉంటాడని మనం భావించవచ్చును.

వ్యాకరణకర్తయైన యీ మంచెళ్ల వాసుదేవ కవి డాక్టర్ తూమాటి దోణప్పగారు తమ Ph.D. థీసీస్ అయిన "వైకృత పదస్వరూప నిరూపణము" అన్న సిద్ధాంత గ్రంథంలో పేర్కొన్నట్లు క్రీ. శ. 1541-1565 ప్రాంతంలో "షడ్భాషా చంద్రికా" అనే గ్రంథాన్ని రచించిన లక్ష్మీధరునికి ఇంచుక తరువాతి వాడు. కృష్ణాతీరవాసియై, అష్టభాషా కవి పట్టభద్ర బిరుద విరాజితుడైన తిమ్మయ సోమయాజికి యీ లక్ష్మీధరుడు మనుమడు. లక్ష్మీధరుని షడ్భాషా చంద్రికనూ, మంచెళ్ల వాసుదేవ కవి వైకృత చంద్రికనూ సరిపోల్చిచూస్తే ప్రాకృత-శౌరసేనీ-మాగధీ-పైశాచీ-చూళికా-అపభ్రంశ-ప్రాకృత పదస్వరూప సాధుత్వాలకు కొంత పోలికవున్నట్లు కనిపిస్తుంది. కాని యీ షడ్విధప్రాకృతభవ, సంస్కృత భవ పదాలను వైకృత చంద్రికా సూత్రకర్తయే మొదట సాధించాడు. సూత్రకర్త సాధించిన పదాలకు వివరణ రూపంగా ప్రకృతి, వికృతి వివేచనం వాసుదేవుడు చేశాడే గాని తనకై తాను వాసుదేవుడు స్వతంత్రించి చేసిందేమీలేదు. వివిధ ప్రాకృత పదాలను తద్భవ పదాలను ప్రదర్శించడంలో మాత్రం వాసుదేవకవి అసాధారణమైన పాండితీ ప్రతిభలను చూపించాడనడంలో సందేహంలేదు.

ఏదియేమైనా ఆంధ్ర వ్యాకరణచరిత్రలోనేకాదు, ఆంధ్ర వాఙ్మయ చరిత్రలోనే-భాషా చరిత్రలోనే అపూర్వమైన ఒకానొక విశిష్టమై, అసాధారణ మైన ప్రత్యేక స్థానాన్ని యీ వైకృత చంద్రిక పొందగలదనడంలో సందేహం లేదు.

## వైకృత చంద్రిక:
## సంపాదన - ముద్రణ

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరులోని ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠంలో నేను విద్యార్థి దశలోవున్నప్పటినుంచీ (1945-50) అనేక అముద్రిత తాళపత్ర గ్రంథాల సేకరణ ప్రారంభించాను. పెక్కు వ్యయ ప్రయాసలకోర్చి అనేక అమూల్య గ్రంథాలను సేకరించాను. దాదాపు యిరవై సంవత్సరాలపాటు నావద్ద సురక్షితంగా వుంచిన 173 తాళపత్ర గ్రంథాలను 1965లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ వారికి దానంచేశాను. ఆ తరువాత సాహిత్య ఎకాడమీవారు యీ గ్రంథాలనన్నింటినీ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్టుసు

వాఙ్మయ మహోద్యానుని

లైబ్రరి అండ్ రిసర్చ్ ఇనిస్టిట్యూట్‌కు పంపించారు. సాహిత్య ఎకాడమీ వారికి గ్రంథాలను యిస్తున్నప్పుడు - నావద్దవున్న అపూర్వ అసాధారణ వ్యాకరణ గ్రంథమైన "వైకృత చంద్రిక" తాళపత్ర ప్రతిని మాత్రం నేనే నా జీవితకాలంలో ఎడిట్‌చేసి పీఠికవ్రాసి ముద్రించి ప్రకటించి తీరాలన్న ప్రగాఢ కాంక్షతో నావద్దనే వుంచుకున్నాను. 1971 జులై 6వ, తేదీన అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారి గౌరవాభిమానాలు కారణంగా ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరి అండ్ రిసర్చ్ ఇనిస్టిట్యూట్‌కు నన్ను "జాయింట్ డైరెక్టర్"గా నియమించారు. ఆ పదవీ బాధ్యతలు నేను స్వీకరించిన తరువాత చూడగా మంచెళ్ల వాసుదేవకవికృతమైన వైకృత చంద్రిక సంజ్ఞా ప్రకరణం మొదలు, తద్ధితాదేశ ప్రకరణాంతం వరకూ (ముద్రిత ప్రతిలో 102వ, పుటవరకు) ప్రథమ భాగంగా ముద్రించి ప్రకటించడానికై శ్రీ ఎన్.సి.ఎస్. వేంకటాచార్యులు, డాక్టర్ అమరేశం రాజేశ్వర శర్మగార్లు ఉభయులూ ఎడిట్‌చేసి తెలుగు వ్యాఖ్య వ్రాయగా, అప్పటి స్టేట్ ఆర్కైవ్స్ డైరెక్టర్, శ్రీ పి. సీతాపతి, I.A.S. గారు ప్రెస్‌కు పంపించి ఉన్నారు. ముద్రణకు సిద్ధమైవున్న వైకృత చంద్రిక సగం గ్రంథాన్ని చూచి నేను ఆశ్చర్యపడ్డాను. తిరుపతి శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ రిసర్చ్ ఇనిస్టిట్యూట్‌లోవున్న శిథిలతాళపత్రప్రతి-ఒక కాగితపు వ్రాతప్రతి ఆధారంగానూ, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తులోవున్న ఒక కాగితపు వ్రాత ప్రతిని చూచి శ్రీ రాజేశ్వరశర్మగారు వ్రాసుకున్న ప్రతి ఆధారంగానూ యీ వైకృత చంద్రికా భాగం ఎడిట్‌చేయబడింది. ముద్రణకు పంపబడిన యీ గ్రంథాన్ని నావద్దనున్న తాళపత్ర గ్రంథంతో పోల్చిచూడగా ఎడిట్ చేసివ్రాయబడిన గ్రంథంలో అనేక పుటల గ్రంథభాగం లేదని గ్రహించాను. అంతేకాదు. ముద్రణలో సుమారు రెండు వందల పుటలకుపైగా కాగల ఒక ఉత్తమ వ్యాకరణ గ్రంథాన్ని రెండు సంపుటాలుగా ప్రకటించడంలో ఔచిత్యంలేదని కూడానేను భావించాను. ఈ వైకృత చంద్రిక రెండు సంపుటాలు గానే ప్రచురితమైతే తొలిసంపుటం లభించిన వారికి రెండవ సంపుటం లభించక పోవచ్చును. రెండవ సంపుటం కొనుక్కున్న వారికి కొన్ని సందర్భాలలో మొదటి సంపుటం దొరకడం కష్టం కావచ్చును. కాగా కవి పండిత పరిశోధకులకు వైకృత చంద్రిక సమగ్రప్రతి ఒకే సంపుటంగా ఉపలభ్యమానమవడం అత్యంత ఉత్తమ కార్య మని నేను భావించాను. ఈ విషయం శ్రీ వేంకటాచార్యులు, శ్రీ రాజేశ్వరశర్మ గార్లకు తెలిపి నా వద్ద వున్న తాళపత్రప్రతితో వైకృత చంద్రిక వ్రాతప్రతిని పోల్చి చూచి సరిచేయవలసి వున్నదని తెలియజేశాను. కాగా, ముద్రణనిమిత్తమై

ఆంధ్రప్రదేశ్ టెక్స్టుబుక్ ప్రెస్‌కు పంపబడిన వైకృత చంద్రిక ప్రథమ సంపుట వ్రాతప్రతిని తిరిగి వెనుకకు తెప్పించి పునస్సమీక్షచేసి సరియైన గ్రంథాన్ని రూపొందించడానికి పూనుకొన్నాను. శ్రీ వేంకటాచార్యులు గారు తెలుగు ఎకాడమీలో ప్రింటింగ్ మేనేజర్‌గా పనిచేస్తున్నందువల్ల ఆఫీసు పనివేళల్లో యీ గ్రంథాన్ని పరిష్కరించడం సాధ్యంకాలేదు. ప్రతిరోజూ రాత్రి 7 గంటలు మొదలు 11 గంటల వరకూ శ్రీ వేంకటాచార్యులుగారూ నేనూ మా యింటిలో కలిసి కూర్చుని నావద్ద వున్న వైకృత చంద్రిక తాళపత్రప్రతితో-అప్పటికి పరిష్కరింపబడి వున్న వ్రాత ప్రతిని సరిపోల్చిచూచాము. ప్రథమ సంపుటంగా తయారైన (ముద్రిత గ్రంథంలో 102 వ, పుట వరకు) గ్రంథంలో దాదాపు యిరువై పుటల విషయాన్ని నా వద్ద నున్న తాళపత్రప్రతిలో నుంచి అధికంగా చేర్చ వలసి వచ్చినది. మరికొన్ని సందర్భాలలో మిగతా ప్రతులలో వున్న పాఠాలకంటే నా వద్ద వున్న తాళపత్రప్రతిలో మేలు పాఠాలు లభించాయి. శ్రీ వేంకటాచార్యులు, శ్రీ రాజేశ్వర శర్మగారు ఎడిట్ చేసిన ప్రథమ సంపుట భాగాన్ని నేను శ్రీ వేంకటాచార్యులుగారు పునఃపరిష్కరించిన తరువాత మిగిలినభాగమైన తద్భవ ప్రకరణం మొదలు కృదన్తప్రకరణం తుదివరకూ (103వ పుట మొదలు 207వ పుట వరకు) అంటే గ్రంథాంత్యం వరకూ శ్రీ వేంకటాచార్యులుగారూ, నేనూ కూర్చొని పరిష్కరించుకుంటూ ప్రతివ్రాశాము. అనంతరం శ్రీ వేంకటాచార్యులుగారు యీ రెండవ భాగానికి తెలుగు వ్యాఖ్య రచించారు. శ్రీ రాజేశ్వరశర్మ గారికి అకాల పుత్రవియోగం కలిగినందువల్ల యేర్పడిన విషాద పరిస్థితిలో శ్రీ శర్మగారి పాత్ర లేకుండా, నేను, శ్రీ వేంకటాచార్యులుగారు మాత్రమే యీ గ్రంథాన్ని పునఃపరిష్కరించి ఎడిట్ చేయవలసి వచ్చినది. అక్కడక్కడా గ్రంథపాఠాలు, సందేహాలు వచ్చినపుడు ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో వున్న శ్రీ వాసిరెడ్డి శ్రీ కృష్ణస్మారక గ్రంథాలయంలోని ప్రాచ్యలిఖిత పుస్తక విభాగంలో వున్న వైకృత చంద్రిక రెండు కాగితపువ్రాతప్రతులను సంప్రదించాము.* అవసరమైనచోట, యే సందర్భంలో కావాలంటే ఆ సందర్భంలో ఆ వ్రాత ప్రతులను చూచి అవసరమైన విషయాలను డాక్టర్ లకంసాని చక్రధరరావు, M.A.,Ph.d.(లెక్చరర్-తెలుగు డిపార్టుమెంట్-ఆంధ్ర యూనివర్సిటీ-విశాఖపట్నం) వ్రాసిపంపారు. ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయంలోని రెండు కాగితపు వ్రాత ప్రతులు యీ వైకృత చంద్రిక సంపాదనలో పరిష్కరణలో యెంతో ఉపయోగపడ్డాయి. ఈ సందర్భంలో యెంతో శ్రమకోర్చి తమ అమూల్యమైన కాలాన్ని వెచ్చించి మాకు సహాయపడిన డాక్టర్ చక్రధరరావు గారికి మా హార్దిక కృతజ్ఞత...

* S. 1145. S. 1263 నెంబర్లతో రెండు కాగితపు వ్రాతప్రతులు ఆంధ్ర విశ్వకళాపరిషత్ గ్రంథాలయంలో వున్నాయి.

వాఙ్మయ మహోద్యమంలో

వందనాలు. ఈ వైకృత చంద్రిక సంపాదనలో ఉపలభ్యమై ఉపయోగపడిన లిఖిత గ్రంథాలన్నింటిలోకీ నా వద్ద వున్న తాళపత్రప్రతి అన్ని విధాలా చాలా మేలు ప్రతి. గ్రంథంలో ఫుట్‌నోట్‌లలో నావద్దఉన్న తాళపత్రప్రతి పాఠాలుగా చూపబడినవి ఊరికే చూపబడ్డాయే గాని గ్రంథంలోకల మేలు భాగాలు పాఠాలు అనేకం అసలు మూల గ్రంథంలోనే చేరి ఉండడంవల్ల నావద్ద వున్న తాళపత్రప్రతి పాఠాలుగా ప్రత్యేకంగా చూపించడానికి వీలులేకపోయింది-ఈ గ్రంథముద్రణా నంతరం కళాప్రపూర్ణ డాక్టర్ కొండవీటి వేంకటకవి (ఆంధ్రోపన్యాసకులు-శ్రీ భావనారాయణ స్వామి సంస్కృత కళాశాల-పొన్నూరు-గుంటూరుజిల్లా) గారివద్ద ఒక కాగితపు వ్రాతప్రతి వున్నదనితెలిసి 1974 ఏప్రిల్ నెలలో నేను పొన్నూరు వెళ్లాను. శ్రీ వేంకటకవిగారి వద్ద నున్న వ్రాతప్రతిని ముద్రితమైన వైకృత చంద్రికతో పోల్చిచూశాను. ముఖ్యంగా ముద్రిత ప్రతిలో గ్రంథపాఠాలున్న చోట్ల పరిశీలించి చూడగా, ఆ వ్రాతప్రతిలో సైతం ఆయా ప్రదేశాలలో గ్రంథ పాఠాలు యథాతథంగానే ఉన్నాయి. వైకృత చంద్రికకు,'ఆంధ్ర సిద్ధాంత కౌముదీ' అని నామాంతరమున్నట్లు శ్రీ వేంకటకవిగారి వద్ద నున్న వ్రాత ప్రతివల్ల ఒక నూతన విషయం వెల్లడైనది.

## తెలుగు వృత్తి

మొత్తం మీద యీ వైకృత చంద్రికా పరిష్కరణలో ఆమూలాగ్రం నా పర్యవేక్షణ వున్నా శ్రీ ఎన్.సి.ఎస్. వేంకటాచార్యులు గారు అత్యధికంగా పరిశ్రమించారని చెప్పడానికి నేనెంతో సంతోషపడుతున్నాను. పరిష్కరణమంతా ఒక యెత్తుకాగా-వాసుదేవకవి-వైకృత చంద్రిక పేరు మీద వ్రాసిన సంస్కృత వృత్తికి తెలుగు వృత్తిని వ్రాయడం మరొక యెత్తు. తెలుగు వృత్తి రచనలో వాసుదేవుడు రచించిన సంస్కృత వృత్తిని జీర్ణం చేసుకొని మరీ భావ వ్యక్తీకరణ చేయడంతో సంస్కృతం రాని అధ్యయనపరులకుగాని, సంస్కృతం నేర్చుకునే అధ్యయన పరులకుగాని యీ తెలుగు వృత్తి యెంతైనా ఉపయోగపడుతుందనడంలో సందేహం లేదు. అయితే సకృత్తుగా కొన్నిచోట్ల తెలుగు వృత్తిలో పొరపాట్లు దొర్లాయి.

"అనుక్తం సంస్కృతవత్"-"సంజ్ఞా ప్రాకృతవచ్చ-(సంజ్ఞ 2-3. సూత్రాలు 5 వ పుట). ఈ సందర్భంలో వృత్తికర్త సవ్యంగానే వృత్తి వ్రాశాడు. కొన్ని సందర్భాలలో పైసూత్రాలలోనుంచి తరువాతి సూత్రంలోకి కొన్ని పదాలను అనువృత్తిచేసుకోవాలని చెపుతూ "సూత్రేష్వదృష్టం పదం సూత్రాంతరాదనువర్తనీయం సర్వత్ర" అని వ్రాశాడు. అనేక సందర్భాలలో అనువృత్తి అయ్యే పదా

అను దృష్టిలో పెట్టుకుని ఈ వాక్యాన్ని వృత్తికారుడు రచించాడు. "ప్రాకృతి వచ్చ" అన్నప్పుడు వున్న 'చ' కారం వల్లనే సంస్కృతంలో వలె కూడా సంజ్ఞలు వుంటాయని అర్థం చెప్పుకోనక తప్పదు. ఈ అర్థదృష్టితోనే 'చ' కారాన్ని సార్థకంగా ప్రయోగించాడు. 'చ' కారమే 'సంస్కృతవత్' అన్న అర్థాన్ని ఇస్తుండగా తెలుగు వృత్తిలో "ప్రకృత సూత్రములోనికి పైసూత్రము నుండి సంస్కృతవత్ అను పదము ననువర్తింపజేసికొని యర్థము చెప్పుకొనవలయును" అని వ్రాయడం మూలానుగుణంకాదు. (చూడు. 6 పుట).

"నా సంస్కృనాత్సంస్కృతస్య" (సంధి-34. సూ-21 పుట) అన్న సూత్ర వృత్తిలో 'సంస్కృతాద్భవంత్యేవ" అని సంస్కృతంలో ఉండగా సంస్కృత సంబంధి పరుషములకు గసడదవలు రావచ్చును, అని తెలుగు వృత్తిలో వ్రాయడం జరిగింది. 'రావచ్చును' అనడానికి మారుగా 'వచ్చును' అని ఈ సందర్భంలో చదువుకోన వలసి వున్నది.

"ద్వినులోవ్వారనచి పూర్వస్యలుగ్వా" (సంధి - 44 సూ. 23 పుట) అనే సూత్రంలో హల్లుగాని, అవసానంగాని పరమవుతున్నప్పుడు, పదాంతాలయిన ద్విత్వ, న్ను, ల్లు వర్ణాలలో పూర్వ హల్లుకు లోపం వస్తుంది అని సూత్రకారుడు చెప్పాడు. కాగా చన్నుగవ, కల్లు కుండ వంటి పదాలు — చనుగవ, కలుకుండ వంటివిగా సిద్ధిస్తాయి 'అనచి' అని అచ్చు పరమవుతుంటే ఈ కార్యం జరుగదని విస్పష్టంగా చెప్పాడు. కాగా కన్నదరె, చన్నిచ్చె, ఇల్లమ్మె, పొల్లాయె-వంటి చోట్ల ద్విత్వా నికి లోపంరాదు. 'అనచి' శబ్ద ప్రయోగంతో అసాధు రూపాలను సూత్ర కారుడు నిష్కర్షగా తిరస్కరించగా వృత్తికర్త పేర్కొనని నూతన విషయాన్ని —"అనచి" అని సూత్రమునందు, దానికే ప్రాధాన్యమిచ్చుటచేత సమాసము కాక పోయిననూ, హలాదియగు వ్యస్తపదము పరముగా నున్నపుడు కూడా నీ లోపము వికల్పముగా వచ్చునని గ్రహింపవలెను"—అని తెలుగు వృత్తిలో అధికంగా వ్రాయడం జరిగింది. "అనజ్గ్రహణాత్పదాంతేఽపి" అన్నదానిలో ఇంత విపులార్థం లేదు కదా ! సూత్రంలో "పూర్వస్యలుగ్వా" అని ద్విత్వంలో తొలి హల్లుకే లోపం చెప్పాడు. ఆంధ్ర శబ్దచింతామణిలోను, బాలవ్యాకరణంవంటి గ్రంథాలలోను ద్విత్వానికి అంటే ద్విరుక్తమయ్యే రెండవ హల్లుకు లోపం చెప్పాడు. కాగా ద్విత్వంలోవున్న స్వరం ద్విత్వ హల్లోపం జరిగిన తరువాత పూర్వ హల్లుతో చేరు తుంది. ఈ లోప వ్యవస్థలో స్వరస్థితి చలనాన్ని మనం గుర్తించక తప్పదు. వైకృత చంద్రికా సూత్రకర్త దృష్టిలో పూర్వ హల్లు అంటే ద్విత్వంలో తొలి హల్లు లోపిస్తుంది. కాబట్టి స్వరస్థితికి చలనంలేదు.

వాఙ్మయ మహాధ్యక్షుని

"ఓహేః" (అజంత-9 సూ-27 పుట) అనే సూత్రానికి వృత్తి వ్రాస్తూ "ప్రత్యయ లోపే ప్రత్యయలక్షణమిత్యుత్వంన. నలుమత్యాంగస్యేతి నిషేధాత్' అని వృత్తి కర్త రచించాడు. దీనికి తెలుగువృత్తిలో యధాతధానువాదంగా తెలుగు సాంప్రదాయానికి భిన్నంగా వాక్యాలు వ్యత్యస్తంగా రచించబడినాయి. —"ప్రత్యయ లోపము కలిగినప్పుడు ఆ లోపించిన ప్రత్యయమునకు సంబంధించిన లక్షణము నిలిచి యుండునను పరిభాషనుబట్టి డుజ్ ప్రత్యయ సంబంధియగు ఉకారము నిలిచి యుండుననుకొనఁదగదు. లుమంతమైన లోప విధి కలిగినప్పుడంగమునకు ప్రత్యయ లక్షణము నిలిచియుండదని నిషేధమున్నది గనుక" — అని మక్కీకి మక్కీగా తెలుగు అనువాదం చేయబడింది. ఈ వాక్యాలనే ముందు వెనకలుగా తారుమారుచేసి ఏక వాక్యతను సాధించివుంటే తెలుగు వాక్య సాంప్రదాయాన్ని ప్రతిబింబించి వుండేది. పాఠకుడు వెనుక ముందులు చూచుకొని తికమకపడకుండా చదువుకొనడానికి వీలుగా వుండేది—"లుమంతమైన లోపవిధి కలిగినప్పుడంగమునకు ప్రత్యయ లక్షణము నిలిచియుండదని నిషేధమున్నది గనుక ప్రత్యయ లోపం కలిగినప్పుడు ఆ లోపించిన ప్రత్యయమునకు సంబంధించిన లక్షణము నిలిచియుండునను పరిభాషనుబట్టి డుజ్ ప్రత్యయ సంబంధియగు 'ఉ' కారము నిలిచియుండు ననుకొనదగదు", అని అనువాద వాక్యంవుంటే బాగుండేది.

ఇదేవిధంగా "దేర్హ్రోఽదేశ్యైకపక్షే" అనే సూత్రానికి "దీర్ఘస్యహ్రస్వ స్స్యాత్ సుపి పరే. సోమపుఁడు, సోమపులు—ఇత్యాది రామవత్" అని వృత్తికర్త వ్రాయగా తెలుగులో "తుది దీర్ఘము సుప్ ప్రత్యయము పరమయినప్పుడు హ్రస్వ మగును.......... .. .. రామశబ్దమువలె" (39 పుట), అని వ్రాయడానికి మారుగా "సు ప్రత్యయము పరమయినపుడు తుది దీర్ఘము హ్రస్వమగును. అనంతరము రామశబ్దమునకువలె రూపములగును. సోమపుఁడు—సోమపులు" అని వ్రాస్తే సహజమయిన తెలుగుగా విస్పష్టంగా వుండేది. "రామశబ్దము వలె" అని వాక్యాంతంలో పేర్కొనడం అస్పష్ట వాక్యంగా అసహజంగా కనిపిస్తున్నది.

భ్రమ ప్రమాదాలకు లోనవడంవల్ల-కన్ను చెదరడంవల్ల యిటువంటి పొరపాట్లు తెలుగు వృత్తిలో సకృత్తుగా దొర్లి వుండవచ్చును. ఏమైనా తెలుగు వృత్తి రచన సంస్కృత వృత్తి రచనకు దీటువచ్చేట్లుగా అత్యుత్తమంగా సులభ బోధకంగా అవతరించిందనడంలో సందేహంలేదు. అందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పక్షాన, తెలుగు భాషా సాహిత్యవేత్తల పక్షాన యీ తెలుగు వృత్తి కర్తలను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.

పరిశోధనారచన

# మన్నించండి

వైకృత చంద్రికలో రెండవభాగం తిఙంత విభాగం, మూడవభాగం కృదంత ప్రకరణం అయినప్పటికీ సంజ్ఞాది ప్రకరణాలను పేర్కొన్నట్లుగా తిఙంత ప్రకరణం, కృదంత ప్రకరణం అని పేర్కొనవలసి వున్నది. గ్రంథంలో రెండవ భాగానికి తిఙంత విభాగమని పేరు పెట్టినా ఆ విభాగం అన్ని పుటలలోనూ 'తిఙంత విభాగః' అని వున్న చోట తిఙంత ప్రకరణమ్ అనీ యిదేవిధంగా-మూడవ భాగానికి కృదంత విభాగమని పేరుపెట్టినా ఆ విభాగం అన్నిపుటలలోనూ 'కృదంత విభాగః' అని వున్నచోట్ల 'కృదంత ప్రరణమ్' అని వ్రాయవలసి వున్నది. పొరపాటున 'తిఙంత విభాగః-కృదంత విభాగః' అని వ్రాయడం జరిగింది. ఈ విషయాన్ని పాఠకులు గుర్తించ ప్రార్థన. వైకృత చంద్రిక గ్రంథమంతటా దంత్య చ, జ లను ఉపయోగించవలసిన చోటల్లా పెక్కుచోట్ల ముద్రణలో సరియైన దంత్యాన్ని ఉపయోగించలేకపోయాము. అసలు ముద్రణలో-అచ్చుపోతలోనే దంత్య చ, జ లు లేకుండాపోయాయి. దంత్య చ జ లని తెలియచెప్పడానికి వాటి మీద ప్రత్యేకించి "‿" (తావత్తు) గుర్తును పైన పెట్టి కొన్ని సందర్భాలలో ముద్రించడం జరిగింది. ఇది పరిశీలకులకు (అక్షరమూ పైచిహ్నమూ కొద్దిగా దూరంగా ఉండడంవల్ల) కొంత అసహజంగా కనిపించవచ్చును. దంత్య చ జ లు ముద్రణలో లేనందువల్ల యీ అసహజస్థితిని కల్పించవలసివచ్చినందుకు మన్నించవలసిందిగా కోరుతున్నాము.

సమాస ప్రకరణంలో "అథసమాసాః" అనేది సూత్రంగా పొరపాటున పరిగణించి వ్రాయడం జరిగింది. నిజానికది సూత్రం కాదు. ఈ దృష్టితో "ఒక్కశేషే" రెండవ సూత్రమవుతుంది. కాగా సమాస సూత్ర సంఖ్య 39 మాత్రమే కాగలదు. ఈ విషయాన్ని పాఠకులు గమనింపగోరుతున్నాము.

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్‌లోని తెలుగు పండితులు చిరంజీవి కోడూరు విశల్ రెడ్డి, M.O.L. ఈ గ్రంథాంతంలో వున్న అకారాది సూత్ర సూచికను రూపొందించారు.

ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరి అండ్ రిసర్చి ఇనిస్టిట్యూట్‌కు నేను జాయింట్ డైరక్టర్‌గా వుండగా 1971, జూలై 6 1973, నవంబర్ 8 మధ్య కాలంలో యీ వైకృత చంద్రికను రూపొందించి ముద్రింపింపడం జరిగింది. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గారు నా మీద వున్న అమేయ గౌరవాభిమానాలు కారణంగా 1975, జనవరి

వాఙ్మయ మహాధ్యక్షుని

1 వ తేదీ నుంచి ఈ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరి అండ్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్‌ను సర్వ స్వతంత్ర ప్రతిపత్తిగల డైరెక్టరేట్‌గా, ప్రత్యేక శాఖగా యేర్పరచి నన్ను డైరెక్టర్‌గా నియమించి యీ మహోత్తమ గ్రంథానికి ప్రధాన సంపాదకుడుగానే కాక ప్రభుత్వ శాఖ డైరెక్టర్‌గా కూడా పరిశోధనాత్మకమైన రచన వ్రాసే అవకాశాన్ని బహుముఖమైన సాహిత్యసేవ చేయడానికి తగిన ఉన్నత స్థానాన్ని కల్పించారు. అందుకు ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారికి భగవంతుడు మేలు చేయుగాక !

పరిశోధనాత్మకమైన యీ మహాగవేషణా రచనను నేను డిక్టేట్ చేస్తుండగా కుమారి చాట్ల కమలకుమారి, B. Sc. (L. D. C.) - చిరంజీవి కోడూరు విఠల్ రెడ్డి, M.O.L. చిత్తు ప్రతి వ్రాయగా—ఆ తరువాత చిరంజీవి కొడవలి సత్యనారాయణ. M.O.L. సాపు ప్రతిని వ్రాయడం జరిగింది. అందుకు వీరికి నా అభ్యుదయ శుభాకాంక్షలు.

ఇట్లు
వాఙ్మయ మహాధ్యక్ష
*వడ్లమూడి గోపాలకృష్ణయ్య*
"కళా ప్రపూర్ణ"
డైరెక్టర్
ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్
ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్
లైబ్రరి అండ్ రిసర్చ్ ఇన్‌స్టిట్యూట్.

హైదరాబాద్.
సుబ్రహ్మణ్య షష్ఠి
14--7-1975.

---

# వైకృతచన్ద్రికా

మంచెళ్ల వాసుదేవకవి విరచితా

ప్రధాన సంపాదకులు:

"కళా-ప్రపూర్ణ"

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

వాఙ్మయ మహోధ్యక్షు

సంపాదకులు

తెలుగు వ్యాఖ్యాకర్తలు

శ్రీ యన్. సి. యస్. వేంకటాచార్యులు,

విశారద

డా. అమరేశం రాజేశ్వరశర్మ

భాషాప్రవీణ, M.A.,Ph.D.

శ్రీ మతే హయగ్రీవాయ నమః

# వైకృతచన్ద్రికా

## 1. సుబంత విభాగః

### సంజ్ఞాప్రకరణమ్

జానకీ కర్ణతాటంక రత్న చుంబిత కుండలమ్
విశాల లోచనం ధ్యాయే శ్రీమద్రామ ముఖాంబుజమ్.[1]

సీతాదేవి చెవికమ్మల రత్నములచే ముద్దుగొనఁబడిన కుండలములు గలదియు, వెడఁద కన్నులు గలదియు, శోభాయుక్తమును అయిన శ్రీరాముని ముఖ కమలమును ధ్యానించుచున్నాను.[2]

### 1. సూ. సిద్ధిః ర్వ్యవహారాచ్చ[4]

వృ: సిద్ధి రిహ త్రిలింగ వ్యాకరణ సంబంధినీ. సా లోకవ్యవహారాద్ భవతి, యతః ఋ౯ ప్రభృతిభి ర్వర్ణైః ద్వివచనేన చ విరహితః శబ్దోచ్చారః* లౌకిక వ్యవహారాదేవ లభ్యతే.

---

1. 'మంగలాదీని హి శాస్త్రాణి ప్రథన్తే' అను భగవద్భాష్యకార వచనమునుబట్టి శాస్త్రాదిని మంగళాచరణ శ్లోకము రచింపఁబడినది. ఇది వృత్తికి మంగళాచరణము. సూత్రగ్రంథమునకు ప్రథమసూత్రాదిని గల 'సిద్ధి' శబ్దముచేతనే మంగళాచరణము కావింపఁబడినది.

2. దీని తరువాత ఈ క్రింది శ్లోకము వ్రాతప్రతి తయారుచేసికొనిన యాతనిచే చేర్పఁబడినది. గ్రంథభాగము కాదు. వాఙ్మయ మహోధ్యక్షు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ" గారి వద్దనున్న తాళపత్రప్రతిలోలేదు.

[ఆంధ్ర సూత్రార్థచాతుర్యం జ్ఞాతుం వైకృతచంద్రికామ్
మంచెళ్ల వాసుదేవేన రచితాం విలిఖామ్యహమ్.

ఆంధ్ర సూత్రార్థ చాతుర్యము తెలియుటకై మంచెళ్ల వాసుదేవాచార్యునిచే రచింపఁబడిన వైకృతచంద్రికను వ్రాయుచున్నాను.]

3. సిద్ధి శబ్దము సూత్రాదిని మంగళార్థము ప్రయుక్తము. వరరుచి 'సిద్ధే' అను శబ్దముతో ప్రథమ వార్తికము నారంభించెను. అచటి భాష్యవివరణము చూచుకొనునది.

4. సిద్ధి ర్లోకాచ్చ. వా. సూ. 1.1.1. సిద్ధి ర్లోకాద్ దృశ్యా. ఆం. శ. చిం.1.6

* విరహితం శబ్దోచ్చారణం-(వ.గో.కృ) తాళపత్రప్రతి.

తెలుగు వృత్తి: ఈ సూత్రమునఁజెప్పఁబడిన సిద్ధి త్రిలింగ వ్యాకరణమునకు[5] సంబంధించినది. అది ప్రజల వ్యవహారమునుండి కలుగుచున్నది. ఋౡ మొదలయిన వర్ణములును ద్వివచనమును లేని శబ్దోచ్చారణము ప్రజల వ్యవహారమునుండియే లభించుచున్నది.[6]

వృ: అణేజౌ ద్వావనుస్వారౌ యణ్ సహౌ మణనా జశః
వర్గ ప్రథమ వర్ణాశ్చ వైకృతే పరికీర్తితాః.

అ ఇ ఉ వర్ణా స్త్రయః, ఏకారౌకారౌ ద్వౌ, పూర్ణార్ధ భేదేన ద్వావనుస్వారౌ, అంతస్థాశ్చత్వారః, సహౌ ద్వావూష్మాణౌ, మణనా స్త్రయోఽనునాసికాః, పంచ జశః జబగడదాః, పంచ వర్గప్రథమవర్ణాః కచటతపా శ్చేత్యాంధ్రభాషాయాం వర్ణాః.[7]

తె. వృ: ఆంధ్రభాషలోని వర్ణముల వివరణము: అణ్ అనఁగా అఇఉ వర్ణములు మూడు. ఏజ్ అనఁగా ఏ ఓ వర్ణములు రెండు, పూర్ణానుస్వారమును అర్ధానుస్వారమునని అనుస్వారములు[8] రెండు, యణ్ అనఁగా యరలవ అను అంతస్థావర్ణములు నాలుగు, సహ అను ఊష్మవర్ణములు రెండు, మణన అను అనునాసిక వర్ణములు మూఁడు, జశ్ అనఁగా జబగడద అను వర్ణములయిదు, వర్గప్రథమము లనఁగా కచటతప అను వర్ణము లయిదు.

వృ: అఇ, అఉ ఇత్యేతయో రాదేశత్వేన ప్రాప్తయోః ఐకారౌకారయోః తాలవ్యత్వ మౌష్ఠ్యత్వంచ సంయోగసిద్ధమ్, ఏజస్తు సమవాయసిద్ధమ్; అనయోస్తయోః అకారస్యైవ ప్రాధాన్యమ్. వ్యస్త ద్విమాత్రకత్వాత్ ప్రహ్స్వాభావశ్చ. అకారపూర్వస్య ఏజోఽపి కంఠ్యత్వ స్యైవ ప్రాధాన్యమ్.

తె.వృ: అఇ, అఉ అను వర్ణముల కాదేశముగా ఐఔ వర్ణము... తెలుఁగులో చేరినవి. వీనికి తాలవ్యత్వమును ఔష్ఠ్యత్వమును సంయోగము[9]

5. త్రిలింగ వ్యాకరణమనఁగా తెలుఁగువ్యాకరణము. శ్రీశైల ద్రాక్షారామ కాళేశ్వరములు ప్రసిద్ధ త్రిలింగక్షేత్రములు. ఈ ప్రసిద్ధక్షేత్రములుగల దేశము త్రిలింగదేశము. త్రిలింగదేశప్రజల భాష త్రిలింగ భాష. అదే తెలుఁగుభాష. ఈ వ్యాకరణము త్రిలింగభాషకు – తెలుఁగుభాషకు – సంబంధించినది.

6. "యస్మాత్ ఋౡ వర్ణాభ్యా మైకారౌకారాభ్యా మసంస్పృక్త ఙఞ కారాభ్యాం శషాభ్యాం ద్వివచనాదినా రహితః శబ్దోచ్చారః లోక వ్యవహారాదేవోపలభ్యతే." త్రివి వృత్తి. 1.1.1. పోల్చుకొనునది.

7. ఆం. శ. చిం. 1.18 "ద్వివిధాదిదుదేదోతోఽచో వక్రతమా వనుస్వారౌ, కగచజయుగటడణతదనపబమయరలవసహాశంతు హల్వర్గః"

8. ఆం. శ. చిం. 1.19. "సిద్ధః సాధ్యశ్చానుస్వారః పూర్ణార్ధభేదతః" ద్వివిధః

9. సంయుక్త వ్యవహారహేతుః సంయోగః. తర్క-సం – ఇమౌ సంయుక్తౌ ఇతి యో వ్యవహారః తస్య హేతుః సంయోగః – పద.వ్యా.

వలనఁగలిగినవి. ఏఓ లకు తాలవ్యత్వమును ఓష్ఠ్యత్వమును సమవాయము వలన[10] గలిగినవి. కనుక ఐఔ లలో అకారముననే ప్రాధాన్యము. విడిగా రెండు మాత్రలు గలవగుటవలన వీనికి హ్రస్వములు లేవు. అకారము మొదటగలవగుటచే ఏఓలలోను కంఠ్యత్వముననే ప్రాధాన్యము.

వృ: అన్యేషా మచాం హ్రస్వత్వం దీర్ఘత్వం ప్లుతత్వ మస్తి. దంత్యత్వ తాలవ్యత్వాభ్యాం చజౌ ద్వివిధౌ. పదాదౌ యకారః, వకారస్య ఉదోతౌ చ న సంతి. లఘ్వలఘు భేదేన అన్తస్థా ద్వివిధాః.[11]

తె.వృ: తెలుఁగులో అఇ, అఉ లకాదేశ రూపములై చేరిన ఐఔ కాక తక్కిన స్వరములు - అఇఉఏఓ అనునవి - హ్రస్వములు, దీర్ఘములు, ప్లుతములు అని మూడువిధములు. అఆఆ౩ ఇఈఈ౩ ఉఊఊ౩ ఎఏఏ౩ ఒఓఓ౩. దంత్యములు, తాలవ్యములు అని చజలు రెండువిధములు.[12] పదాదియందు య, వు, వో ఉండవు. లఘువులు, అలఘువులు అని అంతస్థలు - యరలవ - రెండువిధములు.

## 2 సూ. అనుక్తం సంస్కృతవత్[13]

వృ: యదిహ సంధి ప్రభృతి కార్యత్వే నానుక్తం తత్ పాణినీయాదివ[14] ద్వేదితవ్యమ్.

తె.వృ: ఈ శాస్త్రమునఁ జెప్పఁబడని సంధులు మొదలయిన కార్యములు పాణినీయాది సంస్కృత వ్యాకరణములందు విధింపఁబడిన వానివలెనే గ్రహింపవలయును.

## 3 సూ. సంజ్ఞా ప్రాకృతవచ్చ

వృ: ఇహ శాస్త్రే వాల్మీకీయాదివత్, పాణినీయాదివచ్చ సంజా వేదితవ్యా. సూత్రేష్వదృష్టం పదం సూత్రాంతరా దనువర్తనీయం సర్వత్ర. అచ్ ప్రత్యాహారాదయః సంస్కృతసంజ్ఞాః.

---

10. నిత్యసంబంధః సమవాయః. అయుత సిద్ధవృత్తిః. తర్కసం.

11. ఆం.శ.చిం. 1.22 "లఘవోఽలఘవశ్చేతి ద్వేధాన్తస్థాన్ వదంతి శాస్త్రారః"

12. తాలవ్య కంఠతాలవ్య స్వరములతో - ఇఈఎఏఐ లతోఁ-గూడిన చజలు తాలవ్యములు. ఇతర స్వరములతోఁగూడినవి దంత్యములు.

13. వాల్మీం. సూ. 1.1.2. అనుక్త మన్య శబ్దానుశాసనవత్.

14. అనుక్తం తత్సర్వ మన్యశబ్దానుశాసనవత్ కౌమార జైనేంద్ర పాణినీయ ప్రభృతిషు వ్యాకరణేషు యథోక్తమ్ - వా.సూ. 1.1.2. త్రివి. వృ.

తె.వృ: సూత్రమునఁ గనఁబడని పదములను పై సూత్రమునుండి యనువృత్తము చేసికొనవలయును. ప్రకృత సూత్రములోనికి పై సూత్రము నుండి సంస్కృతవత్ అను పదము ననువర్తింపజేసికొని యర్థము చెప్పుకొన వలయును. ఈ శాస్త్రమున పాణినీయము మొదలయిన సంస్కృత వ్యాకరణలములనుండియేగాక వాల్మీకీయము మున్నగు ప్రాకృత వ్యాకరణములనుండి కూడ సంజ్ఞలు గ్రహింపవలయును. అచ్ ప్రత్యాహారము మొదలైనవి సంస్కృత వ్యాకరణ సంజ్ఞలు.[15] ప్రాకృత వాక్యరణ సంజ్ఞలు తరువాతి సూత్రములలోఁ జెప్పఁబడుచున్నవి.

## 4 సూ. సుప్స్వాది రంత్యహాలా[16]

వృ: సుప్సు[17] ఆది రేకవచన వర్ణో బహువచన సంబంధినా అంత్యహాలా సహ ప్రత్యాహారో భవతి. అతః సుస్, అస్, టాస్, జేస్, జసిస్, జమ్, జిప్ ఇతి విభక్తి సంజ్ఞాః.

తె.వృ: సుబ్విభక్తులలో ఏకవచన వర్ణము బహువచనము చివరి హల్లుతో కలిసి ప్రత్యాహారమగును. అందువలన సుస్, అస్, టాస్, జేస్, జసిస్, జమ్, జిప్ అను విభక్తిసంజ్ఞలేర్పడుచున్నవి.

## 5 సూ. హో హ్రస్వః[18]

వృ: హ్రస్వో 'హ' సంజ్ఞః స్యాత్.

తె.వృ: హ్రస్వమునకు 'హ' అని సంజ్ఞ.

## 6 సూ. ది ర్దీర్ఘః[19]

వృ: దీర్ఘో 'ది' సంజ్ఞః స్యాత్.

తె. వృ: దీర్ఘమునకు 'ది' అని సంజ్ఞ.

15. వాల్మీ. సూ. 1.1.3. "సంజ్ఞా ప్రత్యాహారమయీా వా".

16. వాల్మీ. సూ. 1.1.4. "సుప్ స్వాది రంత్యహాలా"

17. సుప్పులు : సు ఔ జస్; అమ్ ఔట్ శస్; టా భ్యామ్ భిస్; జే భ్యామ్ భ్యస్; జసి భ్యామ్ భ్యస్; జస్ ఓస్ అమ్; జి ఓస్ సుప్.

18. వాల్మీ. సూ. 1.1.5. "హో" హ్రస్వః

19. వాల్మీ. సూ. 1.1.6. "ది ర్దీర్ఘః"

### 7 సూ. సః సమాసః[20]

వృ: సమాసః 'స' సంజ్ఞో భవతి.

తె. వృ : సమాసమునకు 'స' అని సంజ్ఞ.

### 8 సూ. శషసాః శుః[21]

వృ: శషసా స్త్రయో వర్ణాః 'శు' సంజాః.

తె. వృ : శషస అను మూడు వర్ణములకు 'శు' అని సంజ్ఞ.

### 9 సూ. ఆదిః ఖుః[22]

వృ: ఆదివర్ణః 'ఖు' సంజ్ఞః.

తె. వృ : మొదటి వర్ణమునకు 'ఖు' అని సంజ్ఞ.

### 10 సూ. సంయుక్తః స్తుః[23]

వృ: సంయుక్త వర్ణః[24] 'స్తు' సంజ్ఞో భవతి.

తె. వృ : సంయుక్తాక్షరమునకు 'స్తు' అని సంజ్ఞ.

### 11 సూ. గో గణపరః[25]

వృ: గణపరో[26] య ఆదిశబ్దః[27] స 'గ' సంజ్ఞోభవతి.

తె. వృ : గణమును దెలిపెడి ఆది శబ్దమునకు 'గ' అని సంజ్ఞ[28]

20. వాల్మీ. సూ. 1. 1. 8 'సః సమాసః.'
21. వాల్మీ. సూ. 1. 1. 7 'శషసాః శుః.'
22. వాల్మీ. సూ. 1. 1. 9 'ఆదిః ఖుః.'
23. వాల్మీ. సూ. 1. 1. 12 'సంయుక్తః స్తుః.'
24. వ్యంజనేన యుక్తం సంయుక్తమ్. త్రివి. వృ. వాల్మీ. సూ. 1. 1. 12.
25. వాల్మీ. సూ. 1. 1. 10 'గో గణపరః.'
26. 'ప్రధానో'పా. త్రివి. వృత్తి.
27. వాల్మీకి సూత్రములలో 'ఆదిః ఖుః' అను సూత్రము తరువాత ఈ సూత్రముండుటచే 'ఆది' శబ్దమీ సూత్రములోని కనువృత్తమైనది. ఇక్కడ అట్లుకాదు. మండూక ప్లుతితో సరిపెట్టుకొనవలయును.
28. ఉదా. గుణాదిగణము అని చెప్పుటకు గుణగః అని చెప్పుట.

12 సూ. ద్వితీయః ఫుః[29]

వృ: ద్వితీయవర్ణః 'ఫు' సంజ్ఞః స్యాత్.

తె. వృ : రెండవ వర్ణమునకు 'ఫు' అని సంజ్ఞ.

13 సూ. తు వికల్పే[30]

వృ: వికల్పవాచకః సర్వోఽపి 'తు' సంజ్ఞః స్యాత్.

తె. వృ : వికల్పమును తెలుపుట కంతటను 'తు' అను సంజ్ఞ ప్రయోగింపఁబడును.

14 సూ. ప్రాయో లితి న వికల్పః[31]

వృ: లకార ఇద్[32] యస్య తస్మిన్ లితి కర్తవ్యే వికల్పః ప్రాయో న స్యాత్.

తె. వృ : లకారము ఇత్సంజ్ఞగాఁ గలది లిత్తు. లిత్ ప్రత్యయమునకు సామాన్యముగా వికల్ప ముండదు.

15 సూ. రితో ద్విత్వమ్

వృ: రేఫానుబంధస్య ఆదేశవ్యంజనస్య నిత్యం ద్విత్వం స్యాత్.

తె. వృ : రేఫ అనుబంధముగాఁ గల వ్యంజన మాదేశమగునపుడు దానికి నిత్యముగా ద్విత్వము వచ్చును.

16 సూ. శితి దీర్ఘః[33]

వృ: శితి పరే పూర్వస్య[33a] దీర్ఘో భవతి.

తె. వృ : శవర్ణ మిత్తుగాఁగలది శిత్తు. శిత్ ప్రత్యయము పరమగు నప్పుడు పూర్వస్వరమునకు దీర్ఘము వచ్చును.

---

29. వాల్మీ. సూ. 1. 1. 11 'ద్వితీయః ఫుః'
30. వాల్మీ. సూ. 1. 1. 13 'తు వికల్పే'
31. వాల్మీ. సూ. 1. 1. 14 'ప్రాయో లితి న వికల్పః'
32. ఉపదేశకాలమున నుండియు కార్యకాలమునఁ బోవునది ఇత్తు. దీనికే అనుబంధమనియు పేరు. ఏతి గచ్ఛతీతి ఇత్.
33. వాల్మీ. సూ. 1. 1. 15. 'శితి దీర్ఘః'.
33a. చూ. తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య.పా. 1. 1. 66.

### 17 సూ. సానునాసికోచ్చారం జిత్[34]

వృ: జకారానుబంధకార్యం సానునాసికోచ్చారం భవతి.

తె. వృ : జకార మనుబంధముగాఁగల కార్యము అనునాసిచ్చరణము గలిగియుండును.

### 18 సూ. నృ నప్ ఇత్యేతౌ పుంనపుంసక వాచకౌ

తె. వృ : నృ, నప్ అనునవి వరుసగా పుంలింగమును నపుంసకమును దెలుపును.

### 19 సూ. బిందు రనుస్వారః[35]

తె. వృ : అనుస్వారమునకు బిందు వని సంజ్ఞ.

వృ: ఏతాః ప్రాకృత సంజ్ఞాః.

తె. వృ : ఇంతవఱకు వివరించినవి ప్రాకృతసంజ్ఞలు.

### 20 సూ. ప్రాతిపదికం నామ[36]

వృ: ప్రాతిపదిక మత్ర నామసంజ్ఞం స్యాత్.

తె. వృ : ఈ శాస్త్రమున ప్రాతిపదికమునకు నామ మని సంజ్ఞ.

### 21 సూ. ప్రత్యయో వర్ణకః[37]

వృ: ప్రత్యయోఽస్మిన్ శాస్త్రే వర్ణక సంజ్ఞః స్యాత్.

తె. వృ : ఈ శాస్త్రమున ప్రత్యయమునకు వర్ణక మని సంజ్ఞ.

### 22 సూ. ధాతుః క్రియా[38]

వృ: ధాతుః క్రియా సంజ్ఞః స్యాత్.

తె. వృ : ధాతువునకు క్రియ యని సంజ్ఞ.



---

. వాల్మీ. సూ. 1. 1. 16 'సానునాసికోచ్చారం జిత్.'

. ఆం. శ. చిం. 1. 32. 'బిందు రనుస్వారః.'

. ఆం. శ. చిం. 1. 28. 'ప్రాతిపదికం హి నామ.'
'అధాతు విభక్తివర్జ మర్థవన్నామ.' హేమ శబ్దా. 1. 1. 27
'అవిభక్తినామ.' సార. వ్యా విభక్తి – 1. 1.

ఆం. శ. చిం. 1. 29 "ప్రత్యయ ఇహ వర్ణకః'

ఆం. శ. చిం. 1. 30 'క్రియా ధాతుః'

23 సూ. రమాంతో*మధ్యమశ్చ తిఙ్మధ్యః

వృ: రమవర్ణాంతో మధ్యమపురుష విహితశ్చ ధాతుః తిఙ్మధ్య సంజ్ఞః స్యాత్.

తె. వృ : రమవర్ణములు చివరc గలదియు, మధ్యమ పురుషను బోధించు నదియు నగు ధాతువునకు తిఙ్మధ్యమని సంజ్ఞ.[39]

24 సూ. అవ్యవహితః పరోఽనుబంధః[40]

వృ: విశ్లేషరహితః పరత్ర సన్నిధా ప్రయుక్తో ధాత్వాది రనుబంధసంజ్ఞః స్యాత్.

తె.వృ : విశ్లేషములేకుండ వెనువెంటనే ప్రయోగింపcబడు ధాతువు లోనగుదానికి అనుబంధమని సంజ్ఞ.

25 సూ. అచ్ ప్రాణః[41]

వృ: అచ్ ప్రత్యాహారః ప్రాణ సంజ్ఞః స్యాత్.

తె.వృ : అచ్ ప్రత్యాహారములోని వర్ణములకు ప్రాణములని పేరు.

26 సూ. వక్ర వక్రతమా వేజైచౌ[42]

వృ: ఏజైచౌ క్రమా ద్వక్ర వక్రతమ సంజ్ఞౌ భవతః.

తె.వృ: ఏ ఓ లకు వక్రములనియు, ఐ ఔ లకు వక్రతమములనియు సంజ్ఞలు.

27 సూ. అర్ధబిందు ర్బిందుకః

వృ: అనునాసికోచ్చారత్వేన అర్ధమితో బిందు ర్బిందుక సంజ్ఞః స్యాత్.

తె.వృ : అరసున్న అనునాసికోచ్చారణము గలది. దానికి బిందుకమని సంజ్ఞ.

---

*ద్మాంతో-(వ.గో.కృ) తాళపత్రప్రతి.

39. తిఙ్మధ్యమునకు ఉదా : చదివితివి; చదివితిరి; చదువుచున్నారు, చట : చదువుచున్నాము, చదివితిమి.

40. అనుబంధసంజ్ఞ నిర్వచన మీయకయే ఆం. శ. చిం. 5. 10, 11, 13 సూ. లలో ప్రయోగింపcబడినది. ఇట్లు నిర్వచింపకయే ప్రాకృతన వ్యాకరణ సంజ్ఞలను గ్రహించుట చింతామణియందుc గాననగును.

41. ఆం. శ. చిం. 1.31. "ప్రాణా సమానతోఽచః"

42. ఆం. శ. చిం. 1.33. 34. 'ఏజధో వక్రః', "వక్రతమ ఐచ్".

28 సూ. ప్రాణీ హల్[43]

వృ: హల్ ప్రత్యాహారః ప్రాణిసంజ్ఞః.

తె. వృ: హల్ ప్రత్యాహారములోని వర్ణములకు ప్రాణులని సంజ్ఞ.

29 సూ. కచటతపాః పరుషాః[44]

వృ: కాదయః పంచాపి పరుష సంజ్ఞాః.

తె. వృ: క చ ట త ప—పరుషములు.

30 సూ. గజడదబాః సరళాః[45]

వృ: గాదివర్ణాః సరళసంజ్ఞాః.

తె. వృ: గ జ డ ద బ—సరళములు.

31 సూ. అన్యే స్థిరాః[46]

వృ: పరుష సరళ వ్యతిరిక్తా హలః స్థిర సంజ్ఞా భవంతి.

తె. వృ: పరుష సరళములుగాక తక్కిన హల్లులకు స్థిరములని సంజ్ఞ.

32 సూ. ద్రుతం నః[47]

వృ: కృతాకృతో నకారో ద్రుతసంజ్ఞః స్యాత్.

తె. వృ: వ్యాకరణ కార్యవశమున వచ్చినదియు శబ్దసిద్ధమును అయిన నకారమునకు ద్రుతమనిసంజ్ఞ.

33 సూ. స్థా న్యాదేశస్య

వృ: ఆదేశస్య స్థాన్యేవ సంజ్ఞా భవతి.

తె. వృ: ఆదేశమునకు స్థానియే సంజ్ఞయగుచున్నది.

---

43. ఆం. శ. చిం. 1.35. "హల స్స్యు స్సమానతః ప్రాణినః"

44. ఆం. శ. చిం. 1.37. "క చ ట తపాః పరుషాఖ్యాః".

45. ఆం. శ. చిం. 1.38. "గ జ డ ద బా స్తు సరళాః"

46. ఆం. శ. చిం. 1.39. "స్థిరా ఇతరే."

47. ఆం. శ. చిం. 1.36. "ద్రుతాఖ్యో నః".

## 34 సూ. అపూర్వం వికృతమ్

వృ: సంస్కృతాపేక్షయా ప్రాకృతకార్యం వికృతసంజ్ఞం భవతి. తదుభయాపేక్షయాన్యచ్చ.

ఇతి సంజ్ఞా ప్రకరణమ్.

తె. వృ: సంస్కృతభాషనుబట్టి చూచిన ప్రాకృతకార్యము వికృతమను సంజ్ఞను పొందుచున్నది. సంస్కృత ప్రాకృతములనుబట్టి తెలుగు వికృతసంజ్ఞను పొందుచున్నది.[48]

సంజ్ఞాప్రకరణము సమాప్తము.

---

48. సంస్కృతభాష వికృతి (మార్పు) చెంది ప్రాకృతమేర్పడినది. సంస్కృత ప్రాకృతములు వికృతిచెంది తెలుగుభాష ఏర్పడినదని భావము. చూ. ఆం. శ. చిం. 1.12, 13. "ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే, ఏషా తయో ర్భవే ద్వికృతిః."

# సంధిప్రకరణమ్

## స్వరసంధిః

### 1 సూ. సంధిః ప్రాణస్య న ప్రాణే

వృత్తి: ప్రాణస్య ప్రాణే పరే యణాదేశ సవర్ణదీర్ఘ గుణ వృద్ధ్యాది సంధి ర్న స్యాత్.

తె. వృ: ఈ యాంధ్రభాషయం దచ్చునకు అచ్చుపరమైనప్పుడు సంస్కృతమున వచ్చు సవర్ణదీర్ఘసంధి గుణసంధి వృద్ధిసంధి మొదలగునవి రావు.[1]

### 2 సూ. లఘుర్యోఽచోఽచః

వృ: అచః పరస్యాచో లఘుప్రయత్నతర[2] యకారోభవతి. వరియన్నము, కటియావు, ప్రోడయింతి, అరయేరు, కన్నెయైదువ.

తె. వృ: అచ్చుకంటె పరముగానున్న అచ్చుకు లఘుప్రయత్నతరమైన యకారము వచ్చును. ఉదా : వరియన్నము, కటియావు, ప్రోడయింతి, అరయేరు, కన్నెయైదువ.

### 3 సూ. అవర్ణ స్యాలా వురుక్*

వృ: శుక్లాది వర్ణవాచక వర్జిత శబ్దస్య ఉరుగాగమ† స్స్యా దాలా పరే. ప్రియురాలు. అవర్ణస్యేతి కిమ్ ? ధవళయైనది. అసామానాధికరణ్యేతు‡ ప్రియునాలు. వైకృతా ల్లోపధాదపి న. ఇల్లాలు, చూలాలు.

---

1. "అనుక్తం సంస్కృతివత్" (వై. చం. సంజ్ఞా. 2) అను సూత్రముచే వాసుదేవాచార్యుఁడు ఇందు చెప్పఁబడనిదెల్ల సంస్కృతవ్యాకరణమునందువలె నుండునని వచించినవాఁడు కనుక సవర్ణదీర్ఘాదిసంధులు ఆంధ్రభాషయందు రావని చెప్పవలసినవాఁడయ్యెను. ఈ సంప్రదాయము ప్రాకృత వ్యాకరణమగు వాల్మీకీయము ననుసరించినది. "సంధి స్త్వపదే" (వాల్మీ. 1-1-18) న యణ్ (వాల్మీ. 1-1-19) అను సూత్రము లావ్యాకరణమున సంస్కృతసంధులు మొత్తము ప్రాకృతమునఁగూడఁ దమంతతాముగా సిద్ధములయి యున్నట్లు భావించి నిషేధము నుపదేశించుచున్నవి. వైకృతచంద్రికయు నీవిధానమునే యనుసరించె ననుట స్పష్టము.

2. యనాదో భవతి. (పరిషత్ప్రతి) ఈ పాఠమునందు యకారమువంటి ధ్వని వచ్చునని యర్థముఁ జెప్పవలయును.

"యశ్రుతి మార్యా లఘుయం ప్రవదంతి ప్రాణతః పరం ప్రాణమ్"
(ఆం. శ. చిం. సంజ్ఞా. 25)

*వురక్-(వ.గో.కృ) తాళపత్రప్రతి.

†ఉరగాగమ-(వ.గో.కృ) తాళపత్రప్రతి.

*సామానాధికరణ్యాభావేతు-(వ.గో.కృ) తాళపత్రప్రతి.

తె. వృ: తెలుపు మొదలగు వర్ణములను బోధించునవి కానట్టి అకారాంత శబ్దములకు ఆలు అను పదము పరమయినప్పుడు 'ఉరుక్' అను నాగమమువచ్చును. ఉదా: ప్రియురాలు. వర్ణవాచకముకానప్పుడే ఉరుగాగమము వచ్చుననుటచేత ధవళయైనది మున్నగువానిలో నురుగాగమము నివారితమయినదని తెలియవలెను. ఈ యాగమము పూర్వోత్తర పదములు సమానాధికరణములయినప్పుడే వచ్చుననికూడ గమనింపవలెను.

సామానాధి కరణ్యము లేనప్పుడు 'ప్రియునాలు' అనియేయుండును. ఇట్లే యీ ఉరుగాగమము ఆలు శబ్దముపరముగా నున్నను సంస్కృత సమేతరములయిన లోపథ శబ్దములకు రాదు. ఇల్లాలు, చూలాలు అనునవి యిందు కుదాహరణములు.

## 4 సూ. కుంజపాంచాలికయో రరు గ్గృహే

వృ: కుంజపాంచాలికా దేశయో రరుగాగమ స్స్యా ద్గృహాదేశ సంబంధిన్యచి పరే. పొదరిల్లు, బొమ్మరిల్లు.

తె. వృ: కుంజ-పాంచాలికా-శబ్దములకు తెలుఁగునందాదేశములుగా వచ్చు పొద, బొమ్మ యను శబ్దములకు గృహశబ్దమునకు తెనుఁగు నందాదేశముగావచ్చు ఇల్లు శబ్దము పరమయినప్పుడు అరుక్ అనునది యాదేశమగును. ఉదా: పొదరిల్లు, బొమ్మరిల్లు.

## 5 సూ. వికృతస్యాతోఽపత్రే వా లుక్

వృ: అకారస్య లుగ్వా స్యా త్పత్రాదేశ వర్జిత శబ్దసంబంధి న్యచి పరే. మేడంగము-మేడయందము. పత్రాదేశేతు నిత్యమ్. పొన్నాకు.

తె. వృ: వైకృత శబ్దములలోని అత్తునకు పత్రశబ్దాదేశమయిన ఆకు కాక మఱియే అజాది పదము పరమయినను వికల్పముగా లోపమువచ్చును. మేడందము-మేడయందము అనునవి క్రమముగా లోపము వచ్చినదానికిని, రానిదానికి నుదాహరణములు. పత్రశబ్దమునకుఁ దెలుఁగున నాదేశమయిన ఆకు పరమయినప్పుడు ఈ లోపము నిత్యముగా వచ్చును. పొన్నాకు అనునది యుదాహరణము.

## 6 సూ. సుప్ స్ద్రుతః

వృ: విభక్త్యాదేశ స్ద్రుతసంజ్ఞస్స్యాత్.

తె. వృ: సంస్కృత విభక్తిప్రత్యయముల స్థానమునఁ దెలుఁగు నందాదేశముగా వచ్చు విభక్తి ప్రత్యయములకు స్ద్రుతములను సంజ్ఞ యీసూత్రముచే విధింపఁబడుచున్నది.

## 7 సూ. న సద్రుతానామ్

వృ: సద్రుతానా మదిదుతాం లోపో న.

తె. వృ: సద్రుతములలోని హ్రస్వములయిన అఇఉ లకు లోపమురాదు.

## 8 సూ. ద్రుతం సద్రుతాత్

వృ: సద్రుతా ద్ద్రుతం స్యా దచి. గదచేత నడఁచి.

తె. వృ : సద్రుతముల కచ్చుపరమయినప్పుడు ద్రుతముండును. గదచేత నడఁచి యనునది యుదాహరణము.

## 9 సూ. అందు కికుచుకా వా

వృ: అందుః, జమాదేశౌ కికూ చ వర్తమానే చువర్ణకశ్చ క్త్వాదేశః కశ్చ సద్రుత సంజ్ఞా వా స్యుః.

తె. వృ: అందు అనునదియును, షష్ఠీవిభక్తి కాదేశముగా వచ్చు కికు వర్ణకములును, వర్తమానార్థమున వచ్చు చు వర్ణకమును, క్త్వార్థమున వచ్చు క అనునదియు వికల్పముగా సద్రుత సంజ్ఞ కలవి యగును.

## 10 సూ. క్యపితత్క్రమా మితః

వృ: కేః, అపితదాదేః* కిమశ్చ ఇతో లు గ్వా స్యా దచి పరే. రాముని కభివాదనము; రామునికి యభివాదనము**, అతివ నీకిత్తు విడియమే నన్న మేని; అతని కేనీను విడెమేని యన్న మేని; అదెక్కడ; అది యెక్కడ; ఏమేమి; ఏమి యేమి.

తె. వృ: కివర్ణకము, ఏని, అది మొదలగునవి, ఏమి వీనిలోని ఇత్తునకు అచ్చుపరమయినప్పుడు లోపము వికల్పముగా వచ్చును. ఉదా : రాముని కభివాదనము, రామునికి[3] యభివాదనము, అతివ నీకిత్తు విడియమే నన్న మేని, అతని కేనీను విడెమేని యన్న మేని; అదెక్కడ, అదియెక్కడ; ఏమేమి, ఏమియేమి.

---

*అపతదోః—(వ.గో.కృ.) తాళపత్రప్రతి.

**(వ.గో.కృ.) తాళపత్ర ప్రతిలో లేదు.

3. "అందుకికుచుకావా" (వైకృ.సంధి 9 సూ.) అను సూత్రముచే కివర్ణకము వికల్పముగా సద్రుతమగును గనుక 'రామునికి' యభివాదనము అను రూపము వాసుదేవుని మతమునందు సాధువగుచున్నది. చిన్నయసూరి కిది సమ్మతముకాదు.

## 11 సూ. సే సూర్యే

వృ: సమాసే ఇతో వా లుక్ స్యాత్ సూర్యగణ సంబంధి న్యచి పరే. పూరిల్లు, సరీడు. (?)

తె. వృ: సమాసమునందు సూర్యగణ సంబంధియైన అచ్చు పరముగా నున్న చో ఇత్తునకు వికల్పముగా లోపము వచ్చును. పూరిల్లు, సరీడు.

## 12 సూ. నిత్యం తిఙ్మధ్యస్య

వృ: తిఙ్మధ్య సంబంధిన ఇతో నిత్యం లుక్ స్యా దచి పరే. పలికిరందఱు, వచ్చితిమిప్పుడు.

తె. వృ: తిఙ్మధ్యముల యిత్తున కచ్చు పరమయినప్పుడు నిత్యముగా లోపము వచ్చును. పలికిరందఱు, వచ్చితిమిప్పుడు.

## 13 సూ. వర్ణక నిపాతయో రన్యస్య చ

వృ: సర్వ స్యాచో నిత్యం లుక్స్యాత్ వర్ణక నిపాత సంబంధి న్యచి పరే. పుట్టెడు, గిద్దెడు, వచ్చితివా ?

తె. వృ: ప్రత్యయ నిపాతములకు సంబంధించిన అచ్చు పరముగా నున్నప్పు డన్ని యచ్చులకును లోపము నిత్యముగా వచ్చును. పుట్టెడు, గిద్దెడు, వచ్చితివా ?

## 14 సూ. అసుస స్సుపో వా

వృ: ప్రథమావిభక్తివర్జిత సుప్సంబంధిన ఉతో వా లుక్ స్యా దచి పరే. రామునికొఱ కభివాదనము, రామునికొఱకు నభివాదనము.

తె. వృ: ప్రథమేతర విభక్తులలోని ఉత్తునకు అచ్చు పరమయినప్పుడు వికల్పముగా లోపము వచ్చును. రామునికొఱ కభివాదనము, రామునికొఱకు నభివాదనము.

## 15 సూ. ఉతోఽతద్ధర్మే (నిత్యమ్)

వృ: తద్ధర్మవర్జితశబ్దసంబంధిన ఉతో నిత్యం లు క్స్యాదచి. కృష్ణుఁ డతఁడు. అతద్ధర్మ ఇతి కిమ్ ? వెలయు నతఁడు.

తె. వృ: తద్ధర్మేతరములందున్న ఉత్తున కచ్చు పరమయినప్పుడు నిత్యముగా లోపము వచ్చును. కృష్ణుఁ డతఁడు. తద్ధర్మేతరములందనుటచే వెలయునతఁడు మున్నగుచోట్ల లోపము లేదన్నమాట.

### 16 సూ. నుమ్ సమాసే

వృ: సమాసే నుమ్ స్యా దుతోఽచి పరే. మోమునందము.

తె. వృ: సమాసమునం దుత్తున కచ్చు పరమయినప్పుడు నుమాగమము వచ్చును. మోమునందము అనునది యుదాహరణము.

### 17 సూ. అందౌ

వృ: నామ్న ఉతో నుమ్ స్యా దందౌ పరే. రామునందు. వైకృతాద్వికల్పే నేష్యతే.* వనమునందు-వనమందు.

తె. వృ: అందు పరమయినప్పుడు నామసంబంధియగు నుత్తునకు నిత్యముగా నుమాగమము వచ్చును. రామునందు.

*ఈ నుమాగమము వైకృతములకంటె వికల్పముగా వచ్చుటయే యిష్టము. వనమునందు-వనమందు.

### 18 సూ. టు క్సామానాధికరణ్యే

వృ: సామానాధికరణ్యే టు క్స్యా దుతోఽచి పరే. కఱకుశేఱు.

తె. వృ: సామానాధికరణ్యమునం దుత్తున కచ్చు పరమయినప్పుడు టుగాగమము వచ్చును. కఱకుశేఱు.

### 19 సూ. పుంపుభ్యా మన్యత్రాపి

వృ: కాసారంపుటలుగు. క్వచి దనిత్యమ్. చిగురుటాకు - చిగురాకు, పేరుటెద-పేరెద.

తె. వృ: పుంపులకు సామానాధికరణ్యము లేనప్పుడును టుగాగమము వచ్చును. కాసారంపుటలుగు. ఈ టుగాగమము కొన్నింటిలో నిత్యవిధి కాదు. పేరుటెద-పేరెద.

### 20 సూ. నావ్యయస్యావృథాదేః

వృ: ఇహ భాషాయాం వృథాదివర్జిత స్యావ్యయస్య ప్రయోగోఽనుకరణా దన్యత్ర న.

తె. వృ: ఈ యాంధ్రభాషయందు వృథాదులు కొన్ని తక్క కడమ యవ్యయములకు అనుకరణము లేకుండ ప్రయోగము లేదు.

---

*వంపతురములను ఇష్టికి చిహ్నముగా గ్రహింపవలెను.

## 21 సూ. లు గ్విసర్గస్య

వృ: విసర్జనీయస్య లుక్ స్యాదచి. రామాయ నమ యనుచు.

తె. వృ: అచ్చుపరమయినప్పుడు విసర్గలకు లోపము వచ్చును. ఉదా: రామాయ నమ యనుచు.[5]

## 22 సూ. సుప్తిజామ్

వృ: సుపాం తిజాంచ ప్రయోగోఽనుకరణ ఏవ.

తె. వృ: సుబంతములు తిజంతములునైన సంస్కృతశబ్దము... నను కరణరహితముగా నాంధ్రభాషయందు ప్రయోగింపఁబడవు.

## 23 సూ. ద్విత్వ మ్మః

వృ: అజ్విరహితస్య అంత్యమకారస్య ద్విత్వం స్యాదచి... రామమ్మనుచు.

తె. వృ: పదాంతమునందున్న అచ్చులేని మకారమునకు అచ్చు... మయినప్పుడు ద్విత్వము వచ్చును. ఉదా: నమామి రామమ్మనుచు.

హల్సంధిః

## 24 సూ. య్వాది రిత్యే కే

వృ: య్వాది వర్ణక స్స్రుత సంజ్ఞ స్స్యాదితి కేచి దాచార్యాః.

తె. వృ: యు మున్నగునవి యంతమందుఁ గలవి స్రుతసంజ్ఞ... కొందఱు వ్యాకరణాచార్యుల మతము.

## 25 సూ. అతో ద్రుతే (?)[6]

---

5. ఈ సూత్రము ననుకరణమునకు సంబంధించినదే. విసర్గ... వచ్చిన పిదప "లఘురోర్యోఽచోఽచః" (సంధి 2 సూ.) అను సూత్రముచే ... వచ్చును.

6. ఈ సూత్రమునకు వృత్తి లేదు. సందర్భమునుబట్టి సూత్ర... యని నిర్ధారణచేసి చెప్పరాకున్నది. కాకినాడ ప్రతిలో నీ భాగము ... తిరుపతిలోని ఆర్. 238 ప్రతి యాధారముగాఁ గొని యీ భాగమును ... దానిలోని సూత్రమునకు వృత్తి లేదు. (వ.గో.కృ) తాళపత్రప్రతిలో నుండ... ప్రత్యంతరము లభించి సరియగు పాఠము లభించునంతవఱ కీ సూత్రము ... విడువక తప్పదు.

## 26 సూ. ద్రుతా త్సరళాః పరుషాణామ్

వృ: ద్రుతా త్పరేషాం పరుషాక్షరాణాం సరళాః స్యుః.

తె. వృ: ద్రుతముకంటె పరమందున్న పరుషములకు సరళములాదేశమగును.

## 27 సూ. స్థిరసరళయో ర్ద్రుతస్య

వృ: ద్రుతస్య బిందుక ప్రకృతిభావ లోపా స్స్యుః స్థిరసరళయోః పరయోః.

తె. వృ: స్థిరములు కాని సరళములు కాని పరమైనప్పుడు ద్రుతమునకు అరసున్న, లోపము, ప్రకృతిభావము అనువానిలో నేదేని యొక్కటి వచ్చును.

## 28 సూ. హ్రస్వాద్బిందుశ్చ

వృ: హ్రస్వా త్పరతో* బిందు బిందుకో ర్వా స్యాత్. హరియుంగాంచె, హరియుఁగాంచె.

తె. వృ: హ్రస్వమునకంటె పరమందున్న యర్ధానుస్వారము వికల్పముగా పూర్ణానుస్వారమగును. ఉదా: హరియుఁగాంచె-హరియుంగాంచె.

## 29 సూ. నాసజాతీయే స్తోః

వృ: సజాతీయవర్ణయోగాభావే సంయుక్తసంబంధినో హలః ద్విత్వం న స్యాత్. హరియుఁ గాంచెన్ గరుణన్.

తె. వృ: సజాతీయవర్ణసంయోగము లేనప్పుడు సంయుక్తసంబంధి హల్లునకు ద్విత్వముండదు. *ఉదా:* హరియుఁ గాంచెన్ గరుణన్[7].

వృ: *సరళ స్యానాదేశత్వే ఏవ లోపకార్యం ద్రుత స్యేష్యతే.* హరియు గారవించె. వచ్చె న్నరకారి, వచ్చె నరకారి.

తె. వృ: సరళ మాదేశముగా వచ్చినది కానప్పుడే ద్రుతమునకు లోపము వచ్చుట ఇష్టి. హరియు గారవించె, వచ్చెన్నరకారి-వచ్చెనరకారి యనునవి యుదాహరణములు.

---

* త్పరో-(వ.గో.కృ.) తాళపత్ర ప్రతి.

7. దీనికి సమన్వయము కుదురలేదు.

8. వచ్చె న్నరకారి ద్రుతసంశ్లేషమునకు, వచ్చె నరకారి ద్రుతలోపమునకు నుదాహరణములు.

## 30 సూ. ద్రుత స్యోత్[9]

వృ: ద్రుతస్య ఉత్ స్యాత్[9a] పాదపూరణే. "హరియును గృపావిశేషంబు నాశ్రయించె".

తె. వృ: పాదపూరణమునకై అవసరమైనచో ద్రుతమునకు ఉకారము చేరును. "హరియును గృపావిశేషంబు నాశ్రయించె".

## 31 సూ. ఇత ఇత్

వృ: ఇకారాత్పరస్య ద్రుతస్య ఇత్ స్యాత్. రామునిని గొల్తు సద్గుణారాము నెపుడు.

తె. వృ: ఇకారముకంటెఁ బరమందున్న ద్రుతమునకు హ్రస్వమైన ఇకారము వచ్చును. "రామునిని గొల్తు సద్గుణారాము నెపుడు".

## 32 సూ. అస్వాస్మదః ప్రథమామాత్రా ద్గసడదవాః[10]

వృ: స్వాస్మదాదేశౌ వర్జయిత్వా ప్రథమామాత్రా త్పరేషాం పరుషాణాం గసడదవా స్స్యుః. సిరి గలవాఁడు, చతురుండు సదివె, దేవదత్తుండు డక్కరి, తనయిల్లు దామరతంపర, యజ్ఞదత్తుండు వలికె. స్వాస్మదోర్నస్య ద్రుత సంజ్ఞైవ. మాత్ర గ్రహణా త్ప్రథమాతుల్యానా మపి గ్రహణమ్. అప్పుడు సనియె.

తె. వృ: స్వాస్మదర్థకములయిన తాను నేను దప్ప కడమ ప్రథమా మాత్రములకంటె పరమందున్న పరుషములకు గసడదవలు ఆదేశముగా వచ్చును. సిరి గలవాఁడు, చతురుండు సదివె, దేవదత్తుండు డక్కరి, తనయిల్లు దామరతంపర, యజ్ఞదత్తుండు వలికె నను నవి యిందు కుదాహరణములు. నేను తాను లలోని నకారము ద్రుతసంజ్ఞకము. ప్రథమామాత్రములని మాత్రగ్రహణము చేయుటచేత ప్రథమాతుల్యము లయినవానికిఁగూడ నీకార్యము వచ్చును. అప్పుడు సనియె.

---

9. పదపూరణే (పాఠాం). 9a ద్రుతము నుకారముతోఁ గలిపి వ్రాయుట పాదపూరణమునందు మాత్రమేకాదు. ఇతరత్ర వ్రాయుటయుఁ గలదు.

10. "గసడదవా స్స్యుః ప్రథమామాత్రా దాత్మాస్మదో ర్వినై వైతే" (ఆం. శ. చిం. సంధి 23 సూ.)

## 33 సూ. ద్వంద్వే పదాత్[11]

వృ: ద్వంద్వ సమాసే పదా త్పరేషాం పరుషాణాం తథైవ. కాలుసేయి, తల్లిదండ్రులు.

తె. వృ: ద్వంద్వసమాసమునందు పదముకంటె పరమందున్న పరుషములకుఁగూడ గసడదవలు వచ్చును. కాలుసేయి, తల్లిదండ్రులు.

## 34 సూ. నాసంస్కృతా త్సంస్కృతస్య[12]

వృ: అసంస్కృతా త్పరేషాం సంస్కృత సంబంధినాం పరుషాణాం గసడదవా న స్యుః. అయ్యె కరుణించె, సిరి చంచలము, మాయయ్యె టంకాయుధుండు, సంస్కృతా త్భవంత్యేవ. ఆర్యుఁడు గరుణించె, శ్రీ సంచలము.

తె. వృ: సంస్కృతసమములుకానివానికంటె పరమందున్న సంస్కృత సంబంధి పరుషములకు గసడదవలు రావు. అయ్యె కరుణించె, సిరి చంచలము, మాయయ్యె టంకాయుధుండు. సంస్కృత సమములకంటె పరమందున్న సంస్కృతసంబంధి పరుషములకు గసడదవలు రావచ్చును. ఆర్యుఁడు గరుణించె, శ్రీ సంచలము.

## 35 సూ. వాక్యాంతే నస్య లుగ్వా

వృ: క్వచి త్పద్యభేదే వాక్యావసానే ద్రుతస్య లుగ్వా స్యాత్. "బహుళ సౌభాగ్యమహిమంబు వడయఁగంటి, నుత్తమశ్లోకమాన్యత నొందఁగంటి."

తె. వృ: కొన్ని పద్యములలో వాక్యాంత మందున్న ద్రుతమునకు వికల్పముగా లోపము వచ్చును. "బహుళసౌభాగ్యమహిమంబువడయ గంటి, నుత్తమశ్లోకమాన్యతనొందఁగంటి"[13].

## 36 సూ. అచ ఉపధాయా శ్చుకి[14]

వృ: ఉపధా సంబంధినః అచః లుగ్వా స్యాచ్చుకి పరే. తనరుచు-తనర్చు.

తె. వృ: చుక్కు పరమయినప్పుడు ఉపధాసంబంధియగు అచ్చునకు వికల్పముగా లోపమువచ్చును. తనరుచు, తనర్చు.

---

11. "పరుషాణాం గసడదవా స్స్యుః పదా ద్ద్వంద్వే" (అం. శ. చిం. సంధి 32 సూ.)

12. "న వికృతిశబ్దా త్పరత స్సాంస్కృతికానాం భవంతి గసడదవాః" (ఆం.శ. చిం. సంధి 24 సూ.)

13. దీనిలో మొదటి పాదము చివర ద్రుతలోపము లేదు, రెండవపాదము చివర ద్రుతము లోపించినది.

14. "చౌరేరుపధాత్మనశ్చ లుగ్వా స్యాత్" (ఆం. శ. చిం. సంధి. 11 సూ.)

37 సూ. చుదో ర్బిందుకశ్చ గ్రహాదే ర్నః

వృ: గ్రహాద్యాదేశ సంబంధినః ఉపధానకారస్య బిందుకో వా స్యాచ్చుదు ఇత్యేతయోః పరయోః.

తె. వృ: గ్రహధాత్వాదేశ మయిన కొను అనుదానికి సంబంధించిన ఉపధానకారమునకు చుదులు పరమయినప్పుడు వికల్పముగా బిందుకము వచ్చును.

38 సూ. హ్రైకాచో యుజి

వృ: హ్రస్వాదేకాచః పరః, సంయోగాత్పూర్వశ్చ బిందుకో నిత్యం బిందుస్స్యాత్. కొంచు-కొనుచు; కొందును-కొనుదును.

తె. వృ: హ్రస్వమయిన యేకాచ్చుకంబె పరమందుఁ గాని, సంయుక్తాక్షరమునకు పూర్వమందుఁగాని ఉన్నట్టి బిందుకము నిత్యముగా బిందువగును. కొంచు- కొనుచు, కొందును- కొనుదును అనునవి యిందుకుదాహరణములు.

39 సూ. మోః పత్యర్థే [15]

వృ: ముపర్ణకస్య బిందు ప్రకృతిభావ లోపా స్స్యుః పతిధాత్వాదేశే పరే. భయంపడి, భయముపడి, బయపడి.

తె. వృ: పతిధాత్వాదేశమయిన పడు పరమయినప్పుడు ముపర్ణకమునకు బిందు ప్రకృతిభావ లోపములు వచ్చును. భయంపడి (బిందువు), భయముపడి (ప్రకృతిభావము), భయపడి (లోపము).

40 సూ. సరళపరుషయో రుతో నుమ్ సే[16]

వృ: సమాసే ఉకారాంతస్య నుమ్ స్యాత్సరళ పరుష యోః పరయోః. గండుంగోవెల, తళుకున్గజ్జెలు. క్వాచిత్ స్థిరేచ. గిలుకున్మట్టెలు.

తె. వృ: సమాసమునందు పరుష సరళములు పరమయినప్పుడుత్తునకు నుమాగమ మగును. గండుంగోవెల, తళుకున్గజ్జెలు. స్థిరవర్ణము పరమయినప్పుడును కొన్నిచోట్ల నీ నుమాగమము గలదు. గిలుకున్మట్టెలు.

---

15. "ప్రథమా వైభక్తిక మోర్బిందుశ్చ, మహాన్ పతిక్రియార్థేషు" (ఆం. శ. చిం. సంధి 17సూ.)

16. "నుమ్యోతః" (ఆం. శ. చిం. సంధి. 31సూ.)

## 41 సూ. మోః పుంపూ[17]

వృ: సమాసే ముపర్ణకస్య పు, ంపు ఇత్యేతౌ భవతః. సరసపుఁబలుకు, సరసంపుఁబలుకు. నుమాగమత్వే అనిత్యత్వే—సరసపు పలుకు.

తె. వృ: సమాసమునందు ముపర్ణకమునకు పుంపు లాదేశముగా వచ్చును. సరసపుఁబలుకు, సరసంపుఁబలుకు అనునవి ఉదాహరణములు. నుమాగమ మనిత్యమను పక్షమున—సరసపు పలుకు.

## 42 సూ. ఇత్ సుపోఽనలాతః[18]

వృ: సమాసే సుప్సంబంధినః లవర్ణక వర్జితస్య అతః ఇత్స్యాత్[19]. నీతోడి వ్యవహారము, సింగమువలని భయము.

తె. వృ: సమాసమునందు నలవర్ణకములుకాక మిగిలిన విభక్తులకు సంబంధించిన అత్తునకు హ్రస్వమయిన ఇకారము ఆదేశముగా వచ్చును. నీతోడి వ్యవహారము, సంగమువలని భయము.

## 43 సూ. అలిజేః[20]

వృ: సమాసే అందో రల్యాగమ స్స్యాత్. నాయందలి కరుణ.

తె. వృ: సమాసమునందు సప్తమీ విభక్తియగు అందునకు 'అలి' అను నాగమము వచ్చును. నాయందలి కరుణ.

## 44 సూ. ద్విసులోర్వా రనచి పూర్వస్య లుగ్వా[21]

వృ: సమాసే ద్విసులోర్వాః పూర్వవర్ణస్య లుగ్వా స్యాత్ అనచి పరే. చనుగవ-చన్నుగవ, కలుకుండ - కల్లుకుండ. అనగ్రహణా త్పదాంతేఽపి. చనుగుడిచి, కలుద్రావి.

తె. వృ: సమాసమునందు అచ్చుతో మొదలుకాని పదము పరముగా నున్నప్పుడు ద్విత్వనులులలో పూర్వవర్ణమునకు వికల్పముగా లోపము

---

17. "మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ" (ఆం. శ. చిం. సంధి 35 సూ.)

18. "ఇచ్చ విభక్త్యంతిమస్య" (ఆం. శ. చిం. సంధి 37 సూ.)

19. ఇక్కడ "అచః పరస్యా ప్యాదేస్తు సంబంధినోహలః ద్విత్వంస" అనునొక వాక్యముకలదు. అది యీ సూత్రమునకు సంబంధించినది కాదనుట స్పష్టము.

20. "జే రలిచ" (ఆం.శ.చిం. సంధి 38 సూ.)

21. ప్రథమలుగపి ద్విసులోర్వాః (ఆం.శ.చిం. 36 సూ.)

వచ్చును. చనుగవ-చన్నుగవ, కలుకుండ - కల్లుకుండ. 'అనచి' యని సూత్రమునందు దానికే ప్రాధాన్యమిచ్చుటచేత సమాసము కాకపోయినను హలాదియగు వ్యస్తపదము పరముగా నున్నప్పుడు కూడ నీలోపము వికల్పముగా వచ్చునని గ్రహింపవలెను. చను గుడిచి, కలు ద్రావి.

## 45 సూ. క్వచి దన్యత్ర

వృ: క్వచి దన్యత్రాపి ప్రయోగానుసారేణ ప్రథమ లుగ్వా స్యాత్. వటివేఱు - వట్టివేఱు, కటుగంబము - కట్టుగంబము.

తె.వృ: ప్రయోగానుసారముగాఁ గొన్నియితర స్థలములందును నిట్లు ద్విత్వాక్షరములలోని ప్రథమ వర్ణము వికల్పముగా లోపించును. వటివేఱు - వట్టివేఱు, కటుగంబము-కట్టుగంబము.

## 46 సూ. గుజుమూనాం కచపాః

వృ: సమాసే గుజుమూనాం కచపాః భవంతి. వాకనీరు, రాచకొమరుఁడు, వేపపండు.

*ఇతి సంధిప్రకరణమ్*

తె. వృ: సమాసమునందు గు, జు, ము అనువానికి క్రమముగా క, చ, ప అనునవి యాదేశముగావచ్చును. వాకనీరు, రాచకొమరుఁడు, వేపపండు అనునవి క్రమముగా నుదాహరణములు.

సంధిప్రకరణము సమాప్తము

# స్వాది ప్రక్రియా

## (i) అజంతప్రకరణమ్

వృ: అకారాంతః పుంలింగః. రామసు ఇతిస్థితే-

తె.వృ: అకారాంతము, పుంలింగము. రామ + సు అని ఉండఁగా

### 1 సూ. మహ దస్త్రీజడః[1]

వృ: స్త్రీవాచక జడవాచకాని వర్జయిత్వా అన్యత్పదం మహత్సంజ్ఞం స్యాత్.

తె.వృ: స్త్రీవాచకములు, జడవాచకములు తప్ప మిగిలిన పదములు మహత్ సంజ్ఞకలవి.

### 2 సూ. సుపి మహతోఽన స్యాత ఉత్[2]

వృ: అవర్ణకవర్జితస్య మహతోఽత ఉత్ స్యాత్ సుపి పరే.

తె.వృ: అ-వర్ణకముతో నంతముకాని మహద్వాచకముల తుది అకారమునకు సుబ్విభక్తి పరమగునపుడు ఉకార మాదేశమగును.

### 3 సూ. సో ర్మహతో డు జనితః[3]

వృ: పుంలింగే ఇకారాంత వర్జితస్య మహత స్సోస్థానే డుజ్ స్యాత్. డలోపే ప్రాప్తే-

తె.వృ: పుంలింగమున ఇకారాంతముకాని మహద్వాచకమునకు పరమయిన 'సు' ప్రత్యయము స్థానమున డుజ్ వచ్చును. డ కారమునకు లోపము ప్రాప్తించుచుండగా[4]-

### 4 సూ. ప్రత్యయాదే ర్నేత్

వృ: ప్రత్యయాదేశ స్యాదివర్ణస్య ఇత్సంజ్ఞా న స్యాత్. జిత్ కార్యమ్.

---

1. ఆం. శ. చిం. 3.9
2. ఆం. శ. చిం. 3. 11
   అ-వర్ణకముతో నంతమగు పదములు-భ్రాత,ధాత,కర్త, హర్త మొదలగునవి.
3. ఆం. శ. చిం. 3. 12
4. 'చుటూ' (పా. 1. 3.7) అను సంస్కృతవ్యాకరణ సూత్రమువలన డకారమునకు ఇత్సంజ్ఞవచ్చి, తస్య లోపః, (పా. 1.3.9) అను సూత్రమువలన దానికి లోపము కలుగవలసివచ్చును.

తె.వృ: ప్రత్యయాదేశములో మొదటి వర్ణమునకు ఇత్సంజ్ఞ కలుగదు.[5] జిత్ కార్యముచే 'డు' కు వెనుక అనునాసికము చేరును. ప్రత్యయము 'ఁడు' 'ండు' అను రూపములను బొందును.

5 సూ. సు న ద్రుతః

6 సూ. క్రియాభ్యోఽపి

వృ: ప్రథమావిభక్తి రద్రుత సంజ్ఞా స్యా ద్ధాతుభ్యోఽపి. రాముఁడు, రాముండు.

తె.వృ: ప్రథమావిభక్తికి అద్రుత మని సంజ్ఞ. ధాతువులపై వచ్చు ప్రథమావిభక్తి కూడ అద్రుతమే[6]. రాముఁడు, రాముండు[7].

వృ: ద్వివచనం బహుత్వేనైవ వ్యవహ్రియతే.

తె.వృ. ద్వివచనము బహువచనముచేతనే వ్యవహరింపఁబడుచున్నది. అనఁగా వైకృతమున ద్వివచనము వేఱుగా లేదన్నమాట.

7 సూ. లు జసః[8]

వృ: సర్వస్మా న్నామ్నో జసః స్థానే లు స్యాత్. రాములు.

తె. వృ: ప్రతి ప్రాతిపదికమునకును జస్ స్థానమున 'లు' ఆదేశమగును. రాములు.

8 సూ. సుసోఽగారగా వామన్త్రణే[9]

వృ: ఆమన్త్రణే విహితస్య సుసః ఏకవచన బహువచనయోః అ(క్), ఆర(క్) [10] ఇత్యేతౌ భవతః.

---

5. ఈ సూత్రమువలన డుఙ్‌లోని డకారమునకు లోపము వారింపఁబడినది.

6. అసందేహార్థ మిట్లుచెప్పఁబడినది.

7. డుఙ్ ప్రత్యయము జిత్తుగనుక 'డు' సానునాసికముగా గ్రహింపవలయును. ఆ యనునాసికము అర్ధబిందు పూర్ణబిందురూపమైనది. కావున రాముఁడు, రాముండు అనురూపములు సిద్ధించినవి. ధాతువులకు; పఠించుచున్నాఁడు, పఠించినాఁడు.

8. ఆం. శ. చిం. 3. 14 "లు జసొ ల శసోఽలాన్తాత్"

9. ఆం. శ. చిం. 3. 13 "ఆమన్త్రణ సుజసో స్తః క్రమేణ చాదారదాగమావన్తే".

10. కకార మిత్తుగా జేర్చుట స్థాననియమము కొఱకు. ఆద్యంతౌ టకితౌ. (పా. 1. 1. 46) అను సంస్కృత వ్యాకరణసూత్రమునుబట్టి అ, ఆర అను ప్రత్యయములు అంతావయవములుగా చేరునని గ్రహించవలయును.

తె. వృ: ఆ మంత్రణమనఁగా సంబోధనము. సంబోధనమున విధింపబడిన (సుస్) ప్రథమావిభక్తికి ఏకవచన బహువచనములందు క్రమముగా అ(క్), అర(క్) అను ప్రత్యయములు చేరును.

## 9 సూ. ఓ హేః[11]

వృ: ఆమంత్రణవాచకానాం హే ఇత్యాదీనాం స్థానే 'ఓ' ఇత్యవ్యయః స్యాత్. ఓ రాముఁడ, ఓ రాములార.

తె. వృ: సంబోధనమును దెలుపు హే మొదలయినవాని స్థానమున 'ఓ' అను నవ్యయము వచ్చును. ఓ రాముఁడ, ఓ రాములార.

వృ: ఆమంత్రణే సోర్లోపః స్యా, దుతో వాప్యదితో ర్భవేత్

రో వా స్త్రీవాచకా న్నిత్యం, లింగాదిభ్యో మువర్ణకః,

ఓ రామ, ఓ రామా.[12] ప్రత్యయలోపే ప్రత్యయలక్షణ[13] మిత్యుత్వం న. న లుమతాంగస్యేతి[14] నిషేధాత్.

తె. వృ: సంబోధనమున ఉకారాంతమునకు సులోపము వికల్పము. అదిదంతములకు సులోపము కలుగును. స్త్రీ వాచకములకు వికల్పముగా రో చేరును. లింగాదులకు ము వర్ణకము నిత్యము. ఓ రామ, ఓ రామా. ప్రత్యయ లోపము కలిగినప్పుడు ఆ లోపించిన ప్రత్యయమునకు సంబంధించిన లక్షణము నిలిచి యుండునను పరిభాషనుబట్టి డుజ్ ప్రత్యయ సంబంధియగు ఉ కారము నిలిచియుండు ననుకొనఁదగదు. లుమంతమైన లోపవిధి కలిగినప్పు డంగమునకు ప్రత్యయలక్షణము నిలిచియుండదని నిషేధ మున్నది గనుక.

## 10 సూ. అనితో న్వమః[15]

వృ: ఇకారాంతవర్జితా దమః స్థానే ను స్యాత్. రామును.

తె. వృ: ఇకారాంతముకాని అంగమునకు పరమైన అమ్ ప్రత్యయము స్థానమున 'ను' వచ్చును. రాము + ను (అనియుండఁగా)-

---

11. ఈ సూత్రమిచ్చట వ్రాతప్రతిలో చ్యుతమై యుండును. (వ.గో.కృ) తాళపత్ర ప్రతిలోఁ గలదు.

12. ఆం. శ. చిం. 3.21 "నామన్త్రణే డు జిత్యన్యే".

13. పా. 1. 1. 62. "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్".

14. పా. 1. 1. 63 "న లుమతాంగస్య".

15. ఆం. శ. చిం. 3.16 "నిరమో మహతామ్".

11 సూ. న్యమో డుమతశ్చ[15]

వృ: యేభ్యో డుజ్ విధీయతే తేషాం డుమత్సంజ్ఞా. ఇకారాంతాత్ డుమతశ్చ అమః స్థానే ని స్యాత్. రాముని.

తె. వృ: వేనికి డుజ్ విధింపఁబడుచున్నదో వానికి డుమత్తులని సంజ్ఞ. ఇకారాంతమునకును, డు మత్తునకును అమ్ ప్రత్యయము స్థానమున 'ని' వచ్చును. రాముని అగును.

12 సూ. ల శసః[16]

వృ: శసః స్థానే ల వర్ణకః స్యాత్. రాముల.

తె. వృ: శస్ ప్రత్యయము స్థానమున 'ల' వర్ణకము వచ్చును. రాముల.

13 సూ. ని ష్టాదౌ మహతోఽనితోవా[16a]

వృ: ఇకారాంత వర్జితస్య మహతః నిర్వా స్యాత్ టాదౌ వేకవచనే పరే.

తె. వృ: ఇకారాంతముకాని మహద్వాచకమునకు టాదివిభక్తుల యేకవచనము పరమగుచుండఁగా వికల్పముగా 'ని' చేరును.

14 సూ. చే చేతౌ టాసః[17]

వృ: తృతీయాయాః స్థానే చే చేత ఇత్యేతౌ భవతః. రామునిచే-రాముచే; రామునిచేత-రాముచేత.

తె. వృ: తృతీయా విభక్తిస్థానమున చే, చేత అనునవి వచ్చును. రామునిచే-రాముచే; రామునిచేత-రాముచేత.

15 సూ. భిసాదౌ లః[16]

వృ:సర్వస్మాన్నామ్నః లవర్ణకః స్యాత్ భిసాదౌ బహువచనే పరే. రాములచే, రాములచేత.

తె. వృ: ప్రతి నామమునకును భిస్ మొదలయిన బహువచన ప్రత్యయములు పరమగుచుండఁగా ల వర్ణకము చేరును. రాములచే, రాములచేత.

---

15. ఆం. శ. చిం. 3.16 "నిరమోమహతామ్".

16. ఆం. శ. చిం. 3.14 "లుజసో లశసోఽలాన్తాత్".

16a. ఆం. శ. చిం. 3.19 "మహతోనితౌ విభక్తౌ టాదౌ వచనద్వయే క్రమేణాస్తః".

17. ఆం. శ. చిం. 3.22 "టాస శ్చేతః".

### 16 సూ. కైకొఱకు జేసః[18]

వృ: చతుర్థ్యాః స్థానే కై కొఱకు ఇత్యేతౌ భవతః. రామునికై-రాముకై; రామునికొఱకు-రాముకొఱకు; రాములకై; రాములకొఱకు.

తె. వృ: చతుర్థీవిభక్తిస్థానమున కై కొఱకు అనునవి వచ్చును. రామునికై-రాముకై; రామునికొఱకు-రాముకొఱకు; రాములకై; రాములకొఱకు.

### 17 సూ. వలన జసినః[19]

వృ: పంచమ్యాః స్థానే వలన ఇతి స్యాత్. రామునివలన-రామువలన; రాములవలన.

తె. వృ: పంచమీవిభక్తి స్థానమున వలన అను ప్రత్యయము వచ్చును. రామునివలన-రాముదవలన, రాములవలన.

### 18 సూ. జసః క్య యుష్మదః[20]

వృ: యుష్మద్వర్జితస్య పదస్య ఇవర్ణాత్ పరతః షష్ఠ్యాః కి స్యాత్. రామునికి. ప్రత్యయకార్యమపి ప్రాతిపదికాంగత్వేన జ్ఞేయమ్.

తె. వృ: నీవు అనునది కాక తక్కిన పదముల చివరి ఇ వర్ణముపై వచ్చు షష్ఠీ విభక్తి యేకవచన ప్రత్యయమున కాదేశముగా 'కి' వచ్చును. రామునికి, ఇక్కడ టా ద్యేకవచన విభక్తి కార్యముగా వచ్చిన 'ని' ప్రాతిపది కాంగముగ పరిగణింపఁదగును. అందువలననే ఇ వర్ణమునకు పరమైన షష్ఠీ విభక్తి యేకవచనమున కాదేశముగా 'కి' వచ్చినది.[21]

### 19 సూ. కు జమః[22]

వృ: షష్ఠ్యాః స్థానే కువర్ణకః స్యాత్.

తె. వృ: షష్ఠీవిభక్తి స్థానమున 'కు' వర్ణకము వచ్చును.

---

18. ఆం. శ. చిం. 3.23 "జేసః కై కొఱకూ".

19. ఆం. శ. చిం. 3.24. "జసిన ఉచ్యతే వలనః".

20. ఆం. శ. చిం. 3.40; 4.17 "ఇతాం జసః కిశ్చ"; "కిర్న జమః".

21. ఇట్లు పరిగణింపనప్పుడు ముందుచెప్పఁబోవు, 19, 20 సూత్రములు విధించు కార్యములు వచ్చును.

22. ఆం. శ. చిం. 3.26, "జమః కు రనితామ్".

### 20 సూ. ఉకో నకౌ నిత్యమ్[23]

వృ: ఉగంతాత్ జమః అపవాదత్వేన నిత్యం నకారః స్యాత్ కౌ పరే. రామునకు, రాములకు.

తె. వృ: ఉకారాంతములకు, ఋకారాంతములకు జమ్‌కు ఆదేశముగా వచ్చు కు వర్ణకమునకు వెనుక 13వ సూత్రముచే రాఁదగిన 'ని' కి అపవాదముగా 'న' నిత్యముగా వచ్చును. రామునకు, రాములకు.[24]

### 21 సూ. అందు జిపః[25]

వృ: సప్తమ్యాః స్థానే అందు ఇతి స్యాత్. రామునియందు.

తె. వృ: సప్తమీవిభక్తి స్థానమున 'అందు' వచ్చును. రాముని యందు.

### 22 సూ. నిలోపే నుమ్

వృ: రామునందు; రాములయందు, రాములందు

తె. వృ: ని లోపించినప్పుడు ను వచ్చును. రామునందు; రాముల యందు, రాములందు.

వృ: స్త్రీజడవాచకానా మమహత్సంజ్ఞా.

తె. వృ: స్త్రీ వాచకములు, జడవాచకములు నగు శబ్దముల కమహత్తులని సంజ్ఞ.

### 23 సూ. ముమ్ముంబు నపృతోఽమహతశ్చ[26]

వృ: అమహతశ్చ నపుంసకలింగే వర్తమానాచ్చ అకారాంతాత్ సోఃస్థానే ముమ్ము ఇత్యేతౌచ, బిందుపూర్వకో బుశ్చ భవతి. వృత్తము, వృత్తమ్ము, వృత్తంబు.

తె. వృ: అకారాంతములయిన నపుంసకములకును అమహద్వాచకములకును పరమయిన 'సు' విభక్తి ప్రత్యయము స్థానమున ము, మ్ము, ంబు అను వర్ణకము లాదేశమగును. వృత్తము, వృత్తమ్ము, వృత్తంబు.

---

23. ఆం. శ. చిం. 3.25. "నః కౌ".

24. ఋకారాంతమున కుదాహరణము–విధాతృనకు.

25. ఆం. శ. చిం. 3.27, "అందు జి పః".

26. ఆం. శ. చిం. 3.35, 36 "స్యాదమహతాం విభక్తౌ సోశ్చము"; "తదుపరి పునర్మ్యుబూ ప్రాచామ్".

వృ: యేభ్యో వుమూ విధీయేతే తేషాం వుమువత్సంజ్ఞా.

తె. వృ: ఏ శబ్దములకు 'సు' ప్రత్యయస్థానమున వు, ము వర్ణకములు విధింపఁబడునో వానికి వు ము వత్తులని సంజ్ఞ.

## 24 సూ. వుమూ తద్వతః

వృ: వుమువతః ప్రాతిపదికాత్ వుమూ భవతః సుప్రత్యయవర్జితే వర్ణకే పరే. వృక్షములు. తదుపలక్షణాత్ మ్ముంబూచ. వృక్షమ్ములు-వృక్షంబులు. ఓ వృక్షమ-ఓ వృక్షమ్మ-ఓ వృక్షంబ, ఓ వృక్షములార- ఓ వృక్షమ్ములార- ఓ వృక్షంబులార, వృక్షమును - వృక్షమ్మును - (వృక్షంబును), వృక్షముల - వృక్షమ్ముల - వృక్షంబుల, వృక్షముచేత-వృక్షమ్ముచేత ఇత్యాది రూపాణి సంచారణీయాని.

తె. వృ: 'సు' కాక తక్కిన విభక్తి ప్రత్యయములు పరమగునపుడు వుమువత్తు లయిన ప్రాతిపదికములకు వుములు ఆగమముగా వచ్చును. 'ము' కు ఉపలక్షణముగా మ్ము, ంబులను గూడ గ్రహింపఁదగును. వృక్షములు-వృక్షమ్ములు-వృక్షంబులు; ఓ వృక్షమ-ఓ వృక్షమ్మ-ఓ వృక్షంబ; ఓ వృక్షములార - ఓ వృక్షమ్ములార - ఓ వృక్షంబులార ; వృక్షమును - వృక్షమ్మును-వృక్షంబును; వృక్షముల-వృక్షమ్ముల-వృక్షంబుల; వృక్షము చేత-వృక్షమ్ముచేత-వృక్షంబుచేత మొదలగు రూపములు ప్రయోగింపఁదగినవి.

## 25 సూ. అందౌ నుమో వికల్పః[27]

తె. వృ: అందు వర్ణకము పరమగునపుడు ను ఆగమముగా వచ్చుట వికల్పము.

వృ: వృక్షమునందు, వృక్షమందు.

తె. వృ: వృక్షమునందు, వృక్షమందు.

## 26 సూ. పురుషవ్యాఘ్రాదీనా ముపమిత సమాసాశ్రయణేన మహత్త్వమ్.[28]

## 27 సూ. అన్యథాత్వమహత్త్వమ్[28]

వృ: అతః పక్షద్వయేఽపి-పురుషవ్యాఘ్రుఁడు, పురుషవ్యాఘ్రము ఇత్యుభయ మపి జ్ఞేయమ్.

---

27. 22వ సూత్రమునకు ప్రస్తుత సందర్భమున నీ సూత్రము వికల్పమును విధించుచున్నది.

28. అథ. కా. 3.5 "వివక్షాతః ప్రవృత్తిశ్చ, ప్రత్యయస్య క్వచి ద్భవేత్."

తె. వృ: పురుష వ్యాఘ్రాది శబ్దముల నుపమిత సమాసములుగా గ్రహించుటచే మహద్వాచకత్వము కలుగుచున్నది. అన్యథా-రూపకసమాసముగా గ్రహించునపుడు అమహద్వాచకత్వము కలుగును.

కనుక రెండు పక్షములలోను-పురుషవ్యాఘ్రుఁడు-పురుషవ్యాఘ్రము అని రెండు విధముల యుదాహరణములు గ్రహింపఁదగును.

28 సూ. మేఘపర్వతాదీనాం పురుషధర్మప్రతీతికరత్వే తథైవ[29]

మేఘ, పర్వతాది శబ్దములు పురుషధర్మము దెలుపునపుడును పై విధముననే ఉదాహరణములు గలుగును: మేఘుఁడు – మేఘము; పర్వతుఁడు-పర్వతము.

29 సూ. ముఖచన్ద్రశబ్దస్య ఉపమితసమాసాశ్రయణేపి మహత్త్వమేవ.

తె. వృ: ముఖచంద్ర శబ్దము నుపమిత సమాసముగా గ్రహించినను దానిని మహత్త్వముననే ప్రయోగింపఁదగును. ముఖచంద్రుడు. ముఖచంద్రమని ప్రయోగము కూడదు.

30 సూ. బాలాదేః లోపధా ద్రో లః[30]

వృ: లోపధా ద్బాలాదిశబ్దాత్ పరస్య లః రేఫాదేశః స్యాత్. బాలుఁడు, బాలురు, ఓ బాలుఁడ, ఓ బాలులార,[31] బాలుని, బాలురన్, బాలునిచేత, బాలురచేత ఇత్యాది.

తె. వృ : లకార ముపధగాఁగల బాలాది శబ్దములకుఁ బరమగు వర్ణక లకారమునకు రేఫాదేశమగును. బాలుఁడు, బాలురు, ఓ బాలుడ, ఓ బాలులార, బాలుని, బాలురన్, బాలునిచేత, బాలురచేత మొ.

29. అథ. కా. 3.7 "భవే దమహతోఽప్యర్థవిశేషే మహదాకృతిః".

30. .........పధాద్రూలః-వ్రాతప్రతి. వృత్తినిబట్టి సాధుపాఠ మూహింపఁబడినది. ఆం. శ. చిం. 3.15 "లాన్తాత్తు రురౌ తయోః క్రమేణ స్తః."

31 'ఓ బాలులార' అని వ్రాతప్రతి పాఠము. కాని సూత్రమునుబట్టి "ఓ బాలురార!" అని యుండవలసినట్లు తోఁచుచున్నది.

### 31 సూ. ధర్మాదే ర్వ్వర్వా సోః[32]

వృ: ధర్మాదేః సోః స్థానే వుర్వా స్యాత్. ధర్మువు, ధర్ముపులు; పక్షే-ధర్మము.

తె. వృ: ధర్మాది శబ్దములకుఁ బరమగు 'సు' ప్రత్యయము స్థానమున వికల్పముగా 'వు' వచ్చును. ధర్మువు, ధర్ముపులు, పక్షాంతరమున-ధర్మము.[33]

### 32 సూ. కృద్ద్యుదేజంతాససురాసురయోధాః[34] స్త్రీసమాః

వృ: కృదాదేశా దీర్ఘాంతా ఉకారాంతా ఏజంతాః సమాసాభావే సురాదయశ్చ స్త్రీ సమా భవన్తి. స్త్రీసమం స్త్రీవత్. స్త్రీసమం స్త్రీవద్విహితకార్యం భవతి. ఇతి స్త్రీ వద్భావా దమహత్త్వమ్.

తె. వృ : కృత్ ప్రత్యయాంతముల యాదేశములు, దీర్ఘాంతములు, ఉకారాంతములు, ఏ ఓ ఐ ఔ అంతమందుఁగలవి, సమాసాంగములుకాని సుర-అసుర-యోధ శబ్దములు స్త్రీసమము లగును. స్త్రీసమము స్త్రీలింగము వంటిది. అనఁగా స్త్రీ లింగమునకుఁ జెప్పిన కార్యములు స్త్రీ సమమునకుఁగూడ వర్తించును. కావున స్త్రీవద్భావమునలన అమహత్త్వము కలుగుచున్నది.

### 33 సూ. స్త్రియా మనుదోతో లుక్

వృ: స్త్రియాం వర్తమానాత్ ఉకారౌకారాంతవర్జితాత్ పదాత్ సోర్లుక్ స్యాత్. అసుర, అసురలు, ఓయసుర, ఓయసురలార, అసురను, అసురల. అమహత్త్వాత్ నిర్న. అసురచేత, అసురలచేత ఇత్యాది. సురశబ్దస్య బహువచనత్వమేవ. సురలు అసమాసే కిమ్ ? స్త్రీసమత్వం న. మహాసురుఁడు, మహాయోధుండు, భూసురుండు.

తె. వృ : స్త్రీ త్వమున నుండు ఉకారాంతములు, ఓకారాంతములు కాని పదముల 'సు' విభక్తి లోపించును. అసుర, అసురలు, ఓయసుర, ఓయసురలార, అసురను, అసురల. స్త్రీ సమము అమహత్తులగుటవలన 13-వ సూత్రమున విధింపఁబడిన 'ని' వర్ణాగమము రాదు. కనుక--అసురచేత, అసురలచేత మొ. సుర శబ్దము బహువచనముననే యుండును. సురలు. అసమాసమున ననుటవలన-సమాసమున స్త్రీసమత్వము కలుగదు. మహాసురుఁడు, భూసురుండు, మహాయోధుండు.

---

32. అథ. కా. 3. 26 "భవే ద్ధర్మాదిశబ్దానాం ముశ్చ వుశ్చాత్ర కుత్రచిత్." వృత్తినిబట్టి సూత్రమూహింపఁబడినది. ప్రత్యంతరమున 'ధర్మాదేహ' అని యున్నది.

33. ధర్మాదులనుటచే-కర్మువు-కర్మము; వర్మువు-వర్మము.

34. కృత్ + ది + ఉద్ + ఏజంత + అస + సురాసురయోధాః అని పదవిభాగము. ది-దీర్ఘము. అస-సమాసముకాని.

## 34 సూ. కుశగే వా

వృ: కుశాదయః స్త్రీ సమా వా స్యుః. కుశ, హంస, భ్రమ, అభిలాష, వేగ, పులక, అలక, పనస, పక్షే-కుశము, హంసము ఇత్యాది.

తె. వృ : కుశాదిగణములోని శబ్దములు వికల్పముగా స్త్రీ సమము లగును. కుశ, హంస, భ్రమ, అభిలాష, వేగ, పులక, అలక, పనస. పక్షాంతరమున-కుశము, హంసము మొ.

## 35 సూ. తద్భవే సురవ త్సమయాః

వృ: సంస్కృతభవత్వదశాయాం సమయాదయః శబ్దాః సురాదివత్ స్త్రీ సమా భవంతి. సమ్మియ, దొర, తరగ.

తె. వృ : సమయాది శబ్దములు తద్భవ స్థితియందు సురాదుల వలె స్త్రీసమము లగుచున్నవి. సమ్మియ, దొర, తరగ.

## 36 సూ. శయ్యార్యక్రూరయజ్ఞగ్రంథిశబ్దాద్యాః ప్రాకృతాదిషు

వృ: ప్రాకృతాదిభాషాసక్తే యే శయ్యాదిగణాః తే తత్సమత్వేన ప్రయోజ్యాః. కొంచ, అయ్య, కూళ, హనుమ, కప్ప, గూవ(బ).

తె. వృ : ప్రాకృతాదులగు నాలు భాషలలోని శయ్యాది గణము లందలి శబ్దములు తత్సమములు (ప్రాకృతసమములు) గానే ప్రయోగింపఁ దగినవి. కొంచ, అయ్య, కూళ, హనుమ, కప్ప, గూబ.

## 37 సూ. హో హ ద్వక్రః

వృ: హకారాత్ పర ఏజ్ హ్రస్వో భవతి.

తె. వృ : హకారమునకుఁ బరముగాఁ జెప్పఁబడిన ఏఓలు హ్రస్వములు. హెత్-ఎ, హొత్-ఒ.

## 38 సూ. ఇయో హేత్

వృ: తద్భవపదే ఇయ ఇత్యస్య హేత్ భవతి. అతో గోళియశబ్దస్య గోళె ఇతి రూపమ్.

తె. వృ : తద్భవపదమగునప్పుడు 'ఇయ'కు బదులు హ్రస్వమయిన ఎకారము వచ్చును. అందువలన గోళియ శబ్దమునకు గోళె అను రూప మేర్పడును.

వృ: అల్విధావపి స్థానివ ద్భావో బహుళ మిష్యతే ఇతి త్రిసమత్వం న. సుపః స్థానివదాదేశే-గోశెము, గోశెములు ఇత్యాదిని వా రూపాణి.

తె. వృ : వర్ణవిధికి సంబంధించని యాదేశము స్థానివంటిదే యగు (స్థానివ దాదేశోఽనల్విధౌ. పా. 1. 1. 56) అను సంస్కృత వ్యాకరణ సూత్రవిషయము బహుళముగా గ్రహించుట బుధసమ్మతము. కనుక ఇచ్చట త్రిసమత్వము లేదు. సుప్పునకు స్థానివంటిదైన యాదేశమురాఁగా-గోశెము అనురూపము సిద్ధించుచున్నది. గోశెము-గోశెములు మొదలగు రూపములు వికల్పముగాఁ గలుగును. సంస్కృత వ్యాకరణ సూత్రప్రకారము వర్ణవిధియందు స్థానివద్భావము లేనందున-గోశె, గోశెలు అను రూపములు వికల్పితములగుచున్నవి.

వృ: ఏవం భవాదీనాం తద్భవత్వే బాము, బాములు ఇత్యాది.

తె.వృ: ఇట్లే భవ మొ. శబ్దములు తద్భవములగునప్పుడు బాము, బాములు మొ. రూపము లేర్పడును.

వృ: సంస్కృత సమత్వేన ప్రతీతివైషమ్యకారాణా మేకాదీనాం ప్రయోగో న. కింతు ప్రాకృత తద్భవాదిత్వేనైవ. ఒక్కండు. అనస్యేతి నిషేధా దుత్వం న.

తె.వృ: ఏకాదిశబ్దములు సంస్కృత సమములుగా బ్రయుక్తములగు నపుడు అర్థప్రతీతి సమముగాఁ గలుగదు. అందువలన ప్రాకృత తద్భవ రూపముననే ప్రయోగింపఁబడును. ఏకో్క—ప్రా.ఒక్క. ఇక్కడ ఓకారము నకు బదులుగా అవర్ణకము చేరినది. కావున డుజ్ ప్రత్యయము చేరునపుడు 2 వ సూత్రములో 'అనస్య' అని నిషేధింపఁబడినందున ఉత్వము రాదు. కనుక ఒక్కఁడు ఒక్కండు అను రూపములు సిద్ధించును.

## 39 సూ. అ-దీ-దారాదేః

వృ: అవర్ణకాత్ దీర్ఘాంత వర్ణకాత్ దారాదేశ్చ లకారస్య రేఫః స్యాత్.

తె.వృ: అవర్ణక-దీర్ఘాంత వర్ణకములకును, దారాది శబ్దములకును బరమైన లకారము రేఫమగును. ఒక్క+లు. ఒక+రు.

## 40 సూ. అ-దీ-వర్ణకేభ్యో డుజ్

వృ: అవర్ణకా ద్దీర్ఘాంత వర్ణకేభ్యః డుజ్ స్యాత్.

తె.వృ: అవర్ణకమునకును, దీర్ఘాంతవర్ణకములకును పరమందు డుజ్ వచ్చును. ఒక్క+ఁడు+రు.

## 41 సూ. నలడాదేః[35]

వృ: నలడాదే ర్వర్ణస్య ఉతో లుగ్వా స్యాత్.

తె.వృ: న, ల, డ మొ. వర్ణముల ఉకారమునకు లోపము వచ్చును. ఒక్కఁడ్ + రు.

వృ: హ్రైకాచ ఇత్యాదినా సంయోగే బిందుః. ఒక్కండు – ఒక్కఁడ్రు – ఒక్కండురు. పెక్కండ్రు – ఇత్యస్య బహువచన త్వమేవ.

తె.వృ: హ్రైకాచ (సంధి. 38.) అను సూత్రమువలన హ్రస్వమునకుఁ బరముననున్న బిందుకము (అరసున్న) సంయోగము పరమయినప్పుడు పూర్ణబిందువగును. ఒక్కండ్రు – ఒక్కఁడురు – ఒక్కండురు. పెక్కండ్రు అనుదానికి బహువచనము మాత్రమే యుండును.

వృ: ఎల్ల ఇత్యాదౌ అవర్ణకస్య వైకల్పికత్వాత్. ఎల్లండ్రు, ఎల్లరు ఇత్యాది.

తె.వృ: ఎల్ల మొ. శబ్దములలో అవర్ణకము వైకల్పికమగుటవలన ఎల్లండ్రు, ఎల్లరు మొ.

## 42 సూ. గురు ర్దమః

వృ: దవర్ణకాత్ లకారస్య గురురేఫఃస్యాత్. కొందఱు

తె.వృ: దవర్ణకమునకు పరమందలి లకారమునకు బదులు గురురేఫము వచ్చును. కొందఱు.

## 43 సూ. శసాదా విద్వా

తె.వృ: శస్ మొదలగు ప్రత్యయములు పరమగునపుడు వికల్పముగా 'ఇత్' వచ్చును.

వృ: కొందఱు, కొందఱిని,[36] కొందఱను, కొందఱిచేత, కొందఱచేత ఇత్యాది.

తె.వృ: కొందఱు, కొందఱిని, కొందఱను, కొందఱిచేత, కొందఱ చేత మొ.

వృ: ఏవ మెందాదయః.

---

35. నలడాదే రంతరుతశ్చ. ఆం.శ.చిం. 242

36. కొందఱిని, కొందఱిచేత ఇత్యాది రూపముల నిందు సాధించుట గమనింపఁ దగినది.

తె.వృ: ఇక్లే ఎందఱు మొ.

వృ: స్వశబ్దస్య తత్సమత్వేన ప్రయోగాభావే-

తె.వృ: స్వశబ్దమునకు తత్సమముగా ప్రయోగము లేనందున-

## 44 సూ. స్వస్య తా

వృ: స్వశబ్దస్య తా ఇత్యాదేశః స్యాత్.

తె.వృ: స్వశబ్దమునకు 'తా' అని యాదేశమగును.

వృ: స్వశబ్దస్య టాసాదౌ పరే హ్రస్వః స్యాత్.

తె.వృ: స్వశబ్దమునకు తృతీయాది విభక్తులు పరమగునపుడు హ్రస్వము వచ్చును.

వృ: చకారాత్ సుజసో రమ్శసో ర్వికల్పాత్ ద్విత్వమ్, హ్రస్వశ్చ. తాను తాము, తన్ను, తను, తమ్ము, తము.

తె.వృ: చకారాధికారమువలన సు, జస్, అమ్, శస్‌లకు వికల్పముగా ద్విత్వమును, హ్రస్వమును గలుగును. తాను, తాము, తన్ను, తను, తమ్ము, తము.

## 45 సూ. నమౌ స్వస్య టాసాదౌచ

వృ: స్వశబ్దాదేశస్య వచనద్వయే నిలయో రపవాదకత్వేన న, మ ఇత్యేతౌ భవతః టాసాదౌ పరే. తనచేత, తమచేత, తనకొఱకు, తమకొఱకు, తనవలన, తమ వలన, తనకు, తమకు, తనయందు, తమయందు. అదిదారాదే రితి జసఃస్థానే రుశ్చ. తారు.

తె.వృ: స్వశబ్దాదేశమయిన తా (ను) శబ్దమునకు టాస్ మొ॥ (తృతీయాది) విభక్తులు పరమైనప్పుడు 13, 15 సూ. ప్రకారము రాఁదగిన ని,ల వర్ణములకు బదులు (అపవాదముగా) న, మ వర్ణములు వచ్చును. తా హ్రస్వమగును. తనచేత, తమచేత, తనకొఱకు, తమకొఱకు, తనవలన, తమవలన, తనకు, తమకు, తనయందు, తమయందు. 'అ-ది-దారాదేః' అను 39 సూ. ను బట్టి జస్ ప్రత్యయము స్థానమున రు-వర్ణకముగూడ వచ్చును. తారు.

వృ: నామావయవతా ప్రాప్తౌ పూర్వాదేశస్య కుత్రచిత్।
సుజసోః పౌనరుక్త్యం స్యాత్ తత్ర రేఫో న కథ్యతే॥

ఇతి జసః పౌనరుక్త్యే-



తె.వృ: మొదట వచ్చిన విభక్త్యాదేశము ఒకానొకచో నామమున కవయవముగా నేర్పడిపోవును. అప్పుడు మరల సు, జస్-అను విభక్తి ప్రత్యయములు చేరుచుండును. అట్టిసందర్భమున 'అ-ది-దారాదేః' అను 39 సూత్రమునఁ జెప్పఁబడిన రు వర్ణకమురాదు. ఈ నియమమునుబట్టి 'తాము' అనునదే నామముగా నేర్పడి జస్ ప్రత్యయమును మఱలఁ జేర్పవలసిరాఁగా-

## 46 సూ. లే చేతనానామ్

వృ: చేతనవాచినాం రేఫః స్యాత్ లకారే పరే తారలు, తమ్ములు.

తె. వృ: లకారము పరమగునపుడు చేతన వాచకములకు రేఫము వచ్చును. తారలు, తమ్ములు.

## 47 సూ. నమౌ జసాదా వపీతి కేచిత్

తె. వృ: 45 సూ. ప్రకారము తృతీయాది విభక్తులకు మాత్రమే విధింపఁబడిన నములు జసాది విభక్తులలోఁగూడ వచ్చునని కొందఱిమతము.

వృ: తమరు, తనను, తముల.

తె. వృ: తమరు, తనను, తముల.

## 48 సూ. నలులేషు మోః ఋగ్వాసంస్కృతాత్[37]

వృ: సంస్కృత వ్యతిరిక్తాత్ ప్రాతిపదికాత్ ముపర్ణకస్య ఋగ్వాస్యాత్ నలుల-ఇత్యేతేషు వర్ణకేషు పరేషు. శిత్త్వాత్ పూర్వస్య దీర్ఘః. కారము, కారాలు-కారములు, కారమును, కారాల-కారముల, కారముచేత, కారాలచేత-కారముల చేత ఇత్యాది.

తె. వృ: సంస్కృతమునకుఁ జెందని ప్రాతిపదికములకు న, లు, ల-అనునవి పరమగునపుడు ముపర్ణకమునకు ఋక్కు వికల్పముగా వచ్చును. 'ఋక్కు' అనఁగా లోపించుట. శవర్ణ మిత్తుగాఁ జేర్పఁబడినందున (సంజ్ఞ. 16 సూ. ప్రకారము)పూర్వస్వరమునకు దీర్ఘము వచ్చును. కారము, కారాలు-కారములు; కారమును, కారాల-కారముల; కారముచేత, కారాలచేత, కారములచేత మొ.

ఇత్యకారాన్తాః.

అకారాంతములు ముగిసెను.

---

37. ఆం. శ. చిం. 3.43 "వికృతౌ క్వచిచ్చ లోపో, మోర్దీర్ఘశ్చాత ఆది మస్య భవేత్". ఋక్ + వా + అసంస్కృతాత్-అని పదవిభాగము.

## 49 సూ. దేశ్యోఽదేశ్యైకవర్ణే[38]

వృ: దేశ్యపద మేకవర్ణ ప్రాతిపదికంచ వర్జయిత్వా దీర్ఘస్య హ్రస్వః స్యాత్ సుపి పరే. సోమపుఁడు, సోమపులు-ఇత్యాది రామవత్. దీర్ఘాంతస్య స్త్రీ సమత్వే నేజా, నేజాలు ఇత్యాది.

తె. వృ: దేశ్యపదమును, ఏకవర్ణముగల ప్రాతిపదికమునుగాక తక్కిన ప్రాతిపదికముల తుదిదీర్ఘము సుప్ ప్రత్యయము పరమయినప్పుడు హ్రస్వమగును. సోమపా-సోమప-సోమపుఁడు, సోమపులు మొ॥ రామ శబ్దమువలె. దీర్ఘాంతము స్త్రీసమమయినప్పుడు ఈ సూత్రము విధించిన హ్రస్వము రాదు. కనుక-నేజా, నేజాలు మొ॥

వృ: తద్ధితాదేశస్య స్త్రీసమత్వం న. వన్నెకాఁడు. "అ-ది-వర్ణకేభ్యోడుజ్" ఇతి జసి డుజ్. వన్నెకాండ్రు, వన్నెకాని, వన్నెకాండ్ర, వన్నెకానిచేత, వన్నెకాండ్ర చేత ఇత్యాది.

తె. వృ: తద్ధిత ప్రత్యయాంతమున కాదేశముగా వచ్చు ప్రాతిపదికము స్త్రీ సమముకాదు. వన్నెకాఁడు. "అ-ది-వర్ణకే భ్యోడుజ్'' అను 40వ సూ. ప్రకారము డుజ్ చేరును. వన్నెకాండ్రు, వన్నెకాని, వన్నెకాండ్ర, వన్నెకానిచేత, వన్నెకాండ్రచేత మొ॥

## 50 సూ. ఇతః[39]

వృ: లింగత్రయేఽపి వర్తమానాత్ ఇకారాన్తాత్ పరతః సోర్లుక్‌స్యాత్ హరి.

తె. వృ. మూడు లింగములందును ఇకారాంతమునకుఁ బరమయిన 'సు' ప్రత్యయము లోపించును. హరి. (మతి, వారి).

## 51 సూ. ఇతో జసాదా వుత్[40]

వృ: ఇకారాంతస్య ఉత్ స్యాత్ జసాదౌ బహువచనే పరే. హరులు. సులోపా దగాగమో న. ఓహరి, ఓహరీ, ఓహరులార, హరిని, హరుల, హరిచేత, హరులచేత, హరికొఱకు, హరులకొఱకు, హరివలన, హరులవలన, హరికి, హరులకు హరియందు, హరులయందు.

---

38. ఆం. శ. చిం. 47, 48, 49 "దీర్ఘాణాం హ్రస్వః స్యాత్, న చ దేశ్య పదే, న చైకవర్ణేఽపి".

39. ఆం. శ. చిం. 3-37 "సోర్లు గితః".

40. ఆం. శ. చిం. 3-38 "ఉ ద్బహుత్వే".

తె. వృ: జస్ మొదలగు బహువచన ప్రత్యయములు పరమగునపుడు తుది ఇకారమునకు బదులు 'ఉ' వచ్చును. హరులు. 'సు' ప్రత్యయము లోపించినందున సంబోధనమున అక్-ఆగమము (8వ సూత్రమున విధింపఁబడినది) రాదు. ఓహరి, ఓహరీ, ఓహరులార, హరిని, హరుల, హరిచేత, హరులచేత, హరికొఱకు, హరులకొఱకు, హరివలన, హరులవలన, హరికి, హరులకు, హరియందు, హరులయందు.

## 52 సూ. చ ర్దంత్యోఽతాలవ్యాచ్

వృ: వైకృతకార్యే తాలవ్యాజ్విరహిత శ్చవర్గో దంత్యోచ్చారః స్యాత్. హిమరుచి-హిమరుచులు. సావర్ణ్యాత్ శకార స్యాపీతి కేచిత్. రాశి-రాసులు.

తె. వృ: వైకృత కార్యమున తాలవ్యాచ్చులు (ఇ, ఈ, ఎ, ఏ, ఐ,) లేని చ, జ దంత్యోచ్చారణమును పొందును. హిమరుచి-హిమరుచులు. సవర్ణమగుటవలన తాలవ్యమైన శవర్ణమును పై విధముననే దంత్యోచ్చారణమును బొందునని కొందఱి మతము. రాశి-రాసులు.[41]

## 53 సూ. ఇమ్యాదేః పూర్వస్య చ

వృ: ఇమ్యంతాదే రుపోత్తమేకారస్య చ ఉత్ స్యాత్ బహువచనే పరే. బలిమి-బలుములు; పోడిమి - పోడుములు. ఆదిగ్రహణాత్-ములికి-ములుకులు; ఉదిరి-ఉదురులు.

తె. వృ: 'ఇమి' వర్ణకాంతములు మొదలగువాని తుది ఇకారము వెనుకనున్న ఇకారమునకుఁగూడ బహువచనమున ఉత్ ఆదేశమగును. బలిమి-బలుములు; పోడిమి-పోడుములు. 'ఆది' శబ్దగ్రహణమువలన-ములికి-ములుకులు, ఉదిరి-ఉదురులు-అని యిట్లు ఇమ్యంతేతరముల తుది ఇకారమునకు వెనుకనున్న ఇకారమునకును ఉకారాదేశ మగును.

## 54 సూ. ఏర్వా ద్యౌపవిభక్తికమ్

వృ: సుప్ కార్యస్య టుడాదిప్రాప్తి ర్యస్మాత్ రు-ప్రభృతి వర్ణాంతాత్ ఏర్వాది పదాద్ భవతి త దౌపవిభక్తిక సంజ్ఞం స్యాత్.

తె. వృ: ఏఱు మొదలయిన కొన్ని పదములకు సుబ్విభక్తులు చేరునపుడు వాని చివరి ఱు మొదలగు వర్ణములకు ట మొదలగు వర్ణములాదేశముగా వచ్చును. ఇట్టి యాదేశములను బొందు ఏఱు మొదలగు పదములకు ఔప విభక్తికములని సంజ్ఞ.

---

41. రాశి శబ్ద బహువచన రూపము "రాసులు" ఇందు సాధింపఁబడుట గమనింపఁదగినది.

## 55 సూ. పేర్వా ద్యన్యత్

వృ: రు ప్రభృతి వర్ణాంతత్వేఽపి టుడాదిప్రాప్తి ర్యతో నాస్తి తత్పేర్వాద్య నౌపవిభక్తిక మితిచ వ్యవహ్రియతే.

తె. వృ: రు మొదలగు వర్ణములతో నంతమగునవైనను వేనికి టు డాది (ట మొదలగు వర్ణముల) యాదేశము కలుగదో వానికి అనౌప విభక్తికములని సంజ్ఞ.

## 56 సూ. రలడా ముతాం ళః

వృ: ఉకారవతాం రేఫలకారడకారాణాం ళకారో వా స్యాద్ బహు వచనే పరే. గాలి-గాళులు, గాలులు ; నలడాదే రిత్యుల్లోపే-గాళ్లు ; వడి-వడులు, వళులు, వళ్లు, వడ్లు. వరి, వడి ఇతి దేశ్యత్వేన ద్వేధా ప్యుచ్చారణభేదః అత ఏవ.

"ఏకత్వే సస్యవాచిత్వం బహుత్వే ధాన్యవాచితా"†

ఇతి ధాన్య వాచిత్వేన బహుత్వే-వరులు, వళులు, వడులు.

తె. వృ: బహువచనము పరమయినపుడు ఉకారముతోఁ గూడిన రలడ-లకు వికల్పముగా ళకారము ఆదేశమగును. గాలి-గాలులు, గాళులు; 'నలడాదేః' అను (41 వ) సూత్రమునుబట్టి ఉకారములోపింపఁగా-గాళ్లు. వడి-వడులు, వళులు, వళ్లు, వడ్లు; వరి, వడి అని ప్రాంతీయమైన రెండు విధముల యుచ్చారణ భేదము గలదు. ఈ పదము లేకవచనమున సస్యవాచకములు, బహువచనమున ధాన్యవాచకములు నగును. ధాన్య వాచకమై బహువచనమున నున్నపుడు-వరులు-వళులు, వడులు.[42]

## 57 సూ. లే శ్చౌపవిభక్తిక*స్య డుక్[43]

వృ: ఔప విభక్తిక సంబంధినో లివర్ణస్య డుక్ స్యాద్ బహువచనే పరే. కొడవలి-కొడవండులు, కొడవండ్లు.

తె. వృ: ఔపవిభక్తికము తుది లివర్ణమునకు బహువచనము పరమగు చుండఁగా డుక్ ఆదేశమగును. కొడవలి-కొడవండులు, కొడవండ్లు.

---

†. ఈ శ్లోకపాదము వికృతి వివేకమున నున్నది. (3.47)

42. నలడాదేః అనుసూత్రమువలన ఉకారలోపము గలిగి వడ్లు అను రూపమేర్పడును.

* విభక్తికే-(వ.గో.కృ.) తాళపత్రప్రతి.

43. ఆం. శ. చిం. 3.77 "ఔపవిభక్తికలీనా మిల్లుగ్బహులం, తత్రైవ డుశ్చ స్యాత్.

## 58 సూ. లి-న్ను-ల్లుభ్యో బిందుకశ్చ

వృ: లి ప్రభృతి వర్ణాత్ పరస్య ఇకారసహితస్య అమాదే రేకవచనస్య టుడాగమో బిందుకశ్చ భవతి.

తె. వృ: లి-న్ను-ల్లు అను వర్ణములకుఁ బరమైన ఇకారముతోఁ గూడిన అమాది విభక్తిఏకవచనమున టుడాగమము. బిందుకమును జేరును.

## 59 సూ. అసంఖ్యాసంఖ్యేయాత్

వృ: సంఖ్యా సంఖ్యేయ వర్జితాత్ సాచ్కహలో లుక్ స్యాత్. టుడాదౌ పరే. కొడవటిని - కొడవంటిని, కొడవండుల-కొడవండ్ల, కొడవటిచేత-కొడవంటిచేత, కొడవండులచేత-కొడవండ్లచేత ఇత్యాది.

తె. వృ: సంఖ్యావాచకములను, సంఖ్యేయవాచకములను వదలి తక్కినవానికి టుడాదులు పరమయినపుడు అచ్చుతోఁగూడిన హల్లునకు లోపము గలుగును. కొడవటిని-కొడవంటిని; కొడవండుల-కొడవండ్ల; కొడవటిచేత-కొడవంటిచేత, కొడవండులచేత-కొడవండ్లచేత మొదలగునవి.

వృ: క్వచి దనౌపవిభక్తిక స్యాపి డుజ్. పెండిలి-పెండిండులు.

తె. వృ: ఒకానొకచో ఔపవిభక్తికముకానిదానికిఁగూడ డుజ్ వచ్చును. పెండిలి-పెండిండులు.

## 60 సూ. యే ర్జసాదేః

వృ: యేః పరస్య జస్ ప్రభృత్యాదేశస్య తుడాగమః స్యాత్. దాయి, దాతులు, దాతిని, దాతుల, దాతిచేత ఇత్యాది.

తె. వృ: 'యి' కిఁ బరమయిన జస్ మున్నగు విభక్తిప్రత్యయముల యాదేశమునకు తుట్ (తకారము) ఆగమమగును. దాయి, దాతులు, దాతిని, దాతుల, దాతిచేత మొదలగునవి.[44]

వృ: అసంఖ్యేయా దితి ప్రతిషేధః పరిమాణవాచినః కొన్నిత్యాదే రపి. కొన్ని, కొన్నిటిని, కొన్నిటిచేత, కొన్నింటిచేత ఇత్యాది.

తె. వృ: 'అసంఖ్యాసంఖ్యేయాత్' అను (59వ సూ.) ప్రతిషేధము పరిమాణ వాచకములగు కొన్ని మొదలగువానికిని వర్తించును. కొన్ని -కొన్నిటిని, కొన్నిటిచేత, కొన్నింటిచేత మొదలగునవి.

వృ: దీర్ఘస్య హ్రస్వత్వే-గ్రామణి-గ్రామణులు. తోఁటీఁడు, తోఁటీఁడురు, తోఁటింౘడు.

---

44. "దిక్కరటి శిరంబు దాయి"- భీమనచాటుధార. దాయి = దాకలి.

తె. వృ : (49 వ సూ. ప్రకారము) దీర్ఘమునకు హ్రస్వమురాఁగా గ్రామణీ-గ్రామణి, గ్రామణులు. (అదేశ్యమను నిషేధమున్నందున) తోఁటీఁడు, తోఁటీఁడురు-తోఁటీండ్రు.

## 61 సూ. ఉతో వుర్వా[45]

వృ: ఉకారాంతస్య సోః స్థానే వుర్వా స్యాత్. శంభువు, శంభుఁడు. వుమూతద్వత ఇత్యనేన ప్రాప్తస్యాపి వో ర్వైకల్పికత్వమేవ. శంభువులు-శంభులు, శంభువును-శంభుని, శంభువుల-శంభుల, శంభువుచేత-శంభునిచేత, శంభువులచేత ఇత్యాది.

తె. వృ : ఉకారాంత శబ్దమునకు 'సు' స్థానమున 'వు' వికల్పముగా వచ్చును. శంభువు-శంభుఁడు. 'వుమూతద్వతః' అను (24 వ) సూత్రము ప్రకారంమువచ్చు 'వు' కూడ వైకల్పికమేయగును. శంభువులు-శంభులు, శంభువును - శంభుని, శంభుశంభువుల - శంభుల, శంభువుచేత-శంభునిచేత, శంభువులచేత-(శంభులచేత) మొదలగునవి.

వృ: తరువు-పక్షే స్త్రీసమత్వమ్. ఉకారాంతస్త్రీసమస్య అమహద్విషయత్వాత్-తరు. తరువులు-తరులు ఇత్యాది.

తె. వృ : తరువు-పక్షాంతరమున స్త్రీ సమమగును. ఉకారాంత స్త్రీ సమము అమహద్విషయ మగుటవలన-తరు. తరువులు-తరులు మొదలగునవి.

వృ: వైకృతే తు న. వలపు-వలపులు.

తె. వృ: వైకృతమున 'వు' రాదు. వలపు-వలపులు

## 62 సూ. నోః కుఙ్ బహుళమ్

వృ: ను వర్ణస్య బహుళం కుఙాదేశః స్యాద్ బహువచనేపరే. కెలను-కెలఁకులు. బహుళగ్రహణాత్ కెలనులు ఇత్యాదిచ.

తె. వృ : నువర్ణకమునకు బహువచనమున బహుళముగా కుఙ్ ఆదేశమగును. కెలను-కెలఁకులు. బహుళమనుట వలన కెలనులు అనియు నగును.

## 63 సూ. లు ర్మీన్వాదేః

వృ: మీన్వాదే ర్నువర్ణస్య బహుళం లుక్ స్యాద్ బహువచనే పరే. మీను-మీలు, మీనులు.

తె. వృ : బహువచనము పరమైనప్పుడు మీను మొదలగువాని ను వర్ణమునకు లోపము బహుళము. మీను-మీలు, మీనులు.

---

45. ఆం. శ. చిం. 3.44. "సర్వత్రోదోతో ర్వు ర్భవతి మువత్."

64 సూ. వ్మో శ్శసాదా విచ్చ

వృ: వుము వర్ణకాత్ శసాదౌ పరే ఇత్ వా స్యాత్, లకారస్య రేఫశ్చ. నూర్వురు, నూర్వుర-నూర్వురి, నూర్వురచేత-నూర్వురిచేత.

తె. వృ : వు-ము-వర్ణకముతో నంతమగు శబ్దమునకు శస్ మొ. విభక్తులు పరమయినపుడు ఇకారము వచ్చును. బహువచనలకారమునకు బదులు రేఫము వచ్చును. నూర్వురు, నూర్వుర-నూర్వురి, నూర్వురచేత-నూర్వురిచేత.

వృ: అల్లువు. అ-ది-దారాదే రితి లస్య రేఫః. అల్లువురు.

తె. వృ : అల్లువు. 'అ-ది-దారాదేః' అను (39 వ) సూత్రముచే బహువచనలకారమునకు బదులు రేఫము వచ్చును. అల్లువురు.

65 సూ. దారగేఽన్త్యస్య[46]

వృ: దారాదా వంత్యవర్ణస్య డుజ్ స్యాద్ బహువచనే పరే. అల్లుఁడురు-అల్లుండురు, అల్లుంద్రు.

తె. వృ : దారాదిగణ శబ్దములకు బహువచనము పరమగునపుడు అంత్యవర్ణమునకు బదులు డుజ్ వచ్చును. అల్లుఁడురు-అల్లుండురు-అల్లుంద్రు.

66 సూ. ద్విలోశ్చ[47]

వృ: ద్విత్వ మాపన్నస్య లుకారస్య డుజ్ వా స్యాద్ బహువచనే పరే. ముల్లు, ముండులు-ముండ్లు-ముల్లులు.

తె. వృ : బహువచనము పరమగునపుడు 'ల్లు' కు బదులు వికల్పముగా డుజ్ వచ్చును. ముల్లు, ముండులు-ముండ్లు-ముల్లులు.

67 సూ. అమాదౌ రుప్రభృతేశ్చ

వృ: రుప్రభృతి వర్ణాంతాత్ నిత్య మిత్ స్యాత్ అమాదా వేకవచనే పరే. "టి-న్ను-ల్లు-భ్యో బిందుకశ్చ" ఇతి టుడాగమో బిందుకశ్చ. ముంటిని, ముండుల-ముండ్ల-ముల్లుల, ముంటిచేత, ముండులచేత ఇత్యాదీనిరూపాణి. కన్ను, కన్నులు, కంటిని, కన్నుల, కంటిచేత, కన్నులచేత ఇత్యాది.

తె. వృ : రు మొ. వర్ణములతో నంతమగు శబ్దములకు అమ్ మొ. విభక్తుల యేకవచనము పరమగునపుడు నిత్యముగా ఇకారము వచ్చును.

---

46. ఆం. శ. చిం. 3.73. "నిత్యం దారాదేశ్చ స్యా ల్లోర్లు లయో రురౌచ తత్ర స్తః"

47. ఆం. శ. చిం. 3.71 "సలలో ర్బిందుయుతో డుర్వా లులయోః."

"లి-న్ను-ల్లుభ్యో బిందుకశ్చ" అను(58వ)సూత్రము వలన టుడాగమమును, బిందుకమును వచ్చును. ముంటిని, ముండుల-ముండ్ల-ముల్లుల, ముంటిచేత, ముండులచేత మొదలగు రూపములు వచ్చును. కన్ను, కన్నులు, కంటిని, కన్నుల, కంటిచేత, కన్నులచేత మొదలగునవి.

వృ: "రలడా ముతాం ళః". గోరు-గోళులు-గోరులు.

తె. వృ: "రలడా ముతాం ళః" అను 56 వ సూత్రము ప్రకారము-గోరు-గోళులు-గోరులు.

## 68 సూ. డుర్వోః సూర్యే టు డమాదేః

వృ: సూర్యగణే నామ్ని డు-రు వర్ణాభ్యాం పరస్య అమాదే రేకవచనస్య టుడాగమః స్యాత్. గోటిని, గోళుల, గోరుల, గోటిచేత ఇత్యాది.

తె. వృ: సూర్యగణప్రాతిపదికమునందు డు-రు వర్ణములకుఁ బరమగు అమ్ మొదలయిన ఏకవచనమునకు టుడాగమమగును. గోటిని, గోళుల, గోరుల, గోటిచేత మొదలగునవి.

## 69 సూ. న పేరుగే

వృ: పేర్వాదే ష్టుడాది నస్యాత్. పేరు-పేళులు, పేరులు, పేరిని, పేళుల, పేరిచేత ఇత్యాది. తే చ-ఊరు, చూరు, పోరు, కాలు, పాలు, మేలు ప్రభృతయః.

తె. వృ: పేరు మొదలగు గణములోని శబ్దములకు టుడాదికము రాదు. పేరు, పేళులు-పేరులు, పేరిని, పేళుల, పేరిచేత మొదలగునవి. పేర్వాదిగణము-పేరు, ఊరు, చూరు, పోరు, కాలు, పాలు, మేలు మొదలగునవి.

వృ: అసంఖ్యాసంఖ్యేయా దితి నిషేధాత్ సంఖ్యా సంఖ్యేయయోః సాచ్కహలో లుక్ న భవతి.

తె. వృ: (59 వ సూత్రమున) అసంఖ్యాసంఖ్యేయాత్ అని నిషేధ ముండుటవలన సంఖ్యాసంఖ్యేయములకు అచ్చుతోఁగూడినహల్లునకు లోపమురాదు.

## 70 సూ. జడాత్ సంఖ్యేయాద్ బహో రేకవచనమ్

వృ: (జడాత్) సంఖ్యేయా న్నామ్నో బహువచన స్యైకవచన వర్ణకః స్యాత్. ఆఱు, ఆఱింటిని, ఆఱింటిచేత ఇత్యాది. రెండు మూడు నూరుషు లుకో వికల్పః. రెండింటిని-రెంటిని, మూఁడింటిని-మూటిని, నూరింటిని-నూటిని.

తె. వృ: జడవాచకమయి సంఖ్యేయమును దెలుపు నామమునకు బహువచనమునకు బదులుగా ఏకవచనవర్ణకము వచ్చును. ఆఱు, ఆఱింటిని, ఆఱింటిచేత మొదలగునవి. రెండు, మూఁడు, నూరుల విషయమున 59 వ సూత్రమున ప్రతిషేధింపఁబడిన అచ్చుతోడి హల్లునకు లోపము వికల్పమగును. కనుక - రెండింటిని - రెంటిని, మూఁడింటిని - మూటిని, నూరింటిని - నూటిని.

వృ: సంఖ్యాయాస్తు బహుత్వ మస్త్యేవ. ఆఱులు, రెండ్లు, మూఁడులు, నూరులు.

తె. వృ: పైని సంఖ్యేయమునకు బహుత్వమున నేకవచన ప్రత్యయము విధింపఁబడినది. కావున సంఖ్యావాచకమునకు బహువచన ప్రత్యయము చేరుట కభ్యంతరము లేదు. ఆఱులు, రెండ్లు, మూఁడులు, నూరులు.

## 71 సూ. రో రో స్తుట్

వృ: రేఫాధస్థితా ద్రేఫాద్ రకారసహితస్య అమాదే రేకవచనస్య తు డాగమః స్యాత్, సాచ్కహలో లుక్ చ. కఱ్ఱు, కఱ్ఱులు, కర్త్రిని, కఱ్ఱుల, కర్త్రిచేత, కఱ్ఱులచేత ఇత్యాది.

తె. వృ: రేఫక్రిందనున్న రేఫకంటె రేఫముతోఁ గూడిన అమ్ మొదలగు ఏకవచనప్రత్యయమునకు తుడాగమమగును, తుదియచ్చుతోడి హల్లునకు లోపమును గలుగును. కఱ్ఱు, కఱ్ఱులు, కర్త్రిని, కఱ్ఱుల, కర్త్రిచేత, కఱ్ఱులచేత మొదలగునవి.

వృ: ఊకారస్య హ్రస్వః. స్వయంభువు. స్వయంభుఁడు ఇత్యాది.

తె. వృ: ఊకారాంత ప్రాతిపదికము హ్రస్వాంతమగును. (చూ. 49 సూ.) స్వయంభువు, స్వయంభుఁడు మొదలగునవి.

## 72 సూ. డా బృతః[48]

వృ: ఋకారాంతస్య డావ్ స్యాత్ సుపి పరే. ప్రత్యయాదేశత్వా భావాత్ డకారస్య ఇత్త్వమ్. హ్రస్వ స్త్రీవద్భావౌ. కర్త, కర్తలు; భ్రాత, భ్రాతలు.

తె. వృ: ఋకారాంతమునకు సుబ్విభక్తి పరమయినపుడు 'డావ్' చేరును. ఇది ప్రత్యయమున కాదేశము కాదుగనుక ఇందలి డకారమున కిత్సంజ్ఞ కలదు. హ్రస్వము, స్త్రీవద్భావము. కర్త, కర్తలు; భ్రాత, భ్రాతలు.

48. ఆం. శ. చిం. 3.51 "డాబవిధాత్రాదే రుః"

## 73 సూ. విధాత్రగే తు[48]

వృ: విధాత్రాదే ర్వా డావ్ స్యాత్. విధాత - విధాతృఁడు, సవిత-సవితృఁడు; ధాత-ధాతృఁడు; నేత-నేతృఁడు; దాత-దాతృఁడు.

తె. వృ: విధాత్రాది గణమునకు డావ్ వికల్పముగాఁ జేరును. విధాత-విధాతృఁడు: సవిత-సవితృఁడు: ధాత-ధాతృఁడు; నేత-నేతృఁడు; దాత-దాతృఁడు.

## 74 సూ. అరః పితరి

వృ: పితృశబ్దే ఋత స్త్వరః స్యాత్. పితరుఁడు[49], పితరులు.

తె. వృ: పితృ శబ్దమున ఋకారమునకు బదులు 'అర' వచ్చును. పితరుఁడు, పితరులు.

## 75 సూ. ఓతో వుః

వృ: ఓకారాంతస్య సోః స్థానే వుః స్యాత్. గోవు, గోవులు.

తె. వృ: ఓకారాంత నామమునకు 'సు' విభక్తి స్థానమున 'వు' వచ్చును. గోవు, గోవులు.

## 76 సూ. అవావౌ రైనావోః[50]

వృ: రై, నౌ శబ్దయోః ఐకారౌకారయోః క్రమాత్ ఓ, అవ ఇత్యేతౌ భవతః సుపిపరే. రో, రోలు; నావ-నావలు. గ్లౌశబ్దస్యాపి స్త్రీవద్భావే-గ్లా, గ్లౌలు ఇత్యాది.

తె. వృ: రై, నౌ శబ్దములకు సుబ్విభక్తి పరమయినప్పుడు ఐ, ఔలకు క్రమముగా 'ఓ, అవ' అనునవి ఆదేశమగును. రో-రోలు; నావ-నావలు. గ్లౌ శబ్దమునకు స్త్రీవద్భావము వచ్చి గ్లా - గ్లౌలు మొదలగు రూపము లేర్పడును.

---

48. ఆం. శ. చిం. 3.51 "డా బవిధాత్రాదే ర్ఋః"

49. పితరుఁడు-రూపము గమనింపఁదగినది. "సుతుఁడును బితరుఁడు నొండొరులతోడఁ బెనఁగెడుచో"-కేతన ప్రయోగము-విజ్ఞానేశ్వరీయము. "పితరులఁగాని" భార-ఆర. 4 అ.

50. ఆం. శ. చిం. 3.63 "స్తో౽వావౌ రైనావోః."

## అథ అంజతాః స్త్రీలింగాః
## ఇంక అజంత స్త్రీలింగములు.

వృ: ఆకారాంతస్య హ్రస్వః. రమ-రమలు; లత-లతలు.

తె. వృ: ఆకారాంతము హ్రస్వమగును. (చూ. 49 సూ.) రమ-రమలు; లత-లతలు.

### 77 సూ. క్లీబసమా విధా

వృ: విధా క్లీబసమాస్యాత్.

తె. వృ: విధాశబ్దము క్లీబసమమగును.

### 78 సూ. క్లీబవత్ క్లీబసమమ్

వృ: క్లీబసమం క్లీబవిహిత కార్యం స్యాత్. క్లీబవద్భావః. "ముమ్ముంబు నప్యతోఽమహతశ్చ" విధము-విధములు.

తె. వృ: క్లీబసమమునకు క్లీబమునకు విధింపఁబడిన కార్యములు వచ్చును. క్లీబమువంటి దగును. "ముమ్ముంబు నప్యతోఽమహతశ్చ" అను 23 సూత్రమునుబట్టి-విధము, విధములు మొదలగు రూపములను బొందును.

### 79 సూ. విధావ దీర్ష్యాః

వృ: తద్భవత్వదశాయా మీర్ష్యాదయః శబ్దాః విధావత్ క్లీబసమా భవంతి. ఈరసము, బికిరము, విడియము, "ఇయో హేత్". విడెము.

తె. వృ: తద్భవములగునపుడు ఈర్ష్యాది శబ్దములు విధాశబ్దమువలె క్లీబసమములగును. ఈరసము, బికిరము, విడియము. "ఇయో హేత్" అను (౩౭వ) సూత్రమునుబట్టి ఇయకు ఎకారము. విడెము.

### 80 సూ. మాయాదిర్వా

వృ: మాయాదయః వా క్లీబసమా భవంతి. మాయము — మాయ. కంధరము-కంధర.

తె. వృ: మాయాది శబ్దములు వికల్పముగా క్లీబసమము లగును. మాయము-మాయ. కంధరము-కంధర.

వృ: లస్యరేఫే బాల-బాలరు (?) ఇత్యాది.

తె. వృ: బహువచన లకారమునకు రేఫము రాగా - బాల-బాలరు(?) అగును.

వృ: "అదేశ్యైకవర్ణే" ఇతి నిషేధాత్ ఏకాచో హ్రస్వో నమా-మాలు ఇతః - రుచి "చుర్దన్త్యోతాలవ్యాచ్" - రుచులు. ఊయి - తుడాగమః. ఊతులు. అనౌపవిభక్తికత్వ పక్షేతు "నలడాదే" రితి ఉల్లోపే "లోపో వ్యో ర్వలి"

(పా. 6.1.66) ఇతి యకారలోపః ఊాయి; ఊాయిని-ఊాతిని; ఊాల - ఊాతుల ఇత్యాది. రేయి-రేలు,రేయిని -రేల.

తె. వృ: "అదేశ్యైక వర్ణే" (49 వ సూ.) అని నిషేధ ముండుటవలన దేశ్యమునకును ఏకాచ్చునకు హ్రస్వమురాదు. మా-మాలు ఇకారాంతములకు—రుచి—"చుర్ద న్త్యోఽతాలవ్యాచ్" అను 52 సూ. ను బట్టి దంత్యచకారముతో రుచులు. ఊాయి—తుడాగమము. ఊాతులు. ఔపవిభక్తికము కానిపక్షమున "నలడాదేః" (41 వ సూ.) అను సూత్రము వలన ఉకారలోపమును, "లోపో వ్యో ర్వలి" అను సంస్కృతవ్యాకృతి సూత్రమువలన యకారలోపమును కలుగును. ఊాయి, ఊాయిని-ఊాతిని, ఊాల—ఊాతుల మొ. రూపములు గలుగును. రేయి-రేలు, రేయిని-రేల.

వృ: ఈకారాంతస్య హ్రస్వః. నది, నదులు.

తె. వృ: ఈకారాంతమునకు హ్రస్వము (చూ. 49 సూ). నది, నదులు.

వృ: సంస్కృతయో రపి పిప్పలీ కావేరీ శబ్దయోః హ్రస్వతానుశాసన వ్యవహారాదేవ వికృతవద్భావ ఇతి కేచిత్. పిప్పలి-పిప్పళ్లు, కావేరి-కావేళులు; కావేరిని-కావేళుల ఇత్యాది.

తె. వృ.: సంస్కృతశబ్దములయినను పిప్పలి, కావేరి యను నవి హ్రస్వత్వము ననుశాసించుటవలననే వికృతిపదములవంటివగుచున్నవని కొందఱి మతము. పిప్పలి-పిప్పళ్లు. కావేరి-కావేళులు; కావేరిని-కావేళుల మొదలగునవి.

వృ. ఉతో వా. ధేనువు-ధేను. ఆవు-ఉకారవకారలోపౌ. అలు. పక్షే ఆవులు. ఆవును, అల-ఆవుల ఇత్యాది.

తె. వృ: ఉకారమునకు వికల్పముగా 'వు' వచ్చును. (61 వ సూ.)—ధేనువు, ధేను. ఆవు - ఉకార వకారములు లోపించును. ఆలు. పక్షాంతరమున-ఆవులు. ఆవును-ఆల, ఆవుల మొదలగునవి.

వృ: ఊకారస్య హ్రస్వః. జంబువు-జంబు.

తె. వృ: ఊ కారాంతమునకు హ్రస్వము (చూ. 49 సూ.) జంబువు-జంబు.

వృ: "డా బృతః". దుహిత-దుహితలు.

తె. వృ : ''డా బృతః'' అను (72 వ) సూత్రమువలన-దుహిత, దుహితలు.

వృ: "ఓతో వుః". గోవు-గోవులు. నాత్రనలడాదే రిత్యులోపః. తస్య వికృతి ప్రదైక విషయత్వాత్.

తె. వృ : ''ఓతో వుః'' అను (75 వ) సూత్రమువలన-గోవు, గోవులు. ఇక్కడ ''నలడాదేః'' అను (41 వ) సూత్రమువలన ఉకారలోపము రాదు ; ఆ ఉకారలోపము వికృతిపదములకుమాత్రమే సంబంధించినది.

వృ: "అవావౌ రై నావోః". రో-రోలు, నావ-నావలు.

తె. వృ : "అవావౌ రై నావోః'' అను (76 వ) సూత్రము వలన—రో-రోలు ; నావ-నావలు.

**అథ అజంత నపుంసక లింగాః**

**ఇంక అజంత నపుంసక లింగములు.**

వృ: "ముమ్ముంబు నప్యతోఽమహతశ్చ" (23 సూ.) జ్ఞానము-జ్ఞానమ్ము-జ్ఞానంబు, జ్ఞానములు ఇత్యాది. అపత్యము అపత్యమ్ము, అపత్యంబు.

తె. వృ : '' ము-మ్ము-ంబు నప్యతోఽమహతశ్చ '' అను (23 వ) సూత్రమువలన-జ్ఞానము-జ్ఞానమ్ము-జ్ఞానంబు, జ్ఞానములు మొ. అపత్యము-అపత్యమ్ము-అపత్యంబు.

వృ: కడియము-"ఇయో పేత్". కడెము.

తె. వృ : కడియము-''ఇయో పేత్'' అను (38 వ) సూత్రమువలన కడెము.

వృ: "కుశగే వా". కుశ-కుశము; కుండ-కుండము; చరిత-చరితము, చరిత్ర-చరిత్రము.

తె. వృ : ''కుశగే వా'' అను (34 వ) సూత్రమువలన-కుశ-కుశము, కుండ-కుండము ; చరిత-చరిత్తము ; చరిత్ర-చరిత్రము.

వృ: ఇతః. వారి, వారులు.

తె. వృ : ''ఇతః'' అను (50వ) సూత్రమువలన—వారి, వారులు.

వృ: "ఉతో వు ర్వా" మధువు - మధు.

తె. వృ : ''ఉతో వు ర్వా'' అను (61 వ) సూత్రమువలన-మధువు-మధు.

## 81 సూ. స్త్రీవదృతః (నపి)

వృ: నపుంసకలింగే వర్తమానస్య ఋతః స్త్రీవద్భావః. కర్త-కర్తలు. ఉగంతత్వాత్ - కర్తృనకు, ప్రద్యువు. ప్రరి. సులువు. ప్రనువు.

తె. వృ : నపుంసకలింగమున నుండు ఋకారాంతములకు స్త్రీవద్భావము. కర్త-కర్తలు. ఉగంతమగుటవలన 20 వ సూత్రమును బట్టి-కర్తృనకు. ప్రద్యువు, ప్రరి, సులువు, ప్రనువు ఇత్యాదులగు ఓకార-ఐకార-ఔకారాంత నపుంసకలింగపదముల రూపముల నూహించునది.

స్వాదిప్రక్రియలో అజంతప్రకరణము సమాప్తము.

# స్వాదిప్రక్రియా

## (ii) హలంతప్రకరణమ్

### పుంలింగాః

### 1 సూ. అంత్యస్య ప్రాణినోఽక్ సుహృదాదౌ

వృ: సుహృదాదా వంత్యస్య ప్రాణినః అగాగమ స్స్యాత్. స్వాద్యాదేశాః. మధులిహము - మధులిహములు.

తె. వృ : సుహృదాది శబ్దములలోని చివరి హల్లునకు అక్ అను నాగమము వచ్చును. దానిపై 'సు' మున్నగు వానికి వచ్చు ఆదేశములు చేరును.[1] మధులిహము - మధులిహములు.

### 2 సూ. శ్వానానడ్వాహవిద్వాంసాః

వృ: శ్వప్రభృతీనాం శ్వానాదయో నిపాతాః. అనడ్వాహము-అనడ్వాహములు. సుదివుఁడు - సుదివులు.

తె. వృ : శ్వప్రభృతిశబ్దములకు శ్వానాదులు ఆదేశముగా వచ్చునని నిపాతము. అనడ్వాహము-అనడ్వాహములు, సుదివుఁడు-సుదివులు.

వృ: ద్వి త్రి చతుః ప్రభృతీనాం తత్సమత్వేన ప్రయోగో న.

తె. వృ : ద్వి, త్రి, చతుర్ మున్నగు సంఖ్యావాచక సంస్కృత శబ్దములు తెలుఁగుభాషయందు తత్సమములుగా ప్రయోగింపఁబడవు.

---

1. అగాగమము వచ్చినప్పుడవి అకారాంతములగును. "అనుక్తం సంస్కృతవత్" (వైకృ. సంజ్ఞా.2) అనుసూత్రముచే పాణినీయములోని "జ్యాప్ప్రాతిపదికాత్" (పా. 4-1-1) అను సూత్రముచే సుప్పులు ప్రాతిపదికములపై వచ్చి ఆ సుప్పుల స్థానమునఁ దెలుఁగు విభక్తిప్రత్యయములగు డుజాదులు వచ్చును. ఆంధ్రశబ్దచింతామణి, ఆంధ్రకౌముది మొదలగు నాంధ్రవ్యాకరణములందుఁ గూడ నీసంప్రదాయ మిట్లే కలదు. 'మధులిహ' ఇది అమహత్తు కనుక "ముమ్మంబు నవ్యతోఽమహతశ్చ" అను సూత్రముచే ము వచ్చి మధులిహము అగునని గ్రహింపవలెను. కడమవాని ప్రక్రియయు నిట్టిదే.

### 3 సూ. నాలుగు చతురః

వృ: చతుర్శబ్దస్య నాలుగు ఇత్యాదేశ స్స్యాత్. నాలుగు. అజడవాచిత్వే రువర్ణకః.[2] నలుగురు* విప్రులు. సుగిరుఁడు - సుగిరులు, ప్రశాముఁడు-ప్రశాములు.

తె. వృ : చతుర్శబ్దమునకు 'నాలుగు' అనునది యాదేశమగును. నాలుగు. ఇది జడవాచకము కానప్పుడు రువర్ణకము వచ్చును. నలుగురు* విప్రులు-ఇట్లే సుగిరుఁడు-సుగిరులు; ప్రశాముఁడు-ప్రశాములు మున్నగు వాని ప్రక్రియ గ్రహింపఁదగినది.

### 4 సూ. ఏ యత్కిమోః

వృ: యత్ కిమ్ శబ్దయోః ఏ ఇత్యాదేశ స్స్యాత్.

తె. వృ : యత్ కిమ్ అను శబ్దములకు 'ఏ' అను నాదేశము వచ్చును.

వృ: ఏకవచనే తుః.

### 5 సూ. మహతో ర్య త్కిమోశ్చ తః

వృ: మహద్భ్యాం యత్కింశబ్దాభ్యాం తదిదం శబ్దాభ్యాంచ పరతః త ఇతి వా స్యా దేకవచనాదేశే.

తె. వృ : మహద్వాచకములయిన యత్కింశబ్దములకంటెను, తదిదంశబ్దములకంటెను ఏకవచనప్రత్యయము పరముగా నున్నప్పుడు 'త' అనునది వికల్పముగా ఆగమమగును.

### 6 సూ. తేవా హః

వృ: యత్కింతదిదమాం హ్రస్వో వా స్యా త్తవర్ణకే పరే. ఎతఁడు-ఎతండు. పక్షే ఏతఁడు-ఏతండు-ఏఁడు అ-ది-దారాదేః. ఏరు. జసః పౌనరుక్త్యే ఏరలు. ఏతని-ఏని.

తె. వృ : యత్, కిమ్, తత్, ఇదమ్ శబ్దాదేశములకు త వర్ణకము పరముగా నున్నప్పుడు హ్రస్వము వికల్పముగా వచ్చును. ఎతఁడు-ఎతండు,

---

2. "జడా త్సంఖ్యేయాత్ బహో రేకవచనమ్" (అజ.70) అనుసూత్రము సంఖ్యేయము జడవాచకమయినప్పుడుమాత్రమే బహువచనమునకేకవచనము వచ్చునని చెప్పుచున్నది. నలువురు జడవాచకము కాదు కనుక ఏకవచనము రాదు. బహువచన లు వర్ణకమునకు అ-ది-దారాదేః (అజ. 39) అను సూత్రముచే రు వర్ణకము వచ్చి నలువురు అనియగును.

* వురు- (వ.గో.కృ.) తాళపత్ర ప్రతి.

హ్రస్వము రానిపక్షమున ఏత(డు-ఏతండు అనియగును. తవర్ణకము రానప్పుడు ఏ(డు అనిరూపము. 'అ-ది-దారాదేః' అను సూత్రముచే బహువచనమున రువర్ణకమువచ్చినచో ఏరు అనియగును. ప్రథమాబహువచనపౌనరుక్త్యము నందు ఏరలు అని సిద్ధించును.[3] ఏతని-ఏని అనునవి ద్వితీయైకవచనమున సిద్ధించు రూపములు.

### 7 సూ. యదాదేః

వృ: యదాదేః పరస్య రస్య నిత్య మిత్ స్యాచ్ఛసాదౌ బహువచనే. ఏరి- ఏరల ఏతనిచేత-ఏరిచేత, ఎతనిచేత-ఏనిచేత-ఏరిచేత. భిసాదావపి అస్య పౌనరుక్త్య మితి కేచిత్. ఏరలచేత. ఎతనికొఱకు-ఏతనికొఱకు-ఏనికొఱకు-ఏరికొఱకు-ఏరల కొఱకు ఇత్యాది.

తె. వృ: యదాదులకు పరమయిన రకు ద్వితీయాబహువచనాదులు పరముగా నున్నప్పుడు ఇత్వము వచ్చును. ఏరి నను నది యిందు కుదాహర ణము. ఏరలననునది ద్వితీయాబహువచనమున నింకొక యుదాహరణము. ఏతనిచేత — ఏరిచేత, ఎతనిచేత — ఏనిచేత, ఏరిచేత ననునవి తృతీయా విభక్తి యందేర్పడు రూపములు. తృతీయాదిబహువచనములందును లకు పౌనరుక్త్యము కలదని కొందఱి మతము. ఏరలచేత నిత్యాదులప్పుడు సిద్ధించు రూపములు. ఎతనికొఱకు-ఏతనికొఱకు—ఏనికొఱకు. ఏరికొఱకు, ఏరల కొఱకు నిత్యాదివిధముగా రూపములు సిద్ధించుట గ్రహింప(దగినది.

### 8 సూ. ది సోః

వృ: అమహతాం యత్ కిమ్ తదిదమాం సోః స్థానే దివర్ణక స్స్యాత్.

తె. వృ: అమహద్వాచకములగు యత్, కిమ్, తత్, ఇదమ్ అను శబ్దముల సుస్థానమున (ప్రథమైకవచనమునందు) దివర్ణకము వచ్చును.

### 9 సూ. దివ్యో ర్నిత్యమ్

వృ: యత్కింతదిదమాం నిత్యం హ్రస్వ స్స్యాత్ దివి ఇత్యేతయోః పరయోః.

తె. వృ: దివివర్ణకములు పరమయినప్పుడు యత్, కిమ్, తత్, ఇదం శబ్దములకు నిత్యముగా హ్రస్వము వచ్చును.

వృ: యత్కిమో రసమస్తయో ర్నేష్యతే. ఏది. సమస్తత్వేతు ఏయెది.

---

3. "నామావయవతాప్రాప్తౌ పూర్వాదేశస్య కుత్రచిత్
సుజసోః పౌనరుక్త్యం స్యా త్తత్ర రేఫో న కథ్యతే" (అజ.45 సూ. వృత్తి)

తె. వృ: సమాసమున లేని యత్కింశబ్దములకు హ్రస్వము వచ్చుట యిష్టముకాదు. ఏది[4] యిందు కుదాహరణము. ఏయెది యనునది ఎది సమాసగతమయినప్పుడు హ్రస్వమును పొందెననుట కుదాహరణము.

## 10 సూ. అచేతనానాం జసో వి

వృ: అచేతనానాం యత్కింతదిదమాం జసః స్థానే వి స్యాత్. ఏవి.

తె. వృ: అచేతన వాచకములయిన ఏ ఆ ఈ యను శబ్దములకు ప్రథమాబహువచనమునందు జస్ప్రత్యయస్థానమున 'వి' అనునది ఆదేశ మగును. ఏవి అనునది యుదాహరణము.

## 11 సూ. అమహతాం దట్

వృ: అమహతాం యత్ కిమ్ తదిదమాం దట్ స్యా దేకవచనాదేశే పరే. దేని.

తె. వృ: అమహద్వాచకములయిన ఏ ఆ ఈ శబ్దముల కేకవచనాదేశప్రత్యయము పరమయినప్పుడు దట్ అను నాగమము వచ్చును. దేని ననునది యుదాహరణము.

## 12 సూ. ని శసాదౌ లుగ్ రః

వృ: అచేతనానాం యత్కింతదిదమాం నివర్ణక స్స్యాత్, రేఫస్యలు క్శసాదౌ బహువచనాదేశేపరే. వేనిన్, దేనిచేత—వేనిచేత, దేనికొఱకు—వేనికొఱకు ఇత్యాది*

తె. వృ: జడవాచకములయిన యత్కింతదిదమర్థక శబ్దములకు బహువచనాదేశప్రత్యయము పరమయినప్పుడు ద్వితీయాది విభక్తులలో నివర్ణకము వచ్చును. రేఫకు లోపము కూడ వచ్చును. వేనిన్, దేనిచేత, వేనిచేత, దేనికొఱకు—వేనికొఱకు ఇత్యాదు లుదాహరణములు.

## 13 సూ. ఇదమదసేతదా మీ

వృ: ఇదంప్రభృతీనాం ఈ ఇత్యాదేశో భవతి.

తె. వృ: ఇదమ్ మొదలగు సంస్కృత సర్వనామములు మూఁడింటికి నీయాంధ్రభాషయందు 'ఈ' అనునది ఆదేశముగా వచ్చును.

---

4. ఎది యను వ్యస్త రూపమును వాసుదేవుఁడు నిషేధించినను బాల వ్యాకరణ మంగీకరించుచున్నది. నన్నయ భారతమున ఎద్ది—ఏది కలవు కాని ఎది లేదు. నన్నెచోడుఁడును ఎది యనురూపమును ప్రయోగింపలేదు. శ. ర.; సూ. ని. ఎది వ్యస్తముగా నున్నట్లు చెప్పుచున్నవి. ప్రయోగము లీయఁబడలేదు.

*ఏనిన్, దేనిచేత-ఏనిచేత, దేనికొఱకు-ఏనికొఱకు ఇత్యాది-(వ.గో.కృ.) తాళపత్ర ప్రతి.

## 14 సూ. తదిదమో రతయో ర్వట్

వృ: తవర్ణకరహితయో స్తదిదమో రాదేశయో ర్వట్ స్యాత్సుపి పరే. ఇదమితి ఈస్థానినాం త్రయాణాం గ్రహణమ్. వీఁడు-వీరు, వీని-వీరి, వీనిచేత-వీరిచేత, వీనికొఱకు-వీరికొఱకు ఇత్యాది. తవర్ణ కేతు వడాగమో న. ఇతఁడు-ఈతఁడు, ఇతని-ఈతని, ఇతనిచేత-ఈతనిచేత, ఇత్యాది. జడవాచకత్వేతు "దివో్యర్నిత్యమ్". ఇది-ఇవి, దీని-వీని, దీనిచేత-వీనిచేత, దీనికొఱకు-వీనికొఱకు ఇత్యాది.

తె. వృ: తవర్ణకములేని తదిదం శబ్దములకు విభక్తి ప్రత్యయములు పరమయినప్పుడు వడాగమము వచ్చును. ఇదం శబ్ద మిక్కడ ఈ స్థానులగు ఇదమద సేతచ్ఛబ్దములు మూఁడింటికిని గ్రాహకము. వీఁడు—వీరు, వీని—వీరి, వీనిచేత—వీరిచేత, వీనికొఱకు—వీరికొఱకు ఇత్యాదులుదాహరణములు. తవర్ణకము పరమయినప్పుడు వడాగమమురాదు. ఇతఁడు—ఈతఁడు, ఇతని—ఈతని, ఇతనిచేత — ఈతనిచేత ఇత్యాదులుదాహరణములు. ఈ శబ్దము జడవాచకమయినప్పుడు 'దివో్య ర్నిత్యమ్' అను సూత్రము ప్రవర్తించి ఇది-ఇవి అను రూపములేర్పడును. దీని—వీని, దీనిచేత—వీనిచేత, దీనికొఱకు—వీనికొఱకు మొదలగు రూపము లితర విభక్తులందు గ్రహింపఁదగినవి.

## 15 సూ. నస్య చాశునః

వృ: శ్వశబ్దా దన్యత్ర అంత్యనకారస్య లుక్ స్యాత్. అర్యముఁడు-అర్యములు, మఘవుఁడు-మఘవులు. శ్వశబ్దస్యశ్వానము-శ్వానములు ఇత్యాదీని రూపాణి. దండి. ఇత ఇతి సులోపః. దండులు.

తె. వృ: శ్వశబ్దేతరములం దంత్యనకారమునకు లోపము వచ్చును. అర్యముఁడు-అర్యములు, మఘవుఁడు-మఘవులు. శ్వశబ్దమునకు శ్వానము-శ్వానములు ఇత్యాదివిధముగా రూపము లుండును. దండి—దీనికి 'ఇతః' అను అజం. 50 సూత్రముచే సులోపము వచ్చినది. దండులు బహువచన రూపము.

## 16 సూ. రాజ్ఞ ష్టే శ్చేతనే

వృ: చేతనార్థే పుంసి విహితస్య రాజన్శబ్దస్య శే రుత్ స్యాత్. దంత్యత్వమ్. రాజు-రాజులు. ఇదంకార్యం సమాసాంతత్వేఽపి. త్రిలింగరాజు. చేతన ఇతి కిమ్? వృత్తరాజము.

తె. వృ: చేతనార్థమున పుంలింగమునందు రాజన్ శబ్దములోని 'టి'[5]కి ఉత్ ఆదేశముగా వచ్చును. ఆ జకారమునకు దంత్యత్వము కలుగఁగా రాజు-రాజులు మున్నగు రూపములేర్పడును. రాజన్ శబ్దము సమాసము నందుత్తరపదముగా నున్నప్పుడును ఈ ఉత్తువచ్చును. త్రిలింగరాజు మున్నగునవి యుదాహరణములు. చేతనార్థక రాజన్శబ్దమునకే ఉత్తు విధింపఁబడినందున 'వృషురాజము' మొదలగువానిలో రాదని గ్రహింపవలెను.

## 17 సూ. ఆత్మవేధసో రా ట్టేః

వృ: ఆత్మవేధసోః టే రాత్ స్యాత్. ఆత్మ-ఆత్మలు, వేధ-వేధలు.

తె. వృ: ఆత్మన్ వేధస్ అను శబ్దములలోని 'టి'కిఆత్ అను నాదేశము వచ్చును. ఆత్మ-ఆత్మలు, వేధ-వేధలు.

## 18 సూ. పుంసి బ్రహ్మణః

వృ: పుంసి విహితస్య బ్రహ్మణోఽపి టే రాత్ స్యాత్. బ్రహ్మ—బ్రహ్మలు.

తె. వృ: పుంలింగమునందలి బ్రహ్మన్ శబ్దములోని టికిని ఆత్ అనునది ఆదేశముగా వచ్చును. బ్రహ్మ-బ్రహ్మలు.

## 19 సూ. ఇమనిచో వా

వృ: ఇమనిచ్ప్రత్యయాంతస్య టే ర్వా ఆత్ స్యాత్. గరిమ-గరిమము.

తె. వృ: ఇమనిచ్ప్రత్యయాంతో[6] శబ్దముల టికి ఆత్ అను నాదేశము వికల్పముగా వచ్చును. గరిమ, ఆదాదేశము రానిపక్షమున గరిమము[7] అని యగును.

---

5. టి పాణినీయసంజ్ఞ. "అచోఽన్త్యాది టి" (పా.1-1-64) అని యందలి విధానము. చివరియచ్చుతో నారంభించి తరువాతఁగల భాగమునకు 'టి' యని పేరు. రాజన్ దీనిలో అన్ టి.

6. "పృథ్వాదిభ్య ఇమని జ్వా" (పా. 5-1-122) మున్నగు సూత్రములు సంస్కృతమున భావార్థము నందు ఇమనిచ్ప్రత్యయమును విధించునవి.

7. "నస్య చాశునః" (హల. 15) అను సూత్రముచే నకారలోపము వచ్చినరూపమిది.

## 20 సూ. ఏన్వాఱేడ్వెనిమిదితొమ్మిదిపది షట్సంజ్ఞికానామ్

వృ: షట్సంజ్ఞికానాం[8] మేతే ఆదేశాః స్యుః. ఏను–ఏకవచనత్వమ్–ఏనింటిని. వువర్ణకే తు ఏవురు–ఏవుర. ఏడు–ఏడింటిని; ఏడ్వురు–ఏడ్వుర. ఎనిమిది–ఎనిమిదిటిని. తొమ్మిది–తొమ్మిదిటిని.

తె. వృ: షట్సంజ్ఞగల పంచన్, షట్, సప్తన్, అష్టన్, నవన్, దశన్ అనువానికి క్రమముగా ఏను, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది అనునవి ఆదేశముగా వచ్చును. ఏను. దీని కేకవచనత్వము వచ్చును[9]. ఏనింటిని మొదలగు రూపములు సిద్ధించును. వువర్ణకము వచ్చినప్పుడు[10] ఏవురు, ఏవుర నిత్యాదిరూపములుండును. ఇట్లే ఏడు–ఏడింటిని–ఏడ్వురన్, ఎనిమిది–ఎనిమిదిటిని, తొమ్మిది–తొమ్మిదిటిని అనురూపములగునని గ్రహింపవలెను.

## 21 సూ. చేతనవాచిత్వే నవాష్టనో ర్మ్నరౌ బహువచనే చ

వృ: తయో రిఁః అత్ స్యాత్ నూరుశబ్దే బహువచనేచపరే 'దారగేఽన్త్యస్య' ఇతి డుక్ ఎనమండ్రు–ఎనమండ్ర, తొమ్మండ్రు–తొమ్మండ్ర. పది–పదింటిని. వువర్ణకేతు పదువురు–పదువుర. డుకితి కేచిత్. పదువుండ్రు–పదువుండ్ర. అర్థబుధుఁడు–అర్థబుధులు. సుయజుఁడు–సుయజులు. ఋత్విజుఁడు–ఋత్విజులు. సుహృదుఁడు–సుహృదులు, వేదవిదుఁడు–వేదవిదులు.

తె. వృ: నూరు శబ్దము కాని బహువచన ప్రత్యయము కాని పరమయినప్పుడు నవాష్టన్నబ్దాదేశముల కంతమున నున్న ఇకారమున కకారము వచ్చును. "దారగేంత్యస్య" అను సూత్రముచే రు పరమయినప్పుడు డుక్ వచ్చును. ఎనమండ్రు–ఎనమండ్ర, తొమ్మండ్రు–తొమ్మండ్ర ననునవి యుదాహరణములు. పది–పదింటిని అనునవి దశన్ శబ్దరూపములు. వువర్ణకము వచ్చినచో పదువురు–పదువుర నను రూపము లగును. ఇక్కడ డుక్ వచ్చునని కొందఱిమతము. అప్పుడు పదువుండ్రు–పదువుండ్ర నిత్యాది విధముగా రూపములు సిద్ధించును. అర్థబుధుఁడు–అర్థబుధులు. సుయజుఁడు–

---

8. "ష్ణాన్తాః షట్" (పా. 1-1-24) అను సూత్రము సంస్కృత వ్యాకరణమునందు షాంతమగు షట్ శబ్దమునకు నాంతములగు పంచన్, అష్టన్, నవన్, దశన్ శబ్దములకు షట్సంజ్ఞను విధించుచున్నది.

9. "ఙడాత్ సంఖ్యేయా ద్బహో రేకవచనమ్" (అజ. 70) అను సూ. చే నేకవచనము వచ్చుననుట.

10. "అజడా త్సంఖ్యేయా ద్వుమ్" అను వక్ష్యమాణ సూత్రముచేత (తద్ధితాదేశ. 20 సూ.) వువర్ణకము వచ్చినప్పు డీ రూపము లగునని గ్రహింపవలెను.

సుయజులు, ఋత్విజుఁడు- ఋత్విజులు, సుహృదుఁడు-సుహృదులు, వేద విదుఁడు-వేదవిదులు మున్నగునవి యాయాశబ్దములు తత్సమములుగా వచ్చినప్పు డేర్పడు రూపములు.[11]

వృ: "ఏ యత్కి-మోః" (సూ. 4) యచ్ఛబ్దస్య స్వరమాత్రవిశేషః. కింశబ్ద వద్రూపాణి.

తె. వృ : "ఏ యత్కి-మోః" అను సూత్రముచే యత్కిం-శబ్ద ములకు రెంటికిని 'ఏ' అనునదే ఆదేశమగునని యిదివఱకే చెప్పఁ బడినది. యచ్ఛబ్దార్థమునను కింశబ్దార్థమునను రూపము లొకేవిధముగా నుండును. యచ్ఛబ్దార్థమున స్వరము మాత్రమే విశేషమని గ్రహింపవలెను.[12]

## 22 సూ. ఆ తదః

వృ: తచ్ఛబ్దస్య ఆ ఇత్యాదేశ స్స్యాత్, 'తదిదమో ర్వట్' వాఁడు-వారు-వానిని-వారిని-వానిచేత-వారిచేత. తవర్ణకే తు అతఁడు - ఆతండు-అతని - ఆతని ఇత్యాది. జడవాచకత్వేతు అది-అవి-దాని-వాని-దానిచేత-వానిచేత ఇత్యాది. ఏతద ఇదమ్వ ద్రూపాణి.

తె. వృ : తత్ అనుశబ్దమునకు 'ఆ' అనునది యాదేశముగా వచ్చును. "తదిదమో రతయో ర్వట్" అను (సూ. 14) సూత్రముచే వట్ అనునది ఆగమమగును. వాఁడు-వారు, వానిని-వారిని, వానిచేత-వారిచేత ఇత్యాదు లుదాహరణములు. తవర్ణకము వచ్చినచో అతఁడు-ఆతండు, అతని-ఆతని నిత్యాదిరూపములు సిద్ధించును. జడవాచకమయినచో అది-అవి, దాని-వాని, దానిచేత-వానిచేత ఇత్యాదిరూపము లగును. ఏతచ్ఛబ్దమున కిదంశబ్దము వలెనే రూపములు.

---

11. "అంత్యస్య ప్రాణినోఽక్ సుహృదాదౌ" (హల. 1) అను సూత్రముచే అకారమువచ్చి అకారాంతములయి వానివలె వ్యవహృతము లగునన్నమాట. 'అర్థబుధ్' ఇది ధకారాంత పుంలింగశబ్దము. బుధశబ్ద మకారాంతము కలదు. అది దీనికి భిన్నము.

12. ఏ యను సర్వనామము ప్రశ్నార్థకముగను సంబంధసర్వనామము గను వాడఁబడుచున్నది. వీనికి రూపము లొకతీరుననే యున్నను ఉచ్చారణము లోని స్వరమునుబట్టి యది సంబంధ బోధకముగా ప్రయుక్తమయినదని గుర్తింప వలెననుట.

### 23 సూ. నీనా యుష్మదస్మదోః

వృ: యుష్మదస్మచ్ఛబ్దయో ర్యథాక్రమం నీ నా ఇత్యాదేశౌ భవతః.

తె. వృ : యుష్మదస్మచ్ఛబ్దములకు క్రమముగా నీ నా అనునవి ఆదేశములుగా వచ్చును.

### 24 సూ. సో రీతో వు

వృ: యుష్మదస్మదాదేశయో ర్మధ్యే ఈకారాత్పరస్య సోః స్థానే వు స్యాత్. నీవు.

తె. వృ : యుష్మదస్మదాదేశములలో ఈ కారమునకుఁ బరమందున్న సుస్థానమున వు వచ్చును. నీవు అనునది యుదాహరణము.

### 25 సూ. యుష్మదస్మదో స్సుసీత్యేకే

వృ: సుసి పరే యుష్మదస్మదో రాదే ర్హలో వా లుగితి కేచి దాచార్యాః. ఈవు.

తె. వృ : ప్రథమావిభక్తి ప్రత్యయములు పరముగా నున్నప్పుడు యుష్మదస్మదాదేశములలోని ఆదిహల్లు వికల్పముగా లోపించునని కొందఱు వ్యాకరణాచార్యుల మతము. ఈవు అనునది దీని కుదాహరణము.

### 26 సూ. బహువచనే మః

వృ: యుష్మదస్మదాదేశయో ర్నకారస్య మకార స్స్యా ద్బహువచనే పరే. లస్య రేఫః. మీరు. ఆదిహల్లోపే ఈరు. పౌనరుక్త్యే మీరలు-ఈరలు.

తె. వృ : బహువచన ప్రత్యయము పరమయినప్పుడు యుష్మదస్మదాదేశముల నకారమునకు మకార మాదేశమగును. లకారమునకు రేఫము వచ్చి 'మీరు' అగును. ఆదిహల్లు లోపించినచో 'ఈరు' అనియగును. బహువచనప్రత్యయ పౌనరుక్త్యమునందు మీరలు-ఈరలు అను రూపద్వయము సిద్ధించును.

### 27 సూ. అమ్శసో ర్ద్విత్వం యుష్మదస్మదో శ్చ హ్రః

వృ: యుష్మదస్మద్భ్యా మమ్శసో ర్నుమూ భవతః. తత్సన్ని యోగే హ్రస్వశ్చ. వా ద్విత్వమ్. నిను-నిన్ను, మిము-మిమ్ము. పౌనరుక్త్యే మిమ్ములు. నీచేత-మీచేత. నీకొఱకు-మీకొఱకు ఇత్యాది.

తె. వృ: యుష్మదస్మచ్ఛబ్దాదేశములకుఁ బరమందున్న అమ్ శస్ అను ప్రత్యయములకు క్రమముగా 'ను ము' అనునవి యాదేశమగును. వాని సన్నియోగముచే పూర్వాచ్చునకు హ్రస్వము వచ్చును. వికల్పముగా

ను ము లకు ద్విత్వము కలుగును. నిను-నిన్ను, మిము-మిమ్ము. బహు వచనము పునరుక్తమయినప్పుడు మిమ్ముల నని రూపము. నీచేత-మీచేత, నీకొఱకు-మీకొఱకు ఇత్యాది రూపము లూహ్యములు.

28 సూ. నుమూ సుజసో రే దస్మదః

వృ: అస్మచ్ఛబ్దాదేశస్య సుజసోః స్థానే నుమూ భవతః. తత్సన్నియోగే ప్రాతిపదికసంబంధినః అకారస్య ఏకారశ్చ. నేను-మేము, ఏను-ఏము; నను-నన్ను, మము-మమ్ము-మమ్ముల, నాచేత-మాచేత, నాకొఱకు-మాకొఱకు ఇత్యాది.

తె.వృ: అస్మచ్ఛబ్దాదేశమునకుఁ బరమందున్న సుజస్ ప్రత్యయముల స్థానమునందు క్రమముగా ను ము అనునవి యాదేశములగును. తత్సన్ని యోగమున ప్రాతిపదిక సంబంధియగు అకారమునకు ఏకారముకూడ ఆదేశమగును. నేను-మేము, ఏను-ఏము, నను-నన్ను, మము-మమ్ము-మమ్ముల, నాచేత-మాచేత, నాకొఱకు-మాకొఱకు.

29 సూ. ద్వంద్వే జసో ము

వృ: యుష్మదస్మదో ర్ద్వంద్వసమాసే సతి జసః స్థానే మువర్ణక స్స్యాత్. మనము.

తె. వృ: యుష్మదస్మదాదేశములకు ద్వంద్వసమాసము వచ్చినప్పుడు దానికిఁ బరమందున్న జస్ప్రత్యయమునకు మువర్ణక మాదేశమగును. మనము.

30 సూ. న రః

వృ: యుష్మదస్మదో రేవ ద్వంద్వే సతి లస్య రేఫో న. మనల.

తె. వృ: యుష్మదస్మదాదేశములకు ద్వంద్వసమాసము చేసినప్పుడు దానిపై వచ్చు లకారమునకు రేఫమురాదు. మనల నను నది యిందు కుదాహరణము.

వృ: సుపాదుఁడు-సుపాదులు, అగ్నిమథుఁడు-అగ్నిమథులు, ప్రాంచుఁడు-ప్రాంచులు, తిర్యంచము - తిర్యంచములు, పరీక్షితుఁడు-పరీక్షితులు, నీవృతము-నీవృతములు.

తె. వృ: సుపాచ్ఛబ్దము సుపాదుఁడు-సుపాదులు అను విధముగా నుండును. అగ్నిమథ్ శబ్దమునకు అగ్నిమథుఁడు-అగ్నిమథులు అను విధముగా రూపము లుండును. ప్రాఙ్శబ్దమునకు ప్రాంచుఁడు[13]— ప్రాంచులు

13. ప్రాంచుఁడు - తిర్యంచము - నీవృతములను శ. ర. కారుఁ డుదాహ రింపలేదు.

అనువిధముగా రూపములు. తిర్యక్ఛబ్దము తిర్యంచము-తిర్యంచములు అను విధముగా నుండును. పరీక్షిచ్ఛబ్దమునకు పరీక్షితుఁడు-పరీక్షితులు అను విధముగా రూపములు. నీవృచ్ఛబ్దము నీవృతము-నీవృతములు అను విధముగా నేర్పడును.

### 31 సూ. మతుపో మంతః

వృ: మతుప్ ప్రత్యయస్య మంత ఇత్యాదేశ స్స్యాత్. శ్రీమంతుఁడు-శ్రీమంతులు. వకారాదేశే[14] ధనవంతుఁడు-ధనవంతులు.

తె. వృ: మతుప్ప్రత్యయమునకు 'మంత' అను నాదేశము వచ్చును. శ్రీమంతుఁడు-శ్రీమంతులు ఉదాహరణములు. మతుప్పులోని మకు వకారాదేశము వచ్చినప్పుడు ధనవంతుఁడు[14]—ధనవంతులు అనువిధముగా రూపము లుండునని గ్రహింపవలెను.

### 32 సూ. ద్విత్వం చ దిగాదేః

వృ: దిగాదే రంత్యహలో ద్విత్వ ముచ్చ స్యా త్కు-త్వాదికం చ. దిక్కు, మరుత్తు.

తె. వృ: దిగాదుల యంత్యహల్లునకు ద్విత్వము నుత్వమును వచ్చును. కుత్వాదికమును[15] వచ్చునని తెలియవలెను. దిక్కు, మరుత్తు.

### 33 సూ. న భవతామ్

వృ: భవత్ప్రకారాణాం ప్రయోగో నాస్తి. క్తవతు శతృ ప్రత్యయాదయో భవత్ప్రకారాః.

తె. వృ: భవత్ప్రకారముల కాంధ్రమునందు ప్రయోగములేదు. క్తవతుప్రత్యయము[16] శతృప్రత్యయము మున్నగునవి యంతమందుఁ గలవి భవత్ప్రకారములు.

---

14. 'అనుక్తం సంస్కృతవత్' అను నియమము ననుసరించి సంస్కృత వ్యాకరణమునందలి "మాదుపధాయాశ్చ మతో ర్వోఽయవాదిభ్యః (పా. 8-2-9) అనుసూత్రముచేత వకారము వచ్చుననియు నప్పుడు తెలుఁగున మంతకు బదులు వంత వచ్చుననియు గ్రహింపవలెను.

15. "క్విన్ప్రత్యయస్య కుః" (పా. 8-2-62) అను సూత్రముచే సంస్కృత వ్యాకరణమున శకారాంతమయిన దిక్ఛబ్దమునకు కుత్వము వచ్చి దిక్ అని యగును. ఆకుత్వమును వచ్చుననుట. దిక్ఛబ్దము స్త్రీలింగము.

16. "నిష్ఠా" (పా. 3-2-102) అను సూత్రముచే భూతార్థమున క్తవతు ప్రత్యయమును లటశ్శతృశానచా వప్రథమాసమానాధికరణే (పా. 3-2-124) అనిశతృప్రత్యయమును సంస్కృత వ్యాకరణమునందు విధింపఁబడినవి.

వృ: ధర్మగుపుఁడు-ధర్మగుపులు, తాదృశుఁడు-తాదృశులు, ఘృతస్పృశుఁడు-ఘృతస్పృశులు, రత్నముషుఁడు-రత్నముషులు, దోషము-దోషములు, వేధ-వేధలు.

తె. వృ: ధర్మగుప్ఛబ్దము ధర్మగుపుఁడు-ధర్మగుపులు అనువిధముగా నుండును. తాదృక్ఛబ్దము తాదృశుఁడు-తాదృశులు అనువిధముగా నుండును. ఘృతస్పృక్ఛబ్దమునకు ఘృతస్పృశుఁడు-ఘృతస్పృశులు అను విధముగా రూపములు. రత్నముట్ఛబ్దమునకు రత్నముషుఁడు-రత్నముషులు అను రీతిగా రూపములు. దోశ్శబ్దమునకు దోషము[17] దోషములు అని రూపములు. వేధశ్శబ్దమునకు వేధ-వేధలు అనువిధముగా రూపములు.

## 34 సూ. స స్యాపయః ప్రభృతే ర్లుక్[18]

వృ: పయఃప్రభృతే రన్యత్ర అంత్యసకారస్య లుగ్వా స్యాత్. పురూరవుఁడు-పురూరవసుఁడు, ఉశనుఁడు-ఉశనసుఁడు అపయః ప్రభృతేరితికిమ్? సుపయసము. దిగాదిత్వే సుపయస్సు. విద్వాంసుఁడు-విద్వాంసులు.

తె. వృ: పయఃప్రభృతులలో చేరని సకారాంతశబ్దముల చివరి సకారమునకు వికల్పముగా లోపమువచ్చును. పురూరవుఁడు-పురూరవసుఁడు, ఉశనుఁడు-ఉశనసుఁడు అనునవి యుదాహరణములు. అపయఃప్రభృతులకే సలోపమని చెప్పినందువలన సుపయసము అనిరూపము. దిగాదులలోని దగుటవలన సుపయస్సు అనికూడ రూపమగును. విద్వచ్ఛబ్దమునకు విద్వాంసుఁడు-విద్వాంసులు అను విధముగా రూపములుండును.

వృ: అదస ఇదంవ ద్రూపాణి.

తె. వృ: అదశ్శబ్దమునకు ఇదంశబ్దమువలెనే రూపము లుండును.[19]

**ఇవి హలంత పులింగ శబ్దములు.**

---

17. ఇది షకారాంత పుంలింగ శబ్దము. బాహువు దీనికర్థము. అకారాంత దోషశబ్దము దీనికి భిన్నము.

18. "సాంతా దపయఃప్రభృతే స్లోపః" (ఆం.శ.చిం.)

19. "ఇదమద సేతదా మీ" (హల. 13) అను సూత్రముచే అదశ్శబ్దనముకు ఈఆదేశముగాఁ జెప్పఁబడినది. ఆ రూపములే కాని వేఱుగా లేవనుట.

### స్త్రీలింగాః

వృ: ఉష్ణిహాము, దివము, పురము. ఏ యత్కిమోః ఏది–ఏరు, ఏరలు; ఏనిని–ఏరి, ఏరల; ఏనిచేత–ఏరిచేత ఇత్యాది. తదిదమో రతయోర్వాట్: ఇది–వీరు; వీరలు; దీని–వీరి, వీరల; దీనిచేత–వీరిచేత ఇత్యాది. నస్య చాశునః: సీమ–సీమలు. అర్థబుధ–అర్థబుధలు. జడవాచకత్వే అర్థబుధము–అర్థబుధములు. స్రక్కు–స్రక్కులు. ఆ తదః. అది–వారు–వారలు. యదేతచ్ఛబ్దయోః కిమిదమో రివ రూపాణి.

తె. వృ: ఉష్ణిక్ఛబ్దమునకు ఉష్ణిహాము, దివ్ఛబ్దమునకు[20] దివము, పూర్ఛబ్దమునకు[21] పురము అనువిధముగా రూపములుండును. ఏయత్కిమోః అనుసూత్రముచే ఏ ఆదేశముగా రాఁగా ఏది–ఏరు–ఏరలు, దేనిని–ఏరి–ఏరల, దేనిచేత–ఏరిచేత ఇత్యాదిరూపములగును[22]. 'నస్య చాశునః' అను [15]సూత్రముచే నకారలోపము వచ్చి సీమ–సీమలు అను రీతిగా రూపములు సిద్ధించును. అర్థబుధ్ శబ్దమునకు అర్థబుధ–అర్థబుధలు అను విధముగా స్త్రీలింగరూపములు. ఇది జడవాచకమయినచో అర్థబుధము–అర్థబుధములు అను విధముగా నుండును. స్రక్ఛబ్దము స్రక్కు–స్రక్కులు అను విధముగా నుండును. 'ఆ తదః' అను [22]సూత్రముచే తచ్ఛబ్దమునకు ఆ అనునాదేశము వచ్చినచో అది–వారు–వారలు అను విధముగా రూపములుండును. యత్, ఏతత్ అను శబ్దముల రూపములు కిమ్ ఇదమ్ అను శబ్దములకేర్పడురూపముల వలెనేయుండును.[23]

## 35 సూ. ఆక్ సంపదాపదోః

వృ: సంపదాపదోః ఆగాగమ స్స్యాద్. సంపద, ఆపద. అగ్నిమథ. జడవాచకత్వే అగ్నిమథము.

తె. వృ: సంపదాపచ్ఛబ్దములకు ఆక్ ఆగమముగా వచ్చును. సంపద, ఆపద ఉదాహరణములు. అగ్నిమథ్ శబ్దమునకు అగ్నిమథ అని రూపము. జడవాచకమయినచో అగ్నిమథము.

## 36 సూ. వాచ ఉక్వాదిః

వృ: వాక్కుల్యానాం అంత్యహలః ఉక్ స్యాత్. కుత్వాదికార్యంచ. వాక్కు–వాక్కులు, సరిత్తు–సరిత్తులు.

---

20. ఇది వకారాంత స్త్రీలింగశబ్దము. అకారాంత పుంలింగశబ్దము దీనికి భిన్నము.
21. ఇది రేఫాంత స్త్రీలింగశబ్దము. అకారాంత పురశబ్దము దీనికి భిన్నము.
22. స్త్రీలింగమునందును నివి యిట్లే యుండుననుట.
23. వీనికి భిన్నరూపములు లేవనుట.

తె. వృ: వాచ్, కుల్యార్థకమగు సరిత్ శబ్దముల యంత్యహల్లునకు ఉక్ ఆగమముగా వచ్చును. కుత్వాదికార్యముకూడ కలుగును. వాక్కు-వాక్కులు, సరిత్తు-సరిత్తులు.

వృ: అప్శబ్దో బహువచన ఏవ. అప్పులు. దిక్కు-దిక్కులు, ప్రావృట్టు-ప్రావృట్టులు. అదశ్శబ్దస్య ఇదంవద్రూపాణి.

తె. వృ: అప్శబ్ద మెప్పుడును బహువచనమునందే యుండును. అప్పులు. దిక్కు-దిక్కులు, ప్రావృట్టు-ప్రావృట్టులు అనునవి యా శబ్దములకు తత్సమరూపములు. అదశ్శబ్దము ఇదంశబ్ద రూపములతోనే యుండును.

ఇవి హలంత స్త్రీ లింగములు.

**నపుంసకలింగాః**

వృ: అంబురుహము, సుదివము, వారము. కిమిద మోర్జడవాచకవద్రూపాణి. బ్రహ్మము, అర్థబుధము, అసృక్కు. యత్తదేతదాం జడవాచకవదేవ. అగ్నిమథము, ప్రాంచము, జగత్తు, ధర్మగుపము, తాదృశము, రత్నముషము, ధనువు-ధనుస్సు. అదశ్శబ్దస్యాపి జడవాచిన ఇవరూపాణి.

తె. వృ: అంబురుట్ఛబ్దమునకు అంబురుహము, సుదివ్శబ్దమునకు సుదివము అని రూపములు. వార్ శబ్దమునకు వారము. కిమిదం శబ్దములకు జడవాచకమునకువలె రూపములుండును. బ్రహ్మన్శబ్దమునకు బ్రహ్మము, అర్థబుచ్ఛబ్దమునకు అర్థబుధము, అసృక్ఛబ్దమునకు అసృక్కు అని రూపములేర్పడును. యత్, తత్, ఏతత్ అను శబ్దములకు జడవాచకములకు వలె రూపములుండును. అగ్నిమథము, ప్రాంచము, జగత్తు, ధర్మగుపము, తాదృశము, రత్నముషము, ధనువు-ధనుస్సు అనునవి ఆ శబ్దములకు నపుంసకలింగమునందలి రూపములు. అదశ్శబ్దమునకును జడవాచకరూపములే యగును.

శ్లో. యేషాం ప్రతీతివైషమ్యం హలంతానాం న సంభవేత్
తేషాం దిగాదిమత్త్వేన కర్తవ్యా విధయః క్రమాత్.

తె. వృ: హలంతములలో వేనికి ప్రసిద్ధి భిన్నముగా నుండదో అట్టి వానినన్నింటిని దిగాదులలోఁజేర్చి రూపములను సిద్ధింపఁజేయవలయును.

స్వాదిప్రక్రియలో హలంత ప్రకరణము సమాప్తము.

---

## (iii) అవ్యయప్రకరణమ్

### 1 సూ. అవ్యయాని

వృ: ఇతఃపర మాశాస్త్రపరిసమా ప్త్యవ్యయాని భవంతీ త్యధికారో౽యమ్.

తె. వృ: ఇక్కడినుండి చెప్పఁబడునవి అవ్యయములని నిర్దేశించునట్టి యధికారసూత్ర మిది.

వృ: తేషాం బహువిధత్వమ్. తథాచ కతిచన సుపో౽నుబంధాః, కతిచన తిఙః, కతిచన ద్వయో ర్విహితాః, అనుబంధ త్వైవ నస్యా త్కేషాంచి త్సంప్రయుక్తానామితి.

తె. వృ: ఈ యవ్యయములనేక విధములు. కొన్ని సుబంతములకు, కొన్ని క్రియలకు, కొన్ని రెంటికి ననుబంధములుగా ప్రయోగింపఁబడఁగా మఱికొన్ని అనుబంధములుగాఁగాక స్వతంత్రములుగానే ప్రయుక్తము లగు ననుట గమనింపఁదగినది.

### 2 సూ. దనుక మర్యాదాయామ్

వృ: మర్యాదార్థే దనుకేతి నిపాత్యతే. అలరె నీకీర్తి చంద్రమండలముదనుక.

తె. వృ: 'దనుక' అనునది మర్యాదార్థమున నిపతింపఁబడుచున్నది. 'అలరె నీకీర్తి చంద్రమండలముదనుక'.

### 3 సూ. ఇవార్థే వలె పోలె

వృ: ఇవార్థే వలె పోలె ఇత్యేతౌ నిపాత్యేతే. "చంచలారేఖవలె నొప్పె జలధి కన్య." "మన్మథుఁడువోలె నున్నాఁడు మాధవుండు."

తె. వృ: వలె పోలె ననునవి ఇవార్థమున నిపతింపఁబడుచున్నవి. "చంచలారేఖవలె నొప్పె జలధికన్య," "మన్మథుఁడువోలె నున్నాఁడు మాధవుండు."

### 4 సూ. రో సఖ్యాః

వృ: సఖ్యా సంబోధనే రో ఇతి నిపాత్యతే. "బోటిరో వినుము."

తె. వృ: సఖి సంబోధనమునందు రో అనునది నిపతింపఁబడుచున్నది. "బోటిరో వినుము."

## 5 సూ. ఈః ప్రశ్నే

వృ: ప్రశ్నార్థే[1] ఈ ఇతి నిపాత్యతే. "ఏరీ! నీసాటి యింతు లిందు?"

తె. వృ: ప్రశ్నార్థమునందు 'ఈ' అనునది నిపతింపఁబడుచున్నది. "ఏరీ? నీసాటియింతు లిందు?"

ఇతి సుపోఽనుబంధాః

ఇవి సుబంతములకుఁజేరు ననుబంధములు.

## 6 సూ. సంప్రార్థనా దా చ

వృ: సంప్రార్థనార్థకా ద్ధాతోః ఆచ ఈచ స్తః "కరుణ రక్షింపుమా! నన్ను గమలనాథ, యెలమిఁ బోషింపుమీ! దాసుఁ డెఱుఁగఁ దొరుల."

తె. వృ: సంప్రార్థనార్థక ధాతువుల కనుబంధములుగా 'ఆ ఈ' యనునవి యగును.

"కరుణ రక్షింపుమా! నన్ను గమలనాథ!
యెలమి బోషింపుమీ! దాసుఁ డెఱుఁగ దొరుల"

## 7 సూ. ఏ చ భూతాత్

వృ: భూతార్థే విహితా ద్ధాతోః ఏ చ ఆ చ భవతః ప్రశ్నార్థే. "ఏను నీబంట ననుఁ జూచితే మహీజ!", "అసురఁ గానమ్మ! తెలిసితివా శుభాంగి!"

తె. వృ: భూతార్థకధాతువుకంటె ఏ ఆ అనునవి ప్రశ్నార్థమున వచ్చును.

"ఏను నీబంట ననుఁ జూచితే మహీజ!"
"అసురఁ గానమ్మ! తెలిసితివా శుభాంగి!"

## 8 సూ. వ్యతిరేకా దో చ

వృ: వ్యతిరేకార్థవిహితా ద్ధాతోః "ఓ" చ "ఏ"చ "ఆ" చ భవంతి ప్రశ్నార్థే.

"ఊఱకుండెదు రక్షింపవో! గుణాఢ్య!
యితఁడు రిపుఁడంచుఁ బోషింపవే? మహాత్మ!
యనఘ! రఘువీర! కరుణింపవా! నిశాటు
ననఁగ వ్యతిరేక ధాత్వవ్యయస్వరములు."

---

1. "ప్రశ్నార్థే" అని యిక్కడ వ్రాతప్రతులలోఁ గలదు. 'ఈ' ప్రశ్నార్థమున లేదు కనుక లేఖక దోషమని యెంచబడినది.

తె. వృ: వ్యతిరేకార్థమునందలి ధాతువుకంటెఁ బరముగాఁ బ్రశ్నార్థమునందు 'ఓ, ఏ, ఆ' అనునవి మూఁడును వచ్చును.

"ఊఱకుండెదు రక్షింపవో! గుణాఢ్య !
యితఁడు రిపుఁడంచుఁ బోషింపవే? మహాత్మ!
యనఘ! రఘువీర! కరుణింపవా! నిశాటు
ననఁగ వ్యతిరేక ధాత్వవ్యయ స్వరములు." అను నీ

పద్యము నందలి మొదటి మూఁడు పాదములలోఁ గ్రమముగా నుదాహరణములు కలవు.

*ఆ ఇత్యస్యార్థభేదప్రతీతౌ తత్ స్థానే అయ్యాది ప్రయోగ ఇష్యతే.*

"శేష భుజగేంద్ర శాయి! రక్షింపవయ్య!
క్షీరనిధికన్య! మమ్ముఁ బోషింపవమ్మ!"

తె. వృ: ఆ అనుదాని కర్థభేదప్రతీతి యున్నప్పుడు అయ్యా మొదలగునవి కూడ అనుబంధములగును.

"శేష భుజగేంద్ర శాయి! రక్షింపవయ్య!
క్షీరనిధి కన్య! మమ్ముఁ బోషింపవమ్మ."

వృ: ఈ విరహితానామి[2] వ్యయానాం సుబనుబంధత్వమ పీతి కేచిత్.

తె. వృ: ఈ యనునది తక్క కడమవి సుబంతములకుఁగూడ ననుబంధము లగునని కొందఱి మతము.

9 సూ. డుమ కావుతా వాశిషి

వృ: డుమ కావుత ఇత్యేతా వాశీరర్థే నిపాత్యేతే.

"కరుణ రక్షింపుడును మమ్ముఁ గైటభారి
బ్రోచుఁగావుత మిమ్ము నంభోధికన్య."

ఇతి తిజోఽనుబంధాః.

తె. వృ: డుమ, కావుత అనునవి ఆశీరర్థమున నిపతింపఁబడుచున్నవి.

"కరుణ రక్షింపుడుమ మమ్ముఁ గైటభారి
బ్రోచుఁగావుత మిమ్ము నంభోధికన్య"

ఇవి ధాత్వనుబంధములు.

---

2. "మవ్విరహితానా" మని వ్రాతప్రతి.

## 10 సూ. ను చార్థే

వృ: సముచ్చయాద్యర్థే ను ఇతి నిపాత్యతే.
"యశేశుండును దైవతేశుఁడును నిత్యంబు న్సుఖం బీయరో"

తె. వృ: సముచ్చయాద్యర్థమునందు 'ను' అనునది నిపతింపఁబడుచున్నది. "యశేశుండును దైవతేశుఁడును నిత్యంబు న్సుఖం బీయరో"

## 11 సూ. కదాఁటౌ ఖలు కిలార్థయోః

వృ: ఖలుకిలార్థయోః క్రమేణ కదాఁటౌ నిపాత్యేతే.

"నరుల భాగ్యంబుగద నభశ్చరులఁ బ్రోఁచి
దిగియెనఁట మున్ను దివినుండి గగన గంగ"

తె. వృ: ఖలు కిల అను నవ్యయముల యర్థమునందు క్రమముగా కద అఁట అనునవి నిపతింపఁబడుచున్నవి.

"నరుల భాగ్యంబుగద! నభశ్చరులఁ బ్రోఁచి
దిగియెనఁట మున్ను దివినుండి గగన గంగ."

## 12 సూ. అపి యద్యో రేని

వృ: అపి యదీత్యేతయో రేనీతి నిపాత్యతే.

i. "మరుఁడు ప్రేరేప సతి కింపుమాలియుండె
ఆటపాటేని విడెమేని యన్నమేని"

ii. "ఇనుఁ డస్తంగతుఁ డయ్యేనేని దయితుం డేతెంచు నిక్కంబుగన్"

తె. వృ: అపి యది యనువాని యర్థమునందు 'ఏని' యనునది నిపతింపఁబడుచున్నది.

i. "మరుఁడు ప్రేరేప సతి కింపుమాలియుండె
ఆటపాటేని విడెమేని యన్నమేని"

ii. "ఇనుఁ డస్తంగతుఁడయ్యేనేని దయితుం డేతెంచు నిక్కంబుగన్."[3]

## 13 సూ. అ ఏ అవధారణే

వృ: అ ఏ ఇత్యేతా వవధారణార్థే నిపాత్యేతే. "అర్జునుఁడ యేఁ వీరుఁడో యతివలార! యిందిరాదేవియే కోర్కెలిచ్చు నాతి."

---

3. 'ఆటయును పాటయును విడెమును అన్నమును' అని యిందపర్థమున ఏని వచ్చెనన్న మాట. 'అస్తంగతుఁడయ్యేనేని' అను చోటి ఏని యదర్థకము.

తె. వృ: అ, ఏ యనునవి అవధారణార్థమున నిపతింపఁబడుచున్నవి.

"అర్జునుఁడ యేకవీరుఁడో యతివలార!
యిందిరాదేవియే కోర్కె లిచ్చు నాతి."

## 14 సూ. ఒక్కొ సంశయే

వృ: సంశయే ఒక్కొ ఇతి నిపాత్యతే "బుడుపులుఁ గేలుం దోఁపఁగఁ బొడ వైనది స్థాణువొక్కొ పురుషుండొక్కొ."

తె. వృ: సంశయార్థమునందు ఒక్కొయనునది నిపతింపఁబడుచున్నది.

"బుడుపులుఁ గేలుం దోఁపఁగఁ
బొడవైనది స్థాణువొక్కొ పురుషుండొక్కొ."

## 15 సూ. ఓ సంబోధనే చ

వృ: సంబోధనే త్వాదావేవ. స్థాణువో పురుషుఁడో.

తె. వృ: ఓ యనునది సంబోధనము నందును వచ్చును. సంబోధనము నందయినచో ఆదియందే యుండును. 'స్థాణువో పురుషుఁడో' అను నిది సంశయార్థమునందు ఓ వచ్చినందు కుదాహరణము.

## 16 సూ. ఓసి దాస్యాశ్చ

వృ: దాస్యా స్సఖ్యాశ్చ సంబోధనే ఓ సీతి నిపాత్యతే. ఓసి మల్లికా రావే,

"అతని రతిఁ దేల్చి క్రమ్మఱ నరుగుఁదేర
నోసి బోటి యిదేమొ నా కొంటి యయ్యో."

తె. వృ: దాసిగాని సఖిగాని సంబోధ్యలయినప్పుడు తద్వాచక ములకు ఓసి యనునది యనుబంధ మగును. 'ఓసి మల్లికా రావే' యిది దాసికుదాహరణము.

"అతని రతిఁదేల్చి క్రమ్మఱ నరుగుఁదేర
నోసి బోటి యిదేమొ నాకొంటి యయ్యో"

ఇది సఖికుదాహరణము.

ఇత్యుభయానుబంధాః

ఇవి సుబంతములకు తిజన్తములకుఁగూడఁ జేరు నుభయానుబంధనులు.

## 17 సూ. ఏమి కిమః

వృ: కిమి త్యస్య ఏమీతి నిపాత్యతే. "ఏమి వర్ణింపఁగలవయ్య యితని కీర్తి".

తె. వృ: కిమ్ అనుదానికి ఏమి యనునది నిపాతముగా వచ్చును. "ఏమి వర్ణింపఁగలవయ్యా యితని కీర్తి?"

## 18 సూ. భళి ప్రశంసాయామ్

వృ: ప్రశంసాయాం భళీతి నిపాత్యతే. "భళి! రఘూద్వహా! నీ ధనుఃప్రౌఢిమంబు".

తె. వృ: భళి యనునది ప్రశంసార్థమున నిపతింపఁబడుచున్నది. "భళి! రఘూద్వహా నీ ధనుఃప్రౌఢిమంబు."

## 19 సూ. లాలీ డోలాప్రేంఖోలనే

వృ: డోలా ప్రేంఖోలనే లాలీతి నిపాత్యతే. "లాలీ బాలకు నూపరమ్మ యువతు ల్నందాత్మజున్ వేడుకన్."

తె. వృ: డోలాప్రేంఖోలనమునందులాలీ యనునది నిపతింపఁబడుచున్నది. "లాలీ బాలకు నూపరమ్మ యువతు ల్నందాత్మజు న్వేడుకన్" అనునది యుదాహరణము.

## 20 సూ సూ. ముసలఘాత నిశ్చయాఖ్యానయోః

వృ: ఏతయోస్సూ ఇతి నిపాత్యతే.

i. "సూ! నీవారము లెల్లఁ గ్రొత్తలుగదే సూ! రావె పద్మాననా!"
ii. "ఇతఁడు సూ! లంకఁ గాల్పించె నితని నేలె"
iii. "అతఁడు సూ! వీరవర్యుఁ డో యతివలార!"
iv. "సూ! రమణి తోడురావె నీవారములకు

సూ! ముసలమెంత బరువమ్మ సుందరాంగి!"

తె. వృ: ముసలఘాతమును నిశ్చయమును జెప్పుటకు సూ అనునది అనుబంధముగా వచ్చును.

i. "సూ! నీ వారము లెల్లఁ గ్రొత్తలుగదే! సూ! రావె పద్మాననా!"
ii. "ఇతఁడు సూ! లంకఁగాల్పించె నితని నేలె"
iii. "అతఁడు సూ! వీరవర్యుఁ డో యతివలార!"
iv. "సూ! రమణి తోడురావె నీవారములకు"

సూ! ముసల మెంత బరువమ్మ సుందరాంగి!"

21 సూ. అయ్యో కట్టాక్కటాః ఖేదే

వృ: ఏ తే త్రయః ఖేదే నిపాత్యంతే.

"అక్కటా! మోసమయ్యో నేమనఁగఁ గలదు
నా విభుని మది గరగదయ్యో! విధాత!
కట్ట! యెట్లోర్తువేదనఁ గాంతలార!
యనుచుఁ జింతించె రాధ కృష్ణుని దలంచి"

తె. వృ: అయ్యో, కట్టా, అక్కటా యను మూఁడును దుఃఖవ్యక్తీకరణమున అనుబంధములుగా నిపతింపఁబడుచున్నవి.

"అక్కటా! మోసమయ్యో నేమనఁగఁ గలదు?
నా విభుని మది గరగదయ్యో! విధాత!
కట్ట! యెట్లోర్తు? వేదనఁ గాంతలార!
యనుచుఁ జింతించె రాధ కృష్ణుని దలంచి"

22 సూ. చిచ్చీ బాలగ్రహాపనయే

వృ: బాలగ్రహాపనయే చిచ్చీతి నిపాత్యతే.

"మెచ్చు ల్దోప యశోద పల్కు సుతుఁ గూర్మి న్మాపునం దార్చుచున్
జిచ్చీ! బాలక నిద్ర గైకొనుము బూచీ రాకు మిచ్చోటికిన్"

తె. వృ: బాలగ్రహమును దూరము చేయుట యను నర్థమున చిచ్చీ యని నిపతింపఁబడుచున్నది.

"మెచ్చు ల్దోప యశోద పల్కు సుతుఁ గూర్మి న్మాపునం దార్చుచున్
జిచ్చీ! బాలక నిద్ర గైకొనుము బూచీ! రాకు మిచ్చోటికిన్"

23 సూ. ఇస్సీశ్వరస్మరణే

వృ: పాపదర్శనాది ష్వీశ్వరస్మరణే ఇస్సీతి నిపాత్యతే "ఇస్సీ! యెంతలు పుట్టె శీతకిరణుం డిట్లేచునే రాధికన్."

తె. వృ: పాప దర్శనాదులం దీశ్వరస్మరణము చేయుట యను నర్థమునందు ఇస్సీ యనునది యనుబంధమగును. "ఇస్సీ! యెంతలు పుట్టె శీతకిరణుం డిట్లేచునే రాధికన్."

## 24 సూ. చెల్లగాః

వృ: చెల్లాదయ స్సంతాపాదిషు బహుళం నిపాత్యంతే. "వల్లభుఁడు కూర్మిఁ జూపఁడు వనితయెడల, చెల్ల! మరుఁ డెంత కోపించె చెలియలార!"

తె. వృ: చెల్ల మొదలగునవి సంతాపాద్యర్థములలో బహుళముగా నిపతింపఁబడుచున్నవి. "వల్లభుఁడు కూర్మిఁ జూపఁడు వనితయెడల, చెల్ల! మరు డెంత కోపించెఁ జెలియలార!"

## 25 సూ. మఱి వెండ్యపి చార్థే

వృ: మఱి వెండి ఇత్యేతావపి చార్థే నిపాత్యేతే. "మఱియు నింద్రుని కెంతేని మహిమ గలదు, వెండియు ననంగుఁ డుప్పొంగె వేవిధముల."

తె. వృ: మఱి, వెండి యనునవి కూడ సముచ్చయార్థమున నగునని నిపతింపఁబడుచున్నది. "మఱియు నింద్రుని కెంతేని మహిమ గలదు, వెండియు ననంగుఁ డుప్పొంగె వేవిధముల."

## 26 సూ. తూష్ణీమర్థే మిన్నకూఱక

వృ: ఏతౌ తూష్ణీమర్థే నిపాత్యేతే. "ఊఱకుండక క్రీడించు యువతిఁ జూచి, మీనకేతనుఁ డప్పుడు మిన్నకుండె."

తె. వృ: తూష్ణీమ్ అనుదాని యర్థమునందు ఊఱక మిన్నక అనునవి నిపతింపఁబడుచున్నవి. "ఊఱకుండక క్రీడించు యువతిఁ జూచి, మీనకేతనుఁ డప్పుడు మిన్నకుండె."

## 27 సూ. పిద పానంతర్యే

వృ: ఆనంతర్యే పిదపేతి నిపాత్యతే. "ప్రొద్దుక్రుంకిన పిదపఁ బూఁబోణి వలచె."

తె. వృ: ఆనంతర్యార్థమున పిదప అనునది యగును. "ప్రొద్దు క్రుంకిన పిదపఁ బూఁబోణి వలచె" ననునది యుదాహరణము.

## 28 సూ. కొలకొలగా అనుకరణే

వృ: అనుకరణే కొలకొలాదయో నిపాత్యంతే.

"అబ్జరుచిఁ దూర్పు దిగదిగ యంచు మెఱసె
నడవి కాకాళి కొలకొల యంచు మునిఁగె
నసమశరువాలు నిగనిగ యంచు నెఱసె
నతివడెందంబు తెకతెక యంచు నుడికె."

తె. వృ: అనుకరణమునందు కొలకొల మొదలగునవి యగునని నిపతింపఁబడుచున్నది.

"అబ్జరుచిఁ దూర్పు దిగదిగ యంచు మెఱసె
నడవి కాకాళి కొలకొల యంచు మునిఁగె
నసమశరువాలు నిగనిగ యంచు నెఱసె
నతివడెందంబు తుకతుక యంచు నుడికె"

## 29 సూ. సారె పునరర్థే

వృ: పునరర్థే సారె ఇతి నిపాత్యతే. "సారె మ్రొక్కెద నీకుఁ గేశవ! రమేశ!"

తె. వృ: పునః అను నర్థమున సారె వచ్చును. "సారె మ్రొక్కెద నీకుఁగేశవ! రమేశ!"

## 30 సూ. ఎల్లి నిరుడూ శ్వః పరు దర్థయోః

వృ: ఏతయో ర్థయో స్తౌ నిపాత్యేతే. "ఎల్లి మీతోడఁ 4బాడెద నింతులార!" "నిరుడు మదిరాక్షి పాలిండ్లు నిమ్మపండ్లు."

తె. వృ: శ్వః, పరుత్ అనువానియర్థమునందు ఎల్లి, నిరుడు అనునవి క్రమముగా నిపాతములగును. "ఎల్లి మీతోడఁ[4] బాడెద నింతులార!" "నిరుడు మధిరాక్షి పాలిండ్లు నిమ్మపండ్లు."

యథోపపదం విభక్త్యశ్చ జ్ఞేయాః సారెకు, ఎల్లికి, నిరుటికి ఇత్యాది.

తె. వృ: ఈ యనుబంధములలోఁ గొన్నింటి కుపపదముల నను సరించి విభక్తులుకూడ వచ్చునని తెలియవలెను. సారెకు, ఎల్లికి, నిరుటికి.

స్వాది ప్రక్రియ సమాప్తము.

---

4. గూడెద నని పాఠాంతరము.

# స్త్రీప్రత్యయప్రకరణమ్

వృ: అథ స్త్రీ ప్రత్యయాః

తె. వృ: ఇంక స్త్రీ ప్రత్యయములు.

## 1 సూ. నిత్య మాబాదిః[1]

వృ: ఆబాది రత్రాపి నిత్యం స్యాత్ సమతాదశాయామ్. అజ. అశ్వ.

తె. వృ: ఈ వైకృతభాషయందును తత్సమములుగా నుండునపుడు శబ్దములకు ఆప్ (టాప్ డాప్ చాప్), ఈప్ (జీప్ జీష్ జీన్), ఊజ్, తి అను స్త్రీ ప్రత్యయములు నిత్యముగా వచ్చును. అజ. అశ్వ.

## 2 సూ. విశేషణస్య మహత్యాః[2]

వృ: మహత్యా విశేషణ స్యాపి నిత్య మాబాదిః. లోకమాత కుటిలకేశి.

తె. వృ: మహతీవాచకము విశేషణమునకుఁ గూడ నిత్యముగా ఆబాది ప్రత్యయములు చేరును. లోకమాత కుటిలకేశి.

## 3 సూ. అప్రాణిన్యా వా[3]

వృ: అప్రాణి వాచిన్యాః మహత్యాః విశేషణస్య ఆబాది ర్వా స్యాత్.

"మున్ను విరులును వెన్నెలల్ ముదమొనర్చు
వానిగూడుట నిపుడది లేనికతన
తరుణి! మల్లిక నాకు హృద్యంబుగాదు
సరసచంద్రిక మన్మనోహరయుఁ గాదు."

చంద్రిక మనోహర. చంద్రిక మనోహరము.

తె. వృ: ప్రాణులను దెలుపునది కాని మహతీవాచకము విశేషణమునకు ఆబాది ప్రత్యయము వికల్పముగాఁ జేరును.

---

1. ఆం. శ. చిం. 3. 61 : "నియతః స్త్రీ ప్రత్యయస్తు సర్వాసామ్."
2. ఆం. శ. చిం. 3. 59 : "వికృతౌ చ స్త్రీ లింగాః స్త్రీలింగక సర్వనామ ధేయాః స్యుః"
3. ఆం. శ. చిం. 3. 60 : "ఉభయవిధ మమహతీనామ్"

మున్ను విరులును వెన్నెలల్ ముదమొనర్చు
వాని గూడుట యిపుడది లేని కతన
తరుణి ! మల్లిక నాకు హృద్యంబుగాదు
సరసచంద్రిక మన్మనోహరయుఁ గాదు.

చంద్రిక మనోహర. చంద్రిక మనోహరము.

4 సూ. వ్యత్యయశ్చ సంజ్ఞాయాం వర్ణకస్య [4]

వృ: సంజ్ఞాయా మాబాదే ర్వ్యత్యయశ్చ స్యాత్. గౌరి, గౌర, గౌరు.

తె. వృ: సంజ్ఞ విషయమున ఆబాది ప్రత్యయములు తారుమారు గను నగుచుండును. గౌరి (జీష్)- గౌర (టాప్)- గౌరు (ఊఙ్).

5 సూ. బహువచనా డ్డిఙ్ [5]

వృ: బహువచనా ద్విహితాద్ అ-ప్రత్యయాత్ డిఙ్స్యాత్. వగలాఁడి. వన్నియలాఁడి.

తె. వృ: బహువచనము కంటెఁ బరమయిన అ- ప్రత్యయమునకు డిఙ్ [6] చేరును. వగలాఁడి. వన్నియలాఁడి.

6 సూ. వికృతి తద్భవాభ్యాం మిత్- పితౌ

వృ: మిత్- పితౌ యౌ తౌ వికృతి తద్భవాభ్యాం క్రమేణ భవతః.

తె. వృ: దిగువఁజెప్పఁబోవువానిలో మకార మిత్తుగాఁగల ప్రత్యయములు వికృతి శబ్దములకును, పకార మిత్తుగాఁగల ప్రత్యయములు తద్భవ శబ్దములకును జేరును.

7 సూ. సూర్యా జ్జాతే స్తమ్

వృ: సూర్యగణా జ్జాతివాచకా చ్ఛబ్దాత్ పరతః స్త్రియాం తమ్ స్యాత్. బాఁపత. కాఁపత.

తె. వృ: సూర్యగణరూపమున[7] నున్న జాతివాచక శబ్దమునకు స్త్రీత్వమున తమ్[8] అను ప్రత్యయము చేరును. బాఁపత, కాఁపత.

4. ఆం. శ. చిం. 4. 27 : "అ ఇ ఉ స్త్రీ విషయాః"

5. అథ. కా. 3.50 "స్త్రియా మాడి ర్బహుత్వే స్యాత్."

6. డిఙ్ –ఁడి.

7. సూర్యగణరూప మనఁగా నిచ్చట గలము (గురువు, లఘువు కలది) మాత్రమే వివక్షితము.

8. తమ్ లో మకారము ఇత్తు. కనుక 7వ సూ. ప్రకారము ఈ ప్రత్యయము వికృతి శబ్దములకుఁ జేరును.

## 8 సూ. తదేకాభ్యామ్

వృ: తచ్ఛబ్దా దేకశబ్దాచ్చ పరతః స్త్రియామ్ తమ్ స్యాత్. అవ్వత-ఒక్కత.

తె. వృ: తచ్ఛబ్దమునకును ఏక శబ్దమునకును స్త్రీ ప్రత్యయముగా తమ్ వచ్చును. అవ్వత. ఒక్కత.

## 9 సూ. తద్భవా జ్జనపదా దీప్ తత్ర భవే

వృ: తద్భవా జ్జనపదవాచినః పదాత్ తత్ర భవ ఇత్యర్థే (ఈప్ భవతి). కన్నడి, గుజ్జరి, మరాటి.

తె.వృ: అక్కడ పుట్టుక గలది యను నర్థమున జనపదవాచియైన తద్భవ శబ్దమునకు ఈప్ ప్రత్యయ మగును. కన్నడి, గుజ్జరి, మరాటి.

## 10 సూ. ఖడ్గగాత్ స్వార్థే

వృ: తద్భవేభ్యః ఖడ్గాదిభ్యః స్వార్థే ఈప్ స్యాత్. కత్తి, పుట్టి, పిటికి, అంగడి, కుద్దలి, గొడ్డలి, దూది, గుత్తి, రక్కసి, నాగలి, సంపంగి, బూచి, వసనాబి.

తె. వృ: తద్భవములగు ఖడ్గాది శబ్దములకు స్వార్థమున ఈప్ వచ్చును. కత్తి, పుట్టి, పిటికి, అంగడి, కుద్దలి, గొడ్డలి, దూది, గుత్తి, రక్కసి, నాగలి, సంపంగి, బూచి, వసనాబి.

స్త్రీప్రత్యయప్రకరణము సమాప్తము.

---

9. ఈప్ ప్రత్యయము చేరి కన్నడీ, గుజ్జరీ, మరాటీ అను రూపములు రాగా స్వాది. అజం. 49 వ సూత్రము వలన దీర్ఘములు హ్రస్వము లగుచున్నవి.

# విభక్త్యర్థప్రకరణమ్

వృ: అథ విభక్త్యర్థాః

తె. వృ: ఇంక విభక్త్యర్థములు.

## 1 సూ. బహుళం విభక్తి ర్యథాస్థానమ్[1]

వృ: స్వకారకస్థాన మనతిక్రమ్య సంస్కృతవత్ ప్రాకృతవచ్చ అత్ర బహులం విభక్తి ర్భవతి.

తె.వృ: తన కారక స్థానమును మీఱక సంస్కృతమునందువలెను, ప్రాకృతమునందువలెను త్రిలింగ భాషలో విభక్తి వచ్చును.

వృ: హరి రక్షింపుచున్నాఁడు. భక్తుఁడు రక్షింపఁబడుచున్నాఁడు. తిఙా ద్యభిహితే కర్తరి కర్మణిచ ప్రథమా.

తె. వృ: కర్తయు, కర్మయు తిఙ్- కృత్- తద్ధిత- సమాసములచేఁ జెప్పఁబడినపుడు వానికి ప్రథమా విభక్తి వచ్చును. హరి రక్షింపుచున్నాఁడు. భక్తుఁడు రక్షింపఁబడుచున్నాఁడు.[2]

వృ: హరిని భజింపుచున్నాడు. తిఙాద్యనభిహితే కర్మణి ద్వితీయా.[3]

తె. వృ: కర్మ తిఙాదులచేఁ జెప్పఁబడనపుడు దానికి ద్వితీయావిభక్తి వచ్చును. హరిని భజింపుచున్నాఁడు.

వృ: రామునిచేత నసుర వధింపఁబడుచున్నాఁడు. బాణముచే వధింపఁ బడుచున్నాఁడు. తిఙాద్యనభిహితే కర్తరి కరణేచ తృతీయా.[4]

తె. వృ: కర్తయు, కరణమును తిఙాదులచేఁ జెప్పఁబడనప్పుడు తృతీయావిభక్తి వచ్చును. రామునిచేత నసుర వధింపఁబడుచున్నాఁడు. బాణముచే వధింపఁబడుచున్నాఁడు.

---

1. సర్వ విభక్తిః సంస్కృతతుల్యా. అం. శ. చిం. 4.40

2. తిఙభిహితమునకు మాత్ర ముదాహరణము లియ్యఁబడినవి. తక్కినవాని కుదాహరణములు: కృత్ - రాముఁడు [illegible]. తద్ధిత - రాముఁడు దాశరథి. సమాస - విష్ణువు చక్రపాణి.

3. (అనభిహితే) కర్మణి ద్వితీయా. (పా. 2. 3. 1, 2)

4. కర్తృ కరణయో స్తృతీయా (పా. 2. 3. 18).

వృ: విప్రునికొఱకు గోవు నిచ్చుచున్నాఁడు. సంప్రదానే చతుర్థీ.[5]

తె. వృ: సంప్రదానమున చతుర్థీ విభక్తి వచ్చును. విప్రుని కొఱకు గోవు నిచ్చుచున్నాఁడు.

వృ: పాపమువలన విరతుఁడయ్యె, అపాదానే పంచమీ.[6]

తె. వృ: అపాదానమున పంచమీ విభక్తి వచ్చును. పాపము వలన విరతుఁడయ్యె.

వృ: అన్నమునకు వసింపుచున్నాఁడు. హేతౌ ద్యోత్యే షష్ఠీ.[7]

తె. వృ: హేతువు సూచింపఁదగినదగునప్పుడు షష్ఠీవిభక్తి వచ్చును. అన్నమునకు వసింపుచున్నాఁడు.

వృ: కటమందున్నాఁడు. అధికరణే సప్తమీ.[8]

తె. వృ: అధికరణకారకమున సప్తమీ విభక్తి వచ్చును. కటమందున్నాఁడు.

వృ: "హరికిఁ గోపించె రాధ పుష్పాస్త్రుఁదలఁచి" ఇత్యాదౌ జేసఃషష్ఠీ. విప్రునకు గోవు నిచ్చుచున్నాఁడు ఇత్యాదౌ జే సోవా షష్ఠీ. మాధవునకుఁ బ్రణమిల్లె, చోరునకు భయపడియె ఇత్యాదౌ అసాదేః షష్ఠీ. తపోధనుఁడు వనము నుండె ఇత్యాదౌ జిపో ద్వితీయా. బహుళ గ్రహణాత్ మాసమునకుఁజదివె; సుఖమేఁగెన్; జనకు స్మరించెన్; నిండోలగ ముండెను. చర్మము నిమిత్తము వ్యాఘ్రముఁ జంపె. గ్రామాదాగచ్ఛతీత్యాదౌ అపాయాత్ పూర్వ మాధార ప్రతీతేః అధికరణంవా. స్థిత్వేత్యుపపద విశేషః. గ్రామముననుండి వచ్చెన్. గ్రామమునందుండి వచ్చెన్. గ్రామమువలన నుండి వచ్చెన్.

తె. వృ: "హరికిఁ గోపించె రాధ పుష్పాస్త్రుఁ దలఁచి" మొదలగు చోట చతుర్థికి బదులు షష్ఠి[9], "విప్రునకు గోవు నిచ్చుచున్నాడు" మొదలగు చోట చతుర్థికి బదులు వికల్పముగా షష్ఠీ విభక్తి. మాధవునకుఁ[10]

---

5. చతుర్థీ సంప్రదానే. (పా. 2. 3. 13).

6. అపాదానే పంచమీ. (పా. 2. 3. 28).

7. షష్ఠీ హేతు ప్రయోగే. (పా. 2. 3. 26).

8. సప్త మ్యధికరణే చ. (పా.2. 3. 36)

9. అన్యస్యాః క్వచిద్భవే చ్చాన్యా. ఆం. శ. చిం. 4. 41

"హరయే అకుప్యద్రాధా పుష్పాస్త్రం స్మృత్వా". క్రుధద్రుహేర్ష్యాసూయార్థానాం యం ప్రతికోపః (పా. 1. 4. 37) అను సూత్రముచే సంప్రదాన కారక మగుటచే హరి శబ్దము చతుర్థిలో నుండును.

10. విప్రుని కొఱకు గోవు నిచ్చుచున్నాఁడు అని కూడ నుండునన్నమాట.

ప్రణమిల్లె,[11] చోరునకు భయపడియె[12] మొదలగుచోట ద్వితీయకును, పంచమికిని బదులు షష్ఠి. తపోధనుఁడు వనమునుండె[13] మొదలగు చోట సప్తమికి ద్వితీయ. బహుళగ్రహణమువలన మాసమునకుఁ జదివె;[14] సుఖమేఁగెన్;[15] జనకు స్మరించెన్,[16] నిండోలగ ముండెను[17]. చర్మము నిమిత్తము వ్యాఘ్రముఁజంపె.[18] గ్రామాత్ ఆగచ్ఛతి మొదలగుచోట అపాయము (విడచుట)కంటె ముందు ఆధారము తోఁచుచున్నది గనుక వికల్పముగా అధికరణము వచ్చును. స్థిత్వా = ఉండి అను నుపపదము అధికముగాఁ జేరును. గ్రామముననుండి వచ్చెన్. గ్రామమునందుండి వచ్చెన్. గ్రామమువలన నుండి వచ్చెన్.

## 2 సూ. నిపాతే వా సుస్

వృ: వినాదౌ పరే ప్రథమా వా స్యాత్. రాముఁడు వినాగాన్; రామునిచే వినాగాన్.

తె. వృ: వి నా మొదలగు నిపాతములు పరమయినప్పుడు వికల్పముగా ప్రథమా విభక్తి వచ్చును. రాముఁడు వినాగాన్; రామునిచే వినాగాన్.

## 3 సూ. జడ స్యాసః[19]

వృ: జడవాచక ద్వితీయాయాః స్థానే ప్రథమా వా స్యాత్. రథ మెక్కెన్; రథము నెక్కెన్.

---

11. మాధవం ప్రాణమత్—కర్తు రీప్సితతమంకర్మ (పా. 1. 4. 49) కర్మణి ద్వితీయా (పా. 2. 3. 2.)
12. చోరాత్ అబిభేత్ — భీత్రార్థానాం భయహేతుః (అపాదానమ్) (పా. 1.4. 25) అపాదానే పంచమీ. (పా. 2. 3. 28)
13. తపోధనః వనే ఆసీత్—ఆధారోఽధికరణమ్ (పా. 1. 4. 45) సప్తమ్యధికరణేచ (పా. 2. 3. 36)
14. మాసేనాధీతః. అపవర్గే తృతీయా. (పా. 2. 3. 6)
15. సుఖేన గతః. ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్ (పా. 2. 3. 18 వా)
16. జనకస్య అస్మరత్. అధీగర్థదయేశాం కర్మణి (షష్ఠీ) (పా. 2. 3. 52)
17. పూర్ణ సభాయాం స్థితః, సప్తమ్యధి కరణేచ (పా. 2. 3. 36)
18. చర్మణి ద్వీపిన మహాన్. నిమిత్తాత్ కర్మసంయోగే (పా. 2. 3. 36 వా)
19. తస్యాః ప్రథమాచ జడపదానాం స్యాత్. ఆం. శ. చిం. 3.62

తె. వృ: జడవాచకపదముల ద్వితీయకు బదులు ప్రథమ వికల్పముగా వచ్చును. రథ మెక్కెన్; రథము నెక్కెన్.

### 4 సూ. జమో విశేషణస్య[20]

వృ: షష్ఠీ విశేషణస్థానే ప్రథమా వా స్యాత్. ఆర్తరక్షకుడు రామున కిష్టము.

తె. వృ: షష్ఠీ విభక్తి పదము యొక్క విశేషణమునకు షష్ఠీ విభక్తికి బదులు ప్రథమ వచ్చును. ఆర్తరక్షకుఁడు రామున కిష్టము.

### 5 సూ. నిత్య మనుబంధే

వృ: అనుబంధక ధాతౌ పరే నిత్యం ప్రథమా స్యాత్. వృషలిని బెండ్లియాడె.

తె. వృ: నామముల కనుబంధములుగా వచ్చు ధాతువులు పరమగునప్పుడు నిత్యముగా ప్రథమా విభక్తి వచ్చును. వృషలిని బెండ్లియాడె.

### 6 సూ. భావలక్షణే జీవ స్తుముని

వృ: భావలక్షణే విహితాయాః సప్తమ్యాః స్థానే నిత్యం ప్రథమా స్యాత్ తుమున్ ప్రత్యయ రూప విశేషణే పరే. రాముఁడు రక్షింప.

తె. వృ: తుమున్ ప్రత్యయ రూపమయిన విశేషణము పరమగుచుండ భావలక్షణమునఁ జెప్పఁబడిన సప్తమికి (సతి సప్తమికి) బదులు ప్రథమ వచ్చును. రాముఁడు రక్షింప.

వృ: షష్ఠీ చానాదర ఇతి షష్ఠీ స్థానేచ. పుత్రులు దుఃఖింప సన్యసించెన్.

తె. వృ: "షష్ఠీ చానాదరే" (పా 2.3.38) అని అనాదరార్థమున విధింపఁబడిన షష్ఠికి బదులుగఁ గూడ ప్రథమ వచ్చును. పుత్రులు దుఃఖింప సన్యసించెన్.

### 7 సూ. వీప్సోపమానప్రమాణాదిషు

వృ: వీప్సాయా ముపమావాచకేచ ప్రమాణవాచకాదౌ చ షష్ఠీ స్యాత్ ప్రథమాచ. గృహమునకు గృహమునకు, గృహము గృహము.

తె. వృ: వీప్స యందును, ఉపమావాచకము నందును, ప్రమాణ వాచకము మొదలగువానియందును షష్ఠీ విభక్తి వచ్చును; ప్రథమావిభక్తి

20. షష్ఠీ విశేషణానాం ప్రథమా స్యాత్. ఆం. శ. చిం. 3.57

కూడ వచ్చును. గృహమునకు గృహమునకు, గృహము గృహము. (వీప్స యందు).

### 8 సూ. భూతేతుమునో న

వృ: భూతార్థే గమ్యమానే సప్తమీ విశేషణ తుమున్ ప్రత్యయ స్థానే న - వర్ణకః స్యాత్. రాముఁడు రక్షించిన సుఖపడిరి ప్రజలు.

తె. వృ: భూతకాలార్థము తోఁచునప్పుడు సప్తమీ విశేషణ మయిన తుమున్ ప్రత్యయము స్థానమున న- వర్ణక మగును. రాముఁడు రక్షించిన సుఖపడిరి ప్రజలు.

వృ: అథ విభక్తీనాం సుబంతరాణి.

తె. వృ: ఇంక విభక్తులకు ఇతర సుప్రత్యయములు.

### 9 సూ. సహార్థే తో తోడ[21]

వృ: "సహయుక్తేఽప్రధానే" ఇత్యత్ర అప్రధానే విహితాయాః తృతీయాయాః స్థానే తో, తోడ ఇత్యేతౌ భవతః. శిష్యులతో వచ్చె, శిష్యుల తోడ వచ్చె.

తె.వృ: "సహయుక్తేఽప్రధానే" (పా. 2. 3. 19) అను సూత్రము ప్రకారము అప్రధానమునందు విధింపఁబడిన తృతీయావిభక్తి స్థానమున తో, తోడ అనునవి వచ్చును. శిష్యులతో వచ్చె; శిష్యులతోడ వచ్చెను.

వృ: క్వచి దాఖ్యాతృయోగేఽపి. ధర్మశాస్త్రము వశిష్ఠునితోఁ జదివె.

తె. వృ: ఒకానొకచో ఆఖ్యాతతో (గురువుతో) యోగమున్నపుడు గూడ తో, తోడలు వచ్చును. ధర్మశాస్త్రము వశిష్ఠునితోఁ జదివె.

### 10. సూ. కంటెఽన్యారాదాదేః[22]

వృ: అన్యారాదితరేత్యాదినా విహితాయాః పంచమ్యాః కంటె ఇతి స్యాత్. రాముని కంటె నన్యుఁడు, శత్రులకంటె నితరులు.

తె. వృ: "అన్యారాదితరర్తేదిక్ శబ్దాంచూత్తరపదా జాహియుక్తే" (పా. 2. 3. 29) అను నాద్యవ్యాకరణ సూత్రముచే విధింపఁబడిన పంచమికి 'కంటె' వర్ణకమగును. రాముని కంటెనన్యుఁడు. శత్రుల కంటె నితరులు.

---

21. ఆం. శ. చిం. 3.29. "తోడ సహార్థేటాసః".

22. ఆం. శ. చిం. 3-31 "కంటే ఽ న్యారాదాదేః"

## 11 సూ. పట్టిగుణే హేతౌ [23]

వృ: గుణే హేతౌ సతి "విభాషా గుణేఽస్త్రియా" మిత్యనేన విహితాయాః పంచమ్యాః పట్టీతి స్యాత్.

తె. వృ: గుణము హేతువగునపుడు "విభాషా గుణేఽస్త్రియామ్" (పా. 2. 3. 25) అను నాద్యవ్యాకరణ సూత్రముచేఁ జెప్పఁబడిన పంచమీ విభక్తికి 'పట్టి' వర్ణక మగును.

## 12 సూ. అద్రుతే సుపి

వృ: అద్రుతే సుపి పరే నుమ్ స్యాత్. జాడ్యముఁబట్టి బద్ధుఁడు.

తె. వృ : ద్రుతముకాని సుబ్విభక్తి పరమైనప్పుడు నుమ్-ఆగమము వచ్చును. జాడ్యముఁబట్టి బద్ధుఁడు.

వృ: హేతౌ విధీయమానాయాః టాస శ్చేసీతి కథ్యతే
కర్మప్రవచనీయస్య కూర్చి త్యాదేశ ఉచ్యతే.[24]
జడతఁజేసి బద్ధుఁడు. జపముఁ గూర్చి వర్షము.

తె. వృ : హేతువున విధింపఁబడు తృతీయకు 'చేసి' వర్ణకమగును. కర్మ ప్రవచ నీయమునకు 'కూర్చి' వర్ణక మాదేశమగును. జడతఁజేసి బద్ధుఁడు. జపముఁగూర్చి వర్షము.

## 13 సూ. లో లోపలౌ నిర్ధారణే[25]

వృ: యతశ్చ నిర్ధారణే ఇతి విహితాయాః షష్ఠ్యాః స్థానే లో, లోపల ఇత్యేతౌ భవతః. దేవతలలో బ్రహ్మ యధికుఁడు.

తె. వృ : "యతశ్చ నిర్ధారణమ్" (పా. 2. 3. 41) అను పాణిని సూత్రమున విధింపఁబడిన షష్ఠీ విభక్తిస్థానమున లో, లోపల అనువర్ణకము లగును. దేవతలలో బ్రహ్మ యధికుఁడు.

---

23. ఆం. శ. చిం 3-30. "పట్టీతి తు పంచమీ గుణే హేతౌ."

24. ఆం. శ. చిం. 3-18 "కర్మ ప్రవచనీయకే కూర్చిః."

కర్మ క్రియాం ప్రోక్తవంతః కర్మప్రవచనీయాః. తేన సంప్రతిక్రియానద్యోతయం తీతి లభ్యతే. అనగా ఒక క్రియలోపించి యుండుటను సూచించునవి కర్మప్రవచనీ యములు. జపముఁ గూర్చి - జపము (చేయుట) గూర్చి.

25. జాతి గుణ క్రియాభిః సముదాయా దేకదేశస్య పృథక్కరణం నిర్ధారణమ్—కాశి. వృ. 2. 3. 41.
ఆం. శ. చిం. 3. 32. "లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ."

## 14 సూ. జడ స్యాతో ను చ టాఙ్యోః

వృ: జడవాచక పదస్య అవర్ణతః కరణాధి కరణ విహితయోః టాఙ్యోః స్థానే 'ను' స్యాత్. రాముఁడు గదను మోదు. అయోధ్య నుండు. చకారాత్ గదచే మోదు. అయోధ్యయం దుండు.

తె. వృ : జడవాచక పదముయొక్క అవర్ణమునకు కరణాధి కరణముల విధింపబడిన తృతీయా సప్తమ్యేకవచనముల స్థానమున 'ను' వర్ణకము వచ్చును. రాముఁడు గదను మోదు. అయోధ్యనుండు. సూత్రమునందలి 'చ' కారము వలన తృతీయా సప్తమ్యేకవచనములును వచ్చు. గదచేమోదు. అయోధ్యయం దుండు.

## 15 సూ. ఉతో నః

వృ: జడ వాచక పదస్య ఉవర్ణాత్పరతః తయోరేవ "న" స్యాత్. రాముఁడు వనమున నుండు. ఖడ్గముననఱుకు. వనమునం దుండు. ఖడ్గముచే నఱుకు.

తె. వృ : జడవాచకము ఉకారమునకుఁ బరమగు (కరణాధికరణ) తృతీయా సప్తమీ విభక్తుల స్థానమున న - వర్ణక మగును. ఖడ్గమున నఱుకు. రాముఁడు వనమున నుండు. ఖడ్గముచే నఱుకు. రాముఁడు వనమునం దుండు.

## 16 సూ. జడస్య నువత్

వృ: జడవాచకపదస్య ఇవర్ణాత్పరతః తయోరేవ 'ని' స్యాత్. రాముఁడు మహిని జన్మించె. హేతిని నఱికె. మహియందు జన్మించె. హేతిచే నఱికె.

తె. వృ: జడవాచకపదముయొక్క ఇకారమునకుఁ బరమగు తృతీయా సప్తములకు (నువద్భావము) 'ని' - వర్ణకము వచ్చును. హేతిని నఱికె. రాముఁడు మహిని జన్మించె. హేతిచే నఱికె. రాముఁడు మహియందుజన్మించె.

## 17 సూ. అనౌపవిభక్తికే చ టాఙ్యో రద్వా[26]

వృ: ఔపవిభక్తికా దనౌపవిభక్తికాత్ పరతః తయో రద్వా స్యాత్. కాలఁ దన్ని; ఊర నుండి; క్రీఁగంటఁ జూచి; మింట నుండి.

---

26. ఆం. శ. చిం. 3 - 80 "ఔపవిభక్తిక నామ్నా మత్వం స్యాత్సప్తమీ తృతీయార్థే"

తె. వృ: ఔపవిభక్తికముకంటెను, అనౌపవిభక్తికముకంటెను బరమగు తృతీయా సప్తమీ విభక్తుల స్థానమున అకారము వికల్పముగా వచ్చును. కాలఁ దన్ని; ఊర నుండి; క్రిఁగంటఁ జూచి; మింట నుండి.

వృ: దాన్యాదే రపీతి కేచిత్. దాన ఖండించు; దాన నుండు.

తె. వృ: 'దాని' మొదలగు పదమునకును తృతీయా సప్తముల స్థానమున అకారము వచ్చునని కొందఱి మతము. దాన ఖండించు. దాన నుండు.

## 18. సూ. జడస్య భిస్సుపోర్న్వాదివత్

వృ: న్వాదివత్ జడవాచకస్య భిస్సుపోః స్థానే లవర్ణకః స్యాత్. రాముఁడు వనముల విహరించు. బాణముల నఱకు. వనములందు విహరించు. బాణములచే నఱకు.

తె. వృ: పైని జెప్పఁబడిన ను, ని, అకారములవలె జడవాచకము యొక్క భిస్, సుప్ - ప్రత్యయముల స్థానమున ల - వర్ణకము వికల్పముగా వచ్చును. రాముడు బాణముల నఱకు. వనముల విహరించు. బాణములచే నఱకు. వనములందు విహరించు.

విభక్త్యర్థ ప్రకరణము సమాప్తము.

# సమాస ప్రకరణమ్

## 1 సూ. అథ సమాసాః

తె. వృ: ఇఁక సమాసములు చెప్పఁబడుచున్నవి.

## 2 సూ. తత్రాదౌ తత్పురుషః

వృ: పడగతాల్పు, ఉలితునుక, దేవరమేలు, దొంగయులుకు, మాట నేర్పరి.

తె. వృ: ఆ సమాసములందు మొదటిది తత్పురుషము. పడగతాల్పు, ఉలితునుక, దేవరమేలు, దొంగయులుకు, మాటనేర్పరి యనునవి తత్పురుషోదాహరణములు.

## 3 సూ. ఒక్క శేషే

వృ: షష్ఠీ శేషే ఇతి విహితాయా షష్ఠ్యాః స్థానే ఒక్క ఇతి స్యాత్. దొర యొక్క మానిసి. సుబ్లోపే దొరమానిసి.

తె. వృ: షష్ఠీ శేషే అను సూత్రముచే విధింపఁబడిన షష్ఠీస్థానమున ఒక్క అనునది వచ్చును. దొర[1] యొక్క మానిసి. విభక్తి ప్రత్యయము లోపించి దొరమానిసియని యగును.

## 4 సూ. ఒక్కస్య దువే త్యేకే

వృ: యుష్మ దస్మదోః స్వస్యచ శేష షష్ఠ్యాః స్థానే దువర్ణ కోవా. నీదు కొడుకు, నాదుకొడుకు, తనదు కొడుకు.

తె. వృ: యుష్మత్, అస్మత్, స్వశబ్దములకంటె పరమందున్న యొక్క స్థానమున దు అనునది వికల్పముగా వచ్చును. నీదు కొడుకు, నాదు కొడుకు, తనదు కొడుకు, అనునవి క్రమముగా నుదాహరణములు.

(పక్షాంతరమున—నీకొడుకు, నాకొడుకు, తనకొడుకు)

## 5 సూ. తత్పురుషాదౌ వికారే మిశ్రతా చ

వృ: తత్పురుషాది సమాసే పుంప్వాది వికారే సతి సంస్కృత వైకృతయో ర్మిశ్రతాచ భవతి. కటాక్షంపు గుంపు, పటిటీరము.

---

1. దొర యొక్క లోని యకారము సంధి లేనప్పుడు వచ్చినదని గమనింపవలెను.

తె. వృ: తత్పురుషాది సమాసములందు పుంప్వాదేశాది వికారములు కలిగినప్పుడు సంస్కృత వైకృతముల మిశ్రత్వమును సమ్మతమైనదే. కటాక్షంపుగుంపు. ఏటితీరము మొదలగునవి.

### 6 సూ. అనాదే స్తదః

వృ: అనాదౌ వర్తమానస్య తచ్ఛబ్దసంబంధినః అతః వా లుక్స్యాత్. రామునిది – రామునియది.

తె. వృ: ఆదియందులేని తచ్ఛబ్ద సంబంధియగు అత్తునకు వికల్పముగా లోపము వచ్చును. రామునిది – రామునియది.

### 7 సూ. రేకౌ రావే ర్భూషణే

వృ: రావి శబ్దస్య రేకౌ పరే భూషణార్థే ఇతో వా లుక్స్యాత్. రాప్రేకు – రావి రేకు.

తె. వృ: భూషణమర్థమై రేకు పరమయినప్పుడు రావి లోని యిత్తునకు వికల్పముగా లోపము వచ్చును. రాప్రేకు – రావి రేకు.

### 8 సూ. పువ్వునువ్వో రంత శ్శిత్

వృ: పువ్వు, నువ్వు ఇత్యేతయో రన్యశబ్దయోగే అంతర్వర్తమానస్య సాచ్కస్య వకారస్య శిచ్చ లుక్స్యాత్. పూదండ, నూబిండి.

తె. వృ: అన్యశబ్దయోగమునందు పువ్వు నువ్వుల లోని సాచ్కవకారమునకు లోపము వచ్చును. ఆ లోపము శిత్తు కూడనగును. పూదండ, నూబిండి[2].

### 9 సూ. రాజకీరగే

వృ: రాజకీరాదా వంత్యస్య సాజ్ఝలో లుక్స్యాత్. రాచిల్క, నెలకొనుట.

తె. వృ: రాజకీరాదులందు చివరి హల్లచ్చుతోఁగూడలోపించును. రాచిల్క, నెలకొనుట అనునవి యుదాహరణములు.

---

2. శిత్తనుటచేత శితి దీర్ఘః (సంజ్ఞా 16) అని పూర్వాచ్చునకు దీర్ఘము. ఈ విధి వైకల్పికమని యెంచవలెను. పువ్వుదండ, నువ్వుపిండి అనియు నుండునన్న మాట. ఉత్తరపదపరకత్వమునం దనక అన్య శబ్దయోగమునం దనుటచేత "శి నుపూ" మొదలగునవియు నీవిధానముచే సాధ్యములగునని గ్రహింపవలెను.

3. నెలవుకొనుట నెలకొనుట అయినదన్న మాట.

## 10 సూ. నిత్యం నిట్వాదా వమితస్య

వృ: నిట్వాదౌ అనేకస్య సాజ్ఝలో లుక్స్యాత్. నీరువట్టు - నిట్టు, ఉప్పువట్టు - ఉట్టు.

తె. వృ: నిట్టు మొదలగువానిలో నొకటి కన్న నెక్కువ హల్లులు కూడ సాచ్కలములయి లోపించును. నీరువట్టు - నిట్టు. ఉప్పువట్టు - ఉట్టు.

వృ: అథ కర్మధారయః

తె. వృ: ఇఁక కర్మధారయసమాసము చెప్పఁబడును.

వృ: నల్లగలువ, ముదుఁగుఁదామర, పొన్నమ్రాను.

తె. వృ: నల్లగలువ, ముదుఁగుఁదామర, పొన్నమ్రాను మున్నగునవి కర్మధారయసమాసములు.

## 11 సూ. అనమో నః కర్మధారయే

వృ: కర్మధారయ సమాసే అనమ్సంబంధినః అతః ఇత్స్యాత్. తెల్లని కోక, చల్లనినీరు.

తె. వృ: కర్మధారయ సమాసమునందు అనమ్సంబంధియగు (తద్ధి. 18 సూ.) అత్తునకు ఇకారము వచ్చును. తెల్లని కోక, చల్లనినీరు.

## 12 సూ. వికృత మల్పం విశేషణం కర్మధారయే

వృ: కర్మధారయే సంస్కృత శబ్దస్య త్రిచతురక్షర పరిమిత మంధ్రపదం విశేషణం స్యా న్మిశ్రతాయామ్. కఱకు దర్భలు.

తె. వృ: కర్మధారయము మిశ్రమయినప్పుడు త్రిచతురక్షర పరిమితమయిన యాంధ్రపదము సంస్కృత శబ్దమునకు విశేషణము కావచ్చును. ఉదా: కఱకు దర్భలు.

## 13 సూ. తదవ ప్రభృతి చ

వృ: సంస్కృత పదస్య వైకృత స్తదాది శబ్దః అవ వర్ణకాదిశ్చ విశేషణం స్యా న్మిశ్రతాయామ్. ఆ విప్రుఁడు, ఇరువదియొకటవ యుద్ధము.

తె. వృ: మిశ్ర సమాసమునందు సంస్కృత శబ్దమునకు వైకృతములయిన తదాదులును అవ (తద్ధి. 24 సూ.) వర్ణకాదు లంతమందుఁగలవియును విశేషణములు కావచ్చును. ఆ విప్రుఁడు, ఇరువదియొకటవ యుద్ధము.

## 14 సూ. తద్యత్కిమిదమాం హే పర స్యారోష్మణః

వృ: తదాదేః హ్రస్వేసతి రేఫోష్మ వర్జితస్య పరాక్షరస్య ద్విత్వంస్యాత్.

తె. వృ: తదాదుల దీర్ఘము హ్రస్వ మయినప్పుడు వానికి పరమందున్న ఊష్మ రేఫేతరమయిన హల్లు ద్విత్వమును పొందును.

## 15 సూ. యత్కిమో స్తదః

వృ: యత్కిమోః పరస్య తదో వా హ స్స్యాత్. ఎవ్వండు – ఎహ్వాఁడు.

తె. వృ: యత్కిమర్థకమునకు పరముగానున్న తదర్థకమునకు వికల్పముగా హ్రస్వము వచ్చును. ఉదా: ఎవ్వండు - ఎవ్వాఁడు.

## 16 సూ. ఆదోతో హేలాయామ్

వృ: హేలాయా మోకారస్య ఆద్వా స్యా త్సమాసే. నవ్వుటాల[4] – నవ్వుటోల.

తె. వృ: సమాసమునందు హేలార్థకములోని ఓ కారమునకు ఆ వికల్పముగా వచ్చును. ఉదా: నవ్వుటాల[4] - నవ్వుటోల.

## 17 సూ. చెన్ను పొన్ను మున్ను కెంపు క్రొత్తానాం చెం, పొం, ముం, కెం, క్రొం సమాసే

వృ: చెన్ను ప్రభృతీనాం చెమాదీని సమాసే రూపాణి భవంతి. చెంగలువ, పొందామర, ముంగొంగు, కెంబట్టు, క్రొందావి.

తె. వృ: సమాసమునందు చెన్నుకు చెం, పొన్నుకు పొం, మున్నుకు ముం, కెంపునకు కెం, క్రొత్తకు క్రొం అను రూపములు వచ్చును. ఉదా: చెంగలువ, పొందామర, ముంగొంగు, కెంబట్టు, క్రొందావి.

## 18 సూ. ఆర్యాదే రంత్యే

వృ: అంత్యే వర్తమానస్య ఆర్యాదేః సంయుక్తాక్షరస్య[5] ఉపరి (స్థితస్య) వా లుక్ స్యాత్. రామయ – రామయ్య, కోనయ – కోనయ్య.

తె. వృ: అంతమందున్న ఆర్యాది శబ్ద సంయుక్తాక్షరములోని మీఁది హల్లునకు వికల్పముగా లోపము వచ్చును. ఉదా: రామయ -రామయ్య, కోనయ - కోనయ్య.

---

4. నవ్వుటాల – నవ్వులాటకు రూపాంతరమని శ. ర.

5. సంయుక్తాక్షర మిక్కడ ద్విత్వాక్షరమను నర్థమున వాడఁబడినట్లు కాన నగును.

19 సూ. అనార్యాంబస్యాదాద్రాయే

వృ: ఆర్యాంబారహిత శబ్దస్య అతః ఆకారస్స్యా ద్రాయా దౌపరే. రామారాయుఁడు, కోనారెడ్డి. అనార్యాంబస్యేతి కిమ్? రామయరాయుఁడు - కోనమరెడ్డి.

తె. వృ: ఆర్యాంబేతర శబ్దముల చివరి అత్తునకు రాయాదులు పరమయినప్పుడు వికల్పముగా ఆ కారము వచ్చును. ఉదా: రామా రాయుఁడు, కోనారెడ్డి. ఈకార్య మార్యాంబేతరములకే యనుటచేత రామ యరాయుఁడు, కోనమరెడ్డి ఇత్యాదులందు ఆ కారము నివారిత మయినదని యెఱుఁగవలెను.

20 సూ. జాతావిత్

వృ: జాతివాచకశబ్దే పరే అత ఇత్ స్యాత్. తిమ్మిసెట్టి, కసవిసీఁడు.

తె. వృ: జాతివాచకశబ్దము పరమయినప్పుడు అత్తున కికారము వచ్చును. ఉదా: తిమ్మిసెట్టి, కసవిసీఁడు[6].

21 సూ. ఇదీతా వూరో స్సే

వృ: సమాసే ఊరు సంబంధిన ఉతః ఇదీతౌ భవతః. కొల్లూరి పురము- కొల్లూరీ పురము. 'ఊతస్తూమో' శ్చేత్యాదినా హ్రస్వశ్చ. కొల్లురి పురము.

తె. వృ: సమాసమునందున్న ఊరు శబ్దములోని ఉత్తునకు ఇ ఈ లు వచ్చును. కొల్లూరి పురము - కొల్లూరీ పురము. "ఊతస్తూమోశ్చ హ స్సంఖ్యా పూర్వే" అను (25) వ సూత్రముచే హ్రస్వము కూడ వచ్చినచో కొల్లురి పురము అని యగును.

వృ: క్రేఁగన్ను, కొనచేయి ఇత్యాదయ ఏకదేశిసమాసాః.

తె. వృ: క్రేఁగన్ను, కొనచేయి మొదలగునవి యేకదేశి సమాసములు[7].

వృ: జవ్వాదిసెట్టి, నడగుజ్జము ఇత్యాదయో లుప్త సమాసాః.

తె. వృ: జవ్వాదిసెట్టి, నడగుజ్జము మొదలగునవి మధ్యమపదలోప సమాసములు[8].

6. కసవులో ఉకారము కాని అకారము కాదు. కసవ అను పదము కానరాదు.

7. "అఱగన్ను" క్రేఁగన్ను, సామేను, కొనచేయి, పెడతల ఇత్యాద్యా ఏకదేశి సమాసాః" (కవి శిరో. 531 పు.)

8. "జవ్వాదిసెట్టి .... ఇత్యాద్యా ఉత్తరపదలోపాః" (కవి శిరో. 531 పు.)

22 సూ. ఉప్రభృతి రాభాసః

వృ: ఉవర్ణకప్రభృతిభి ర్విశేష ణైః కర్మధారయాభాస స్స్యాత్. రక్షించు దేవత, రక్షించిన దేవత, రక్షింపని దేవత.

తె. వృ: ఉ వర్ణకము మొదలగునవి యంతమందుఁగల విశేషణములు సమసించినవి కర్మధారయాభాసములు. రక్షించుదేవత, రక్షించిన దేవత - రక్షింపని దేవత[9].

అథద్విగుః

23 సూ. ద్విత్రిచతుర్ణా మిరుమునలు సే

వృ: ద్విప్రభృతీనా మిర్వాదయ స్స్యు స్సమాసే.

తె. వృ: సమాసమునందు ద్విత్రిచతుర్శబ్దములకు ఇరు, ము, నలు అనునవి యాదేశములగును.

24 సూ. త్రిరాదేశే

వృ: త్రిశబ్దస్య ము ఇత్యాదేశే పరాక్షరస్య ద్విత్వం స్యాత్.

తె.వృ: త్రిశబ్దమునకు ము అనునది యాదేశమయినప్పుడు తరువాత నున్న యక్షరమునకు ద్విత్వము వచ్చును.

25 సూ. ఊత స్తూమోశ్చ హ స్సంఖ్యాపూర్వే

వృ: సంఖ్యా పూర్వ సమాసే తూము ఊరు ఇత్యేతయో రూతఃహస్స్యాత్ ముత్తుము.

తె. వృ: సంఖ్యాపూర్వ సమాసమునందు తూము ఊరు అను శబ్దములలోని ఊత్వమునకు హ్రస్వము వచ్చును. ముత్తుము అనునది ఉదాహరణము.

26 సూ. పదేః పన్ ద్వినవాఢకేషు

వృ: పదేః పన్నితిస్యాత్. ద్విప్రభృతౌ పరే. పందుము.

తె. వృ: పది కిరు తొమ్మిది తూము శబ్దములు పరమయినప్పుడు 'పన్' ఆదేశమగును. పందుము.

---

9. "నీవు పోషించిన భక్తులు ఇత్యాదయః కర్మధారయాభాసాః" (కవి శిరో. 520పు.)

### 27 సూ. నిత్యంపదావాతః

వృ: అఱు శబ్దస్య ఆతో నిత్యం హ స్స్యాత్ పదిశబ్దే పరే. అఱువది, అఱుబది.

తె. వృ: పది శబ్దము పరమయినప్పుడు అఱులోని ఆ కారమునకు నిత్యముగా హ్రస్వము వచ్చును. అఱువది, అఱుబది.

### 28 సూ. మాఱు కాల్వో స్సమాసే వా

వృ: ఏతయో రాత స్సమాసే వా హ స్స్యాత్. వేమఱు - వేమాఱు.

తె. వృ: మాఱు, కాలు[10] శబ్దములలోని ఆ కారమునకు సమాసమునందు హ్రస్వము వికల్పముగా వచ్చును. వేమఱు - వేమాఱు.

వృ: నవాష్టనో ర్నూ రౌ బహువచనే చ: ఎనమనూఱు, తొమ్మనూఱు. నిట్త్వాదిత్వాత్ టిలోపః[11].

తె. వృ: నవాష్టనోర్నూరౌ బహువచనేచ[12] అను సూత్రముచేత ఇత్తులకు అకారములు వచ్చినచో ఎనమనూఱు, తొమ్మనూఱు అను రూపములు వచ్చును. నిట్త్వాదులలోని వగుటచే (చూ. 10సూ.) టిలోపము.

### 29 సూ. సప్తాష్టనవానాం డెబెనుతొన్ పదే

వృ: సప్తప్రభృతీనాం డెబాదయ స్స్యుః పదే పరే. డెబ్బది, ఎనుబది, తొంబది.

తె. వృ: సప్తాష్టనవశబ్దములకు పది పరమయినప్పుడు డెబ్, ఎను, తొన్ అనునవి ఆదేశములుగా వచ్చును. డెబ్బది, ఎనుబది, తొంబది యనునవి యుదాహరణములు.

### 30 సూ. ఇరునలో ర్నూ రౌ నః

వృ: ఏతయో రంత్యహాలో న స్స్యాన్నూఱుశబ్దే పరే. ఇన్నూఱు మున్నూఱు, నన్నూఱు.

తె. వృ: ఇరు నలు శబ్దముల యంత్య హల్లునకు నూఱు శబ్దము పరమయినప్పుడు నకారము వచ్చును. ఇన్నూఱు, మున్నూఱు[13], నన్నూఱు అనునవి యిందువలన సిద్ధించు రూపములు.

---

10. కాలులోని ఆకారమునకు హ్రస్వము వచ్చిన రూపము 36వ సూత్రము దగ్గఱ చూడనగును.

11. నిత్త్వా దిత్వా ట్టిలోపః. (కాకినాడ ప్రతి)

12. హల. 21 సూ.

13. మున్నూఱు "త్రి రాదేశే"(సమా.24)అను సూత్రముచే నేర్పడిన రూపము.

## 31 సూ. ద్విగో ర్బహుత్వమ్.

వృ: ద్విగు సమాసస్య బహుత్వం, మిశ్రతాచ స్యాత్. ముల్లోకములు, నల్దిక్కులు. అమిశ్రతాయాంతు మువ్వన్నె.

తె. వృ: ద్విగు సమాసము మిశ్రము కూడ నగును. అప్పు డది బహువచనమున నుండును. ముల్లోకములు, నల్దిక్కులు. మిశ్ర ద్విగువు కానిచో ముvవ్వన్నె అను విధముగా నుండును.[14]

### అథబహువ్రీహిః

వృ: వేఁడివెలుఁగు, చలిమెఱుఁగు.

తె. వృ: వేఁడివెలుఁగు, చలిమెఱుఁగు మొదలగునవి బహువ్రీహి సమాసములు.

## 32 సూ. బహువ్రీహి స్సుస్ జమోః

వృ: ప్రథమా షష్ఠీ ప్రయోగా ద్బహువ్రీహే రాభాస స్స్యాత్[15]. పట్టు పుట్టమునది.

తె. వృ: ప్రథమావిభక్తికాని షష్ఠీవిభక్తి కాని యున్నచో నది ఆభాస బహువ్రీహి యగును. పట్టుపుట్టమునది యనునది యుదాహరణము.

## 33 సూ. అ మంత్యవదనస్య

వృ: బహువ్రీహే రంతే వదనాదేశస్య అమ్ స్యాత్. నలువ, పలువ.

తె. వృ: బహువ్రీహియం దుత్తరపదముగా నున్న వాయిశబ్దము నకు అమ్ అను నాదేశము వచ్చును. నలువ, పలువ.

## 34 సూ. నో ర్లోచనస్య ంటిమ్

వృ: లోచనాదేశ సంబంధినో నుకారస్య బిందుపూర్వక ంటిమ్ స్యాత్. తమ్మికంటి, ముక్కంటి.

తె. వృ: బహువ్రీహియందు కన్నులోని ను అనుదానికి పూర్ణబిందు పూర్వకమయిన టిమ్ (ంటి) అనునది యాదేశమగును. తమ్మికంటి, ముక్కంటి.

---

14. ఏకవచనము వచ్చు నన్నమాట.

15. "స్యా దాభాసబహువ్రీహిః ప్రథమాదిప్రయోగతః" (వి.వి.హల.19)

### 35 సూ. విల్లో స్తుః

వృ: బహువ్రీహా రంత్యే విల్లుశబ్దా త్తు వర్ణకస్స్యాత్. అలరువిలుతుఁడు.

తె. వృ: బహువ్రీహియం దుత్తరపదమగు విల్లుశబ్దమునకు తు వర్ణకము వచ్చును. అలరువిలుతుఁడు.

### 36 సూ. చూలుకాల్యో రిత్

వృ: ఏతయో రిత్స్స్యాత్. తమ్మిచూలి, ముక్కాలి.

తె. వృ: చూలు కాలు శబ్దముల కిద్వర్ణము వచ్చును. తమ్మిచూలి, ముక్కాలి.

వృ: మాఊకాల్యో స్సమాసే వేతి హ్రస్వే ముక్కలి.

తె.వృ: "మాఊ కాల్యో స్సమాసే వా"[16] అను సూత్రముచే కాలులోని ఆ కారమునకు హ్రస్వము వచ్చినచో ముక్కలి యని యగును.

### 37 సూ. మే ర్లుక్

వృ: బహువ్రీహా రంత్యే క్వచిన్మి వర్ణకస్య లుక్ స్యాత్. పువ్వుంబోడి.

తె. వృ: బహువ్రీహి యందుత్తరపదము చివరనుండు మివర్ణకము కొన్నిచోట్ల లోపించును. పువ్వుఁబోడి యుదాహరణము.

### అథ ద్వంద్వః

వృ: కాలుసేయి[17], తల్లిదండ్రులు.

తె. వృ: కాలుసేయి, తల్లిదండ్రులు మొదలగునవి ద్వంద్వ సమాసములు.

### 38 సూ. ఉ ర్ద్వంద్వే రః[18]

వృ: ద్వంద్వ సమాసే ఋకారాంత సంబంధినః ఋతః రస్స్యాత్. మాతాపితరులు.

---

16. సమా. 28 సూ.

17. కాలుసేతులనుబహువచన రూపమే ఆంధ్రవ్యాకరణములు పెక్కంగీకరించినవి. అయినను ఏకవచన రూపము వ్యవహారమున నున్నది. వ్రాతప్రతి పాఠము కూడ నట్లే కలదు.

18. ఉర్ద్వంద్వే రః. (ఆం.శ.చిం.అజ.66)

తె. వృ: ద్వంద్వ సమాసమునందు ఋ కారాంతశబ్దములకు సంబంధించిన ఋ కారమునకు 'ర' అనునది వచ్చును. మాత్రపితరులు.[19]

39 సూ. ద్వంద్వే యుష్మదస్మదో రీతః

వృ: యుష్మదస్మదో ర్ద్వంద్వసమాసే ఈతః అత్ స్యాత్.

తె. వృ: యుష్మదస్మద్ద్వంద్వమునందు ఈ కారమునకు అ కారము వచ్చును.

40 సూ. అంత్యేఽస్మదః

వృ: సమాసాంతే అస్మచ్ఛబ్ద సంబంధిన ఆతో హ స్స్యాత్. మనము.

తె. వృ: సమాసాంతము నందున్న అస్మచ్ఛబ్ద సంబంధి యగు ఆకారమునకు హ్రస్వము వచ్చును. మనము[20].

సమాస ప్రకరణము సమాప్తము.

---

19. ఇది నిత్యవిధి కాదు. మాతాపితరులు, మాతరపితరులు అనియు నుండును. ఆంధ్ర వైయాకరణులందఱును ఈ ర విధానమును కంఠోక్తిగా వచించి నను దీనికి మహాకవి ప్రయోగములు మృగ్యములు.

20. మనము ద్వంద్వముగా సాధింపఁబడుట గమనార్హము.

# తద్ధితాదేశ ప్రకరణమ్

వృ: అథ తద్ధితాదేశాః

తె. వృ: అనంతరము తద్ధితాదేశములు చెప్పబడుచున్నవి.

## 1 సూ. అరిమీమ్కామో మతుపః

వృ: మతుప్ప్రత్యయస్య అరిమ్, ఈమ్, కామ్, ఇత్యేతే ఆదేశా స్స్యుః. సుంకరి, నేతరి, తొంటరీఁడు, వన్నెకాఁడు[1].

తె. వృ: మతుప్ప్రత్యయ స్థానమున అరిమ్, ఈమ్, కామ్ అనునవి ఆదేశమగును. సుంకరి, నేతరి, తొంటరీఁడు, వన్నెకాఁడు.

## 2 సూ. అ మామః

వృ: షష్ఠీబహువచనాత్పరతః అమ్ స్యాత్. వన్నెలాఁడు, వగలాఁడు.

తె. వృ: షష్ఠీ బహువచన ప్రత్యయాంతమునకుఁ బరముగా మతు ప్ప్రత్యయమునకు అమ్ అను నాదేశము వచ్చును. వన్నెలాఁడు, వగలాఁడు ఉదాహరణములు.

## 3 సూ. వైరాత్తుమ్

వృ: వైర శబ్దాత్ తుమ్ స్యాత్. పగతుండు.

తె. వృ: వైరార్థకశబ్దముకంటెఁ బరమందున్న మతుప్ ప్రత్యయమునకు తుమ్ ఆదేశమగును. పగతుఁడు.

## 4 సూ. నామ్న స్తేనోన ఇడిమ్

వృ: తృతీయా సమర్థా దూన ఇత్యర్థే ఇడిమ్ స్యాత్. వెరవిడి, ముక్కిడి.

---

1. ఈ ప్రక్రియలో సంస్కృత ప్రత్యయములు ముందుగా వచ్చినవని యెంచి వాని స్థానమునఁ దెలుఁగు ప్రత్యయములను ఆదేశములుగాఁ జెప్పుకొనుట గమనింపఁ దగినది.

తె. వృ: తృతీయాసమర్థమయిన[2] నామము కంటె హీనార్థము నందు ఇడిమ్ అను ప్రత్యయము వచ్చును. వెరవిడి, ముక్కిడి.

5 సూ. ఎడుమ్ పరిమాణే

వృ: పరిమాణవాచకా దెడుమ్ స్యాత్. తూమెడు, మూరెడు, బారెడు.

తె. వృ: పరిమాణ వాచకముల కంటె 'ఎడుమ్' అను ప్రత్యయము వచ్చును.తూమెడు, మూరెడు, బారెడు ఉదాహరణములు.

6 సూ. పౌరుషే బంటిమ్

వృ: పురుషసంబంధి పరిమాణ విహితా ద్బంటిమ్ స్యాత్. మొలబంటి, కుత్తుకబంటి.

తె. వృ: ఆ పరిమాణము పురుషసంబంధి యయినచో తద్వాచకము కంటె బంటిమ్ అను ప్రత్యయము వచ్చును. మొలబంటి, కుత్తుకబంటి.

7 సూ. స్వార్థే కమ్

వృ: క్వచిత్ స్వార్థే కమ్ స్యాత్. నిప్పుక.

తె. వృ: కొన్నిచోట్ల స్వార్థమునందు కమ్ అను ప్రత్యయము వచ్చును. నిప్పుక.

8 సూ.ఉత్ కమి

వృ: కమిప్రత్యయే పరే అత ఉత్ స్యాత్. నెలఁతుక. ఇకారస్యాపీతి కేచిత్. వెలఁదుక.

తె. వృ: కమ్ ప్రత్యయము పరమయినప్పుడు అకారమునకు ఉత్తు వచ్చును. నెలతుక. ఇకారమునకుఁగూడ ఉత్తు వచ్చునని కొంద అందురు. వెలఁదుక.

9 సూ. దేవవేగాభ్యామరేరౌ

వృ: తాభ్యాం క్రమాత్ స్వార్థే "అర, ఇర" ఇత్యేతే భవతః. దేవర, వేగిరము.

తె. వృ: దేవ, వేగ శబ్దములకంటె స్వార్థమునందు క్రమముగా అర, ఇర అను ప్రత్యయములు వచ్చును. దేవర, వేగిరము.

---

2. "తృతీయా సమర్థమయిన" అనుట కేవలము సంస్కృతసంప్రదాయానుసరణము.

10 సూ. సితా వేకభిక్షయోః

వృ: తాభ్యాం క్రమాత్ సితావి భవతః. ఒక్కరుండు, బికిరము.

తె. వృ: ఏక భిక్షాశబ్దములకు క్రమముగా అర, ఇర ప్రత్యయములు సిత్తులై వచ్చును. ఒక్కరు:డు, బికిరము.

11 సూ. త్రపుతేజసో రిత్యేకే

వృ: తాభ్యామపి సితావితి కే చి దాచార్యాః. తగరము, తేజిరము.

తె: వృ: త్రపు తేజశ్శబ్దములకును క్రమముగా అర, ఇర సిత్తులై వచ్చునని కొందఱి మతము. తగరము, తేజిరము.

12 సూ. ఇరి స్సాక్షిణః

వృ: తస్మా దిరి స్స్యాత్ స్వార్థే. సాకిరి.

తె. వృ: సాక్షి శబ్దము కంటె స్వార్థమునందు ఇరిస్ ప్రత్యయము వచ్చును. సాకిరి.

13 సూ. పోతా దవస్

వృ: యానపాత్ర వాచకాత్ పోతశబ్దా దవ స్స్యాత్ స్వార్థే. పొడవ.

తె. వృ: యానపాత్ర వాచక శబ్దముకంటె స్వార్థమునందు అవ ప్రత్యయము వచ్చును. పొడవ.

14 సూ. ఉలుస్ మేఘాత్

వృ: మేఘా దులుస్ స్యాత్ స్వార్థే. మొగులు.

తె. వృ: మేఘ శబ్దము కంటె స్వార్థమునందు ఉలుప్రత్యయము వచ్చును. మొగులు.

15 సూ. చంద్రమస ఆమస్

వృ: తస్మా దామస్ స్యాత్. చందమామ.

---

3. సితిచ (పా. 1.4.16) అను పాణినీయ సూత్రముచే సకార మిత్సంజ్ఞగాఁగల ప్రత్యయము పరమగునపుడు పూర్వమునకు పదసంజ్ఞ వచ్చును. అనఁగా సిత్ ప్రత్యయము పరమైనప్పుడు పూర్వమునకు (ప్రకృతికి) పద కార్యములు వచ్చునని గ్రహింపవలెను.

తె. వృ: చంద్రమశ్శబ్దము కంటె ఆమస్ అను ప్రత్యయము వచ్చును. ఉదా: చందమామ.

## 16 సూ. ఏకాదిభ్యోఽన్

వృ: ఏకాదిభ్య స్స్వార్థే ఽన్ స్యాత్. ఒక్కండు, హనుమండు, రాయఁడు

తె. వృ: ఏకాదుల కంటె పరమున స్వార్థమున అన్ ప్రత్యయము వచ్చును. ఒక్కండు, హనుమండు, రాయఁడు.

## 17 సూ. క్షుద్రా న్మిచ్చ

వృ: క్షుద్రవాచకా న్మిచ్చ స్యాత్. వరకుఁడు, పులియఁడు.

తె. వృ: క్షుద్రవాచకముకంటె వచ్చు అన్ ప్రత్యయము మిత్తు కూడ నగును. వరకుఁడు, పులియఁడు.

## 18 సూ. గుణా దనమ్

వృ: గుణవాచకా చ్ఛబ్దా దనమ్ స్యాత్. చల్లన, వెచ్చన.

తె. వృ: గుణవాచక శబ్దముల కంటె అనమ్ అను ప్రత్యయము వచ్చును. చల్లన, వెచ్చన.

## 19 సూ. వర్ణా త్పుమ్ చ

వృ: వర్ణవాచకాత్ పుమ్ చ స్యాత్. తెల్లన - తెలుపు, నల్లన - నలుపు.

తె. వృ: వర్ణవాచక శబ్దములకంటె అనమ్ప్రత్యయ, పుమ్ప్రత్యయ ములు రెండును వచ్చును. తెల్లన - తెలుపు, నల్లన- నలుపు.

## 20 సూ. అజడా త్సంఖ్యేయా ద్వుమ్

వృ: జడవాచక వ్యతిరిక్తా త్సంఖ్యేయాత్ వుమ్ స్యాత్. ముప్వురు, నలువురు. సమాసోపలక్షణా న్వర్ణ కేఽప్యాదేశాః.

తె. వృ: జడవాచకములు కాని సంఖ్యేయముల కంటె వుమ్ ప్రత్యయము వచ్చును. ముప్వురు, నలువురు మొదలగునవి యుదాహ ణములు. "ద్విత్రిచతుర్ణా మిరుమునలు సే"[4] యను సూత్రములోని 'సే

4. సమా. 23 సూ.

తద్ధితమునకును ఉపలక్షణము కనుక ఆ యాదేశములు తద్ధిత ప్రత్యయము పరమయినప్పుడును వచ్చును.

### 21 సూ. కాలో శ్చరతౌ బహువచనే

వృ: కాలు శబ్దా చ్చరతీ త్యర్థే ర్వుమ్ స్యాత్ (బహువచనే). కాల్వురు.

తె. వృ : కాలు శబ్దముకంటె నడుచువాఁ రను నర్థమున ర్వుమ్ ప్రత్యయము వచ్చును. అది బహువచనమున మాత్రమే యుండును. కాల్వురు.

### 22 సూ. సర్వనామ్నో ందమ్

వృ: జడవాచక వ్యతిరిక్తా త్సర్వనామ్నః "ందమ్" స్యాత్. అందఱు, కొందఱు.

తె. వృ : జడవాచకములు కాని సర్వనామములకు 'ందమ్' అనునది వచ్చును. అందఱు, కొందఱు.

### 23 సూ. ని ర్జడాత్

వృ: జడవాచకా త్సర్వనామ్నః "ని" స్యాత్. అన్ని, కొన్ని.

తె. వృ: జడవాచక సర్వనామములకు 'ని' వచ్చును. అన్ని, కొన్ని.

### 24 సూ. పూరణేఽవమ్

వృ: సంఖ్యాయాః పూరణేఽవమ్ స్యాత్. పదునాల్గవ మనువు.

తె. వృ : సంఖ్యావాచకములకు పూరణార్థమునందు 'అవమ్' వచ్చును. పదునాల్గవ మనువు.

### 25 సూ. అదితో ర్యు స్సముచ్చయే

వృ: అకారాంతా దికారాంతాచ్చ పరతో యువర్ణక స్స్యా త్సముచ్చయార్థే. రమయు, లక్ష్మియు, హరియు.

తె. వృ: అకారాంతములు నికారాంతములు నైన శబ్దములకు పరమందున్న యువర్ణకము సముచ్చయార్థమును జెప్పును. రమయు, లక్ష్మియు, హరియు.

## 26 సూ. యుష్మదస్మదర్థాత్తత్సుస్

వృ: యుష్మదస్మ దర్థయోః పరతః తయో స్సుసేవ యథావచనం స్యాత్.

తె. వృ : యుష్మదస్మదర్థకముల కంటె పరముగా వాని ప్రథమా విభక్తి ప్రత్యయములే యథావచనముగా వచ్చును.

## 27 సూ. యుష్మదస్మదర్థస్య తత్సుసి

వృ: యుష్మదస్మదర్థస్య శబ్దస్య తత్సంబంధిని సుసాదేశే పరే ఉకార స్యాకారో నిత్యం స్యాత్. నీవు దేవుఁడవు—మీరు దేవులరు; నేను భక్తుఁడను- మేము భక్తులము.

తె. వృ: యుష్మదస్మదర్థములగు శబ్దములలోని ఉకారమునకుఁ బై ప్రథమా విభక్తి ప్రత్యయములు పరమయినప్పుడు నిత్యముగా అకారము ఆదేశమగును. నీవు దేవుఁడవు-మీరు దేవులరు, నేను భక్తుఁడను-మేము భక్తులము.

## 28 సూ. ఇతో విని

వృ: యుష్మదస్మదర్థా దికారాంతా త్పదాత్ విని భవతః. నీవు హరివి—నేను కవిని.

తె. వృ : యుష్మదస్మదర్థకము లికారాంతములయినచో వానికిఁ బరముగా 'వి, ని' అనునవి వచ్చును. నీవు హరివి—నేను కవిని.

## 29 సూ. త్వస్య తనమ్

వృ: త్వ ప్రత్యయస్య తన మిత్యాదేశ స్స్యాత్. దొరతనము.

తె.వృ: త్వప్రత్యయమునకు తనమను నాదేశము వచ్చును. ఉదా : దొరతనము.

## 30 సూ. పరగో ష్టః

వృ: పరగు శబ్దాత్త్వ ప్రత్యయస్య టవర్ణక స్స్యాత్. పరగుట.

తె. వృ : పరగు శబ్దమున కంటె భావార్థమున టప్రత్యయము వచ్చును. పరగుట.

## 31 సూ. బలహేలాభ్యా మిమిః

వృ: తాభ్యాం పరత ఇమి స్స్యాత్. బలిమి,ఎలిమి[5].

తె. వృ : బల హేలాశబ్దములకంటె 'ఇమి' వచ్చును. బలిమి, ఎలిమి[5] ఉదాహరణములు.

---

5. ఎలిమి అను రూపము కానరాదు. 'ఎలమి' అనియే కానవచ్చును.

32 సూ. మి ద్భాగ్యాదిభ్యః

వృ: భాగ్యాదిభ్యో మిత్ స్యాత్. కలిమి, పోడిమి, తాలిమి, కోలిమి, వేడిమి.

తె. వృ : భాగ్యాదివాచకములకంటె ఇ మిప్రత్యయము వచ్చును. అది మిత్తు. మిత్తు వికృతి శబ్దములపై వచ్చును. కలిమి, పోడిమి, తాలిమి, కోలిమి, వేడిమి.

33 సూ. రికన్ కన్యాదిభ్యః

వృ: కన్యాదిభ్యో రికన్స్యాత్. కన్నెరికము—రెడ్డిరికము.

తె. వృ: కన్యాది శబ్దములకంటె రికన్ ప్రత్యయము వచ్చును. కన్నెరికము, రెడ్డిరికము.

34 సూ. తదాదే స్త్రలోందుమ్

వృ: తదాదేః పరస్య త్రలః 'ందుమ్' స్యాత్. అందు, ఇందు, ఎందు.

తె. వృ : తదాదివాచకములకంటెఁ బరమందు త్రల్ ప్రత్యయ స్థానమున 'ందుమ్' అనునది వచ్చును. అందు, ఇందు, ఎందు.

35 సూ. థాల ష్టుక్

వృ: తదాదేః పరస్య థాల ష్టుక్స్యాత్. అట్టు, ఇట్టు, ఎట్టు.

తె. వృ: తదాదివాచకములకుఁబరమందు వచ్చు థాల్ ప్రత్యయము యొక్క స్థానమునందు 'టుక్' వచ్చును. అట్టు, ఇట్టు, ఎట్టు.

36 సూ. పుడు ర్దః

వృ: దాప్రత్యయస్య పుడు స్స్యాత్. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు.

తె. వృ: దాప్రత్యయ స్థానమునందు పుడు అనునది వచ్చును. అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు.

37 సూ. పరిమాణే ంతః

వృ: పరిమాణార్థే 'ంత'స్స్యాత్. అంత, ఇంత, ఎంత.

తె. వృ: పరిమాణార్థమునందు 'ంత' అనునది వచ్చును. అంత, ఇంత, ఎంత.

తద్ధితాదేశప్రకరణము సమాప్తము.

# తద్భవ ప్రకరణమ్

## సంస్కృతభవాః

వృ: అథ కేచన సంస్కృతభవా నిరూప్యంతే.

తె. వృ: అనంతరము కొన్ని సంస్కృతభవములు నిరూపింపఁబడుచున్నవి.

### 1 సూ. సంస్కృతే

వృ: ఇతః ప్రభృతి ఆపాద పరిసమాప్తేః సంస్కృతే కార్యం స్యాత్.

తె. వృ: ఇక్కడినుండి ఈ పాదము చివరివఱకును (విధింపబడు) కార్యము సంస్కృత శబ్దమునందు జరుగును.

### 2 సూ. కతమా ముతః కురువ కాతుర సముద్రేషు లుక్

వృ: కురువకాదిషు క్రమాత్ కకార తకార మకార సంబంధినః ఉతో లుక్ స్యాత్. ఆత్రము, సంద్రము.

తె. వృ: కురువక, ఆతుర, సముద్ర శబ్దములందు వరుసగా[1] కకార, తకార, మకారముల ఉకారమునకు లుక్కు (లోపము) వచ్చును. ఆతుర-ఆత్రము, సముద్ర - సంద్రము.

### 3 సూ. కురువకే రః

వృ: కురువక శబ్దస్య రేఫ సంబంధిన ఉత ఓత్ స్యాత్.

తె. వృ: కురువక శబ్దము యొక్క రేఫము మీది ఉకారమునకు ఓకారము వచ్చును.

### 4 సూ. ఇత్ కురువకే వః

వృ: కురువక శబ్దే వకార సంబంధినః అతః ఇత్ స్యాత్.

తె. వృ: కురువక శబ్దములోని వకారము మీది అకారమునకు ఇకారము వచ్చును.

---

1. వరుసగా అనుటచే కురువక శబ్దములోని కకారముమీదను, ఆతుర శబ్దములోని తకారము మీదను, సముద్ర శబ్దములోని మకారముమీదను గల ఉకారమునకు లోపము వచ్చునని గ్రహించదగును.

5 సూ. కానన తామరస కైకయీ జంగమ కురువక విస్మయ పారావత పారిజాతేషు సాజ్ఝలోఽంత్యస్య

వృ: కాననాదిష్వంత్యస్య సాజ్ఝలో లుక్ స్యాత్. క్రోవి, కాన, తామర, కైక, జంగము.

తె. వృ: కానన, తామరస, కైకయీ, జంగమ, కురువక, విస్మయ, పారావత, పారిజాత శబ్దముల చివర నున్న అచ్చుతో కూడిన హల్లు లోపించును. కురువక - క్రోవి, కానన - కాన, తామరస - తామర జంగమ - జంగము.

6 సూ. పంక్త్యాదిగే పరుషాణామ్

వృ: పంక్త్యాదిషు పరుషాణాం సరళోచ్చారణం భవతి. బారిజము - క్లీబ సమత్వే నైవ ప్రయోగః.

తె. వృ: పంక్త్యాది గణశబ్దములలోని పరుషములకు (కచటతపలకు) సరళోచ్చారణము (గజడదబల పలుకుబడి) కలుగును. పారిజాత - బారిజము. క్లీబసమముగానే ఈ పదమునకు ప్రయోగము.

7 సూ. శయ కదంబాయత్త ఖురళీ సమ యాపత్య పుత్రేషు ఫోః

వృ: శయాదిషు ఫో రత ఇత్ స్యాత్.

తె. వృ: శయ - కదంబ - ఆయత్త - ఖురళీ - సమయ - అపత్య - పుత్ర శబ్దముల ద్వితీయ వర్ణముమీది అకారమునకు ఇకారము వచ్చును.

8 సూ. ఖో రతో లు గపత్యే

వృ: అపత్యశబ్దే ఖో రతో లుక్ స్యాత్.

తె. వృ: అపత్యశబ్దమున మొదటి అకారను లోపించును.

9 సూ. కందాపత్యయాత్రాదిషు స్తో*ర్డః

వృ: కందాదిషు స్తో ర్డః స్యాత్.

తె. వృ: కంద - అపత్య - యాత్రా - మొదలగు శబ్దములలోని సంయుక్తమునకు బదులు డకారము వచ్చును.

---

* "స్తోః" లేదు - (వ. గో. కృ. తాళపత్ర. ప్రతి.)

## 10 సూ. అఖో ర్ద్విత్వ మాదేశ స్యాసాక్షిగే

వృ: సాక్ష్యాది వర్జితేషు అనాదేః సంయుక్తాదేశస్య ద్విత్వం స్యాత్. బిడ్డ, సమ్మియ, పుటాదిత్వా ద్ద్విత్వమ్.

తె. వృ: సాక్ష్యాది గణమునఁ జేరని శబ్దములలో మొదటిదికాని సంయుక్తమునకు వచ్చిన ఆదేశమునకు ద్విత్వము వచ్చును. అపత్య-బిడ్డ. సమయ - సమ్మియ; ఇది పుటాది గణములోని శబ్ద మగుటవలన (మకారమునకు) ద్విత్వము వచ్చినది. (చూ. సూ. ३३.)

## 11 సూ. లఘుప్రయత్నయో ర్దిః

వృ: ఏతయోః ఖో రతో దీర్ఘః స్యాత్.

తె. వృ: లఘు - ప్రయత్న శబ్దముల మొదట నున్న అకారమునకు దీర్ఘము వచ్చును.

## 12 సూ. ఘ ఝ ఢ ధ భా మ్

వృ: ఏషాం సరళత్వం స్యాత్. లాగు.

తె. వృ: ఘ ఝ ఢ ధ భ లు సరళములగును. లఘు - లాగు.

## 13 సూ. బిందుకః పీఠానాం స్వరాత్

వృ: పీఠాదీనాం ప్రథమాత్ స్వరాద్ బిందుకో భవతి.

తె. వృ: పీఠ - మొదలగు శబ్దముల మొదటి స్వరము మీఁద బిందుకము (అరసున్న) వచ్చును.

## 14 సూ. త్యాగ కుడ్య వ్యధా శ్రుతి సాక్షి ధుర్య తపస్వి ప్రత్న ధాత్ర్యమావాస్యా స్వధః

వృ: త్యాగాదిషు స్తో రధోవర్ణస్య లుక్ స్యాత్.

తె. వృ: త్యాగ - కుడ్య - వ్యధా - శ్రుతి - సాక్షి - ధుర్య - తపస్విన్- - ప్రత్న - ధాత్రీ - అమావాస్యాశబ్దములలోని సంయుక్తమున క్రింది యొత్తు లోపించును.

వృ: ప్రాంత బహుళాధికారాత్ రేఫస్య లుక్. తపసి. దాది. పంక్త్యాదిత్వాత్ తస్య దః.

తె. వృ: లు గ్లోపము ప్రక్కనధికముగ నుండు హల్లునుగూడ తఱచు లోపింపఁజేయును. తపస్విన్ - తపసి. ధాత్రీ - దాది. ధాత్రీశబ్దము పంక్త్యాది గణములోని దగుటవలన తకారమునకు (బదులు) దకారము (వచ్చినది).

## 15 సూ. విస్మయే స్తో స్తః

వృ: విస్మయే స్తోః తకారః స్యాత్.

తె. వృ: విస్మయ శబ్దమున సంయుక్తము (లోని అధోవర్ణము) నకు బదులు తకారము వచ్చును.

## 16 సూ. ఉత్ కోల తటార్ఘ కాచ విస్మయేషు

వృ: కోలాదిషు ఘోః అత ఉత్ స్యాత్. కాలు, తట్టు. పుటగే ఘోః ఇతి ద్విత్వమ్. అర్గువు, గాజు. ఉభయత్రాపి సరళత్వమ్. విస్తు, కానన తామర సేత్యాదినా అంతస్య సాజ్ఝలో లుక్.

తె. వృ: కోల - తట - అర్ఘ - కాచ - విస్మయశబ్దములందు ద్వితీయ వర్ణముమీఁది అకారమునకు (బదులు) ఉకారము వచ్చును. కాల - కాలు, తట - తట్టు; ఇందు "పుటగే ఘోః" అను రాఁబోవు 33 వ సూత్రమువలన ద్విత్వము. అర్ఘ - అర్గువు, కాచ - గాజు: రెంటను సరళత్వము వచ్చినది. విస్మయ - విస్తు: ఇందు కానన తామర సేత్యాది (5వ) సూత్రము వలన చివరి అచ్చు తోడి హల్లు లోపించినది.

## 17 సూ. శో ర్హంస కంస సింహుండ శయ శ్రుతి శ్యామల శ్యా మేష త్సేవంతీషు చః

వృ: హంసాదిషు శోః చః స్యాత్. కంచము, చామ.

తె. వృ: హంస - కంస - సింహుండ - శయ - శ్రుతి - శ్యామల - శ్యామ - ఈషత్ - సేవంతీ అను శబ్దములలో శషసలకు (బదులు) చకారము వచ్చును. కంస - కంచము, శ్యామ - చామ.

## 18 సూ. ఇతో హేత్ పితృ సింహుండ వినాయకేషు

వృ: పిత్రాది ష్వితో హేత్ స్యాత్.

తె. వృ: పితృ - సింహుండ - వినాయక శబ్దములలో ఇకారమునకు (బదులు) ఎకారము వచ్చును.

### 19 సూ. (స్తోర్మః) సింహుండే ఘోః

వృ: సింహుండే ఘోః స్తో ర్మః స్యాత్.

తె. వృ: సింహుండ శబ్దమున రెండవదగు సంయుక్తమునకు(బదులు) మకారము వచ్చును.

### 20 సూ. జ్లు* క్తరంగగే

వృ: తరంగాదౌ బిందోః జ్లుక్† స్యాత్.

తె. వృ: తరంగాది గణశబ్దములలో అనుస్వారమునకును, దాని స్థానమున వచ్చు పరసవర్ణములైన ఙ ఞ ణ న లకును లోపము వచ్చును.

### 21 సూ. సింహుండేఽ ంత్యస్య

వృ: సింహుండే అంత్యస్య అత ఉత్ స్యాత్. చెముడు.

తె. వృ: సింహుండ శబ్దమున చివరి అకారమునకు (బదులు) ఉకారము వచ్చును. సింహుండ - చెముడు.

### 22 సూ. మకరే క్రోః

వృ: మకర శబ్దే కకార రేఫ సంబంధినః అత ఉత్ స్యాత్. మకురు.

తె. వృ: మకరశబ్దమున కకారరేఫములమీది అకారమునకు(బదులు) ఉకారము వచ్చును. మకర - మకురు.

### 23 సూ. ఘోః కుట్టనీ తమ్మరయోః

వృ: ఏతయోః ఘో రతో పేత్ స్యాత్.

తె. వృ: కుట్టనీ - తమ్మర శబ్దములలో రెండవ వర్ణముమీఁది అకారమునకు (బదులు) ఎకారము వచ్చును.

### 24 సూ. ఖ ఛ ఠ థ ఫాం పరుషా ఇహ

వృ: వైకృత శాస్త్రే ఖాదీనాం పరుషా భవంతి.

తె. వృ: వైకృత శాస్త్రమున ఖ ఛ ఠ థ ఫ లకు (బదులు) పరుషములు (కచటతపలు) వచ్చును.

---

* జత్ — (వ. గో. కృ. తాళపత్రప్రతి.)

† జ్లక్ — (వ. గో. కృ. తాళపత్రప్రతి.)

## 25 సూ. పటోలీకుటన్యో ర్యాత్*

వృ: ఏతయోః ఈతః ఆత్ స్యాత్.

తె. వృ: పటోలీ - కుట్టనీ శబ్దముల ఈకారమునకు (బదులు) ఆకారము వచ్చును.

వృ: పీఠాదిత్వాద్బిందుకే హైకాచ ఇత్యాదినా బిందుః. కుంటెన.

తె. వృ: (కుట్టనీశబ్దము) పీఠాదిగుణము లోనిది గాన తొలియచ్చు మీఁద బిందుకము (అరసున్న) రాగా 'హైకాచోయుజి' (సంధి 38సూ.)యను సూత్రమువలన నది నిండుసున్నయగును. కుట్టనీ - కుంటెన.

## 26 సూ. పర శయ టంక వ్యథాసు ఖోః

వృ: పరాదిషు ఖో రతో హ్రస్వ ఏత్ స్యాత్. పెర.

తె. వృ: పర - శయ - టంక - వ్యథా శబ్దముల తొలి అకారమునకు (బదులు) ఎకారము వచ్చును. పర - పెర.

వృ: చెయి. శోర్ధ్మాంసేత్యాదినా చః.

తె. వృ: చెయి. ఇక్కడ "శోర్ధ్మాంస"తో మొదలైన (17వ సూత్రము)చే(శయశబ్దములోని)శ వర్ణమునకు(బదులు) చ కారము వచ్చినది.

వృ: టెంకి. ఖడ్గాదిత్వా దిప్.

తె. వృ: టంక - టెంకి. ఖడ్గాది గణములోని దగుటచే (కకారము మీఁద) ఇకారము (వచ్చినది).

వృ: వెత. త్యాగకుడ్యేత్యాదినా స్త్రో రధోలుక్.

తె. వృ: వ్యథా - వెత. 'త్యాగకుడ్య' తో మొదలైన (14వ) సూత్రమువలన (వ్యథాశబ్దములోని) సంయుక్తమునందలి క్రింది వర్ణము లోపించినది.

## 27 సూ. ఓత్ పటోల్యామ్

వృ: పటోల్యా మత ఓ ద్ధ్రస్వశ్చ.

తె. వృ: పటోలీ - శబ్దమున (పకారము మీఁది) అకారమునకు బదులు ఓకారము వచ్చును. అది హ్రస్వమగును.

---

* రాత్ — (వ. గో. కృ. తాళ పత్ర ప్రతి.)

## 28 సూ. లుక్ పటోల్యామ్

వృ: పటోల్యా మేజో లుక్ స్యాత్. ఈతః ఆకారః. పొట్ల.

తె. వృ: పటోలీ - శబ్దమున ఓకారమునకు లోపము వచ్చును. (25 సూ. చే) ఈకారమునకు బదులు ఆకారము. పొట్ల.

## 29 సూ. ధుర్య ముఖర కుఠారేషు హః

వృ: ధుర్యాది షూత ఓత్ స్యా (ద్ధ్రస్వశ్చ. మొకరి. కుబ్జాదిత్వాత్ ఖస్య కః. ఈవ్.

తె. వృ: ధుర్య - ఖుర - కుఠార శబ్దములలోని ఉకారమునకు బదులు ఓకారమును దానికి హ్రస్వమును వచ్చును. కుబ్జాది గణములోనిదగుటచే ఖకారమునకు కకారము. ఈవ్. ముఖర - మొకరి.

## 30 సూ. హః కుఠార కుద్దాలైకాంత తాంబూల వినాయకే ష్వాతః

వృ: కుఠారాది ష్వాతో హః స్యాత్. కస్య గః. ఈవ్.

తె. వృ: కుఠార - కుద్దాల - ఏకాంత - తాంబూల - వినాయక శబ్దములలోని ఆకారమునకు హ్రస్వము వచ్చును. కకారమునకు బదులు గకారము. ఈవ్.

## 31 సూ. ఏకాంతే లుక్

వృ: ఏకాంతశబ్దే బిందో ర్లుక్ స్యాత్. ఏకతము.

తె. వృ: ఏకాంతశబ్దమున బిందువునకు లోపము వచ్చును. ఏకాంతము- ఏకతము.

## 32 సూ. లడౌ రః కుఠార వేసరయోః

వృ: ఏతయో రేఫస్య క్రమేణ లడౌ భవతః. వేసడము.

తె. వృ: కుఠార - వేసర శబ్దములలోని రేఫమునకు క్రమముగా లకార, డకారములు వచ్చును. వేసర - వేసడము.

## 33 సూ. పుటగే. ఫోః

వృ: పుటాదిషు ఫో ర్ద్విత్వం స్యాత్.

తె. వృ: పుటాదిగణ శబ్దములందు రెండవ వర్ణమునకు ద్విత్వమ వచ్చును.

### 34 సూ. కుబ్జగే సరళాః

వృ: కుబ్జాదిగణే ఖ ఛ ఠ థ ఫాం సరళోచ్చారణం భవతి.

తె. వృ: కుబ్జాదిగణశబ్దములందు ఖ ఛ ఠ థ ఫ లకు సరళోచ్చారణము గలుగును. (అనఁగా ఖ ఛ ఠ థ ఫ లకు బదులు గ జ డ ద బ లు వచ్చుననుమాట.)

### 35 సూ. ఖడ్గా దివ్*

వృ: గొడ్డలి. పంక్త్యాదిత్వాత్ కస్య గః.

తె. వృ: ఖడ్గాది గణశబ్దముల చివర ఇవ్ వచ్చును. కుద్దాల-గొడ్డలి. (కుఠార శబ్దము) పంక్త్యాది గణములోని దగుటవలన కకారమునకు బదులు గకారము వచ్చినది.

### 36 సూ. ఘో ర్జటాధారిణి

వృ: జటాధారిణి ఘోరాతో హః స్యాత్. పంక్త్యాదిత్వాత్ కుబ్జాదిత్వాచ్చ సరళోచ్చారణలాభః. జెడదారి.

తె. వృ: జటాధారి - శబ్దమున రెండవ వర్ణమునకు హ్రస్వము వచ్చును. ఈ శబ్దము పంక్త్యాది - కుబ్జాది గణముల రెంటను జేరినదగుట వలన టకార - ధకారములకు సరళోచ్చారణము లభించును. జటాధారి - జెడదారి.

### 37 సూ. హ శ్చామావాస్యాయామ్

వృ: అమావాస్యాయాం మకార వకార సంబంధిన ఆతః హః స్యాత్. త్యాగ కుడ్యేత్యాదినా స్తో రధోవర్ణస్య లుక్. అమవస.

తె. వృ: అమావాస్యా - శబ్దములో మకార వకారములమీఁది ఆకారమునకు హ్రస్వము వచ్చును. "త్యాగకుడ్య" తో మొదలగు (14వ) సూత్రముచే సంయుక్తమయిన 'స్య' లోని యావత్తు లోపించును. అమావాస్యా - అమవస.

### 38 సూ. బాల త్యాగయో రేత్

వృ: ఏతయో రాత ఏత్ స్యాత్. బేల, తేగము.

---

* "ఖడ్గగా దివ్" అని యుండఁదగును.

తె. వృ: బాల - త్యాగ శబ్దములలోని ఆకారమునకు బదులు ఏకారము వచ్చును. బాల - బేల. త్యాగము - తేగము.

39 సూ. ఉత్పారావతే రః

వృ: పారావతే రేఫ సంబంధిన అత ఉత్ స్యాత్. కానన తామరసేత్యాది నాంత్యస్య సాఙ్ఝలో లుక్. పారువము.

తె. వృ: పారావత శబ్దమున రేఫమీఁది ఆకారమునకు బదులు ఉకారము వచ్చును. "కానన తామరస" తో మొదలగు (5వ) సూత్రము వలన చివరి అచ్చుతోఁగూడిన హల్లు(త)లోపించును. పారావత - పారువము.

40 సూ. ఇతః పింఛస్య దిః

వృ: పింఛ సంబంధిన ఇతో దీర్ఘః స్యాత్. ఖ ఛ ఠ థ ఫా మిత్యాదినా పరుషత్వమ్. తరంగాదిత్వా ద్బిందోః ర్లుక్. పీచెము.

తె. వృ: పింఛ - శబ్దములోని ఇకారము దీర్ఘమగును. "ఖ ఛ ఠ థ ఫా మ్" అను (24వ) సూత్రముచే ఛకారము పరుషము (చ) అగును. ఈశబ్దము తరంగాది గణములోని దగుటవలన ఇందలి బిందువు లోపించును. పింఛము-పీచెము. (అజం 52 సూ. చే దంత్యాత్వము వచ్చినది.)

41 సూ. సామి భీత్యో రుత్

వృ: ఏతయో రిత ఉత్ స్యాత్. సాము. బీతు. ఘ ఝ ఢ ధ భా మితి సరళత్వమ్.

తె. వృ: సామి - భీతి శబ్దముల తుది ఇకారమునకు బదులు ఉకారము వచ్చును. సామి - సాము. భీతి - బీతు. 'ఘ ఝ ఢ ధ భా మ్' అను (12వ) సూత్రము వలన భకారము సరళమైనది.

42 సూ. వినాయకే యకోర్వ్యత్యయః

వృ: వినాయక శబ్దే యకార కకారయోః వ్యత్యయః స్యాత్. హేత్ పితృ సింహుం డేత్యాదినా ఇతో హేత్. హ్రః కుతా రేత్యాదినా ఆతో హ్రః. వెనకయ.

తె. వృ: వినాయక-శబ్దమున యకార కకారములు తారుమాఱగును. "ఇతోహేత్ పితృసింహుండ" తో మొదలగు (18వ) సూత్రముచే ఇకారమునకు ఎకారము వచ్చును. "హ్రః కుతార" తో మొదలగు (30వ) సూత్రముచే ఆకారము హ్రస్వమగును. వినాయక - వెనకయ.

### 43 సూ. లు గితౌ చ సిందూరే

వృ: సిందూరే ఊతో లుగితౌ హ్రస్వశ్చ.

తె. వృ: సిందూర - శబ్దములోని ఊకారమునకు హ్రస్వమును, లోపమును, ఇకారమును వచ్చును.

### 44 సూ. అచ్చ హే త్సిందూరే

వృ: సిందూరే ఊతో హ్రస్వే సతి ఇతః అకారో హేచ్చ. శోర్ధ్మాంసేత్యాదినా శో శ్చకారః. చేందురము. చెందురము. చేంద్రము. చెందిరము. చెంద్రము.

తె. వృ: సిందూరశబ్దములోని ఊకారమునకు హ్రస్వము రాగా ఇకారమునకు అకారమును, ఎకారమును వచ్చును. "శోర్ధ్మాంస" తో మొదలగు (17వ) సూత్రముచే సకారమునకు బదులు చకారము వచ్చును. సిందూర -చేందురము; చెందురము; చేంద్రము; చెందిరము; చెంద్రము.

### 45 సూ. ఈతో జంబీ రేష ద్భీరు కేషు హ్రః

వృ: జంబీరాది ష్వీతో హ్రః స్యాత్ జెంబిరము. ఇంచు. సింహుండాదిత్వా దంత్య స్యోత్. శో ర్ధ్మాంసేత్యాదినా శో శ్చః. పీఠాదిత్వా ద్బిందుకే హైకాచ ఇత్యాదినా బిందుః.

తె. వృ: జంబీర-ఈషత్-భీరుక శబ్దములలోని ఈకారము హ్రస్వమగును. జంబీర-జెంబిరము. ఈషత్-ఇంచు. సింహుండాదులలోని దగుట వలన (ఈషత్-శబ్దములోని) అంత్యమునకు ఉకారము, శోర్ధ్మాంసేత్యాది (17 వ) సూత్రముచే షకారమునకు బదులు చకారము. పీఠాదిగణములోనిదగుటవలన (13వ సూ. చే) బిందుకము, "హైకాచ"తో మొదలగు (సంధి -38వ సూత్రముచే) బిందుకము బిందు వగును.

### 46 సూ. ఇ న్మృత్యు భీరుకయోః

వృ: మృత్యు భీరుకయో రుత ఇత్ స్యాత్.

తె. వృ: మృత్యు-భీరుక శబ్దములలోని ఉకారమునకు ఇకారము వచ్చును.

### 47 సూ. మఘగే పరుషాః

వృ: మఘాదిషు ఘ ఝ ఢ ధ భాం పరుషాచ్చారణం స్యాత్. ఖడ్గాదిత్వా దిప్. పిరికి.

తె. వృ : మఘాదిగణ శబ్దములలో 'ఘ ఝ ఢ ధ భ' లకు పరుషో చ్చారణము వచ్చును. (భీరుక శబ్దము) ఖడ్గాది గణములోని దగుటవలన చివరిస్వరమునకు ఇవ్ వచ్చును. భీరుక-పిరికి.

48 సూ. గభీరిమ గోపాల మదవతీషు ప్రథమాదేః

వృ : గభీరిమాదిషు క్రమేణ ప్రథమాదేః సాజ్ఝలో లుక్ స్యాత్. మదతి.

తె. వృ : గభీరిమ-గోపాల-మదవతీ శబ్దములలో వరుసగా ప్రథమ-ద్వితీయ-తృతీయ వర్ణములు లోపించును. మదవతి-మదతి.

49 సూ. హే ద్గభీరిమ్ని

వృ : గభీరిమ శబ్దే ఈతో హేత్ స్యాత్. మఘాదిత్వాత్ పత్వమ్. పెరిమ.

తె. వృ : గభీరిమ శబ్దమున ఈకారమునకు బదులు ఎకారము వచ్చును. మఘాదిగణములోని దగుటవలన పత్వమువచ్చును. గభీరిమ-పెరిమ.

50 సూ. మేదో నేమి నారికేళ పోత గోపాలే ష్వేజో హ్రః

వృ : మేదః ప్రభృతి ష్వేజో హ్రస్వః స్యాత్. గొల్ల. పుటాదిత్వా ద్ద్విత్వమ్. మెదము. నెమ్మి. నారికెళము.

తె. వృ : మేదస్-నేమి-నారికేళ-పోత-గోపాల శబ్దములలోని ఏ ఓ లకు హ్రస్వము వచ్చును. గోపాల-గొల్ల. ఇది పుటాదిగణములోని దగుట వలన ద్విత్వము (చూ. ౩౩వ సూ.) మేదస్-మెదము. నేమి - నెమ్మి. నారికేళ-నారికెళము.

51 సూ. ఉత్సే దిః

వృ : ఉత్స శబ్దే ఉతో దీర్ఘ స్యాత్.

తె. వృ : ఉత్స శబ్దమున ఉకారమునకు దీర్ఘము వచ్చును.

52 సూ. పుత్రోత్సయో ష్టః

వృ : ఏతయోః స్తో ష్టః స్యాత్. పీఠాదిత్వా ద్బిందుకః. ఊంట.

తె. వృ: పుత్ర-ఉత్సశబ్దములలోని సంయోగమునకు బదులుటకారము వచ్చును. ఉత్స శబ్దము పీఠాదిగణములోని దగుటవలన బిందుకము వచ్చును. ఉత్స-ఊంట.

## 53 సూ. పుత్ర ఖురళ్యో రత్

వృ : పుత్ర ఖురళ్యో రుతోవుత్ స్యాత్. స్తో ష్టః. తద్విత్వమ్ ఖడ్గాదిత్వాత్. స్వార్థ ఇవ్. పట్టి.

తె. వృ : పుత్ర-ఖురళీ శబ్దములలోని ఉకారమునకు బదులు అకారము వచ్చును. (పుత్ర శబ్దములోని) సంయోగమునకు బదులు టకారము దానికి ద్విత్వము (10వ సూ. చూ.) ఇది ఖడ్గాదిగణములోని దగుటవలన చివరి స్వరమునకు స్వార్థమున ఇప్ వచ్చును. పుత్ర-పట్టి.

## 54 సూ. గుగ్గులౌ ఘోః

వృ : గుగ్గులు శబ్దే ఘో రుత ఇత్ స్యాత్. గుగ్గిలము.

తె. వృ : గుగ్గులు శబ్దమున రెండవదగు ఉకారమునకు బదులు ఇకారము వచ్చును. గుగ్గులు-గుగ్గిలము.*

## 55 సూ. శ్రుతి కంచులయో ర్హేత్

వృ : కర్ణవాచక శ్రుతి శబ్దే కంచులా శబ్దే చ ఉతో హేత్ స్యాత్. కంచెల

తె. వృ : చెవి యను నర్థముగల శ్రుతి శబ్దమునను, కంచులా శబ్దమునను ఉకారమునకు బదులు ఎకారము వచ్చును. కంచులా-కంచెల.

## 56 సూ. ఓత్ కుడ్య కురంటయోః

వృ : కుడ్య కురంటయో రుత ఓత్ స్యాత్. గోరంట. తరంగాదిత్వాత్ బిందోః బ్లుక్. ఉభయత్రాపి పంక్త్యాదిత్వాత్ కస్య గః. గోడ. త్యాగకుడ్యే త్యాదినా స్తో రధోలుక్.

తె. వృ : కుడ్య-కురంట శబ్దములలో ఉకారమునకు బదులు ఓకారము వచ్చును. కురంట-గోరంట. కురంట శబ్దము తరంగాదిగణములోని దగుటవలన బిందువునకు బ్లుక్కు వచ్చును. (అనగా బిందువులోపించును.) గోరట. కురంటకుడ్య శబ్దములు పంక్త్యాదిగణములోని వగుట వలన (6వ సూ.) కకారమునకు బదులు గకారము వచ్చును. కుడ్య-గోడ.†
"త్యాగకుడ్య"తో మొదలగు (14వ) సూత్రమువలన సంయుక్తములోని క్రింది వ్యంజనము లోపించినది.

---

*లకారము మీఁది ఉకారమునకు అకారము విధించు సూత్రము కానరాదు.

†అసలు గోడ శబ్దము సంస్కృతమే కావచ్చును. గుడ ప్రతీఘాతే అను ధాతువునకు ఘఞ్-గోడః.

### 57 సూ. కస్తూరీ తాంబూలయో రూతః

వృ: ఏతయో రూతో హ్రః స్యాత్. కస్తురి.

తె. వృ: కస్తూరీ-తాంబూల శబ్దములలోని ఊకారమునకు హ్రస్వము వచ్చును. కస్తూరీ-కస్తురి.

### 58 సూ. ఋతోఽరః పితరి

వృ: పరేత పర్యాయ పితృ శబ్దే అర ఇతి స్యాత్. పేత్ పితృ సింహాం దేత్యాదినా ఇతో పేత్. పెతర.

తె. వృ: పరమపదించినవారికి పర్యాయమగు పితృశబ్దమున (ఋకారమునకు బదులు) 'అర' వచ్చును. "ఇతో పేత్ పితృ సింహాండ" తో మొదలగు (18వ) సూత్రమువలన ఇకారమునకు బదులు ఎకారము వచ్చును. పితృ - పెతర.

### 59 సూ. వృథాదా విత్

వృ: వృథాదౌ ఋత ఇత్ స్యాత్. ఇన్మృత్యు ఖీరుకయోరి త్యుత ఇత్.

తె. వృ: వృథాది గణశబ్దములలో ఋకారమునకు బదులు ఇకారము వచ్చును. "ఇ న్మృత్యు ఖీరుకయోః" అను (46వ) సూత్రమువలన (మృత్యుశబ్దములోని) ఉకారమునకు బదులు ఇకారము వచ్చును.

### 60 సూ. తో మృత్యు చించా ఖడ్గ గుచ్ఛేషు

వృ: మృత్యు ప్రభృతిషు స్తోః తః స్యాత్. అఖో ర్ద్విత్వ మిత్యాదినా ద్విత్వమ్. మిత్తి. చింత. కత్తి. గుత్తి. ఉభయత్రాపి ఇవ్.

తె. వృ: మృత్యు - చించా - ఖడ్గ - గుచ్ఛ శబ్దములలోని సంయుక్తమునకు బదులు తకారము వచ్చును. "అఖో ర్ద్విత్వమ్" తో మొదలగు (10వ) సూత్రమువలన మొదటిది కాని సంయుక్తమునకు వచ్చు నాదేశమునకు ద్విత్వము వచ్చును. మృత్యు - మిత్తి. చించా - చింత. ఖడ్గ - కత్తి. గుచ్ఛ - గుత్తి. ఖడ్గ - గుచ్ఛ శబ్దములు ఖడ్గాది గణములోని వగుటవలన రెండింటికిని స్వార్థమున తుదిస్వరమునకు ఇకారము వచ్చినది.

### 61 సూ. చపేటాయామత్

వృ: చపేటాయా మేఽోఽత్ స్యాత్. చస్య వైకృతత్వాద్దంత్యత్వమ్ పుటాదిత్వా ద్ద్విత్వమ్. చప్పట.

తె. వృ: చపేటా శబ్దమునందలి ఏకారమునకు బదులు అకారము వచ్చును. వైకృతమగుటచే చకారమునకు దంత్యత్వము. పుటాది గణములోని దగుటవలన రెండవ వర్ణమునకు (౩౭వ సూ.) ద్విత్వము. చపేటా - చప్పట.

## 62 సూ. ఇ దోక స్సందేహ తేమన వేళా వళీ చ్ఛోటికాసు

వృ: ఓకః ప్రభృతి ష్వేజ ఇత్ స్యాత్. ఇక్క. చిటిక. ఛస్య చః. తిమ్మనము. పుటాదిత్వాత్ ద్విత్వమ్.

తె. వృ: ఓకస్ - సందేహ - తేమన - వేళావళీ - ఛోటికా శబ్దముల లోని ఏ ఓలకు బదులు ఇకారము వచ్చును. ఓకస్ - ఇక్క, ఛోటికా - చిటిక: ఇట ఛకారమునకు బదులు చకారము. తేమనము - తిమ్మనము. ఇక్క, తిమ్మనము అనునెడల పుటాదిగణకృతమైన ద్విత్వము. (౩౭వ సూ.)

## 63 సూ. హో స్మే ఘే

వృ: మేఘ శబ్దే ఏతః హోత్ స్యాత్. స్వార్థే ఉలుస్. మొగులు.

తె. వృ: మేఘ శబ్దమున ఏకారమునకు బదులు ఒకారము వచ్చును. స్వార్థమున 'ఉలుస్' ప్రత్యయము (తద్ధిత. 14 వ సూ.) మేఘ- మొగులు.

## 64 సూ. ఏ త్సాజ్ఝలా నియమ స్యాదే రచః

వృ: నియమ శబ్దసంబంధిన ఆదే రచః పరేణ సాజ్ఝలా సహ ఏత్ స్యాత్. నేమము.

తె. వృ: నియమ శబ్దములోని మొదటి యచ్చునకును, దాని తరువాతి అచ్చుతో గూడిన హల్లునకును బదులు ఏకారము వచ్చును. నియమము - నేమము.

## 65 సూ. సుఖ ముఖయో ర్వా

వృ: ఏతయో రాదే రచః పరేణ సాజ్ఝలా సహ ఓద్వా స్యాత్. సోము. సుకము. మోము — మొగము. కుబ్జాదిత్వా ద్గత్వమ్.

తె. వృ: సుఖ - ముఖ శబ్దములలోని తొలియచ్చునకును దాని తరువాతి యచ్చుతోఁగూడిన హల్లునకును బదులు ఓత్వము వికల్పముగా వచ్చును. సుఖ - సోము; సుకము. ముఖ - మోము; మొగము. కుబ్జాది గణములోని దగుటవలన (ముఖశబ్దములోని ఖ కారమునకు బదులు) గ కారము వచ్చును.

### 66 సూ. ఈ ద్గృహస్య

వృ: గృహ శబ్ద స్యాదే రచః పరేణ సాఙ్ఝలా సహ ఈత్ స్యాత్. గీము.

తె. వృ: గృహ శబ్దములోని తొలియచ్చునకును, దాని తరువాతి యచ్చుతో గూడిన హల్లునకును బదులు ఈకారము వచ్చును. గృహము - గీము.

### 67 సూ. ఆ ద్భవ సహోయయోః

వృ: ఏతయో రాదే రచః పరేణ సాఙ్ఝలా సహ ఆత్ స్యాత్. బాము. సాయము.

తె. వృ: భవ - సహోయ శబ్దములలోని తొలియచ్చునకును, దాని తరువాతి యచ్చుతోఁగూడిన హల్లునకును బదులు ఆకారము వచ్చును. భవము—బాము. సహోయము - సాయము.

### 68 సూ. సోమయాజినః ఘోః

వృ: సోమయాజిన్ శబ్దే ఘో రచః పరేణ సాఙ్ఝలా సహ ఆత్ స్యాత్. సోమాజి.

తె. వృ: సోమయాజిన్ శబ్దమున ద్వితీయాచ్చునకును, దాని తరువాతియచ్చుతోఁ గూడిన హల్లునకును బదులు ఆకారము వచ్చును. సోమయాజి - సోమాజి.

### 69 సూ. దః సూచౌ చోః

వృ: సూచి శబ్దే చో ర్దః స్యాత్. సూది.

తె. వృ: సూచి శబ్దమున చవర్గాక్షరమునకు దకారము వచ్చును. సూచి - సూది.

### 70 సూ. వచా చ్ఛిద్రయోః సః

వృ: ఏతయో. శ్చోః సకారః స్యాత్. వస.

తె. వృ: వచా - ఛిద్ర శబ్దములలోని చ వర్గాక్షరమునకు బదులు సకారము వచ్చును. వ చ - వ స.

### 71 సూ. ఛిద్ర చిత్ర తంద్రా యత్న యాత్రా మ్రార్తి తీవ్ర వక్రే ష్వత్

వృ: ఛిద్రాది ష్వన్త్యహలః ప్రాగత్వమ్ స్యాత్. సిదరము. చిత్తరవు. తందర. జతనము. జాతర. అమరము. ఆరతి. తీవరము. వక్కరము. వికృతాదౌ యత్రశవణా భావాత్ జకార ఏవేష్టః.

తె. వృ: ఛిద్ర - చిత్ర - తంద్రా - యత్న - యాత్రా - ఆమ్ర - ఆర్తి - తీవ్ర - వక్ర శబ్దములలో చివరిహల్లునకు ముందు అత్వము వచ్చును. ఛిద్ర - సిదరము. చిత్ర - చిత్తరవు. తంద్రా-తందర. యత్న - జేతనము. యాత్రా - జాతర. ఆమ్ర - ఆమరము. ఆర్తి - ఆరతి. తీవ్ర - తీవరము. వక్ర - వక్కరము. వికృతి పదముల మొదట యకార శ్రవణము లేదు గనుక జేకారమే ఇష్టము.

72 సూ. యాత్రాగతార్థే యాతరి ణః

వృ: మన్మథాది యాత్రాశ్రిత జనార్థే యాతృ శబ్దే తు ణ వర్ణః స్యాత్. జాణ.

తె. వృ: మన్మథాది యాత్రాశ్రిత జనార్థమున ప్రయుక్తమగు యాతృ శబ్దమున 'తృ' కు బదులు 'ణ' వచ్చును. యాతృ జాణ.

73 సూ. ణాంగణే డః

వృ: అంగణ శబ్దే ణస్య డః స్యాత్. ఖడ్గాదిత్వా దిప్. అంగడి.

తె. వృ: అంగణ శబ్దములోని ణకారమునకు బదులు డకారము వచ్చును. ఇది ఖడ్గాది గణములోని శబ్దమగుటవలన చివరి స్వరమునకు బదులు ఇకారమును వచ్చును. అంగణ - అంగడి.

74 సూ. తోః పోత కదంబయోః

వృ: ఏతయో స్తవర్గస్య డః స్యాత్. పొడవ. మేదో నేమీత్యాదినా ఏజో హ్రః. స్వార్థే అవస్. కడిమి. శయకదంబేత్యాదినా ఘో రత ఇత్. తరంగాదిత్వాత్ బిందోః ఋక్.ఇప్.

తె. వృ: పోత - కదంబ శబ్దములలోని తవర్గాక్షరమునకు బదులు డకారము వచ్చును. పోత - పొడవ. ఇక్కడ మేదోనేమీత్యాది (50వ) సూత్రమువలన పోత శబ్దములోని ఓకారము హ్రస్వమైనది. (తద్ధి.13వ సూ. వలన) స్వార్థమున 'అవస్' ప్రత్యయము. కదంబ - కడిమి. ఇందు శయ కదంబేత్యాది (7వ) సూత్రము ప్రకారము ద్వితీయ స్వరమయిన అకార మునకు బదులు ఇకారము వచ్చినది. తరంగాది గణములోని శబ్దమగుట వలన బిందువు లోపించినది. ఇప్ చేరినది.

75 సూ. శ్రుతి జతుకయో ర్వః

వృ: కర్ణ వాచక శ్రుతిశబ్దస్య జతుకాశబ్దస్య చ తో ర్వః స్యాత్. చెవి. జవుక

తె. వృ: చెవి అను నర్థముగల శ్రుతి శబ్దమునను, జతుకాశబ్దమునను తవర్గాక్షరమునకు బదులు వకారము వచ్చును. శ్రుతి - చెవి. జతుక - జవుక.

76 సూ. జాతి దూత్యో ర్జః

వృ : ఏతయో స్త(వర్గ)వర్ణస్య జః స్యాత్ .జాజి. జూజి.

తె. వృ: జాతి - దూతీ శబ్దములలో త(వర్గ)వర్ణమునకు బదులు జకారము వచ్చును. జాతి - జాజి - దూతీ - జూజి.

77 సూ. భూతే చ శ్చ

వృ: భూతశబ్దే తోశ్చకారశ్చ స్యాత్. భస్య బత్వమ్. బూచము. బూజము.

తె. వృ: భూత శబ్దమున త వర్గాక్షరమునకు బదులు చకారమును వచ్చును. భకారమునకు బదులు బకారము. భూత-బూచేము-బూజ ము.

78 సూ. దనడా ల సూల శ్యామల ఖురళీషు

వృ : తూలాదిషు లస్య క్రమేణ దనడాభవంతి. కుబ్జాదిత్వాత్ తస్య దః. ఇప్. దూది. చామన. గరడి.

తె. వృ: తూల - శ్యామల - ఖురళీ శబ్దములలోని లకారమునకు బదులు వరుసగా ద, న, డ వచ్చును. తూల శబ్దము కుబ్జాది గణములోనిదగుట వలన తకారము దకారమగును. ఇప్ చేరును. తూల - దూది. శ్యామల - చామన. ఖురళి - గరడి.

79 సూ. వః కవితా సేవంత్యో ర్యమౌ

వృ : ఏతయో ర్వస్య క్రమేణ యమౌ భవతః. కయిత. చేమంతి. శోర్ష్మ త్యాదినా శో శ్చః.

తె. వృ: కవితా - సేవంతీ శబ్దములలోని వకారమునకు బదు క్రమముగా య, మ వచ్చును. కవిత - కయిత. సేవంతీ - చేమంతి. ఇందు శోర్ష్మంసేతి (17వ) సూత్రము ప్రకారము సకారమునకు బదులు చకారము.

80 సూ. హేయ హంసయో ర్హోలుక్

వృ : హేయ హంస శబ్దయో ర్హస్య లుక్ స్యాత్.

తె. వృ: హేయ - హంస శబ్దములలోని హకారమునకు లోపము వచ్చును.

## 81 సూ. యో హేయ యమునయో ర్వజౌ

వృ : ఏతయో ర్యకారస్య వజౌ భవతః. ఏవము. జమున. అంచ. శో ర్హం సే త్యాదినా సస్య చః.

తె. వృ: హేయ - యమునా శబ్దములలో యకారమునకు బదులు క్రమముగా వకార జకారములు వచ్చును. హేయ - ఏవము. యమునా- జమున. హంస - అంచ. ఇందు శో ర్హంసేత్యాది (17వ) సూత్రమువలన సకారమునకు బదులు చకారము వచ్చినది.

## 82 సూ. స్తో స్సః క్షేమే

వృ : క్షేమ శబ్దే సంయుక్తాక్షరస్య సః స్యాత్. సేమము.

తె. వృ: క్షేమ శబ్దమున సంయుక్త హల్లులకు బదులు సకారము వచ్చును. క్షేమ - సేమము.

## 83 సూ. అంబా తాంబూలయో ర్మః

వృ : ఏతయోః స్తో ర్మః స్యాత్. అమ్మ. (తమ్మలము) తమ్ములము. ఊతో హ్రస్వః.

తె. వృ: అంబా - తాంబూల శబ్దములలోని సంయుక్తమునకు బదులు మకార ద్విత్వము (10 సూ. చూ) వచ్చును. అంబ - అమ్మ. తాంబూల-(తమ్మలము.) తమ్ములము: ఊకారమునకు హ్రస్వము.(58 సూ.)

## 84 సూ. నః ప్రతిజ్ఞాయామ్

వృ : ప్రతిజ్ఞా శబ్దే స్తో ర్నః స్యాత్. అసాక్షిగ ఇతి నిషేధా ద్విత్వం న. ప్రతిన.

తె. వృ: ప్రతిజ్ఞాశబ్దమున (తుది) సంయుక్తమునకు బదులు నకారము వచ్చును. ఇది సాక్షి గణములో చేరినది. అసాక్షిగే అని (10 సూ. లో) నిషేధమున్నందున నకారమునకు ద్విత్వము రాదు. ప్రతిజ్ఞ - ప్రతిన.

## 85 సూ. టో ర్దాడిమే నః

వృ : దాడిమశబ్దే టో ర్నః స్యాత్. పుటాదిత్వాద్ద్విత్వమ్. దానిమ్మ.

తె. వృ: దాడిమ శబ్దమున టవర్గాక్షరమునకు బదులు నకారము వచ్చును. పుటాదిగణ శబ్దమగుటవలన ద్విత్వము వచ్చును.* దాడిమ - దానిమ్మ.

---

*"పుటగేఘోః." సూ. 33. అని రెండవ వర్ణమునకు మాత్రమే ద్విత్వము విధింపఁబడినను దానిని తృతీయవర్ణమున కిచట ననువర్తింపఁజేయుట విశేషము.

86 సూ. ఉన్మాదాయత్త వత్సనాభీష్టకా తురుష్కే షూపరి లుక్

వృ : ఉన్మాదాదిషు స్తో రుపరివర్ణస్య లుక్ స్యాత్. ఉమాదము. ఆయితము. *శయ కదంబేత్యాదినా ఫో రత ఇత్. వసనాబి. తురుక. ఇటక.

తె. వృ: ఉన్మాద - ఆయత్త-వత్సనాభి - ఇష్టకా - తురుష్క అను శబ్దముల సంయుక్తములోని పైవర్ణము లోపించును. ఉన్మాద - ఉమాదము. ఆయత్త - ఆయితము. శయ కదంబేత్యాది (7వ) సూత్రమువలన ద్వితీయ స్వరమైన అకారమునకు బదులు ఇకారము. వత్సనాభి-వసనాబి. ఇష్టకా - ఇటక. తురుష్క - తురుక.

87 సూ. అర్ధస్య సమేఽంశే

వృ : సమాంశార్థవిహిత స్యార్ధ శబ్దస్య స్తో రథోవర్ణస్య లుక్ స్యాత్. అర.

తె. వృ: సమాంశమను నర్థమిచ్చు అర్ధ శబ్దమున సంయుక్తములోని క్రింది వర్ణము లోపించును. అర్ధ - అర.

88 సూ. రాత్రి పంక్తి ముగ్ధా ప్రఖ్యా సఖ్యా స్విత్ ప్రాగంత్యహలః

వృ : రాత్ర్యాది ష్వంత్య హలః ప్రా గిత్స్యాత్. రాతిరి. పగిది. పంక్త్యాదిత్వాత్ సరళత్వమ్. ముగిది. పగ్గియ. కుబ్జాదిత్వాద్గః. సకియ.

తె. వృ: రాత్రి-పంక్తి- ముగ్ధా- ప్రఖ్యా- సఖ్యా - శబ్దములందు చివరి హల్లునకు ముందు ఇకారము వచ్చును. రాత్రి-రాతిరి. పంక్తి- పగిది.* ఇది పంక్త్యాదిగణములోని శబ్దమగుటవలన సరళత్వము వచ్చినది. ముగ్ధా- ముగిది. ప్రఖ్యా - పగ్గియ. ఇది కుబ్జాదిగణములోనిదగుటవలన గకారము వచ్చినది. సఖ్యా - సకియ.

89 సూ. ఉత్ సత్వ పర్వ దద్రు నిద్రా భస్మ చంద్రేషు

వృ: సత్వాది ష్వంత్యహలః ప్రాగుత్వం స్యాత్. సత్తువ. పుటాదిత్వాద్ద్విత్వమ్. దద్దురు. నిద్దుర. పరువము. బసుమము. చేందురుడు.

తె. వృ: సత్వ - పర్వ - దద్రు - నిద్రా - భస్మ - చంద్ర శబ్దములలో అంత్య హలునకు ముందు ఉత్వము వచ్చును. సత్వ - సత్తువ. ఇది పుటాది గణములోని శబ్దమగుటవలన ద్వితీయహల్లునకు ద్విత్వము. పర్వ - పరువము. దద్రు - దద్దురు. నిద్రా - నిద్దుర. భస్మ - బసుమము. చంద్ర - చేందురుఁడు.

---

* తరంగా దిత్వములనజ్లు క్వచ్చి బిందులోపము.

90 సూ. ద్యో భువో ర్దివి భువి

వృ : ఏతయోః క్రమేణ దివి భువి ఇత్యాదేశౌ భవతః. దివి. భువి.

తె. వృ: ద్యో - భూ శబ్దములకు క్రమముగా దివి భువి యనునవి యాదేశము లగును.

91 సూ. అళీక తిత్తిరి కారవేల్లాంగులీయకానాం హుళంకి తీతు కాక రోంగరాణి

వృ : అళీకాదీనాం క్రమేణ హుళంక్యాదయ ఆదేశాః. హుళంకి. తీతువు. కాకర. ఉంగరము.

తె. వృ: అళీక - తిత్తిరి - కారవేల్ల అంగుళీయక శబ్దములకు క్రమముగా హుళంకి - తీతువు - కాకర - ఉంగరము అనునవి యాదేశము లగును. అళీక-హుళంకి. తిత్తిరి-తీతువు. కారవేల్ల-కాకర. అంగుళీయక - ఉంగరము.

---

# ప్రాకృతభవాః

## (ii) అథ ప్రాకృతభయః.

ఇంక ప్రాకృత భవములు

### 1 సూ. అతో లు గంత్యే న్యోపాధ్యా యాశ్చర్య భూ చక్రవాకేషు

వృ: సంస్కృత నిర్దేశేఽపి సర్వత్ర ప్రాకృతస్యైవ స్థానిత్వమ్. ఉపాధ్యాయాదిషు అంత్యస్యాతో లుక్ స్యాత్. ఘ ఝ ఢ ధ భా మి తి ఝస్య జః. ఒఝ్ఝాఙ్-ఒజ్జే చక్కవాఙ్-జక్కవ. చస్య జః.

తె. వృ: ప్రకృతులను సంస్కృతమున నిర్దేశించినను కార్యమునకై ప్రాకృతమునే స్థావిగా గ్రహించవలెను. ఉపాధ్యాయ-ఆశ్చర్య-భూ-చక్రవాక శబ్దములందు చివరి అకారము లోపించును. ఉపాధ్యాయయో-ఒఝ్ఝాఙ్-ఒజే. చక్రవాక-చక్కవాఙ్ - జక్కవ. చకారమునకు జకారము వచ్చినది.

### 2 సూ. బ్రహ్మ కహ్మ ప్రస్తరేషు హాశ్చ

వృ: బ్రహ్మాదిషు ఖో రత ఓద్ధ స్వశ్చ స్యాత్.

తె. వృ: బ్రహ్మా- కహ్మా- ప్రస్తర శబ్దముల ప్రాకృతాదేశములలో ఆదివర్ణముమీఁది అకారమునకు బదులు ఓకారమును, దానికి హ్రస్వమును వచ్చును.

### 3 సూ. హే మః

వృ: సంయుక్త సంబంధినో హస్య మః స్యాత్. బమ్మ. బొమ్మ. కంఘూ. కొంగ

తె. వృ: సంయుక్తమునకు సంబంధించిన 'హ' కు బదులు 'మ' వచ్చును. బ్రహ్మా- బమ్హ- బమ్మ, బొమ్మ. కహ్మా- కంఘో-కొంగ.

### 4 సూ. ప్రస్తరే ఘోః

వృ: ప్రస్తరశబ్దే ఘో రతో లుక్ స్యాత్. ధస్య తః. పద్ధరో-పొత్రము.

తె. వృ: ప్రస్తర శబ్దమున ద్వితీయవర్ణము యొక్క అకారమునకు లోపము వచ్చును. ప్రస్తర - పద్ధరో - పొత్రము. ఇందు ధకారమునకు బదులు తకారము వచ్చినది.

5 సూ. ద్వీప కటక జాలకే ష్విత్

వృ: ద్వీపాదిషు ఘో రత ఇత్ స్యాత్. దీవో - దివి. కదఅం - కడియము. జాళఅం - జోళియము.

తె. వృ: ద్వీప - కటక - జాలక శబ్దములలో ద్వితీయ వర్ణము మీఁది అకారమునకు బదులు ఇకారము వచ్చును. ద్వీప - దీవో - దివి. కటక - కదఅం - కడియము. జాలకం - జాళఅం - జోళియము.

6 సూ. ఉ జీర్ణ యామ కాంస్య కర్కశ రౌరవేషు

వృ: జీర్ణాదిషు ఘో రత ఉత్ స్యాత్.

తె. వృ: జీర్ణ - యామ - కాంస్య - కర్కశ-రౌరవ శబ్దములలోని ద్వితీయవర్ణముమీఁది అకారమునకు బదులు ఉకారము వచ్చును.

7 సూ. శోః కాంస్య శుక్ర శర్కరాసు చః

వృ: కాంస్యాదిషు శో శ్చః స్యాత్. జుణ్ణా. జున్ను. జామో. జోము. కంసో. కంచు. ప్రాకృతే బహుళాధికారాత్ మాంసాదిత్వం.న. రోరవో-రోరువము.

తె. వృ: కాంస్య - శక్ర - శర్కరా శబ్దములలోని శసలకు, బదులు చకారము వచ్చును. జీర్ణ - జుణ్ణా - జున్ను. యామ - జామో - జోము. కాంస్య - కంసో - కంచు. ప్రాకృతమున బహుళాధికారమగుటచే మాంసాది గణీయత్వము లేదు. రౌరవ - రోరవో - రోరువము.

8 సూ. శ్మశ్రు లఘుక త్రిపుటాది ష్వత్

వృ: శ్మశ్రు ప్రభృతిషు ఉతోఽత్ స్యాత్.

తె. వృ: శ్మశ్రు, లఘుక, త్రిపుట - మొదలగు శబ్దములలోని ఉకారమునకు బదులు అకారము వచ్చును.

9 సూ. ఇచ్చ లఘుకే కః

వృ: లఘుక శబ్దే కకార సంబంధినః అత ఇత్ స్యాత్. చకారాదుత్. తదభావే ఘో రత ఇచ్చ.

తె. వృ: లఘుక శబ్దమున కకారమునకు సంబంధించిన అకారమునకు బదులు ఇకారము వచ్చును. సూత్రమున 'ఇచ్చ' అని చకారమున్నందున

ఉకారముగూడ వచ్చును. ఉకారము కలుగనప్పుడు ద్వితీయ వర్ణముమీది అకారమునకు బదులు ఇకారమును వచ్చును.

### 10 సూ. లఘుకేవక్

వృ: లఘుక శబ్దేఽంత్యస్య అతో వక్ స్యాత్.

తె. వృ: లఘుక శబ్దమున చివరి అకారమునకు వక్ ఆగమ మగును.

### 11 సూ. జహో ర్యశో లఘుక హరిద్రాసు లుక్

వృ: యశః ప్రభృతిషు జకార హకారయో ర్లోపః స్యాత్. హళక్. అళవు. అళవి. అళివి. జసో. అసము.

తె. వృ: యశస్ - లఘుక - హరిద్రా శబ్దములలోని జకార హకారములు లోపించును. లఘుక - హాళక్ - అళవు, అళవి, అళివి. యశస్ - జసో - అసము.

### 12 సూ. ఈత్ ఖోః శ్మశ్రుణి

వృ: శ్మశ్రు శబ్దే ఖో రత ఈత్ స్యాత్. శ్మశ్రు లఘుకేత్యాదినా ఉతోఽత్. తరంగాదిత్వా ద్బిందోః ర్లుక్. మంసూ - మీస.

తె. వృ: శ్మశ్రు శబ్దమున ప్రథమ వర్ణముమీఁది అకారమునకు బదులు ఈకారము వచ్చును. శ్మశ్రు లఘుకేత్యాది (8వ) సూత్రముచే ఉకారమునకు బదులు అకారము. ఇది తరంగాది గణశబ్దమగుటవలన బిందువునకు లోపము. శ్మశ్రు - మంసూ - మీస.

### 13 సూ. ద్వయ్యా మోత్

వృ: ద్వయ్యాం ఖోరత ఓత్ స్యాత్. దయీా - దోయి.

తె. వృ: ద్వయీా శబ్దమున తొలివర్ణముమీఁది అకారమునకు బదులు ఓకారము. ద్వయీా - దయీా - దోయి.

### 14 సూ. దిశా త్రిపుటయో ర్హేత్

వృ: ఏతయో రితో హేత్ స్యాత్. దిస - దెస. తివుడా - తెవడ.

తె. వృ: దిశా - త్రిపుటా శబ్దముల ఇకారమునకు బదులు ఎకారము వచ్చును. దిశా - దిస - దెస. త్రిపుటా - తివుడా - తెవడ.

15 సూ. ఆశ్చ ర్యోన్మ త్తారక్షి కర్పర క ర్తరీషు ఫోః

వృః ఆశ్చర్యాదిషు ఫో రత ఏత్; హ్రస్వచ్చ. ఉమ్మత్తో - ఉమ్మెత్త. కప్పరో - కప్పెర.

తె. వృః ఆశ్చర్య - ఉన్మత్త - ఆరక్షి - కర్పర - కర్తరీ శబ్దములలో ద్వితీయ వర్ణముమీఁది అకారమునకు బదులు ఏకారమును, దానికి హ్రస్వమునువచ్చును. ఉన్మత్త - ఉమ్మత్తో- ఉమ్మెత. కర్పర- కప్పరో- కప్పెర.

16 సూ. కర్తర్యా మాత్

వృః కర్తర్యా మీత ఆత్ స్యాత్. కత్తరీ. కత్తెర. ధూర్తాదిత్వా దుత్వం న.

తె. వృః కర్తరీ శబ్దమున ఈకారమునకు బదులు ఆకారము వచ్చును. కర్తరీ - కత్తరీ - కత్తెర. ధూర్తాది గణములోని శబ్దమగుటవలన ఉత్వము రాదు.

17 సూ. వైశాఖీ ప్రవాళ కూర్పాసేషు హః

వృః వైశాఖి ప్రభృతి ష్వాతో హః స్యాత్.

తె. వృః వైశాఖీ - ప్రవాళ - కూర్పాస శబ్దములలోని ఆకారము హ్రస్వమగును.

18 సూ. ప్రవాళ వ్రీళితయో ర్డః

వృః ఏతయో ర్ళస్య డః స్యాత్. పవాళో-పవడము. కుప్పాసో-కుప్పసము.

తె. వృః ప్రవాళ - వ్రీళిత శబ్దములలో ళకారమునకు బదులు డకారము వచ్చును. ప్రవాళ - పవాళో - పవడము. కూర్పాస - కుప్పాసో- కుప్పసము.

19 సూ. ఉతః క్షురాయాం దిః

వృః క్షురాయా ముతో దీర్ఘః స్యాత్.

తె. వృః క్షురా శబ్దమున ఉకారము దీర్ఘమగును.

20 సూ. క్షురాయా మిత్

వృః క్షురాయా మాత ఇత్ స్యాత్.

తె. వృః క్షురాశబ్దమున ఆకారమునకు బదులు ఇకారము వచ్చును.

### 21 సూ. ఖోః క్షురాయాం చః

వృ: క్షురాయాం ఖోః చః స్యాత్. ఖురా. చూరి.

తె. వృ: క్షురాశబ్దమున ఆదివర్ణమునకు బదులు చకారము వచ్చును. క్షురా—ఖురా—చూరి.

### 22 సూ. ఓ ద్వారే

వృ: ద్వారశబ్దే ఆత ఓత్ స్యాత్. దారం. దోరము.

తె. వృ: ద్వారశబ్దమున ఆకారమునకు బదులు ఓకారము వచ్చును. ద్వార—దారం—దోరము.

### 23 సూ. ఇతః శుక్తి పృథివ్యోః ఫో రత్

వృ: ఏతయోః ఫో రితోఽత్ స్యాత్. చిప్పి. చిప్ప.

తె. వృ: శుక్తి—పృథివీ-శబ్దముల ద్వితీయ వర్ణములమీఁది ఇకారమునకు బదులు అకారము వచ్చును. శుక్తి—చిప్పి—చిప్ప.

### 24 సూ. వో మః పృథివ్యామ్

వృ: పృథివ్యాం వస్య మః స్యాత్. థస్య డః. పుఢివి - పుడమి.

తె. వృ: పృథివీ శబ్దమున వకారమునకు బదులు మకారము వచ్చును. థకారమునకు బదులు డకారము. పృథివీ—పుఢివి—పుడమి.

### 25 సూ. ఉ దాశ్చర్యే

వృ: ఆశ్చర్యే ఇత ఉత్ స్యాత్. ఆశ్చర్యోన్మత్తేత్యాదినా ఫో రత ఏద్ధ్రస్వశ్చ. అతో లుగిత్యాది నాంత్యస్య అతో లుక్. ఛస్య చః. అచ్ఛరిఅం - అచ్చెరువు.

తె. వృ: ఆశ్చర్య శబ్దమున ఇకారమునకు బదులు ఉకారము వచ్చును. ఆశ్చర్యోన్మత్తేత్యాది (15వ) సూత్రమువలన ద్వితీయ వర్ణము మీఁది అకారమునకు బదులు ఏకారమును దానికి హ్రస్వమును అగును. అతో లుగిత్యాది (1వ) సూత్రము వలన చివరి అకారము లోపించును. ఛకారమునకు బదులు చకారము. ఆశ్చర్య—అచ్ఛరిఅం—అచ్చెరువు.

### 26 సూ. ఖో ర్లుక్ కిరీటిని

వృ: కిరీటిన్ శబ్దే ఖో రితో లుక్ స్యాత్. కిరిడి-క్రీడి.

తె. వృ: కిరీటిన్ శబ్దమున ప్రథమ వర్ణముమీఁది ఇకారము లోపించును. కిరీటిన్-కిరీడి-క్రీడి.

27 సూ. ఈతః ఖలీనే హ్రః

వృ: ఖలీనే ఈతః హ్రః స్యాత్.

తె. వృ: ఖలీన శబ్దమున ఈకారము హ్రస్వమగును.

28 సూ. ఖలీనే ణః

వృ: ఖలీనే ణస్య లుక్ స్యాత్.

తె. వృ: ఖలీన శబ్దమున ణకారమునకు లోపము వచ్చును.

29 సూ. ద్విత్వం శమీ ఖలీన కూటపేటికాసు ఘోః

వృ: శమ్యాదిషు ఘో ర్ద్విత్వం స్యాత్. ఖస్య కః. ఖళీణం. కళ్ళియము. కూడో - గుడ్డ. పేడిఅ - పెడ్డియ. పెట్టి యేతి కేచిత్.

తె. వృ: శమీ—ఖలీన—కూట—పేటికా శబ్దములలో ద్వితీయ వర్ణమునకు ద్విత్వము వచ్చును. ఖకారమునకు బదులు కకారము. ఖలీన— ఖళీణ — కళ్లియము. కూట—కూడో—గుడ్డ. పేటికా—పేడిఅ—పెడ్డియ; పెట్టియ యని కొంద అందురు.

30 సూ. కుక్కుట్యా మోత్

వృ: కుక్కుట్యా ముత ఓత్ స్యాత్.

తె. వృ: కుక్కుటీ శబ్దమున ఉకారమునకు బదులు ఓకారము వచ్చును.

31 సూ. కుక్కుటీ కాహళీకయో ర్లుక్ స్యాజ్ఝలః

వృ: ఏతయోః ఘోః సాజ్ఝలః లుక్ స్యాత్. ఘో రనువృత్తేః హల్ద్వయ స్యాపి గ్రహణమ్. కుక్కుడి - కోడి.

తె. వృ: కుక్కుటీ-కాహళీక శబ్దములలో ద్వితీయమైన అచ్చుతోడి హల్లునకు లోపము వచ్చును. 'ఘోః' అనునది అనువృత్త మగుటచే హల్లులు రెండును గ్రహింపనగును. కుక్కుటీ-కుక్కుడి-కోడి.

32 సూ. హశ్చ భ్రూ కుమారయోః

వృ: భ్రూ కుమారయో రుతట ర్ధస్వశ్చ. భుమఆ-బొమ. అంత్యస్యాతో లుక్.

తె. వృ: భ్రూ-కుమార శబ్దములలోని ఉకారమునకు ఓకారమును, దానికి హ్రస్వమును వచ్చును. భ్రూ-భుమఆ-బొమ. చివరి ఆకారమునకు లోపము.

33 సూ. రః పూలికా కుమారయోః

వృ: ఏతయో ర్ళస్య రః స్యాత్. కుమళో-కొమరుడు. పూళిఅ-బూరియ. పస్య బః.

తె. వృ: పూలికా-కుమార శబ్దములలోని ళకారమునకు రకారము వచ్చును. కుమార-కుమళో - కొమరుఁడు. పూలికా-పూళిఅ-బూరియ. పకారమునకు బదులు బకారము వచ్చినది.

34 సూ. ఊతః కర్పూర ఖర్జూర కచ్చూరేషు హ్రః

వృ: కర్పూరాది షూతో హ్రస్వః స్యాత్. కప్పూరో-కప్పురము. ఖజ్జూరో-గజ్జురము. కచ్చూరో - కచ్చురము.

తె. వృ: కర్పూర-ఖర్జూర-కచ్చూర శబ్దములలోని ఊకారమునకు హ్రస్వము వచ్చును. కర్పూర-కప్పూరో-కప్పురము. ఖర్జూర-ఖజ్జూరో-గజ్జురము. కచ్చూర-కచ్చూరో-కచ్చూరము.

35 సూ. మంజూషాయా మత్

వృ: మంజూషాయా మూతోఽత్ స్యాత్.

తె. వృ: మంజూషా శబ్దమున ఊకారమునకు బదులు అకారము వచ్చును.

36 సూ. దో వా మంజూషాయామ్

వృ: మంజూషాయాం ష్టోః దోవా స్యాత్. మంజూసా - మందస; మంజస.

తె. వృ: మంజూషా శబ్దమున సంయుక్తమునకు* దకారము వికల్పముగా వచ్చును. మంజూషా-మంజూసా-మందస, మంజస.

37 సూ. ఉ దోతో మౌక్తికే

వృ: మౌక్తికే ఓత ఉత్ స్యాత్. మొత్తిఅం - ముత్తియము.

తె. వృ: మౌక్తిక శబ్దమున ఓకారమునకు బదులు ఉకారమగును. మౌక్తిక-మొత్తిఅం-ముత్తియము.

* మంజూషా - మఞ్జూషా

### 38 సూ. అత్ సంతోషే

వృ: సంతోష శబ్దే ఓతోఽత్ స్యాత్. సంతోసో - సంతసము.

తె. వృ: సంతోష శబ్దమున ఓకారమునకు బదులు అకారము వచ్చును. సంతోష-సంతోసో-సంతసము.

### 39 సూ. ఏతః కర్కరేటౌ

వృ: కర్కరేటా వేతోఽత్ స్యాత్.

తె. వృ: కర్కరేటు శబ్దమున ఏకారమునకు బదులు అకారము వచ్చును.

### 40 సూ. కర్కశ కర్కరేటు ప్రగ్రహ సదృశాప్సరః కోద్రవే ష్వంతస్య

వృ: కర్కశాదిషు అంతస్య సాజ్ఝలో లుక్ స్యాత్. కక్కసో - కక్కు. కక్కరోడు - కక్కర. పగ్గహో - పగ్గము. సరిసో - సరి. అచ్చరసా - అచ్చర.

తె. వృ: కర్కశ - కర్కరేటు - ప్రగ్రహ-సదృశ-అప్సరస్-కోద్రవ శబ్దముల చివరి అచ్చుతోడి హల్లునకు లోపమువచ్చును. కర్కశ-కక్కసో-కక్కు. కర్కరేటు-కక్కరోడు-కక్కర. ప్రగ్రహ-పగ్గహో-పగ్గము. సదృశ-సరిసో-సరి. అప్సరస్-అచ్చరసా- అచ్చర.

### 41 సూ. ఓ దేతః

వృ: ఏకశబ్దే ఏత ఓత్ స్యాత్. ఏక్కో. ఒక్కండు.

తె. వృ: ఏక శబ్దమున ఏకారమునకు ఓకారమగును. ఏక-ఏక్కో-ఒక్కండు.

### 42 సూ. హే శ్చర్మయష్ట్యాం తేన (?)

వృ: చర్మయష్ట్యాం తేన (?) సహ ఘ్యో రతో హేత్ స్యాత్.

తె. వృ: చర్మయష్టి శబ్దమున ద్వితీయ వర్ణము మీఁది అకారము నకును, దాని తరువాతి అకారమునకును బదులు ఎకారము వచ్చును.

### 43 సూ. చ శ్చర్మయష్ట్యాం సః

వృ: చర్మయష్ట్యాం చః సః స్యాత్.

తె. వృ: చర్మయష్టి శబ్దమున చకారమునకు బదులు సకారము వచ్చును.

44 సూ. ఆరక్షీ భిక్షా సపత్నీ చర్మయష్టి మహారాష్ట్రీ చతుష్కికా హరిద్రా సూపరి లుక్

వృ: ఆరక్షీ ప్రభృతిషు స్తో రుపరి లుక్ స్యాత్. ఆరక్ఖి-ఆరెకులు. సవత్తి-సవతి చమ్మఅట్ఠి-సమ్మెటి. తస్య టః. బహుళాధికారా న్మస్య న లుక్. చవుక్కిఅ-చేవుకియ. హాళద్ది-అళంది.

తె. వృ: ఆరక్షీ-భిక్షా-సపత్నీ-చర్మయష్టి-మహారాష్ట్రీ- చతుష్కికా-హరిద్రా శబ్దములలో సంయుక్తము మీఁది వర్ణము లోపించును. ఆరక్షీ-ఆరక్ఖి-ఆరెకులు. సపత్నీ-సవత్తి- సవతి. చర్మయష్టి-చమ్మఅట్ఠి - సమ్మెటి. ఇచట తకారమునకు బదులు టకారము. బహుళాధికారమువలన మకారమునకు లోపము లేదు. చతుష్కికా-చవుక్కిఅ-చేవుకియ. హరిద్రా-హాళద్ది-అళంది.

45 సూ. తోః దీర్ఘికాయాం డః

వృ: దీర్ఘికాయాం తో ర్డః స్యాత్. ఘస్య గః. దీర్ఘిఅ-డిగ్గియ.

తె. వృ: దీర్ఘికా శబ్దమున తవర్గాక్షరమునకు బదులు డకారము వచ్చును. 'ఘ'కు బదులు 'గ'. దీర్ఘికా-దీర్ఘిఅ-డిగ్గియ.

46 సూ. ఆమ్లాతే లః

వృ: ఆమ్లాత శబ్దే తో లః స్యాత్. అమ్మాతో - అమ్మాలము. ప్రాకృతే ప్రాయోలు గిత్యాదినా ప్రాయోగ్రహణాత్ తలోపాభావః.

తె. వృ: ఆమ్లాత శబ్దమున తకారము లకారమగును. ఆమ్లాత-అమ్మాతో-అమ్మాలము. "ప్రాయో లుక్ కగచజతదపయవామ్" (వాల్మీకి 1 అ. 3 పా. 8 సూ) అను ప్రాకృత వ్యాకరణ సూత్రమున ప్రాయోగ్రహణముండుటవలన తకారము లోపించలేదు.

47 సూ. ప్రళయే డవః

వృ: ప్రళయే ళస్య డవ ఇతి స్యాత్. పళఅ-పడవ.

తె. వృ: ప్రళయ శబ్దమున ళకారమునకు బదులు 'డవ' వచ్చును. ప్రళయ - పళవో - పడవ.

48 సూ. అవ్వో దైవయో ర్యః

వృ: ఏతయోః వస్య యః స్యాత్. అవ్వో-అయ్యో. దెవ్వ-దెయ్యము.

తె. వృ: అవ్వో - దైవ శబ్దములలోని వకారమునకు యకారము వచ్చును. (అవ్వో ప్రాకృత పదము).* అవ్వో - అయ్యో. దైవ - దెవ్వ - దెయ్యము.

*"అవ్వో సూచనా - దుఃఖ - సంభాషణాపరాధ-విస్మయానందాదర - భయఖేద-విషాద-పశ్చాత్తాపే"-హైమ ప్రా. వ్యాక. 2.204.

## 49 సూ. శమ్యాంజః

వృ: శమ్యాం శో ర్జః స్యాత్. ద్విత్వం శమీత్యాదినా ఘో ర్ద్విత్వమ్. సమీ - జమ్మి.

తె. వృ: శమీ శబ్దమున శు (శ.ష.స) వర్ణమునకు బదులు జకారము వచ్చును. ద్విత్వం శమీత్యాది (29వ) సూత్రముచే ద్వితీయ వర్ణమునకు ద్విత్వము. శమీ - సమీ - జెమ్మి.

## 50 సూ. హే వైశాఖ్యాం వః

వృ: వైశాఖ్యాం హస్య వః స్యాత్. వైశాఖీ ప్రవాలేత్యాదినా హ్రస్వః. వేసాహి - వేసవి.

తె. వృ: వైశాఖీ శబ్దమున హకారమునకు బదులు వకారము వచ్చును. వైశాఖీ ప్రవాళేత్యాది (17వ) సూత్రముచే హ్రస్వము. వైశాఖీ - వేసాహి - వేసవి.

## 51 సూ. గ్రహ మహారాష్ట్రయో ర్హేన పూర్వ స్యాత్

వృ: ఏతయో ర్హకారేణ సహ పూర్వ స్యాచ ఆత్ స్యాత్. గహో-గాము. మరహట్ఠో - మరాటి.

తె. వృ: గ్రహ - మహారాష్ట్ర శబ్దములలో హకారమునకును తత్పూర్వస్వరమునకును కలిపి ఆకారము వచ్చును. గ్రహ - గహో -గాము. మహారాష్ట్ర - మరహట్ఠో - మరాటి.

## 52 సూ. పార్శ్వే జః

వృ: పార్శ్వ శబ్దే స్తో ర్జః స్యాత్. పంసో-పజ్జె.

తె. వృ: పార్శ్వశబ్దమున సంయుక్తమునకు బదులు జకారము వచ్చును. పార్శ్వ - పంసో - పజ్జె.

## 53 సూ. వంశే గసః

వృ: వంశ శబ్దే స్తోః గస ఇతి స్యాత్. వంసో—వంగసము.

తె. వృ: వంశ శబ్దమున సంయుక్తమునకు బదులు 'గస' వచ్చును. వంశ - వంసో - వంగసము.

---

## శౌరసేనీభవాః

అథ శౌరసేనీ భవాః.

ఇంక శౌరసేనీభవములు.

### 1 సూ. శౌరసేన్యాం హో దుతః సురతౌ

వృ: ఇతః పరం మాగధ్యా మిత్యాది పర్యంతం శౌరసేన్యాం కార్యమ్. తత్ర సురతి శబ్దే ఉతో హోత్ స్యాత్. సురది - సొరది.

తె. వృ: ఇక్కడినుండి 'మాగధ్యామ్' అని చెప్పఁ బడువఱకు శౌరసేనీ ప్రాకృత ప్రకృతులయందు కార్యము విధింపఁబడును. సురతి శబ్దమున ఉకారమునకు బదులు ఒకారము వచ్చును. సురతి - సురది - సొరది.

### 2 సూ. ఓతో యజ్ఞోపవీతే వ్యా

వృ: యజ్ఞోపవీతే వీ ఇత్యనేన సహ ఓత ఇత్ స్యాత్.

తె. వృ: యజ్ఞోపవీత శబ్దమున 'వీ' తో కలిపి దాని వెనుక నున్న ఓకారమునకు బదులు ఇకారము వచ్చును.

### 3 సూ. ణో నః

వృ: ణకారస్య న కారః స్యాత్. జణోవీదం - జన్నిదము.

తె. వృ: ణకారము నకారమగును. యజ్ఞోపవీత-జణోవీదం-జన్నిదము.

### 4 సూ. ఆతః ప్రతిజ్ఞాతే

వృ: ప్రతిజ్ఞాతే ఆత ఇత్ స్యాత్.

తె. వృ: ప్రతిజ్ఞాత శబ్దమున ఆకారమునకు బదులు ఇకారము వచ్చును.

### 5 సూ. ఘో ర్లుక్ సాజ్ఝలః ప్రతిజ్ఞాతే

వృ: ప్రతిజ్ఞాతే ఘోః సాజ్ఝలో లుక్ స్యాత్. పడిణాదం - పన్నిదము.

తె. వృ: ప్రతిజ్ఞాత శబ్దమున రెండవదగు అచ్చుతోఁ గూడిన హల్లు లోపించును. ప్రతిజ్ఞాత - పడిణాదం - పన్నిదము.

## 6 సూ. శేనోద్ధింతాళే

వృ: హింతాళే శేన సహ అత ఉత్ స్యాత్.

తె. వృ: హింతాళ శబ్దమున శకారమునకును, దాని వెనుక ఆకారమునకును బదులు ఉకారము వచ్చును.

## 7 సూ. ఇతో దిర్ఘా హ్రా

వృ: హింతాళే హకారేణ సహ ఇతో దీర్ఘః స్యాత్. బిందోః ల్లుక్.

తె. వృ: బిందువు లోపించినప్పుడు హింతాళ శబ్దమున హకారముతోగూడిన ఇకారమునకు బదులు ఈకారము వచ్చును.

## 8 సూ. తస్యదః

వృ: హింతాళ తకారస్య దకారస్స్యాత్. హింతాళో-ఈదు.

తె. వృ: హింతాళ శబ్దములోని తకారమునకు దకారము వచ్చును. హింతాళ-హింతాళో-ఈదు.

## 9 సూ. హరితాళే హః

వృ: హరితాళ శబ్దే ఆతో హ్రస్వః స్యాత్. హరిదాళో - హరిదళము.

తె. వృ: హరితాళ శబ్దమున ఆకారమునకు హ్రస్వమగును. హరితాళ - హరిదాళో - హరిదళము.

## 10 సూ. ధాతౌ ఖో ర్జః

వృ: ధాతు శబ్దే ఖో ర్జః స్యాత్. దాదు - జాదు.

తె. వృ: ధాతు శబ్దమున ఆదివర్ణమునకు బదులు జకారము వచ్చును. ధాతు-దాదు-జాదు.

---

## మాగధీభవాః

అథ మాగధీభవాః

ఇంక మాగధీభవములు

### 1 సూ. మాగధ్యాం నేదిష్ఠ గేహస్థయోః

వృ: ఇతః ప్రభృత్యాపాదపరిసమాప్తి మాగధ్యాం కార్యమ్. తత్ర నేదిష్ఠ గేహస్థ శబ్దయోః ఘోః సాజలో లుక్ స్యాత్. ణేదిస్తం-నేస్తము. ణస్య నః.

తె. వృ: ఇఁకనుండి పాదాంతమువఱకు మాగధీప్రాకృతప్రకృతుల యందు కార్యములు విధింపబడును. అందు నేదిష్ఠ-గేహస్థ శబ్దములలో అచ్చుతోఁగూడిన రెండవ యక్షరములోపించును. నేదిష్ఠ-ణేదిస్తం-నేస్తము. ణకారమునకు బదులు నకారము.

### 2 సూ. ఉ ద్గేహస్థే

వృ: గేహస్థ శబ్దేంత్యస్య ఉత్ స్యాత్. గేహస్తో. గేస్తు.

తె: వృ: గేహస్థ శబ్దమున అంత్య స్వరమునకు ఉకారము వచ్చును. గేహస్థ-గేహస్తో-గేస్తు.

### 3 సూ. ఇత్ కష్టేఽంత్యస్య

వృ: కష్టేఅంత్య స్యాచ ఇత్ స్యాత్. కస్తం-కస్తి.

తె. వృ: కష్ట శబ్దమున చివరి యచ్చునకు బదులు ఇకారము వచ్చును. కష్ట-కస్తం-కస్తి.

### 4 సూ. ఏ దాదే రామాయామ్

వృ: స్త్రీవాచక రామా శబ్దే ఆదే రచ ఏత్ స్యాత్. లామా-లేమ.

తె. వృ: స్త్రీవాచకమయిన రామా శబ్దమున మొదటి యచ్చునకు బదులు ఏకారము వచ్చును. రామా-లామా-లేమ.

## పైశాచీభవాః

అథ పైశాచీ భవాః

ఇంక పైశాచీ భవములు

### 1 సూ. పైశాచ్యామ్

వృ: ఇతః ప్రభృతి చూళికాపైశాచ్యాం మిత్యాది పర్యంతం పైశాచ్యాం కార్యమ్ స్యాత్.

తె. వృ: ఇక్కడినుండి 'చూళికాపైశాచ్యామ్' అని చెప్పునంత వఱకును పైశాచీ ప్రాకృత ప్రకృతులకు కార్యములు విధింపఁబడును.

### 2 సూ. అతో లుగాదే రలక్తే

వృ: అలక్తే ఆదే రతోలుక్ స్యాత్. అలత్తో-లత్త.

తె. వృ: అలక్త శబ్దమున తొలి-అకారము లోపించును. అలక్త-అలత్తో-లత్త.

### 3 సూ. నః శూర్పణఖాయాం దిః

వృ: శూర్పణఖాయాం నకార సంబంధినోఽతో దీర్ఘః స్యాత్.

తె. వృ: శూర్పణఖా శబ్దముననకారముమీఁది అకారము దీర్ఘమగును.

### 4 సూ. శోః శష్కులీ పరిహాస శూర్పణఖాసు చః

వృ: శష్కుల్యాదిషు శోః చ్చః స్యాత్. సుప్పనఖా-చుప్పనాక.

తె. వృ: శష్కులీ-పరిహాస-శూర్పణఖా శబ్దముల శషసలకు బదులు చకారము వచ్చును. శూర్పణఖా-సుప్పనఖా-చుప్పనాక.

### 5 సూ. అత్ ద్రోణీ శష్కుల్యో రీతః

వృ: ఏతయో రీతోఽత్ స్యాత్.

తె. వృ: ద్రోణీ-శష్కులీ శబ్దములలోని ఈకారమునకు బదులు అకారము వచ్చును.

### 6 సూ. మానుష శకునికా హింగుల శష్కులీ ష్విత్

వృ: మానుషాది షూత ఇత్ స్యాత్. సఖ్ఖులీ-చక్కిలము. సకునిఆ-సకునియ.

తె. వృ: మానుష-శకునికా-హింగుల-శష్కులీ శబ్దములలోని ఉకారమునకు బదులు ఇకారము వచ్చును. శష్కులీ-సఖులీ-చక్కిలము, శకునికా-సకునిఆ-సకునియ.

7 సూ. హో హేలా పరిహాసక హింగులేషు లుక్

వృ: హేలాదిషు హకారస్య లుక్ స్యాత్. పరిహాసకో - పరియాచకము. హింగుళం - ఇంగిలము.

తె. వృ: హేలా-పరిహాసక-హింగుల శబ్దముల హకారము లోపించును. పరిహాసక-పరిహాసకో-పరియాచేకము. హింగుళ-హింగుళం-ఇంగిలము.

8 సూ. మానుషేఽంత్యస్య

వృ: మానుష శబ్దే ఽంత్యస్య అత ఇత్ స్యాత్. మానుసో - మానిసి.

తె. వృ: మానుష శబ్దమున చివరి అకారమునకు బదులు ఇకారము వచ్చును. మానుష-మానుసో* - మానిసి.

9 సూ. హేలాయా మోత్

వృ: హేలాయా మేత ఓత్ స్యాత్.

తె. వృ: హేలా శబ్దమున ఏకారమునకు బదులు ఓకారము వచ్చును.

10 సూ. ఇ దూర్ణా నిశా హేలా ప్రయాణేషు

వృ: ఊర్ణాది ష్వాత ఇత్ స్యాత్. ఉన్నా-ఉన్ని. నిసా-నిసి. హేలా-ఓలి. పయానం-పయినము.

తె. వృ: ఊర్ణా-నిశా-హేలా-ప్రయాణ శబ్దములలో ఆకారమునకు బదులు ఇకారము వచ్చును. ఊర్ణా-ఉన్నా-ఉన్ని. నిశా-నిసా-నిసి. హేలా-హేలా-ఓలి. ప్రయాణ-పయానం-పయినము

11 సూ. ద్రోణీ గోనాసయో రోతో హ్రః

వృ: ఏతయో రోతో హ్రః స్యాత్. ఈతోఽత్. దోనీ-దొన.

తె. వృ: ద్రోణీ-గోనాస శబ్దములలోని ఓకారమునకు (హ్రస్వము) వచ్చును. ఈకారమునకు అకారము. ద్రోణీ-దోనీ-దొన.

* మానుస అనునదే ప్రాకృతశబ్దము. సువిభక్తి సహితరూపము మానుసో.

## 12 సూ. ఉత్ కంఠ మీన త్రిలింగ లోధ్ర ఖరక నాట్య నిల యానుగ గోనాస కల్య యోగేషు

వృ: కంఠాది ష్వంత స్యాత ఉత్ స్యాత్. గోనాసో-గొనసు. మీనో-మీను. లోద్దో-లొద్దువు. నట్టం-నట్టువు. అనుగో-అనుఁగు. పీఠాదిత్వా ద్బిందుకః. కల్లం-కల్లు. జోగో-జోగు.

తె. వృ: కంఠ-మీన-త్రిలింగ-లోధ్ర-ఖరక-నాట్య-నిలయ-అనుగ-గోనాస-కల్య- యోగ శబ్దముల చివరి అకారమునకు బదులు ఉకారము వచ్చును. గోనాస-గోనాసో-గొనసు. మీన-మీనో-మీను. లోధ్ర-లోద్దో-లొద్దువు. నాట్య-నట్టం-నట్టువు. అనుగ-అనుగో-అనుఁగు. ఇది పీఠాది గణములోని దగుటవలన ఇందు బిందుకము వచ్చినది. కల్య-కల్లం-కల్లు. యోగ-జోగో-జోగు.

## 13 సూ. హశ్చ స్వర్ణ కంఠయోః

వృ: ఏతయోః ఖో రత ఒద్ధ్రస్వశ్చ.

తె. వృ: స్వర్ణ-కంఠ శబ్దముల మొదటి వర్ణముమీఁది అకారమునకు బదులు ఒకారమును, దానికి హ్రస్వమును వచ్చును.

## 14 సూ. కంఠే తః

వృ: కంఠే స్త్రోః తకారః స్యాత్. కస్య గః. కంఠో- గొంతు. పీఠాదిత్వా ద్బిందు కశ్చ. సన్నం-సొన్న.

తె. వృ: కంఠ శబ్దమున సంయుక్తము(ణ్ఠ)నకు బదులు తకారము వచ్చును. కకారమునకు బదులు గకారము. ఈ శబ్దము పీఠాదిగణములోని దగుటవలన బిందుకమువచ్చి హైకాచఇత్యాది సూత్రమువలన బిందువగును. కంఠ-కంఠో-గొంతు. స్వర్ణ-సన్నం-సొన్న.

## 15 సూ. గురుః ఖరకే

వృ: ఖరకే రస్య గురురేఫః స్యాత్. ఖరకో-కఱకు.

తె. వృ: ఖరక శబ్దమున రేఫమునకు గురురేఫము (బండిఱా) వచ్చును. ఖరక-ఖరకో-కఱకు.

## 16 సూ. త్రిలింగే ఘో రుశ్చ

వృ: త్రిలింగే ఘో రిత ఉత్ స్యాత్. చకారా దాదే ర్హ్రేచ్చ.

తె. వృ: త్రిలింగ శబ్దమున ద్వితీయ వర్ణముమీఁది ఇకారమునకు బదులు ఉకారము వచ్చును. సూత్రమున చకార ముండుటవలన అది స్వరమునకు బదులు ఎకారము వచ్చును.

17 సూ. త్రిలింగే నో వా

వృ: త్రిలింగ శబ్దే లస్య నో వా స్యాత్. బిందోః ఘ్లుక్. తిలింగో-తెలుఁగు-తెనుఁగు.

తె. వృ: త్రిలింగ శబ్దమున లకారమునకు బదులు వికల్పముగా నకారము వచ్చును. బిందువునకు ఘ్లుక్ *. త్రిలింగ-తిలింగో-తెలుఁగు-తెనుఁగు.

18 సూ. హేత్ శిఖా నిలయ గణికాసు

వృ: శిఖాది ష్వితో హేత్ స్యాత్. సిక-సెక.

తె. వృ: శిఖా-నిలయ-గణికా శబ్దములలో ఇకారమునకు బదులు ఎకారము వచ్చును. శిఖా-సిక-సెక.

19 సూ. గణికాయాం నకో ర్డనౌ

వృ: గణికా శబ్దే నకారకకారయోః క్రమేణ డనౌ భవతః. గనికా-గడెన.

తె. వృ: గణికా శబ్దమున 'నికా' కు బదులు 'డన' వచ్చును. గణికా-గనికా-గడెన, గడన.

20 సూ. అనిశ చిహ్న కన్యకా నిలయ గోలక వధూనికా స్వంత్యస్య

వృ: అనిశాది ష్వంత్యస్య హలో లుక్ స్యాత్. నిలయో-నెలవు.

తె. వృ: అనిశ-చిహ్న-కన్యకా-నిలయ-గోలక-వధూనికా శబ్దముల అంత్యహల్లు లోపించును. నిలయ-నిలయో-నెలవు.

21 సూ. అనిశ పూర్ణిమయోః

వృ: ఏతయో రితోఽత్ స్యాత్. అనిసో-అనయము. పున్నిమా-పున్నమ.

తె. వృ: అనిశ-పూర్ణిమా శబ్దముల ఇకారమునకు బదులు అకారము వచ్చును. అనిశ-అనిసో-అనయము.† పూర్ణిమా-పున్నిమా-పున్నమ.

---

* ఘ్లుక్ అనుటవలన లోపము గలిగి సానునాసికోచ్చారము మిగులుటచే బిందుకము వచ్చినది.

† ఇందు 'య' వచ్చుటకు సూత్రము కానరాదు.

22 సూ. ఇత్ కన్యకా గోళక చిహ్నకేషు ఘోః

వృ: కన్యకాదిషు ఘో రత ఇత్ స్యాత్. కన్నకా–కన్నియ. గోళియము.

తె. వృ: కన్యకా-గోళక-చిహ్నక శబ్దముల ద్వితీయ వర్ణవ స్వరమునకు బదులు ఇకారము వచ్చును*కన్యకా-కన్నకా-కన్నియ. గోలకం-గోళియము.

23 సూ. స్త్రో(ః) హో నః

వృ: సంయుక్త సంబంధినో హస్య నః స్యాత్. చిన్హికం- చిన్నియ

తె. వృ: సంయుక్త మందలి హకారమునకు బదులు నః వచ్చును. చిహ్నక-చిన్హికం-చిన్నియ.

24 సూ. ఇ ద్వధూనికాయా మూతః

వృ: వధూనికాయా మూత ఇత్ స్యాత్. ధస్య దః. వధూనికా- వ

తె. వృ: వధూనికా శబ్దమున ఊకారమునకు బదులు ఇక వచ్చును. ధ కు బదులు ద. వధూనికా-వదినియ.†

25 సూ. నిశ్రేణా వంత్యస్య

వృ: నిశ్రేణి శబ్దే అంత్య స్యే తోఽత్ స్యాత్.

తె. వృ: నిశ్రేణి శబ్దమున చివరి ఇకారమునకు బదులు అక వచ్చును.

26 సూ. ఏతో నిశ్రేణే ర్హ్రః

వృ: నిశ్రేణే రేతో హ్రస్వః స్యాత్.

తె. వృ: నిశ్రేణి శబ్దమున ఏకారము హ్రస్వమగును.

27 సూ. నిశ్రేణా వత్

వృ: నిశ్రేణా శో శ్చకారోరి త్స్యాత్. నిశేని – నిచ్చెన. ప్రాకృతభ ద్విత్కృతేఽపి సంయుక్త పూర్వస్య హ్రస్వత్వమ్.

తె. వృ: నిశ్రేణి శబ్దమున శవర్ణమునకు బదులు చకారము

---

* ఇక్కడ క కారమునకు య కారము వచ్చుటకు సూత్రము కానరాదు

† కాకు యా వచ్చినది.

వచ్చును. అది రేఫానుబంధము గలది. అందువలన ద్వితీయము ద్విత్వమగును. నిశ్రేణి - నిశేని - నిచ్చెన. ప్రాకృతభవమగుటవలన వికృతిలోఁ గూడ సంయుక్తపూర్వము హ్రస్వముగా నుండుట గమనించదగును. (?)

28 సూ. ఓత్స్రవణే వేన ఖోః

వృ: శ్రవణ శబ్దే వేన సహ ఖో రత ఓత్ స్యాత్. సవనం - సొన.

తె. వృ: శ్రవణ శబ్దమున సాచ్కమగు వకారమునకును ప్రథమ వర్ణముమీఁది అకారమునకును బదులు ఓకారము వచ్చును. శ్రవణ - సవనం - సొన. ఇందు ఓకారమునకు హ్రస్వము.

29 సూ. ఏన్మర్దలే ఖోః

వృ: మర్దల శబ్దే ఖో రత ఏద్ధ్రస్వశ్చ. మద్దలో - మద్దెల.

తె. వృ: మర్దల శబ్దమున ద్వితీయ వర్ణముమీఁది అకారమునకు ఏకారమును, దానికి హ్రస్వమును వచ్చును. మర్దల - మద్దలో - మద్దెల.

30 సూ. అతో ముక్తాపుటస్య

వృ: ముక్తాపుట శబ్దే అత ఏద్ధ్రస్వశ్చ. ముత్తాపుటో - ముత్తెపుటము.

తె. వృ: ముక్తాపుట శబ్దమున అకారమునకు బదులు ఏకారమును దానికి హ్రస్వమును వచ్చును. ముక్తాపుట - ముత్తాపుటో - ముత్తెపుటము.

31 సూ. గుణే హో దుతః

వృ: గుణ శబ్దే ఉత ఓత్ స్యాత్. గునో - గొనము.

తె. వృ: గుణశబ్దమున ఉకారమునకు బదులు ఒకారము వచ్చును. గుణ - గునో - గొనము.

32 సూ. యౌవ నాందోలయో రత్

వృ: యౌవనాందోలయో రోత అత్ స్యాత్. జొవ్వనం - జవ్వనము. అందోలో - అందలము.

తె. వృ: యౌవన - ఆందోల శబ్దముల ఓకారమునకు బదులు అకారము వచ్చును. యౌవన - జొవ్వనం - జవ్వనము. ఆందోల - అందోలో - అందలము.

33 సూ. చతుర్థీ చతుర్దంతినో స్తః

వృ: ఏతయో స్తకారస్య లుక్ స్యాత్. చతుదంతి – సంయుక్తస్య న లుక్.

తె. వృ: చతుర్థీ – చతుర్దంతి శబ్దములలోని తకారమునకు వచ్చును. చతుర్దంతి – చతుద్దంతి – చవుదంతి. సంయుక్తము లోని త లోపింపదు. (ఇక్కడ ంతి=న్తి అని సంయుక్తము.)

34 సూ. ఉపరి లుక్ చతుర్థీ మాణిక్యయోః

వృ: ఏతయో స్తో రుపరివర్ణస్య లుక్ స్యాత్. చతుర్థీ – మానిక్కం – మానికము.

తె. వృ: చతుర్థీ – మాణిక్య శబ్దములలోని సంయుక్తవ వర్ణమునకు లోపము వచ్చును. చతుర్థీ – చతుర్థీ – చవుతి. మా మానిక్కం – మానికము.

35 సూ. సవితరి వః

వృ: సవితృ శబ్దే వకారస్య లుక్ స్యాత్. సవితా – సయిత.

తె. వృ: సవితృ శబ్దమున వకారమునకు లోపము వ సవితృ – సవితా – సయిత.

36 సూ. స్వామిన్యాం ఘోః

వృ: స్వామినీ శబ్దే ఘోః సాచ్కస్య లుక్ స్యాత్. సామిని – సాని

తె. వృ: స్వామినీ శబ్దమున అచ్చుతోఁగూడిన ద్వితీయ వర్ణ లోపము వచ్చును. స్వామినీ – సామిని – సాని.

37 సూ. చః ఖో ర్లక్షణే

వృ: లక్షణే స్తోః ఖస్య చః స్యాత్. లఖ్ఖన – లచ్చన.

తె. వృ: లక్షణ శబ్దమున ఖకార ద్విత్వమునకు బదులు ద్విత్వము వచ్చును. లక్ష్మణ – లఖ్ఖన – లచ్చన.

38 సూ. చో శ్చణక చూర్ణ నారాచేషు సః

వృ: చణకాదిషు చః సః స్యాత్. చనకో – సనగ. చున్నో – సున్న నారాచో – నారసము.

తె. వృ: చణక - చూర్ణ - నారాచ శబ్దములలోని చకారమునకు బదులు సకారము వచ్చును. చణక - చనకో - సనగ. చూర్ణ - చున్నో - సున్నము. నారాచ - నారాచో - నారసము.*

39 సూ. అంగార నాళ ప్రసాధ నాకాశ కర్ణాట పర్యాణ విజ్ఞాపనేషు హ్రః

వృ: అంగారాది ష్వాతో హ్రః స్యాత్. ఇంగాలో - ఇంగలము. పసాదనం - పసదనము. ఆకాసం - ఆకసము. కన్నాడో - కన్నడము.

తె. వృ: అంగార - నాళ - ప్రసాధన - ఆకాశ - కర్ణాట - పర్యాణ- విజ్ఞాపన శబ్దములందు ఆకారమునకు హ్రస్వము వచ్చును. అంగార - ఇంగాలో - ఇంగలము. ప్రసాధన - పసాదనం - పసదనము. ఆకాశ - ఆకాసం - ఆకసము. కర్ణాట - కన్నాడో - కన్నడము.

40 సూ. లో నాళే రః

వృ: నాళ శబ్దే లస్య రః స్యాత్. నాళం - నరము.

తె. వృ: నాళ శబ్దమున లకారమునకు బదులు రేఫము వచ్చును. నాళ - నాళం - నరము.

41 సూ. పున్నాగ పర్యాణ విజ్ఞాపనేషు సాచ్కస్య

వృ: పున్నాగాదిషు సాచ్కస్యాంత్యహాలో లుక్ స్యాత్. పున్నాగో-పొన్న. పల్లానం-పల్లము. విన్నాపనం-విన్నపము.

తె. వృ: పున్నాగ-పర్యాణ-విజ్ఞాపన శబ్దములలో అచ్చుతోఁగూడిన తుదిహల్లునకు లోపము వచ్చును. పున్నాగ-పున్నాగో-పొన్న. పల్యాణ- పల్లానం-పల్లము. విజ్ఞాపనం-విన్నాపనం-విన్నపము.

---

* రాఁకు హ్రస్వము.

## చూళికా పైశాచీభవాః

అథ చూలికా పైశాచీభవాః.

ఇంక చూళికాపైశాచీ భవములు.

### 1 సూ. చూలికాపైశాచ్యాం ఫో రత ఇద్బృంద పాదకయోః

వృ: ఇతః పర మాపాద పరిసమాప్తి చూళికా పైశాచ్యాం కార్యమ్. తత్ర బృంద పాదకయోః ఫో రత ఇత్ స్యాత్. పాతకో-పాతికె.

తె. వృ: ఇంతటి నుండి పాదాంతము వఱకును చూళికాపైశాచీ ప్రకృతులలో కార్యములు విధింపఁబడును. ఇందు బృంద-పాదక శబ్దముల ద్వితీయ వర్ణముమీది అకారమునకు బదులు ఇకారము వచ్చును. పాదక-పాతక-పాతిక.

### 2 సూ. బృంద బుధయో రి ద్దేతౌ

వృ: ఏతయో రుతః క్రమా దికారో హేచ్చ భవతి.

తె. వృ: బృంద-బుధ శబ్దముల ఉకారమునకు వరుసగా ఇకారమును, ఎకారమును వచ్చును.

### 3 సూ. బృందే డః

వృ: బృందేస్తోర్దస్య డః స్యాత్. పుందో-పిండు. స్వర్ణ బృంద బ్రధ్నానా ముకారాంతత్వేనైవ ప్రయోగః.

తె. వృ: బృంద శబ్దమున సంయుక్తమందలి దకారమునకు బదులు డకారము వచ్చును. బృంద-పుందో-పిండు. స్వర్ణ-బృంద-బ్రధ్న శబ్దములు ఉకారాంతములుగనే ప్రయోగింపఁబడును.

### 4 సూ. బుధ విజయయో ర్ద్విత్వమ్

వృ: ఏతయో రనాదే ర్వర్ణస్య ద్విత్వం స్యాత్. పుద్దో-పెద్ద.

తె. వృ: బుద్ధ-విజయ శబ్దముల యనాదివర్ణమునకు ద్విత్వము వచ్చును. బుధ-పుద్దో-పెద్ద.

### 5 సూ. ఇతో హే న్మృగ వృద్ధ విజయేషు

వృ: మృగాది ష్వితో హేత్ స్యాత్. మీకో-మెకము. బిద్దో-పెద్ద.

తె. వృ: మృగ-వృద్ధ-విజయ శబ్దముల ఇకారమునకు బదులు ఎకారము వచ్చును. వృద్ధ-బిద్ధో-పెద్ద.

6 సూ. లు గ్విజయ ఖిదుర బాడబే ష్వంత్యస్య సాఝ్జలః

వృ: విజయాది ష్వంత్యస్య సాఝ్జలో లుక్ స్యాత్. విచయో-వెచ్చేము. విజయోఽత్ర వ్యయ పర్యాయో నిపాత్యః.

తె. వృ: విజయ-ఖిదుర-బాడబ శబ్దములలో చివరి అచ్చుతోఁగూడిన హల్లు లోపించును. విజయ-విచయ-వెచ్చేము. ఇందు విజయ శబ్దము వ్యయ పర్యాయముగా నిపతింపఁదగినది.

7 సూ. డో ఖిదురే ఘోః

వృ: ఖిదురే ఘోర్హలో డః స్యాత్. ఖిదురో-పిడుగు.

తె. వృ: ఖిదుర శబ్దమున రెండవ హల్లునకు బదులు డకారము వచ్చును. ఖిదుర-ఖిదురో-పిడుగు.

8 సూ. గురు ర్బాడబేఽః

వృ: బాడబశబ్దే ఘో హ్లో గురురేఫః స్యాత్. పాటపో-పాఱఁడు.

తె. వృ: బాడబ శబ్దమున ద్వితీయ హల్లునకు బదులు శకటరేఫము వచ్చును. బాడబ-పాటప-పాఱఁడు.

9 సూ. బ్రధ్న బలి స్వర్ణేషు ఖో హ్లోత్

వృ: బ్రధ్నాదిషు ఖో రతో హలోత్ స్యాత్. పలి-పొలి. పన్నో-పొన్ను.

తె. వృ: బ్రధ్న-బలి-స్వర్ణ శబ్దములందు ప్రథమవర్ణముమీఁది అకారమునకు ఒకారమగును. బలి-పలి-పొలి. స్వర్ణ-పన్నో-పొన్ను.

10 సూ. న లుగ్రః స్తోః

వృ: సంస్కృత దశాయాం సంయోగసంబంధినో రేఫస్య లుఙ్న భవతి. పద్దో-ప్రొద్దు.

తె.వృ: సంస్కృత దశయందలి రేఫమునకు వైకృతమున లోపము రాదు. బ్రధ్న-పద్దో-ప్రొద్దు.

11 సూ. అనః ప్రియంగౌ

వృ: ప్రియంగు శబ్దే ఉతః అనః స్యాత్. ప్రియంకు-ప్రియంకనము.

తె. వృ: ప్రియంగు శబ్దమున ఉకారమునకు బదులు 'అన' వచ్చును. ప్రియంగు-ప్రియంకు-ప్రియంకనము.

12 సూ. ఉతోఽత్కర్బురే

వృ: కర్బుర శబ్దే ఉతోఽత్ స్యాత్. కప్పురో-కప్పర.

తె. వృ: కర్బుర శబ్దమున ఉకారమునకు బదులు అకారము వచ్చును. కర్బుర-కప్పురో-కప్పర.

13 సూ. ఊత ఓత్పూగే

వృ: పూగ శబ్దే ఊత ఓత్ స్యాత్. పీతాదిత్వా ద్బిందుకః. పూకో-పోంక.

తె. వృ: పూగ శబ్దమున ఊకారమునకు బదులు ఓకారము వచ్చును. పూగ-పూకో-పోంక.

14 సూ. పయిరు వ్రీహిః

వృ: వ్రీహి శబ్దస్య పయిరు ఇత్యాదేశః స్యాత్. వ్రీహి-పయిరు.

తె. వృ: వ్రీహి శబ్దమునకు పయిరు అని ఆదేశమగును. వ్రీహి-పయిరు.

---

## అపభ్రంశభవాః

అథ అపభ్రంశ భవాః

ఇంక అపభ్రంశ భవములు

### 1 సూ. ది బ్రాహ్మణే

వృ: బ్రాహ్మణ శబ్దే భో రతో దీర్ఘః స్యాత్.

తె. వృ: బ్రాహ్మణ శబ్దము తొలివర్ణము మీఁది అకారము దీర్ఘమగును.

### 2 సూ. బ్రాహ్మణాంచలయో రంత్యస్య సాజ్ఝలః

వృ: ఏతయో రంత్యస్య సాజ్ఝలో లుక్ స్యాత్. బంభణు-బాపఁడు తరంగాదిత్వా ద్బిందోః ల్లుక్. భస్య పత్వమ్.

తె. వృ: బ్రాహ్మణ-అంచల శబ్దముల చివరి అచ్చుతోడి హల్లునకు లోపము వచ్చును. బ్రాహ్మణ-బంభణు-బాపఁడు. తరంగాదిగణములోని శబ్దమగుటచే బిందువునకు లోపము. 'భ'కు బదులు 'ప'.

### 3 సూ. భోః సికతాంచలయో రుత్

వృ: ఏతయోః భో రత ఉత్ స్యాత్. అంచలు-అంచ.

తె. వృ: సికతా-అంచల శబ్దముల ద్వితీయ వర్ణముమీఁది అకారమునకు బదులు ఉకారము. అంచల-అంచలు-అంచు

### 4 సూ. ఊరాదే రంత్యస్య

వృ: ఊరాదే రంత్య స్యాత ఉత్ స్యాత్.

తె. వృ: ఊరాదుల చివరి అకారమునకు బదులు ఉకారము వచ్చును.

### 5 సూ. కోః ఊరే చ స్తు

వృ: ఊర శబ్దే కవర్ణస్య చో వా స్యాత్. చానం-చారు; కారు.

తె. వృ: ఊర శబ్దమున కవర్ణమునకు చకారము వికల్పముగా వచ్చును. ఊర-చానం-చారు ; కారు.

6 సూ. అబద్ధే ఖో రతో లుక్

వృ: అబద్ధ శబ్దే ఖో రతో లుక్ స్యాత్. అబద్ధు-బద్ధు.

తె. వృ: అబద్ధ శబ్దమున ఆది వర్ణముమీఁది అకారమునకు లోపము వచ్చును. అబద్ధ-అబద్ధు-బద్ధు.

7 సూ. ఘాస సుఖ వాసయో ర్హ్రః

వృ: ఏతయో రాతో హ్రః స్యాత్. ఘాసు-కసవు.

తె. వృ: ఘాస-సుఖవాస శబ్దములలోని ఆకారము హ్రస్వమగును. ఘాస-ఘాసు-కసవు.

8 సూ. సుఖవాసే హేన

వృ: సుఖవాస శబ్దే హాకారేణ సహ ఉతో హ్రోత్ స్యాత్. సుహవాసు-సొవసు.

తె. వృ: సుఖవాస శబ్దమున హాకారముతోఁ గూడిన ఉకారమునకు ఒకారము వచ్చును. సుఖవాస-సుహవాసు-సొవసు.

9 సూ. పోః పుళింద బీభత్సయో ర్వః

వృ: ఏతయోః పవర్గస్య వకారః స్యాత్.

తె. వృ: పుళింద-బీభత్స శబ్దములలోని పవర్గాక్షరములకు బదులు వకారము వచ్చును.

10 సూ. ద్విత్వం స్తన జూట బీభత్సేషు

వృ: స్తనాది ష్వచః పరస్య ద్విత్వం స్యాత్. బీభత్సు-వివ్వచ్చు.

తె. వృ: స్తన-జూట-బీభత్స శబ్దములలో అచ్చుమీఁది హల్లునకు ద్విత్వము వచ్చును. బీభత్సు-వివ్వచ్చు.

11 సూ. తోః స్తన సికతయో శ్చడౌ

వృ: ఏతయోః క్రమేణ (తవర్గాక్షరస్య) చకార డకారౌ భవతః. థణు-చన్ను. ప్రాయోగ్రహణాత్ ణస్య నః.

తె. వృ: స్తన-సికతా శబ్దములలోని తవర్గాక్షరములకు క్రమముగా చకార, డకారములు వచ్చును. స్తన-థణు-చన్ను. ప్రాయోగ్రహణము వలన ణకారమునకు నకారము.

## 12 సూ. శోః శ్రుత సికతయో శ్చః

వృ: ఏతయోః శో శ్చకారః స్యాత్.

తె. వృ: శ్రుత-సికతా శబ్దములలోని శువర్ణములకు (శషసలకు) బదులు చకారము వచ్చును.

## 13 సూ. అ త్పుళింద సికతయోః

వృ: ఏతయో రితోఽత్ స్యాత్.

తె. వృ: పుళింద - సికతా శబ్దములలోని ఇకారమునకు బదులు అకారము వచ్చును.

## 14 సూ. హిక్కా- సికతయో రుత్

వృ: ఏతయో రాత ఉత్ స్యాత్. సిగదా-చేగుదు. ఘో స్సికతేత్యాదినా ఘోరత ఉత్.

తె. వృ: హిక్కా-సికతా శబ్దముల ఆకారమునకు ఉకారమగును. సికతా-సిగదా-చేగుదు. 'ఘోస్సికవా' (3 వ సూ.) ఇయ్యాది సూత్రముచే రెండవ యక్షరము మీది అకారమునకు ఉకారము.

## 15 సూ. హిక్కా-యాం లుక్

వృ: హిక్కా-యాం హకారస్య లుక్. హిక్కా-హిక్కా-ఎక్కు.

తె. వృ: హిక్కా- శబ్దమున హకారమునకు లోపము వచ్చును. హిక్కా-ఎక్కు.

## 16 సూ. ఇదేతౌ ఖర్జూ మాలూరయోః

వృ: ఏతయో రూతః క్రమాత్ ఇదేతౌ భవతః ఖర్జూ-గజ్జి.

తె. వృ: ఖర్జూ శబ్దములోని ఊకారమునకు బదులు ఇకారమును, మాలూర శబ్దములోని ఊకారమునకు బదులు ఏకారమును వచ్చును. ఖర్జూ-ఖర్జూ-గజ్జి.

## 17 సూ. లరో ర్మాలూరే రడౌ

వృ: మాలూర శబ్దే లకారరేఫయోః క్రమేణ రడౌ భవతః. మాళూరు - మారేడు.

తె. వృ: మాలూర శబ్దమున లకారరేఫములకు బదులు క్రమముగా రడ లగును. మాలూర - మాళూరు-మారేడు.

18 సూ. ఇజః ఖురే

వృ: ఖురేఽన్త్య స్యోతః ఇజ ఇతి స్యాత్. ఖోరు - గోరిజే. అపభ్రంశే ప్రాయోఽపభ్రంశ ఇత్యాదినా ఉకార స్యోకారః. హ్రస్వః ప్రాయోగికః.

తె. వృ: ఖుర శబ్దమున చివరి ఉకారమునకు బదులు 'ఇజ' వచ్చును. ఖుర - ఖోరు - గోరిజే. అపభ్రంశ ప్రకరణమున 'ప్రాయోఽపభ్రంశే'* ఇత్యాది సూత్రము వలన ఉకారమునకు ఓకారము. హ్రస్వము ప్రయోగమున వచ్చినది.

19 సూ. ఇ ద్యమలే మ్లోః

వృ: యమల శబ్దే మకార లకారయో రతఇత్ స్యాత్. జమలు - జెమిలి.

తె. వృ: యమల శబ్దమున మకార లకారముల అకారమునకు ఇకారము వచ్చును. యమల - జమలు - జెమిలి.

20 సూ. ఇతో హే త్కోకిలే

వృ: కోకిల శబ్దే ఇతో హేత్ స్యాత్. కొగిలు - కోగెల.

తె. వృ: కోకిల శబ్దమున ఇకారమునకు బదులు ఎకారము వచ్చును. కోకిల - కొగిలు - కోగెల.

21 సూ. జూట జలూకయో రూతో హ్రః

వృ: ఏతయో రూతో హ్రస్వః స్యాత్. జూటు - జెట్టు. జళూగో-జెలుగు.

తె. వృ: జూట - జలూకా శబ్దములలోని ఊకారము హ్రస్వమగును. జూట - జూటు - జెట్టు. జలూకా - జళూగో - జలుగు.

22 సూ. చో శ్చామరే సః

వృ: చామరే చవర్గస్య సః స్యాత్. చంవరు - సంవరము. బిందుకా ద్వో మః (?). సవరము.

తె. వృ: చామర శబ్దమున చవర్గాక్షరమునకు బదులు సకారము వచ్చును. చామర - చంవరు - సంవరము. ఇచట బిందుకము మీది మకారమునకు వకారము (?). సవరము.

---

*ప్రాయోఽపభ్రంశే ఽచోఽచ్- వాల్మీ. సూ. 3. 3. 1. వృ. అపభ్రంశే అచః స్థానే ప్రాయః అచ్ అన్యో భవతి.

23 సూ. ఉతః శ్రుత వకుళ ముకుళ పుళిందేషు

వృ: శ్రుతాది షూతోఽత్ స్యాత్. సుదు – చదువు.

తె. వృ: శ్రుత – వకుళ –ముకుళ – పుళింద శబ్దములలోని ఉకార మునకు బదులు అకారము వచ్చును. శ్రుత – సుదు – చేదువు.

24 సూ. వస్తి వకుళ పలాలేషు హోత్

వృ: వస్త్యాదిషు ఖో రతో హోత్ స్యాత్.

తె. వృ: వస్తి – వకుళ – పలాల శబ్దములలోని ఆదివర్ణము మీది అకారమునకు బదులు ఒకారము వచ్చును.

25 సూ. వో వస్తి వకుళయోః పః

వృ: ఏతయో ర్వస్య పః స్యాత్. వద్ధి – పొత్తి.

తె.వృ: వస్తి – వకుళ శబ్దములలోని వకారమునకు బదులు పకారము వచ్చును. వస్తి – వద్ధి – పొత్తి.

26 సూ. ళ స్తాళ వకుళ ముకుళేషు డః

వృ: తాళాదిషు ళస్య డః స్యాత్. తాళు – తాడు. పగుళు – పొగడ.

తె. వృ: తాళ – వకుళ – ముకుళ శబ్దములలోని ళకారమునకు బదులు డకారము వచ్చును. తాళ – తాళు – తాడు. వకుళ – పగుళు – పొగడ.

27 సూ. ఖో ర్హో న్ముకుళే

వృ: ముకుళ శబ్దే ఖో రుతో హోత్ స్యాత్. ముగుళు – మొగడ. పుళిందు – వళందు. అత్ పుళిందేత్యాదినా ఇతోఽత్. ఉతః శ్రుతేత్యాదినా ఉతోఽత్. పస్య వత్వమ్.

తె. వృ: ముకుళశబ్దమున ఆదివర్ణముమీఁది ఉకారమునకు బదులు ఒకారము వచ్చును. ముకుళ – ముగుళు – మొగడ. పుళింద – పుళిందు – వళందు. ఇందు అత్ పుళిందేత్యాది ( 13వ) సూత్రము వలన ఇకారమునకు బదులు అకారము. ఉతః శ్రుతేత్యాది ( 23వ) సూత్రము వలన ఉకారము నకు బదులు అకారము. పకారమునకు బదులు వకారము.

## 28 సూ. ఆతో లుక్ పలాలే

వృ: పలాల శబ్దే ఆతో లుక్ స్యాత్. పలాలు-పొల్లు.

తె. వృ: పలాల శబ్దమున ఆకారము లోపించును. పలాల - పలాలు - పొల్లు.

## 29 సూ. మాకం దోద్వేగయో ర్మావి బెదడూ

వృ: ఏతయో రేతా వాదేశౌ భవతః. మాగందు - మావి. ఇబ్బెగు-బెదడు.

తె. వృ: మాకంద - ఉద్వేగ శబ్దములకు మావి - బెదడు శబ్దములాదేశములగును. మాకంద - మాగందు - మావి. ఉద్వేగ - ఉబ్బెగు - బెదడు.

---

## వైకృత విశేషాః

అథ వైకృత విశేషాః.

ఇంక వైకృత విశేషములు

### 1 సూ. గ్రామ మనుష్య బిరుదేషు బహుళమ్

వృ: గ్రామాదిషు బహుళ మాదేశా యథాదర్శనం భవంతి. నావాడు. బాచినేడు. మూరురాయరగండఁడు.

తె. వృ: గ్రామ-మనుష్య-బిరుదముల విషయమున వ్యవహారమును బట్టి (యథాదర్శనముగా) ఆదేశములు వచ్చును. నావాడు. బాచినేఁడు. మూరురాయరగండఁడు.

### 2 సూ. లు గుంగర స్యాతః

వృ: ఉంగర శబ్దసంబంధినః ప్రథమస్యాతో బహుళం లుక్ స్యాత్. ఉంగ్రము-ఉంగరము.

తె. వృ: ఉంగర శబ్దమున మొదటి అకారమునకు లోపము బహుళము. ఉంగ్రము-ఉంగరము.

### 3 సూ. తాంబూలాత్

వృ: తాంబూలాదేశే ఉతోఽత్స్యాద్వా. తమ్ములము-తమ్మలము.

తె. వృ: తాంబూల శబ్దాదేశమున ఉకారమునకు వికల్పముగా అకారము వచ్చును. తమ్ములము-తమ్మలము.

### 4 సూ. లు గితః కన్యకాదేస్తు

వృ: కన్యకాదే రితో వా లుక్ స్యాత్. కన్నియ-కన్య. "ఇయో హేత్". కన్నె. మల్లియ-మల్ల్య-మల్లె. వీడియము-వీడ్యము-వీడెము.

తె. వృ: కన్యకాది శబ్దముల ఇకారము వికల్పముగా లోపించును. కన్నియ-కన్య. "ఇయోహేత్" (స్వాది-అజం 38 సూ.) కన్నె. మల్లియ-మల్ల్య-మల్లె. వీడియము-వీడ్యము-వీడెము.

### 5 సూ. వా వీటి కాయాం హః

వృ: వీటికాయా మీతో వా హ్రస్వః స్యాత్. వీడియము - విడియము-విడ్యము-విడెము.

తె. వృ: వీటికా శబ్దాదేశమున ఈకారము వికల్పముగా హ్రస్వ మగును. వీడియము-విడియము-విడ్యము-విడెము.

6 సూ. ఉతః కర్పూరస్య లుక్

వృ: కర్పూరాదేశ సంబంధిన ఉతో వా లుక్ స్యాత్. కప్రము-కప్పురము.

తె. వృ: కర్పూరాదేశ శబ్దమందలి ఉకారము వికల్పముగా లోపించును. కప్రము-కప్పురము.

7 సూ. ఉపరి లు క్కర్పూరాదే స్తో స్తు

వృ: కర్పూరాదే స్సంయుక్త సంబంధిన ఉపర్యక్షరస్య వా లుక్ స్యాత్. కపురము. ఒకండు. తమలము. గయాళి. ఒయారి. ఎవరు. ఎపుడు. అపుడు. ఇపుడు.

తె. వృ: కర్పూరాద్యాదేశాములలోని సయుక్తముల మీఁదియక్ష రములు లోపించుట కలదు. కపురము-కప్పురము. ఒకండు - ఒక్కండు. తమలము-తమ్మలము. గయాళి-గయ్యాళి. ఒయారి-ఒయ్యారి. ఎవరు-ఎవ్వరు. ఎపుడు-ఎప్పుడు. అపుడు-అప్పుడు. ఇపుడు-ఇప్పుడు.

8 సూ. పో దః

వృ: దాప్రత్యయ సంబంధినః పకార స్యోతో వా లుక్ స్యాత్. ఎప్డు-ఎపుడు. అప్డు-అపుడు. ఇప్డు-ఇపుడు.

తె. వృ: దాప్రత్యయమునకు సంబంధించిన శబ్దముల పకారము మీఁది ఉకారము వికల్పముగా లోపించును. ఎప్డు-ఎపుడు. అప్డు-అపుడు. ఇప్డు-ఇపుడు.

9 సూ. నలడాదేః

వృ: నలడాదే ర్వర్ణ స్యోతో వా లుక్ స్యాత్. పున్క-పునుక. చిల్క-చిలుక. కడ్పు-కడుపు. ఆదిగ్రహణాత్ చెర్వు-చెరువు. చెయ్వులు-చెయువులు. క్వచి దకారేకారయో రపి వా లుక్. పంటి-పనటి. కోర్కె-కోరికె. ఎనుగు ఇత్యాదా వప్రవృత్తిః.

శ్లో. ఛాయా సంబంధ సాదృశ్య శబ్దా వికృతి సంభవాః।
గ్రామ్యా దేశ్యా స్తథా జాత్యాః కల్పనీయా యథాయథమ్॥

తమ్మికంటి, పూవిలుతుఁడు, బాసవాల్దొర ఇత్యాదయః ఛాయా కల్పనీయాః- రవణ, వేసవి, బోనము ఇత్యాదయః సంబంధేన సంచారణీయాః. కొమ్మ ,మోవి ఇత్యాదయః సాదృశ్యేన ప్రయోక్తవ్యాః. అపుష్ట క్లిష్టాప్రసిద్ధా

దయో గ్రామ్యాః. తేచ ఇరుసుక్కాలి, మామమామ, చక్కెరవిల్తుఁడు ఇత్యాదయః. సకలజనసముదాయ సమాశ్రయో దేశః. తత్రభవా దేశ్యాః: నెనరు, నెంజలి, మక్కువ ఇత్యాదయః. హృదయంగమస్య భావప్రకాశికా జాతిః. తత్రభవా జాత్యాః: కమ్మ; జాగు, సూడిగము ఇత్యాదయః. అన్యేచ యథాసంభవ మూహనీయాః.

తె. వృ: నలడాది వర్ణముల ఉకారమునకు వికల్పముగా లోపము వచ్చును. పున్క-పునుక. చిల్క-చిలుక. కడ్పు-కడుపు. ఆది గ్రహణమువలన చెర్వు-చెరువు. చెయ్వులు-చెయువులు. ఒకానొక యెడ అకారమునకును, ఇకారమునకును గూడ వికల్పముగా లోపము గలుగును. పంటి-పనటి. కోర్కె-కోరికె. ఎనుగు ఇత్యాదులందు ఈవిధి ప్రవర్తించదు.

సంస్కృత సమాసాదుల ఛాయను బట్టియు, సంస్కృత శబ్దముల సంబంధమును బట్టియు, సంస్కృత శబ్దముల సాదృశ్యమును బట్టియు వైకృత శబ్దములు ప్రయోగింపఁదగును. గ్రామ్యములు, దేశ్యములు, జాత్యములు యథాయథముగా కల్పించుకొనవలయును. తమ్మికంటి, పూవిలుతుఁడు, బాసవాల్దొర మొ. చాయనుబట్టి కల్పించుకొనఁదగినవి. రవణ, వేసవి, బోనము మొ. సంబంధమునుబట్టి ఏర్పఱచుకొనఁదగినవి, కొమ్మ, మోవి మొ. సాదృశ్యమునుబట్టి ప్రయోగింపఁదగినవి. అపుష్టార్థములు, క్లిష్టార్థములు, అప్రసిద్ధార్థములు మొ. గ్రామ్యములు: ఇరుముక్కాలి, మామమామ, చక్కెరవిల్తుఁడు మొదలగున విట్టివి. సకల జన సముదాయములకు ఆశ్రయమైనది దేశము. దేశములో వ్యవహారములోనుండు నెనరు, నెంజిలి, మక్కువ మొ.నవి దేశ్యములు. హృదయంగమముగా భావమును వెల్లడించు శబ్దములు జాత్యములు. కమ్మ, జాగు, సూడిగము మొదలగు పదము లిట్టివి. తక్కినవి యథాసంభవముగా నూహింపఁదగినవి.

ఇతి శ్రీమద్బాలగోపాల కరుణా కటాక్ష
సంప్రాప్త విలసదష్టభాషా కవిత్వ సామ్రాజ్యపట్టభద్రేణ
మంచెళ్లవంశ కలశార్ణవ పౌర్ణమాసీ చంద్రేణ
హిమవన్నగ సేతుమధ్య మహీవలయ విరాజమాన
నానావిధ విద్యా ప్రవీణవిద్వత్కవి వితాన సంస్తూయమాన
సాధుపండిత మణినా వాసుదేవ కవినా
విరచితాయాం వైకృత చంద్రికాయాం
సుబంతవిభాగః సమాప్తః.

---

## 2. తిజంత విభాగః

సీతా సతీ కుచాగ్రస్థ
ప్రాలంబ ఘుటికా కృతిమ్
కచ్చోత్తమాంగ ముత్తేంద్ర
వ్యంజనం సముపాస్మహే.

వృ: పుష (=పుష్టౌ)

తె. వృ: పుష = పోషించుట.

### 1 సూ. ఉపకృతిః పుష్యాదిః

వృ: పుష్యాది ర్ధాతు రుపకృతి సంజ్ఞః స్యాత్.

తె. వృ: పుష వంటి ధాతువు ఉపకృతి సంజ్ఞగలది.*

### 2 సూ. తి జ్యుపకృతే ర్ఘఞ్

వృ: ఉపకృతేః ఘఞ్ ప్రత్యయః స్యాత్ తిజి పరే.

తె. వృ: ఉపకృతి ధాతువునకు తిజ్ ప్రత్యయములు† పరమగునప్పుడు ఘఞ్ ప్రత్యయము వచ్చును.

### 3 సూ. అదేశ్యా ద్ధాతో రించేక్

వృ: దేశ్య వర్జితా ద్ధాతో రించేక్ స్యాత్ తిజి. కిత్త్వా దంత్యావయవత్వమ్.

తె. వృ: దేశ్యముకాని ధాతువునకు తిజ్ ప్రత్యయము పరమగునప్పుడు 'ఇంచేక్' అను ఆగమము చేరును. ఇంచేక్‌లో కకారము ఇత్తు, "ఇంచే" మాత్రమే ఆగమము. "ఆద్యన్తౌ టకితౌ"- (పా.1.1.46) అను ఆద్యవ్యాకరణ సూత్రమునుబట్టి కకారమిత్తుగాఁగల ఈ యాగమము ధాతువుచివర చేరును.

---

* ఉపకృతి ధాతువులు కృదంత ప్రాతిపదికల రూపమున వైకృత ప్రక్రియలోఁ ప్రవేశించును.

† 

| | | |
|---|---|---|
| తిప్. తస్. ఝి ప్ర. పురు. | త ఆతామ్ ఝ | ఇవి తిజ్ ప్రత్యయములు. |
| సిప్. థస్ థ మ. పురు. | థాస్ ఆథామ్ ధ్వమ్ | |
| మిప్ వస్ మస్ ఉ. పురు. | ఇట్ వహి మహిజ్ | |

## 4 సూ. వర్త్తమానే చుః

వృ: సర్వస్మా ద్ధాతోః వర్త మానార్థే చుః స్యాత్.

తె. వృ: ప్రతిధాతువునకును వర్త్తమానార్థమున 'చు' వర్ణకము చేరును.

## 5 సూ. ట చు గ్రహి షూత్

వృ: ట చువర్ణ కయో గ్గృహ్ణాతా చ పరేఽంత్యవర్ణ స్యోత్ స్యాత్.

తె. వృ: ట, చు వర్ణకములును, గ్రహిధాత్వాదేశమగు 'కొను' అనునదియు చేరునప్పుడు చివరివర్ణమునకు ఉకారము వచ్చును.

## 6 సూ. అతాలవ్యస్య

వృ: తాలవ్యాద్రహితస్య చుగించుక్సంబంధిన శ్చస్య పో వాస్యాత్ పోషింపుచు + తిప్ ఇతి స్థితే.

తె. వృ: తాలవ్యాచ్చు లేని చుక్, ఇంచుక్ సంబంధియైన చకారమునకు పకారము వికల్పముగా వచ్చును. పోషింపుచు + తిప్ అనియుండఁగా-

## 7 సూ. ఉండో వసేః

వృ: వసి ధాతోః ఉండ ఇత్యాదేశః స్యాత్.

తె. వృ: 'వస' ధాతువునకు 'ఉండ' అని ఆదేశము వచ్చును.

## 8 సూ. నా వసతి ర్వర్త్తమానస్య

వృ: వసతిధాత్వాదేశో నవర్ణకేనసహ వర్ణమానార్థవిహిత ధాతో రనుబంధో భవతి.

తె. వృ: వస ధాత్వాదేశము (ఉండ) న - వర్ణకముతోఁగూడి వర్త్తమానార్థ విహితమైన ధాతువునకు అనుబంధ మగును. ('ఉన్న' అనుబంధము.) పోషింపుచు + ఉన్న.

## 9 సూ. నస్య దిః

వృ: అనుబంధ సంబంధినో నవర్ణకస్య దీర్ఘః స్యాత్ తిజి.

తె. వృ: తిజ్ పరమగునప్పుడు అనుబంధమునకుఁజెందిన నవర్ణకమునకు దీర్ఘమువచ్చును. పోషింపుచు + ఉన్నా.

### 10 సూ. తద్యుష్మదస్మదాం సుస్ ప్రథమాదేః

వృ: ధాతోః ప్రథమపురుషైకవచనాదే ర్యథాక్రమం తచ్ఛబ్ద యుష్మ చ్ఛబ్దాస్మచ్ఛబ్దేభ్యో విహితాః సుసాదేశాః భవంతి. తేన తిప్తయోః స్థానే డు జాదిః ఝిఝయోః స్థానే ర్వాదిః.సిప్థాసో ర్వుః. థధ్వమో రుః. మిబిటో ర్నుః. మస్మహిజో ర్ముః. వాఁడు పోషింపుచేన్నాఁడు. వారు పోషింపుచేన్నారు. నీవు పోషింపుచున్నావు. మీరు పోషింపుచేన్నారు. నేను పోషింపుచేన్నాను. మేము పోషింపుచేన్నాము. అమహత్కర్తృ కత్వేతు-.

తె. వృ: ధాతువునకు ప్రథమపురుషైకవచనాదులకు వరుసగా తద్-యుష్మద్-అస్మద్ శబ్దములకుఁ జెప్పఁబడిన ప్రథమావిభక్తి యాదేశములు చేరును. కనుక 'తిప్-త' లస్థానమున డుజాదులు, 'ఝిఝ' ల స్థానమున 'రు' మొదలగునవి, 'సిప్-థాస్' ల స్థానమున 'వు', 'థ-ధ్వమ్' ల స్థానమున 'రు'; 'మిప్-ఇట్' ల స్థానమున 'ను', 'మస్-మహిజ్' లస్థానమున 'ము' ఆదేశమగును. వాఁడు పోషింపుచేన్నాఁడు - వారు పోషింపు చేన్నారు. నీవు పోషింపుచున్నావు-మీరు పోషింపుచేన్నారు. నేను పోషింపుచేన్నాను - మేము పోషింపుచేన్నాము. కర్త అమహద్వాచక మయినప్పుడయితే-

### 11 సూ. న దివ్యోః

వృ: నవర్ణకస్య దీర్ఘో న స్యాత్ ది,వి ఇత్యేతయోః పరయోః. అది పోషింపు చేన్నది. అవి పోషింపుచేన్నవి. స్త్రీ కర్తృకేతు ఆమె పోషింపుచేన్నది - వారు పోషింపుచేన్నారు ఇత్యాది,

తె. వృ: 'ది,వి' అనునవి పరమగునపుడు నవర్ణకమునకు దీర్ఘము రాదు. అది పోషింపుచేన్నది-అవి పోషింపుచేన్నవి. కర్త స్త్రీయయినచో ఆమె పోషింపుచేన్నది - వారు పోషింపుచేన్నారు మొ.

### 12 సూ. అస్తేః కలగః

వృ: అస ధాతోః కలగ ఇత్యాదేశః స్యాత్.

తె. వృ: అస ధాతువునకు కలగ అను ఆదేశము వచ్చును.

### 13 సూ. అస్తి ర్భవిష్యతః

వృ: అస ధాత్వాదేశో నవర్ణకేన సహ భవిష్యదర్థ విహిత ధాత్వనుబంధః స్యాత్.

తె. వృ: అస్త ధాత్వాదేశమగు కలగ భవిష్యదర్థమునఁ జెప్పఁబడిన ధాత్వనుబంధమగును.

## 14 సూ. తుమున్న వసిగ్రహేఽనుబంధే

వృ: వసి గ్రహి వర్జితేఽనుబంధే పరే తుమున్ ప్రత్యయః స్యాత్.

తె. వృ: వసి (ఉండ), గ్రహి (కొను) అను అనుబంధములు కాక తక్కిన యనుబంధములు పరమగునప్పుడు తుమున్ ప్రత్యయము వచ్చును.

## 15 సూ. తుమున్ వ్యతిరేకయో రత్

వృ: తుమున్ ప్రత్యయస్య, వ్యతిరేకార్థస్యచ అత్ స్యాత్. చస్య పః. తుమున్ సంబద్ధ ప్రతిపాదకత్వాత్ స్ద్రుతత్వమ్. పోషింపఁగలఁడు - పోషింపఁగలరు. పోషింపఁగలవు - పోషింపగలరు. పోషింపఁగలను - పోషింపఁగలము.

తె. వృ: తుమున్ ప్రత్యయమునకును, వ్యతిరేకార్థమునకును వెనుక అత్ చేరును. చకారమునకుబదులు పకారము. తుమున్ సంబంధము గల దగుటచే స్ద్రుతత్వము. పోషింపఁగలడు - పోషింపఁగలరు. పోషింపఁగలవు-పోషింపఁగలరు. పోషింపఁగలను - పోషింపఁగలము.

## 16 సూ. దోర్భ్య రు వ్యతిరేక్వవిష్యతోః

వృ: వ్యతిరేకార్థే భవిష్యదర్థే చ విహితయోః ది, వి ఇత్యేతయో రికార స్యోత్ స్యాత్. పోషింపఁగలదు - పోషింపఁగలవు.

తె. వృ: వ్యతిరేకార్థమునను భవిష్యదర్థమునను జెప్పఁబడిన ది, వి యనువాని ఇకారమునకు బదులు ఉకారము వచ్చును. పోషింపఁగలదు - పోషింపఁగలవు.

## 17 సూ. అరః ప్రథమస్య హేత్.

వృ: భూతార్థే రు వర్జితస్య ప్రథమపురుషాదేశస్య హేత్ స్యాత్.

తె. వృ: భూతార్థమున రువర్జితమైన ప్రథమ పురుషాదేశమునకు ఎకారము వచ్చును.

## 18 సూ. డుజశ్చ భూతతద్ధర్మయోః

వృ: భూత తద్ధర్మయో ర్డుజో లుక్ స్యాత్ ఇతి డుజ్లోపే హేత్వ విశిష్టే-పోషించె.

తె. వృ: భూతతద్ధర్మములందు డుజ్జునకు లోపము వచ్చును. కావున డుజ్ లోపింపఁగా ఎత్వముతో గూడి - 'పోషించె' అగును.

19 సూ. భూత ఇత్

వృ: భూతార్థ విహిత వర్ణకే పరే క్రియాంత్యవర్ణస్య ఇత్ స్యాత్.

తె. వృ: భూతార్థమున విధింపఁబడిన వర్ణకము పరమగుచుండగా క్రియాంత్య వర్ణమునకు 'ఇత్' వచ్చును.

20 సూ. భూతే తిజః

వృ: భూతార్థే తిజాదేశస్య ఇత్ స్యాత్. పోషించిరి.

తె. వృ: భూతార్థమున తిజ్జున కాదేశముగా వచ్చు వర్ణకమునకు ఇకారమగును. పోషించిరి.

21 సూ. తి ర్భూత స్యాప్రథమే

వృ: ప్రథమ పురుష వర్జితే తిజి పరే భూతార్థస్య తిః స్యాత్. పోషించితివి-పోషించితిరి. పోషించితిని-పోషించితిమి.

తె. వృ: భూతకాలమున ప్రథమేతర పురుషములలో తిజ్జు చేరునపుడు దానికి ముందు 'తి' వచ్చును. పోషించితివి - పోషించితిరి. పోషించితిని - పోషించితిమి.

22 సూ. భూత తద్ధర్మయో ర్లుక్

వృ: భూతార్థే తద్ధర్మార్థే చ యథాస్థానం విహితయోః ది, వి ఇత్యేతయో ర్లుక్స్యాత్. అది పోషించె-అవి పోషించె.

తె. వృ: భూత తద్ధర్మములందు ఆయాస్థానములఁ జెప్పఁబడిన ది, వి యను వానికి లోపము వచ్చును. అది పోషించె - అవి పోషించె.

వృ: భావ వ్యతిరిక్తః కాలత్రయప్రతిపాదకో ధాత్వర్థ స్తద్ధర్మార్థః.

తె. వృ: భావవ్యతిరిక్తమై కాలత్రయమును (వర్తమాన - భూత - భవిష్యత్తులను) ప్రతిపాదించు ధాత్వర్థము తద్ధర్మార్థము.

23 సూ. తద్ధర్మే దే హేత్

వృ: తద్ధర్మార్థే దవర్ణకే పరే క్రియాంత్యస్య హేత్ స్యాత్. తదభావే ఉదేవ, డుజ్ చ. పోషింపు (చు?). భూత తద్ధర్మయో రిత్యధికృత్య యోగ విభాగాత్ లుకో వైకల్పికత్వే పోషింపుఁడు.

తె. వృ: తద్ధర్మార్థమున దవర్ణకము పరమగునపుడు క్రియాంత్య స్వరమునకు ఎకారము వచ్చును. తదభావమున ఉకారమే నిలుచును.

వికల్పముగా 'డుజ్' కూడ వచ్చును. పోషింపు (చే?). "భూతతద్ధర్మయోః" అని యధికార సూత్రముగాఁ జేసికొని సూత్రమును విభజించుకొన్న పక్షమున లుక్కు వైకల్పికమై పోషింపుఁడు * అను రూపమును గలుగును.

## 24 సూ. తద్ధర్మస్య దు

వృ: తద్ధర్మార్థస్య దు ఇతి వర్ణకః స్యాత్ తిజి.

తె. వృ: తద్ధర్మార్థకమున తిజ్ చేరునప్పుడు 'దు' అను వర్ణకము వచ్చును.

## 25 సూ. దో ఞ్చునా తు స్తద్ధర్మే

వృ: తద్ధర్మార్థే దువర్ణకస్య ధాత్వాదేశ సంబంధిభ్యాం నుకార చకారాభ్యా మించేక్సంబంధినా చువర్ణేన చ సహ తువర్ణః స్యాత్. పోషింతురు. పోషింతువు-పోషింతురు. పోషింతును - పోషింతుము.

తె. వృ: తద్ధర్మార్థమున ఇంచేక్కులోని 'చే' తోఁగలసిన 'దు' (అనఁగా 'చుదు')కుబదులుగను, ధాత్వాదేశ సంబంధులయిన నుకార చకారములతోఁగలసిన 'దు' కు బదులుగను తువర్ణము వచ్చును. (వారు) పోషింతురు-పోషింతువు-పోషింతురు. పోషింతును-పోషింతుము.

## 26 సూ. ద్వంద్వకర్తృ కే దో ర్మా

వృ: మన శబ్దకర్తృకే క్రియాపదే దో రత్ స్యాత్ మువర్ణకే పరే. మనము పోషింతము.

తె. వృ: 'మనము' అను పదము కర్తగా నున్న క్రియాపదమున దువర్ణకమునకు ము వర్ణకము పరమగునపుడు అకారము వచ్చును. మనము పోషింతము.

వృ: "భూత తద్ధర్మయో ర్లుక్"(22 సూ.) అది పోషించు. అవి పోషించు.

తె. వృ: "భూత తద్ధర్మయో ర్లుక్" అను (22 వ) సూత్రమువలన ది, వి లోపింపఁగా-అది పోషించు. అవి పోషించు.

## 27 సూ. అర్థవిశేషే దః

వృ: భూతాద్యర్థవిశేషప్రతీతౌ తద్ధర్మస్య దో రపవాదకత్వేన దవర్ణః స్యాత్తిజి. పోషించెదరు. పోషించెదవు-పోషించెదరు. పోషించెదను-పోషించెదము.

---

* తద్ధర్మప్రథమపురుషమున నీ రూప మస్య వ్యాకరణ విలక్షణము.

తె. వృ: భూతాద్యర్థ విశేషము తోఁచునపుడు తద్ధర్మమున తిఙ్ పరమగుచుండఁగా 'దు' కపవాదముగా దవర్ణకము వచ్చును. (వారు) పోషించెదరు-పోషించెదవు-(మీరు)పోషించెదరు. పోషించెదను-పోషించెదము.

## 28 సూ. వలస ఊరీకృఞః

వృ: ఊరీపూర్వస్య కృఞో వలస ఇత్యాదేశః స్యాత్.

తె. వృ: ఊరీపూర్వక కృఞ్ ధాతువునకు 'వలస' అని యాదేశ మగును.

## 29 సూ. విధే రూరీకరోతి స్తద్ధర్మేణ

వృ: ఊరీకృఞాదేశః తద్ధర్మేణ సహ విధ్యర్థవిహితధాతో రనుబంధః స్యాత్.

తె. వృ: 'ఊరీకృఞ్' కు ఆదేశమగు 'వలస' యనునది తద్ధర్మముతో గలసి విధ్యర్థమునఁ జెప్పఁబడిన ధాతువున కనుబంధ మగును.

## 30 సూ. సస్య యః

వృ: క్రియాంత్య సకారస్య యకారః స్యాత్ ఇంచుక్కుతి చాదౌచప పోషింపవలయు, దో శ్చునా దు స్తద్ధర్మే. (25 సూ.) పోషింపవలతురు. పోషింప వలతువు-పోషింపవలతురు. పోషింపవలతును-పోషింపవలతుము. ప్రథమ పురుషైక వచనం పురుషత్రయేఽపి యుజ్యత ఇతి కేచిత్.

తె. వృ: ఇంచుక్కు, ఉకారము, చకారము మొ॥ పరమగునపుడు క్రియ చివరి సకారమునకు యకారము వచ్చును. పోషింపవలయు. 25 వ సూ. ను బట్టి 'చేదు' కు బదులు 'తు' వచ్చి-పోషింపవలతువు- పోషింపవల తురు. పోషింపవలతును- పోషింపవలతుము. ప్రథమపురుషైకవచనము పురుషత్రయమునకును సరిపోవునని కొందఱమతము.

## 31 సూ. ముడుఞౌ ప్రార్థనాయామ్

వృ: ప్రార్థనాయా మేకత్వ బహుత్వయోః ముడుఞ్ ఇత్యేతౌ భవతః. నీవు పోషింపుము. మీరు పోషింపుఁడు. తుమున్ వ్యతిరేక యోరత్. (15 సూ). వ్యతిరేకః ప్రతిషేధార్థః. పోషింపఁడు-పోషింపరు. పోషింపవు-పోషింపరు. పోషింపను-పోషిం పము. అమహత్కర్తృకత్వే-పోషింపదు-పోషింపవు.

తె. వృ: ప్రార్థనార్థమున నేక బహువచనములందు ము, డుఞ్ అనునవి యగును. నీవు పోషింపుము-మీరు పోషింపుఁడు. తుమున్ వ్యతిరేకార్థములందు ధాతువు చివరి స్వరమునకు అకారమాదేశమగును.

(15సూ.) వ్యతిరేకమనగా ప్రతిషేధార్థము. పోషింపఁడు-పోషింపరు. పోషింపవు-పోషింపరు. పోషింపను-పోషింపము. అమహద్వాచకము కర్త గా నున్నపుడు: అదిపోషింపదు-అవి పోషింపవు.

## 32 సూ. కుః ప్రార్థనాయామ్

వృ: వ్యతిరేకార్థే కుః స్యాన్ముడుజ్ఞోః పరయోః. పోషింపకుము-పోషింపకుఁడు.

తె. వృ: ముడుజ్ఞులు పరమగునపుడు వ్యతిరేకార్థమున క్రియకు 'కు' చేరును. పోషింపకుము-పోషింపకుఁడు.

## 33 సూ. అతా భ్వసాగమాం కా-లే-రాః

వృ: భూధాతో రసిధాతోః అజ్ పూర్వస్య గమేశ్చ యథాక్రమ మతా సహ కా-లే-రా ఇత్యేతే ఆదేశాః స్యుః ఇంచుకి.

తె. వృ: భూ-అసి-ఆగమ అను ధాతువులకు ఇంచుక్కు పరమగునపుడు అకారముతోఁగలసి యథాక్రమముగా కా-లే-రా అనునవి ఆదేశములగును.

## 34 సూ. వ్యతిరేకేఽస్తి వ్యతిరేకః

వృ: వ్యతిరేకార్థే వ్యతిరేక విహితోఽసిధాతు రనుబంధో వా స్యాత్. పోషింపలేఁడు-పోషింపలేరు. పోషింపలేవు-పోషింపలేరు. పోషింపలేను-పోషింపలేము. అమహత్కర్తృకత్వే. పోషింపలేదు-పోషింపలేవు.

తె. వృ: వ్యతిరేకార్థమున వ్యతిరేక విహితమైన అసి ధాతువు వికల్పముగా ననుబంధముగా వచ్చును. పోషింపలేఁడు - పోషింపలేరు. పోషింపలేవు-పోషింపలేరు. పోషింపలేను- పోషింపలేము. అమహత్తు కర్త యయినప్పుడు పోషింపలేదు- పోషింపలేవు.

## 35 సూ. అయో భువేస్తు

వృ: భూ సత్తాయా మితి ధాతో రయ ఇత్యాదేశః స్యాత్.

తె. వృ: భూ ( = సత్తాయామ్ ఉనికియందు) అను ధాతువునకు 'అయ' అను నాదేశము వచ్చును.

## 36 సూ. భవతి స్సర్వేషామ్

వృ: సర్వేషా మర్థానాం భవత్యా దేశోఽనుబంధో వా స్యాత్.

తె. వృ: అన్ని యర్థములలోను భూధాత్వాదేశ మయిన 'అయ' అనుబంధముగా వికల్పముగా వచ్చును.

37 సూ. భువేః

వృ: భువే రాదేశ సంబంధినో యకారస్య వకారః స్యాత్ ఇంచుక్యతి (చాదౌ) చ. క్వచి ద్గో వః. పోషింపనగుచున్నాడు- పోషింపనగుచున్నారు. పోషింపనగుచున్నావు- పోషింపనగుచున్నారు. పోషింపనగుచున్నాను- పోషింపనగుచున్నాము. ఇత్యాది వర్తమానే. అతా భ్వసాగమాం కాలేరాః. పోషింపగాఁగలఁడు.

తె. వృ: భూధాత్వాదేశమందలి యకారమునకు ఇంచుక్కు, అకారము, (చకారము మొ.) పరమగునపుడు వకార మాదేశమగును. కొన్ని యెడల వకారమునకు గకారము. పోషింపనగుచున్నాఁడు- పోషింపనగుచున్నారు. పోషింపనగుచున్నావు-పోషింపనగుచున్నారు. పోషింపనగుచున్నాను-పోషింపనగుచున్నాము.

38 సూ. అనుబంధే కః

వృ: అనుబంధతా విహితస్య కా ఇత్యస్య హ్రస్వోవాస్యాత్. పోషింపఁగఁగలఁడు, పోషింపఁగాఁగలఁడు. పోషింపఁగఁగలరు-పోషింపఁగాఁగలరు. ఇత్యాది భవిష్యార్థే.

తె. వృ: అనుబంధముగాఁ జెప్పఁబడిన 'కా' అను దానికి వికల్పముగా హ్రస్వమగును. పోషింపఁగఁగలఁడు-పోషింపఁగాఁగలఁడు-పోషింపఁగఁగలరు-పోషింపఁగాఁగలరు. ఈ మొదలైనవి భవిష్యదర్థమునఁజూచుకొనునది.

39 సూ. భువే రాయె

వృ: భవతేః భూతార్థే రువర్జితస్య ప్రథమ పురుషాదేశస్య ఆయె ఇత్యాదేశః స్యాత్. అయ్యో ఇతి కేచిత్. పోషింపనాయె. పోషింపనయిరి. ఇత్యాది భూతార్థే. పోషింపనగు. పోషింపనగుదురు ఇత్యాది తద్ధర్మే. ఏవం యథాసంభవం రూపాంతరాణి. క్రియాఫలే కర్తృ, భిప్రాయే తు విశేషః.

తె. వృ: భూతార్థమున రువర్జితమైన ప్రథమ పురుషాదేశముగా వచ్చిన భూధాత్వాదేశమునకు 'ఆయె' అని యాదేశమగును. 'అయ్యో' అని కొందఱ మతము. పోషింపనాయె- పోషింపనయిరి మొ. భూతార్థమునందును, పోషింపనగు-పోషింపనగుదురు మొ. తద్ధర్మమునను గ్రహించునది. ఇట్లు యథాసంభవముగా రూపాంతరముల నెఱుఁగఁదగును. క్రియాఫలము కర్తను జెందునపుడు (ఆత్మనేపదార్థమున) విశేషము గలదు.

## 40 సూ. కొనో గ్రహేః

వృ: గ్రహ ఉపాదాన ఇత్యస్య కొన ఇత్యాదేశః స్యాత్.

తె. వృ: గ్రహ ( = ఉపాదానే) అనుధాతువునకు 'కొన' అని యాదేశము వచ్చును.

## 41 సూ. క్రియాఫలే కర్తృగామిని గృహ్ణాతిః

వృ: గృహిధాత్వాదేశః క్రియాఫలే కర్తృగామిని సతి ధాతో రనుబంధో భవతి. తుమున్ ప్రతిషేధః.

తె. వృ: క్రియాఫలము కర్తను బొందునపుడు గ్రహిధాతువున కాదేశమగు 'కొన' యనునది ధాతువున కనుబంధముగానుండును. తుమున్ ప్రతిషేధము అనగా ధాతువు చివర 'అన్' రాదు.

## 42 సూ. గృహ్ణాతౌ వా

వృ: అనుబంధరూపగృహ్ణాతౌ పరే క్రియాంత్య వర్ణస్య ఇద్వా. పక్షే టచు గ్రహి షూత్ (సూ.5) పోషించికొనుచున్నాఁడు-పోషించికొనుచున్నారు. పోషించి కొనఁగలఁడు-పోషించికొనఁగలరు.

తె. వృ: అనుబంధమైన గ్రహిధాత్వాదేశము పరమగునపుడు క్రియాంత్య వర్ణమునకు ఇకారము వికల్పముగా వచ్చును. ఇకారము రాన పుడు "టచు గ్రహిషూత్" (5 సూ.) అను సూత్రమును బట్టి ఉకారము పోషించికొనుచున్నాఁడు - పోషించికొనుచున్నారు. పోషించికొనఁ గలఁడు-పోషించికొనఁగలరు.

## 43 సూ. ఇయ గ్భవేత్

వృ: గ్రహార్థ ధాత్వాదేశస్య ఇయక్ స్యా దేకారే పరే. పోషించికొనియె. పోషించికొనిరి.

తె. వృ: గ్రహధాత్వాదేశమగు 'కొన' కు 17వ సూత్రమును బట్టి భూతార్థమున ఎకారము చేరినప్పుడు దానికి ఇయక్ అను నాదేశము వచ్చును. పోషించికొనియె - పోషించికొనిరి.

## 44 సూ. కొనాదే ర్నా టిజ్ తేః

వృ: కొనాదేః పరస్య తివర్ణస్య నకారేణ సహ టిజ్ స్యాత్. హైకాచ ఇత్యాదినా బిందుః. పోషించికొంటివి - పోషించికొంటిరి. పోషించికొంటిని- పోషించికొంటిమి.

తె. వృ: కొనాదులకు (21వ సూ. ప్రకారము) పరమైన తివర్ణమునకు నకారముతోఁగూడ టిజ్ ఆదేశమగును. "వైకాచ" ఇత్యాది (సంధి 38 సూ.) సూత్రము వలన బిందువు వచ్చును. పోషించికొంటివి-పోషించికొంటిరి. పోషించికొంటిని - పోషించికొంటిమి.

## 45 సూ. కొనాదే రుజా దోః

వృ: కొనాదేః పరస్య దువర్ణస్య నకారేణ సహ డుజ్ స్యాత్. పోషించికొనును. పోషించికొంన్రు. ఏవమన్యేషా మపి రూపాణి సంచారణీయాని.

తె. వృ: కొనాదులకుఁ బరమైన దు వర్ణమునకు నకారముతోఁ గూడ డుజాదేశమగును. పోషించికొనును. పోషించికొంన్రు. ఇట్లే ఇతర క్రియారూపములను గూడ సాధించుకొనఁదగును.

వృ: ముహ వైచిత్త్యే. ద్విష అప్రీతౌ ఇత్యాదీనాం పుష్యాదిత్వం వేద్యమ్. మోహింపుచేన్నాఁడు. ద్వేషింపుచేన్నాఁడు. తుష తుష్టౌ.

తె. వృ: ముహ ( = వైచిత్త్యే), ద్విష ( = అప్రీతౌ) మొదలగునవి పుషాదులలో జేరునని యెఱుఁగఁదగును. మోహింపుచేన్నాఁడు. ద్వేషింపుచేన్నాఁడు. తుష ( = తుష్టౌ).

## 46 సూ. తుష కుచ శుధాః సమః

వృ: సంపూర్వాః తుషాదయః ఉపకృతిసంజ్ఞా భవంతి. సంతోషింపుచేన్నాడు, డుపచష్పాకే.

తె. వృ: సమ్ అను నుపసర్గతోఁ గూడిన తుష - కుచ - శుధ అను ధాతువులు కూడ ఉపకృతి సంజ్ఞ గలవి. సంతోషింపుచేన్నాఁడు. (డు) పచ (ష్) ( = పాకే).

## 47 సూ. ప్రాత్ పచి షది లపః

వృ: ప్రపూర్వాః పచ్యాదయః ఉక్తసంజ్ఞా భవంతి. ప్రపాకింపుచేన్నాడు. లప కాంతౌ.

తె. వృ: ప్ర - అను నుపసర్గతోఁగూడిన పచ - షద - లప అను ధాతువులును ఉపకృతి సంజ్ఞ గలవే. ప్రపాకింపుచేన్నాఁడు. ప్రసాదింపుచేన్నాఁడు. ప్రలాపింపుచేన్నాఁడు.

48 సూ. ఉత్పర్యుపేభ్యో లసితసిదిశః

వృ: ఉత్, పరి, ఉప - ఏభ్యః పరే లస్యాదయో యథాక్రమ ముపకృతి సంజ్ఞా భవంతి. ఉల్లాసింపుచేన్నాఁడు, రుధిర్ ఆవరణే.

తె. వృ: లస - తంస - దిశ అను ధాతువులు వరుసగా ఉత్ - పరి - ఉప అను నుపసర్గలతోఁ గూడినపుడు ఉపకృతిసంజ్ఞ గలవగును. ఉల్లాసింపుచేన్నాఁడు. రుధిర్ = (ఆవరణే).

49 సూ. రుధ ద్విషౌ వేః

వృ: విపూర్వౌ రుధ ద్విషౌ ప్రాగుక్తసంజ్ఞా భవతః. విరోధింపుచున్నాఁడు. శ్లిష ఆలింగనే.

తె. వృ: 'వి' పూర్వకములైన రుధ - ద్విష అను ధాతువులు ఉపకృతి సంజ్ఞ గలవి. విరోధింపుచేన్నాఁడు. శ్లిష ( = ఆలింగనే).

50 సూ. శ్లిషి స్ఫుటి లుడా ఆజః

వృ: ఆజః పరే శ్లిషాదయ ఉక్తసంజ్ఞా భవంతి. ఆశ్లేషింపుచున్నాడు.

తె. వృ: ఆజ్ అను ఉపసర్గతోఁగూడిన శ్లిష - స్ఫుట-లు-డ ధాతువులు ఉపకృతి సంజ్ఞ గలవగును. ఆశ్లేషింపుచేన్నాఁడు.

51 సూ. ణు మను ష్టుభ్యః క్తిన్

వృ: ఉపకృతిసంజ్ఞకేభ్యో ణు ప్రభృతిభ్యః క్తిన్ ప్రత్యయః స్యాత్ తిజి.

తె. వృ: ణు - మను - ష్టు అను ధాతువులు ఉపకృతి సంజ్ఞ గలవి. తిజ్ ప్రత్యయములకు ముందు వీనికి క్తిన్ ప్రత్యయము చేరును. అనఁగా క్తిన్ ప్రత్యయాంతరూపము మీఁద వీనికి తిజాది ప్రత్యయములు చేరును.

52 సూ. లఘ్వేకాక్షరపూర్వా దనయ ఇంచుక్

వృ: లఘు యదేకమేక మక్షరం తత్పూర్వం యస్య తస్మా దయవర్జితా క్రియాపదా ది ద్వా స్యా దించుక్. నుతియింపుచేన్నాఁడు - నుతింపుచేన్నాఁడు. ఘ్రా గంధోపాదానే.

తె. వృ: 'అయ' చేరని* లఘువైన యేకాక్షర క్రియాపదమునకు† ఇంచుక్కు పరమైనపుడు వికల్పముగా ఇకారము చేరును. నుతియింపు చేన్నాఁడు - నుతింపుచేన్నాఁడు. ఘ్రా ( = గంధోపాదానే).

## 53 సూ. ఘ్రా ధాఞ్ మా ద్రాయతిభ్యో ల్యుట్

వృ: ఏభ్యో లుట్ స్యా త్తిజి. ఘ్రాణింపుచేన్నాఁడు. డుధాఞ్ ధారణ పోషణయోః. సమో ధాఞ్. సంపూర్వస్య ధాఞస్త్విహైవ. సంధానింపుచేన్నాఁడు. మూర్ఛా మోహసముచ్ఛ్రాయయోః.

తె. వృ: ఘ్రా - ధాఞ్ - మా - ద్రై అను ధాతువులకు తిజ్ చేరునపుడు ల్యుట్ (అన) ప్రత్యయము వచ్చును. ఘ్రాణింపుచేన్నాఁడు. (డు) ధా (ఞ్) ( = ధారణపోషణయోః). 'సమ్' అను ఉపసర్గముతోఁ గూడిన ధా (ఞ్)ధాతువునకును అట్లే. సంధానింపుచేన్నాఁడు. మూర్ఛా ( = మోహసముచ్ఛ్రాయయోః).

## 54 సూ. మూర్ఛాదిభ్యోఽజ్

వృ: భిదాదివిహితోఽజ్ ప్రత్యయః స్యాత్ తిజి. గురు పూర్వా దకర్మకా ద్ధాతోరించుక్ సంబంధిన శ్చేర్బిందు నా సహలకారఉశ్చభవతః. మూర్ఛిల్లుచేన్నాఁడు. మూర్ఛిలుచేన్నాఁడు.

తె. వృ: మూర్ఛాది ధాతువులకు తిజ్లు పరమగునపుడు భిదాది విహితమగు అజ్ ప్రత్యయము వచ్చును. గురు పూర్వకమైన అకర్మక ధాతువున కించుక్కులోని 'ంచే' కు బదులు లకారమును ఉకారమును వచ్చును. మూర్ఛిల్లుచేన్నాఁడు-మూర్ఛిలుచేన్నాఁడు.

వృ: అథ సంవృతిః. వస నివాసే.

తె. వృ: ఇంక సంవృతి ధాతువులు. వస ( = నివాసే).

## 55 సూ. సంవృతి ర్వస్యాదిః

వృ: వస్యాది ర్ధాతుః సంవృతి సంజ్ఞః స్యాత్. వసింపుచేన్నాఁడు. ఇత్వే-వసియింపుచున్నాఁడు. రంజ-రాగే. రంజిల్లుచేన్నాఁడు. గర్వ-దర్పే.

తె. వృ: వస మొదలయిన ధాతువులు సంవృతి‡ సంజ్ఞ కలవి.

---

*"జి" ధాతువునకు "అయ" చేరును. జయించు. ఇటువంటివి పరిణతిక్రియలు. వీటివి గుఱించి ముందు తెలియును.

†"లఘువులైన రెండక్షరాలు గల క్రియాపదమునకు" అని యుండినచో విశదముగా నుండును.

‡సంవృతిధాతువుల కించుగాదులు చేరునప్పుడు మార్పురాదు.

వసింపుచేన్నాఁడు. ఇత్వమున-వసియింపుచేన్నాఁడు. రంజ ( = రాగే): రంజిల్లుచేన్నాఁడు. గర్వ ( = దర్పే).

## 56 సూ. క్వచి త్సంవృతేః

వృ: క్వచి త్సంత్ర్వృతేః ఘుఙ్ ఇతి సిద్ధ ఏవ స్యాత్. గర్విఁంపుచున్నాడు. వసి ప్రభృతేః ఈకో నిత్యత్వాభావాదత్ర వికల్పః. శంస స్తుతౌ.

తె. వృ: అందందు సంవృతి ధాతువునకు ఘుఙ్ వచ్చుననుట సిద్ధమే. గర్వింపుచేన్నాఁడు. వస మొదలయినవానికి ఈక్ నకు (?) నిత్యత్వము లేనందున ఇట వికల్పము. శంస ( = స్తుతౌ).

## 57 సూ. శంస రూపి భాజి లోకః ప్ర ని వ్యాఙ్భ్యః

వృ: ప్రాదిభ్యః పరే శంసి ప్రభృతయః యథాక్రమం సంవృతి సంజ్ఞాః ప్రశంసింపుచేన్నాఁడు.

తె. వృ: శంస-రూపి-భాజి-లోక అనుధాతువులు వరుసగా ప్ర-ని-వి- ఆఙ్ అను నుపసర్గలతోఁగూడి వరుసగా సంవృతి సంజ్ఞకము లగును. ప్రశంసింపుచేన్నాఁడు.

వృ: అథ పరిణతిః.

తె. వృ: ఇంక పరిణతి ధాతువులు

## 58 సూ. పరిణతి రిగంత ఏకాచ్

వృ. ఇగంత ఏకాచ్కో-ధాతుః పరిణతి సంజ్ఞః స్యాత్.

తె. వృ: ఇ-ఉ-ఋ లంతమందున్న ఏకాచ్చుగల ధాతువులు పరిణతి సంజ్ఞ కలవగును.

## 59 సూ. పరిణతే ర్యో రేఙ్

వృ: పరిణతి సంబంధినో రికారోకారయోః క్రమా దేకారౌకారౌ భవతః. జి-జయే. అనయ ఇతి నిషేధా దిత్వంన. జయింపుచున్నాఁడు.

తె. వృ: పరిణతి ధాతువుల ఇకార-ఉకారములకు వరుసగా ఏకార-ఓకారములు వచ్చును. వానికి ఇంచుక్ చేరునపుడు క్రమముగా అయ్-అవ్‌లు వచ్చును. జి ( = జయే). 52 వ సూ. న 'అనయ' అని నిషేధముండుటను బట్టి ఇకారమురాదు. జయింపుచేన్నాఁడు.

## 60 సూ. అకర్మకా ద్బిందునా

వృ: అకర్మకా ద్ధాతో రించుకస్సంబంధిన శ్చేర్బిందునా సహ లుక్ స్యాత్. స్రవిల్లుచున్నది. ఇత్వే స్రవియిల్లుచున్నది. భూసత్తాయా మిత్యాదీనా మనుపసర్గత్వే ప్రయోగో న. ప్రభవిల్లుచున్నది.

తె. వృ: అకర్మకధాతువున కించుక్కులోని బిందువుతోడి 'చే' లోపించును. స్రవిల్లుచున్నది. ఇత్వము వచ్చినప్పుడు- స్రవియిల్లుచున్నది. భూ (= సత్తాయామ్) మొ. వానికి ఉపసర్గరహితముగా ప్రయోగము లేదు. ప్రభవిల్లుచున్నది.

## 61 సూ. ఋతో౽రః

వృ: పరిణతి సంబంధిన ఋతః అర ఇతి స్యాత్. భృఞ్ భరణే. భరింపుచేన్నది. జాగృ ధాతుశ్చ పరిణతి సంజ్ఞః స్యాత్. జాగరిల్లుచున్నాఁడు. ఏవం సాదింపుచేన్నాడు. అప్పగింపుచేన్నాఁడు ఇత్యాదీనాం సంస్కృతభవానాం, ఓసరింపుచేన్నాఁడు ఒప్పగింపుచేన్నాఁడు ఇత్యాదీనాం ప్రాకృతసమానాం, ఓహటింపుచేన్నాఁడు. సంతసిల్లుచేన్నాడు ఇత్యాదీనాం ప్రాకృత భవానాంచ రూపాణి. హృఞ్ హరణే.

తె. వృ: పరిణతి క్రియల ఋకారమునకు 'అర'అని యాదేశమగును. భృఞ్ (= భరణే). భరింపుచేన్నది. జాగృధాతువు గూడ పరిణతి సంజ్ఞ గలది. జాగరిల్లుచేన్నాఁడు. ఇట్లే సాదింపుచేన్నాఁడు. అప్పగింపు చేన్నాడు మొ. సంస్కృతభవములకును, ఓసరింపుచేన్నాఁడు, ఒప్పగింపుచేన్నాఁడు మొదలగు ప్రాకృతసమములకును, ఓహటింపు చేన్నాఁడు, సంతసిల్లుచేన్నాఁడు మొదలగు ప్రాకృతభవములకును రూపములను గ్రహింపఁదగును. హృఞ్ (= హరణే).

## 62 సూ. ఆహృ సంవసో రారగ సొమ్మసా వించుకి

వృ: సంస్కృత భవాధికారే త్వేతయో రేతా వాదేశా భవతః ఇంచుకిపరే- ఆరగింపుచేన్నాఁడు. వస నివాసే. సొమ్మసిలుచేన్నాఁడు. శుభ రంభ దీప్తౌ.

తె. వృ: ఆహృ-సంవస ధాతువులకు ఇంచుక్కు పరమైనపుడు ఆరగ- సొమ్మస అనునవి యాదేశములగును. ఆరగింపుచేన్నాఁడు. వస(= నివాసే). సొమ్మసిలుచేన్నాఁడు. శుభ రంభ (= దీప్తౌ).

## 63 సూ. శుంభ రంభయో స్సోంప రంపా వించుకి

వృ: ప్రాకృతభవాధికారే త్వేతయో రేతా వాదేశా భవతః ఇంచుకి పరే. సొంపిల్లుచున్నాడు. ఈక్ష దర్శనాంకనయోః.

తె. వృ: ప్రాకృతభవాధికారమున శుంభ-రంభ అను ధాతువులకు ఇంచుక్కు పరమగునపుడు సొంప-రంప అనునవి ఆదేశమగును. సొంపిల్లు చేన్నాఁడు. ఈక్ష (= దర్శనాంకనయోః).

64 సూ. పరీక్షా లక్షయో రించుకి

వృ: పైశాచీభవాధికారే త్వేతయో స్తో రుపరివర్ణస్య లుక్ స్యా దించేకి పరే. ఖస్య కత్వమ్. పరికింపుచున్నాఁడు. లక్ష దర్శనాంకనయోః. అలకింపు చేన్నాడు. వహ ప్రాపణే.

తె. వృ: పైశాచీభవాధికారమున పరీక్షా - లక్ష ధాతువులలోని సంయుక్తమున మీఁది వర్ణమునకు ఇంచుక్కు పరమైనప్పుడు లోపము వచ్చును. ఖకారమునకు బదులు కకారము. పరికింపుచున్నాఁడు. లక్ష (= దర్శనాంకనయోః) అలకింపుచున్నాఁడు. వహ (= ప్రాపణే).

65 సూ. ఆవహి నిర్వహ్యో రావట నివ్వటౌ

వృ: ఏతయో రేతా వాదేశా వించేకి. అవటిల్లుచేన్నాడు. నివ్వటిల్లు చేన్నాడు. అర్థభేదా దకర్మకత్వమ్. ఏవమన్యేషాంచతత్సమ తద్భవ ధాతూనా మించేగాగమేన రూపాణి సంచారణీయాని.

తె. వృ: ఆవహి-నిర్వహి ధాతువులకు 'ఇంచేక్' పరమగునపుడు క్రమముగా ఆవట-నివ్వట యను నాదేశములు వచ్చును. ఆవటిల్లు చేన్నాఁడు. నివ్వటిల్లుచేన్నాఁడు. సంస్కృతమున నీ ధాతువులు సకర్మకములైనను తెలుఁగున నర్థభేదమువలన నకర్మకములైనవి. ఇట్లే తద్భవ ధాతువులకు ఇంచేగాగమముతో రూపము లేర్పఱచుకొనఁదగును.

అథ దేశ్యా ధాత్వాదేశాః.

అనంతరము దేశ్యములైన ధాత్వాదేశములు.

66 సూ. గమేః పోయః

వృ: గమ్లు గతా విత్యస్య పోయ ఇత్యాదేశః స్యాత్.

తె. వృ: గమ్లు (= గతౌ) అను ధాతువునకు 'పోయ' అను నాదేశము వచ్చును.

67 సూ. గమే ర్య ఉ తించుకి చ

వృ: గమే రాదేశస్య అంత్యయకారస్యలుక్. పకారశ్చోకారా కారయో రించుకిచ పరేషు.

తె. వృ: గమ ధాతువున కాదేశముగ వచ్చు "పోయ"లోని చివరి యకారమునకు లోపము. ఉకారము-అకారము-ఇంచుక్కు- పరమగునపుడు వకారము వచ్చును.

## 68 సూ. అచః క్రియాంత్యలుకి

వృ: క్రియాంత్యవర్ణస్య లుకి అవశిష్టస్యాచో లుక్ స్యాత్. పోచేన్నాఁడు. పోవుచేన్నాఁడు. పోఁగలఁడు- పోవఁగలఁడు. పోయె-పోవు.

తె. వృ: క్రియాంత్యవర్ణము లోపించినప్పుడు మిగిలిన అచ్చునకును లోపము గలుగును. పోచేన్నాఁడు-పోవుచేన్నాఁడు. పోఁగలఁడు-పోవఁగలఁడు. పోయె- పోవు.

## 69 సూ. ద్విత్వం చ దేర్ఘః

వృ: దీర్ఘస్య హ్రస్వః స్యాత్ ద్విత్వంచ ప్రార్థనా విహితయో ర్ముడుఞోః పరయోః. పోవుము-పొమ్ము-పోవుఁడు-పొండు. వ్యతిరేకేతు న. పోకుము. పోకుఁడు.

తె. వృ: ప్రార్థనార్థకమున విధింపఁబడిన ముడుఞ్లు పరమగునప్పుడు ధాతు దీర్ఘమునకు హ్రస్వమును, 'ము' వర్ణకమునకు ద్విత్వమును నగును. పోవుము-పొమ్ము. పోవుఁడు-పొండు. వ్యతిరేకమున నీవిధి వర్తింపదు. పోకుము-పోకుఁడు.

## 70 సూ. ఏఁగచే నౌ ప్రతిష్ఠతేః

వృ: ప్రపూర్వస్య ష్ఠా ధాతో రేతా వాదేశౌ భవతః. ఏఁగుచేన్నాఁడు. చేనుచేన్నాఁడు. కొనాదిత్వాభావాత్ నాత్ర బిందుకాదికార్యమ్.

తె. వృ: ప్ర (పూర్వకమైన) ష్ఠా (= ప్రయాణముచేయుట) ధాతువునకు ఏఁగ, చన అను నాదేశములు వచ్చును. ఏఁగుచేన్నాఁడు. చేనుచేన్నాఁడు. కొనాదిత్వము లేనందున ఇచట బిందుకాది కార్యము రాదు.

## 71 సూ. లేచ ఉత్తిష్ఠతేః

వృ: ఉత్పూర్వక ష్ఠాధాతోః లేచ ఇత్యాదేశః స్యాత్. లేచేచేన్నాఁడు.

తె. వృ: ఉత్ పూర్వకమైన ష్ఠా ధాతువునకు లేచ అను నాదేశము వచ్చును. లేచుచేన్నాఁడు.

## 72 సూ. గురో రణ్వాదౌ

వృ: ణ్వాది వర్జితే ధాత్వాదేశే గురోః పర స్యాంత్యచకారస్య వకారః స్యాదతి. లేవఁగలఁడు. లేచెను. లేచేను.

తె. వృ: ణు = స్తుతౌ మొ. నవి కాకతక్కిన ధాతువులకు వచ్చిన యాదేశమునకు అత్తు పరమగునపుడు గుర్వక్షరమునకు పరమైన చకారము నకు వకార మాదేశమగును. లేవఁగలఁడు. లేచెను. లేచేను.

## 73 సూ. ఉతిష్ఠతేః ప్రార్థనాయామ్

వృ: ఉత్తిష్ఠతేః దంత్య చకారస్య శ్లుక్ స్యాత్ ముడుజోః పరయోః. లేము-ద్విత్వంచ దేర్హ్యః (69 సూ.) లెమ్ము-లేవుము. లేఁడు-లెండు-లేవుఁడు.

తె. వృ: 'ఉత్తిష్ఠ'కు ఆదేశముగా వచ్చిన 'లేచే' లోని 'చే' కారమునకు లోపమువచ్చును. "ద్విత్వంచ దే ర్హ్యః" అను (69 వ) సూత్ర మువలన ద్విత్వమును, ధాతుదీర్ఘమునకు హ్రస్వమును వచ్చును. లేము-లెమ్ము-లేవుము. లేఁడు-లెండు-లేవుఁడు.

## 74 సూ. వసే రునః కొనాదివ చ్చుద్వోః

వృ: వసధాతో రునాదేశః. కొనాదివద్భావశ్చ స్యాత్ చుద్వోః పరయోః. ఉంచున్నాఁడు. ఉండఁగలఁడు. ఉండెను. ఉండిరి.

తె. వృ: వస ధాతువునకు 'ఉన' ఆదేశమగును. చే, ది, వి వర్ణక ములు పరమగునప్పుడు 'కొన' (గ్రహిధాత్వాదేశము) యొక్క రూపముల వంటి రూపము లేర్పడును. ఉంచేన్నాఁడు. ఉండఁగలఁడు. ఉండెను. ఉండిరి.

## 75 సూ. ఉండే ష్టిజిచ

వృ: నవర్ణక లోపే త్వవశిష్టస్య ఉండే రంత్యహలో నకారః స్యాత్ టిజి పరేచ. ఉంటివి. ఉండు. కొనాదివత్కార్యమ్. ఉంద్రు.

తె. వృ: కృత్ప్రత్యయమగు న వర్ణకము లోపింపఁగా (కృదన్త. 32 సూ.) మిగిలిన 'ఉండి' లో అంత్య హల్లునకును టిజ్ పరమగునపుడును నకారాదేశమగును. ఉంటివి. ఉండు. కొను మొ. వానికివలె కార్యము. ఉంద్రు.

76 సూ. విన శృణోతేః

వృ: శృశ్రవణ ఇత్యస్య విన ఇత్యాదేశః స్యాత్. వించున్నది.

తె. వృ: శృ (= శ్రవణే) అను ధాతువుకు 'విన' అని యాదేశమగును. వించేన్నది.

77 సూ. ఈన కనౌ షూఙః

వృ: షూఙ్ ప్రాణి ప్రసవ ఇత్య స్యైతా వాదేశౌ భవతః. ఈనుచేన్నది. కంచేన్నది.

తె. వృ: షూఙ్ (= ప్రాణి ప్రసవే) అను ధాతువునకు "ఈన-కన" అను నాదేశములు వచ్చును. ఈనుచేన్నది. కంచేన్నది.

78 సూ. అన పల కాడ నొడవా వదేః

వృ: వద వ్యక్తాయాం వాచీత్యస్య అనాదయ శ్చత్వార ఆదేశా భవంతి అంచేన్నాఁడు.

తె. వృ: వద (= వ్యక్తాయాం వాచి) అను ధాతువునకు అన-పలక-ఆడ-నొడవ అను నాలుగాదేశములు వచ్చును. అంచేన్నాఁడు.

79 సూ. తుము న్యనో నా వా

వృ: అన ఇత్యస్య తుమున్నాదేశే నా ఇతి వా స్యాత్. నాఁగలఁడు. అనఁగలఁడు. అనియె. అను. అనుడు. భవత్యనుబంధేఽత్ర విశేషః.

తె. వృ: 'అన' యను దానికి తుమున్నాదేశమున 'నా' అని వికల్పముగా రూపములు వచ్చును. నాఁగలఁడు-అనఁగలఁడు. అనియె. అను. అనుఁడు. భవత్యనుబంధము చేరునపు డిందు విశేషము గలదు.

80 సూ. అవుండో రనః

వృ: అన ఇత్యస్మా త్పరస్య అవుండో రతో లుక్ స్యాత్ - అనవుండు. నావుండు.

తె. వృ: 'అన' అనుదానికి అవుండు (అవు + ఉండు) పరమగునపుడు అకారమునకు లోపము వచ్చును. అనవుండు - నావుండు.

## 81 సూ. ఉత్తమవ దుపోత్తమ స్యాసరళస్య లఘో రబిందుకేఽశ్చే

వృ: సకార చకార రహితే బిందుక వర్జితే చ క్రియాదేశే లఘోః పరస్య సరళ వ్యతిరిక్తస్య ఉపోత్తమ స్యోత్తమవ త్కార్యం స్యాత్. ఇతి అకార స్యోత్వాది. పలుకుచేన్నాడు. పలుకఁగలఁడు. పలికె. నాత్ర లస్య తో హేతోః అతిదిష్టస్య కార్యస్య ఇతి ఉవర్ణస్య నియతత్వాత్.(?) కింతు భూతార్థవిహిత మిత్వమేవ. పలికిరి. నొడవు చేన్నాడు. అసరలస్యేతి నిషేధా దుత్వం న.

తె. వృ: సకార చకారములు, బిందుకమును లేని క్రియాదేశమున లఘువునకుఁ బరమైనదియు, సరళవ్యతిరిక్తమయినదియు నగు ఉపోత్తమ వర్ణమునకును ఉత్తమ(చివరి) వర్ణమునకు వలెనే కార్యమగును. అందువలన 'పలక' లోని లకార కకారముల మీఁది అకారమునకు ఉకారము. పలుకు చేన్నాఁడు. పలుకఁగలఁడు. పలికె..............................
......భూతార్థమునఁజెప్పఁబడిన ఇత్వమే నిలుచును. పలికిరి. నొడవు చేన్నాడు. "సరళ వ్యతిరిక్తమయినదియు" నను నిషేధము వలన డకార మునకు ఉత్వము రాలేదు.

## 82 సూ. అదే తిన మెక్కా

వృ: అద భక్షణే ఇత్య స్యైతా వాదేశా భవతః. తించేన్నాఁడు. మెక్కుచేన్నాఁడు.

తె. వృ: అద (= భక్షణే) అను ధాతువునకు 'తిన - మెక్క' అను నాదేశములు వచ్చును. తించేన్నాఁడు. మెక్కుచేన్నాఁడు.

## 83 సూ. మన బ్రతుకౌ జీవతేః

వృ: జీవ ప్రాణ ధారణ ఇత్య స్యైతౌ భవతః. మంచేన్నాఁడు. బ్రతుకు చేన్నాఁడు.

తె. వృ: జీవ(= ప్రాణధారణే), అను ధాతువునకు 'మన—బ్రతుక' అను నాదేశములు వచ్చును. మంచేన్నాఁడు. బ్రతుకుచేన్నాఁడు.

## 84 సూ. కన చూచౌ దృశి

వృ: దృశిర్ ప్రేక్షణ ఇత్య స్యైతా వాదేశా భవతః. కంచేన్నాఁడు. చూచుచేన్నాఁడు.

తె. వృ: దృశిర్ (= ప్రేక్షణే) అను ధాతువునకు కన - చూచ అను నాదేశములు వచ్చును. కంచేన్నాఁడు. చూచుచేన్నాఁడు.

85 సూ. అంత్యస్య చో ర్దృశే ర్డోఽతి

వృ: దృశే రాదేశస్య అంత్య చకారస్య డకారః స్యా దతి పరే. చూడఁ గలఁడు. చూచె.

తె. వృ: అకారము పరమైనపుడు దృశికాదేశమయిన 'చూచే' లోని చివరి చేకారమునకు బదులు డకారము వచ్చును. చూడఁగలఁడు. చూచె.

86 సూ. చొచ్చ విశేః

వృ: విశ ప్రవేశన ఇత్యస్య చొచ్చే ఇత్యాదేశః స్యాత్. చొచ్చేచేన్నాఁడు.

తె. వృ: విశ (= ప్రవేశనే) అను దానికి 'చొచ్చే' అను నాదేశము వచ్చును. చొచ్చే చేన్నాఁడు.

87 సూ. చొచ్చ చ్చో రః

వృ: చొచ్చ ఇత్యస్య యుక్త చకారస్య రేఫాదేశః స్యాదతి. చొరఁగలఁడు.

తె. వృ: 'చొచ్చే' లోని సంయుక్త చేకారమునకు అకారము పరమైనపుడు రేఫాదేశమగును. చొరఁగలఁడు.

88 సూ. తలచే స్మరేః

వృ: స్మృ స్మరణ ఇత్యస్య తలఁచే ఇత్యాదేశః స్యాత్. తలఁచేచేన్నాఁడు.

తె. వృ: స్మ (= స్మరణే) అను ధాతువునకు తలఁచే అని ఆదేశము వచ్చును. తలఁచేచేన్నాఁడు.

89 సూ. లఘో ర్వః

వృ: లఘోః పరస్య అంత్య చకారస్య వకారః స్యాదతి. తలవఁగలఁడు.

తె. వృ: లఘువునకు పరమం దున్న తుది చేకారమునకు వకార మాదేశ మగును. తలవఁగలఁడు.

90 సూ. ణువతే ర్మెచ్చే పొగడౌ

వృ: ణు స్తుతా విత్య స్యైతా వాదేశౌ భవతః. మెచ్చేచేన్నాఁడు. మెచ్చే గలఁడు. అణ్వాదా వితి ప్రతిషేధా ద్వకారో న.

తె. వృ: ణు (= స్తుతౌ) అను ధాతువునకు మెచ్చే-పొగడ అను నాదేశములు వచ్చును. మెచ్చేచేన్నాఁడు. మెచ్చేఁగలఁడు. "అణ్వాదా" అని (72వ సూ. న) ప్రతిషేధముండుటవలన వకారము రాదు.

91 సూ. త్రుంగ కుంద డింద బ్రుంగ చేచ్చే మరే

వృ: మృజ్ ప్రాణత్యాగే ఇత్యస్య త్రుంగాదయః పంచ ఆదేశా భవంతి. ేన్నాఁడు ఇత్యాది.

తె. వృ: మృ (= ప్రాణ త్యాగే) అను ధాతువునకు త్రుంగ-డింద-బ్రుంగ-చేచ్చే అను నాదేశములు వచ్చును. త్రుంగుచే మొ.

92 సూ. చచ్చే పుచ్చే తెచ్చెచ్చే నొచ్చేంగు ష్ట్వా*

ృ: చచ్చాదీనాం యుక్తస్యాంత్య చకారస్య శితౌ లోపవకారౌ వా ఽపరే. చచ్చుచున్నాఁడు. చాగలఁడు. చావగలఁడు. ఆద్య తృతీయాభ్యాం ్ఞేషాం వకారస్య శిత్వాభావో ద్విత్వం చేతి కేచిత్.

ె. వృ: చేచ్చే-పుచ్చే-తెచ్చే-ఎచ్చే-నొచ్చే అను వానిలో తుది , చకారమునకు అకారము పరమయినపుడు లోప-వకారము గా నాదేశములగును. ఈలోప వకారములు శక్తార మిత్సంజ్ఞగాఁ ుక వీని వెనుకనుండు స్వరము దీర్ఘమగును. చచ్చే చేన్నాఁడు. ు-చావఁగలఁడు. పై యాదేశములలో చచ్చు-తెచ్చు కాక ానికి వకారమునకు శిత్త్వములేదనియు, ద్విత్వము వచ్చుననియు ంతము.

93 సూ. తిష్ఠతే ర్నిలచః

): ష్ఠాగతినివృత్తా విత్యస్య నిలచ ఇత్యాదేశః. స్యాత్.

. వృ: ష్ఠా (= గతినివృత్తౌ) అను ధాతువునకు 'నిలచ' అను వచ్చును.

94 సూ. నిలచే మరచోః

: ఏతయో రంత్య చకారస్య ళ్లు గ్వా స్యాదతి. నిలవఁగలఁడు. ). యోగవిభాగాత్ శిత్వాభావో వా. నిలఁగలఁడు.

వృ: నిలచ-మరచ అనువాని చివరి చకారమునకు అకారము ంండఁగా వికల్పముగా ళ్లుక్కు వచ్చును. నిలవఁగలఁడు. నిలాఁ యోగవిభాగమువలన వికల్పముగా శిత్త్వాభావము. నిలఁగలఁడు.

---

్వా" కు బదులు "ళ్లుక్ శ్వా" అని యుండఁదగు ననిపించుచున్నది.

## 95 సూ. సంగమేః కూడ కలసౌ

వృ: సంపూర్వగమే రేతా వాదేశౌ భవతః. కూడుచేన్నాఁడు.

తె. వృ: సంపూర్వకమైన గమ్లు (= గతౌ) అను ధాతువునకు కూడ-కలస అను నాదేశములు వచ్చును. కూడుచేన్నాఁడు.

వృ: "సస్య యః" (30సూ) కలయుచేన్నాఁడు. "అశ్చే" ఇతి నిషేధాదుపోత్తమ స్యోత్వం న. కలయఁగలఁడు, కలసె.

తె. వృ: "సస్య యః" అను 30 వ సూ. ప్రకారము ధాత్వాదేశాంత్య సకారమునకు యకారము వచ్చును. కలయుచున్నాఁడు. 81 వ సూత్రమున 'అశ్చే' అను నిషేధముండుటవలన ఉపోత్తమ వర్ణమునకు ఉత్వమురాదు. కలయఁగలఁడు. కలసె.

## 96 సూ. ఆగమే వచ్చేః

వృ: ఆఙ్ పూర్వస్య గమే ర్వచ్చే ఇత్యాదేశః స్యాత్ - వచ్చుచున్నాడు, "అతా భ్వసాగమాం కావేరాః" (సూ. 33) రాఁగలఁడు, అసిధాతోః భవిష్యదర్థే తస్యైవానుబంధకత్వాత్ వే ఇతి రూపం న. కిం త్వత్వమేవ. కలుగుచేన్నాఁడు. కలుగఁగలఁడు.

తె. వృ: ఆఙ్ పూర్వకమైన గమ ధాతువునకు వచ్చే అను నాదేశము వచ్చును. వచ్చేచేన్నాఁడు. "అతా భ్వసాగమాం కావేరాః" (33 సూ.) రాఁగలఁడు. అస ధాతువునకు భవిష్యదర్థమున నదేయను బంధమగుటవలన 33 సూ. ప్రకారము 'వే' అను రూపమురాదు. అత్వమేవచ్చును. కలుగుచున్నాఁడు. కలుగఁగలఁడు.

## 97 సూ. పతేః పడః

వృ: పత నిపాతన ఇత్యస్య పడ ఇత్యాదేశః. పడుచేన్నాఁడు. పడఁగలఁడు.

తె. వృ: పత (= నిపాతనే) అను ధాతువునకు 'పడ' అను నాదేశము వచ్చును. పడుచున్నాఁడు. పడఁగలఁడు.

## 98 సూ. వా పత్యాదేః.

వృ: పత్యాదే రాదేశస్య ఇయగ్ వా స్యా ద్దేతి. పడె, పడియె.

తె. వృ: పత మొ. వాని యాదేశమునకు ఎకారము చేరినపుడు దానికి వికల్పముగా ఇయక్ ఆదేశమగును. పడె-పడియె.

## 99 సూ. అర్హాతే స్తగః

వృ: అర్హ పూజాయా మిత్యస్య తగ ఇత్యాదేశః స్యాత్. తగుచున్నాఁడు. తగఁగలఁడు. తగె-తగియె.

తె. వృ: అర్హ (= పూజాయామ్) అను ధాతువునకు తగ యని యాదేశము. తగుచున్నాఁడు. తగఁగలఁడు. తగె. తగియె.

## 100 సూ. నగ నవ్వౌ హసేః

వృ: హస వికసన ఇత్య స్యైతా వాదేశౌ భవతః. నగుచున్నాఁడు. నగఁగలఁడు. నగె, నగియె.

తె.వృ: హస (= వికసనే) అను ధాతువునకు నగ-నవ్వ అను నాదేశములు వచ్చును. నగుచున్నాఁడు. నగఁగలఁడు. నగె. నగియె.

## 101 సూ. త్రుటే స్తెగః

వృ: త్రుట ఛేదన ఇత్యస్య తెగ ఇత్యాదేశః స్యాత్. తెగుచున్నాఁడు. తెగఁగలఁడు. తెగియె-తెగె.

తె. వృ: త్రుట (= ఛేదనే) అను ధాతువునకు 'తెగ' అను నాదేశము వచ్చును. తెగుచున్నాఁడు. తెగఁగలఁడు. తెగియె - తెగె

## 102 సూ. చెడ వీడ చెంగ చెదర వదల సడలా శ్లథే

వృ: శ్లథ వైకల్యే ఇత్యస్య చెడాదయః షడాదేశాః. చెడుచున్నాఁడు. చెడఁగలఁడు. చెడియె-చెడె.

తె. వృ: శ్లథ (= వైకల్యే) అనుధాతువునకు చెడ-వీడ-చెంగ-చెదర-వదల-సడల అను నాదేశములువచ్చును. చెడుచున్నాఁడు. చెడఁగలఁడు. చెడియె-చెడె.

## 103 సూ. అర్పే రిచ్చెడ పుడక పొనరాః

వృ: అర్పయతేః ఇచ్చాదయః చత్వార ఆదేశాః, ఇచ్చుచున్నాఁడు. ఇడుచున్నాఁడు. ఇడఁగలఁడు. ఇడియె-ఇడె.

తె. వృ: 'అర్చయతి' యను క్రియకు ఇచ్చ-ఇడ-పుడక-పొనర అను నాదేశములు వచ్చును. ఇచ్చేచేన్నాఁడు. ఇడుచేన్నాఁడు. ఇడఁగలఁడు. ఇడియె-ఇడె.

## 104 సూ. డిగోఽవరుహేః

వృ: అవపూర్వస్య రుహేః డిగ ఇత్యాదేశః. డిగుచేన్నాఁడు. డిగియె-డిగె.

తె. వృ: అవ యను నుపసర్గతోఁ గూడిన రుహ ధాతువునకు డిగ యను నాదేశము వచ్చును. డిగుచేన్నాఁడు. డిగియె-డిగె.

## 105 సూ. ఈగారతీరాడగా ణశేః

వృ: ణశ అదర్శన ఇత్యస్య ఈగాదయః చత్వార ఆదేశాః భవంతి. ఈగుచేన్నది.

తె. వృ: ణశ (= అదర్శనే) అను ధాతువునకు ఈగ-అర-తీర-అడగ అను నాదేశములు వచ్చును. ఈగుచేన్నది.

## 106 సూ. ప్రభవతేః పుట్టపొడమౌ

వృ: ప్రపూర్వాద్భవతే రేతావాదేశౌ భవతః. పుట్టుచేన్నాఁడు.

తె. వృ: 'ప్రభవతి' యను క్రియకు పుట్ట-పొడమ యను నాదేశములు వచ్చును. పుట్టుచేన్నాఁడు.

## 107 సూ. చిదకపగలాగలనలగా ఛిదేః

వృ: ఛిదేః చిదకాదయ శ్చత్వార ఆదేశా భవన్తి. చిదుకుచేన్నది.

తె. వృ: ఛిద ధాతువునకు చిదక-పగల-అగల-నలగ అను నాదేశములు వచ్చును. చిదుకుచేన్నది.

## 108 సూ. ఖేలే రాడః

వృ: ఖేలతే రాడ ఇత్యాదేశః స్యాత్. ఆడుచేన్నాఁడు.

తె. వృ: ఖేల ధాతువునకు 'ఆడ' అను నాదేశము వచ్చును. ఆడుచేన్నాఁడు.

## 109 సూ. గాయతేః పాడః

వృ: గా గానే ఇత్యస్య పాడ ఇత్యాదేశః స్యాత్. పాడుచేన్నాఁడు.

తె. వృ: గా (= గానే) అను ధాతువునకు 'పాడ' అను నాదేశము వచ్చును. పాడుచేన్నాఁడు.

## 110 సూ. పండః ఫలే

వృ: ఫల విశరణ ఇత్యస్య పండ ఇత్యాదేశః స్యాత్. పండుచేన్నది.

తె. వృ: ఫల (= విశరణే) అను ధాతువునకు 'పండ' యను నాదేశము వచ్చును. పండుచేన్నది.

## 111 సూ. తూంగ తోంగ తేండా శ్చ శీజః

వృ: శీజ్ స్వప్న ఇత్యస్య తూఁగాదయ స్త్రయా భవంతి. చకారా త్పండ ఇతిచ. తూఁగుచున్నాఁడు.

తె. వృ: శీజ్ (= స్వప్నే) అనుధాతువునకు తూంగ-తొంగ-తేండ అను నాదేశములు వచ్చును. తూఁగుచేన్నాఁడు.

## 112 సూ. పచే ర్వండః

వృ: డుపచష్ పాకే ఇత్యస్య వండ ఇతి స్యాత్. వండుచేన్నాఁడు.

తె. వృ: (డు) పచ (ష్) (= పాకే)అను ధాతువునకు 'వండ' యను నాదేశము వచ్చును. వండుచేన్నాఁడు.

## 113 సూ. కాల గ్రమ్గ మాడ మండా జ్వలేః

వృ: జ్వల దీప్తా విత్యస్య కాలాదయ శ్చత్వారో భవంతి. కాలుచేన్నాఁడు.

తె. వృ: జ్వల (= దీప్తౌ) అను ధాతువునకు కాల-గ్రమ్గ-మాడ-మండ అను నాదేశములు వచ్చును. కాలుచేన్నాఁడు.

## 114 సూ. వగచ వన రాడలాః ఖేదేః

వృ: ఖేద దైన్య ఇత్యస్య వగచాదయ స్త్రయ ఆదేశాః. వగచేచేన్నాఁడు.

తె. వృ: ఖిద (= దైన్యే) అను ధాతువునకు వగచ-వనర-అడల అను నాదేశములు వచ్చును. వగచేచేన్నాఁడు.

### 115 సూ. రుహే ర్ననచే మొలచౌ

వృ: రుహ బీజజన్మని ప్రాదుర్భావే ఇత్య స్యైతా నాదేశౌ భవతః. ననచే చేన్నది.

తె. వృ: రుహ( = బీజజన్మని) అను ధాతువునకు ననచే-మొలచే యను నాదేశములు వచ్చును. ననచుచేన్నది.

### 116 సూ. పెనగ మలగౌ శ్లిషః

వృ: శ్లిష ఆలింగనే ఇత్య స్యైతౌ భవతః. పెనఁగుచేన్నాఁడు.

తె. వృ: శ్లిష ( = ఆలింగనే) అను ధాతువునకు పెనగ-మలగ యను నాదేశములు వచ్చును. పెనఁగుచేన్నాఁడు.

### 117 సూ. కొలచో మాజ్ భజత్యోః

వృ: మాజ్ మానే, భజ సేవాయా మిత్యేత యో రయ మాదేశః. కొలచే చేన్నాఁడు.

తె. వృ: మా (జ్) ( = మానే), భజ ( = సేవాయామ్) అను ధాతువులకు 'కొలచ' అను నాదేశము వచ్చును. కొలచుచేన్నాఁడు.

### 118 సూ. ఘుణాదినా పుచ్చేః

వృ: ఘుణాది కర్తృకస్య శ్లథేః పుచ్చ ఇత్యాదేశః స్యాత్. పుచ్చేచేన్నది.

తె. వృ: పురుగులుపట్టిన దనునర్థమున శ్లథ ధాతువునకు పుచ్చే అను నాదేశము వచ్చును. పుచ్చేచేన్నది.

### 119 సూ. నొచ్చో ణుదేః

వృ: ణుద ప్రేరణ ఇత్యస్య నొచ్చ ఇత్యాదేశః. నొచ్చేచేన్నది.

తె. వృ: ణుద ( = ప్రేరణే) అను ధాతువునకు 'నొచ్చే' అను నాదేశము వచ్చును. నొచ్చేచేన్నాఁడు.

### 120 సూ. వ్రేస విసర మీట చిమ్మాః క్షిపేః

వృ: క్షిప ప్రేరణ ఇత్యస్య వ్రేసాదయ శ్చత్వారో భవన్తి. వ్రేయు చేన్నాఁడు.

తె. వృ: క్షిప (= ప్రేరణే) అను ధాతువునకు వ్రేస-విసర-మీట-చిమ్మ అను నాదేశములు వచ్చును. వ్రేయుచున్నాఁడు.

## 121 సూ. మట్ట నురచ నురుమాః క్షుదేః

వృ. క్షుదే ర్మట్టాదయ స్త్రయో భవన్తి. మట్టుచున్నాఁడు.

తె. వృ: క్షుద (= సంపేషణే) అను ధాతువునకు మట్ట-నురచ-నురుమ అను నాదేశములు వచ్చును. మట్టుచున్నాఁడు.

## 122 సూ. ఎఱుఁగ తెలసౌ బుధేః

వృ: బుధ అవగమన ఇత్య స్యైతౌ భవతః. ఎఱుఁగుచున్నాఁడు.

తె. వృ: బుధ (= అవగమే) అను ధాతువునకు ఎఱుఁగ-తెలస యను నాదేశములు వచ్చును. ఎఱుఁగుచున్నాఁడు.

## 123 సూ. తనస స్తృపేః

వృ: తృప ప్రీణన ఇత్య స్యాయ మాదేశః. తనియుచున్నాఁడు.

తె. వృ: తృప (= ప్రీణనే) అను ధాతువునకు 'తనస' అను నాదేశము వచ్చును. తనియుచున్నాఁడు.

## 124 సూ. అలస స్రుక్క- చిక్క- బడలాః క్లమే

వృ: క్లమ గ్లానా విత్యస్య చత్వార ఆదేశాః భవన్తి. అలయుచున్నాఁడు.

తె. వృ: క్లము (= గ్లానౌ) అను ధాతువునకు అలస-స్రుక్క-చిక్క-బడల అను నాదేశములు వచ్చును. అలయుచున్నాఁడు.

## 125 సూ. బొంకోఽనృతే

వృ: అనృతే కర్మణి వదేః బొంక ఇత్యాదేశః స్యాత్. బొంకుచున్నాఁడు.

తె. వృ: అనృతము కర్మముగాఁగల వద ధాతువునకు బొంక అను నాదేశము వచ్చును. బొంకుచున్నాఁడు.

## 126 సూ. వాఁగ కూస వదర పదరా అనర్థవాచి

వృ: అనర్థ వాక్యే కర్మణి తస్యైవ వాఁగాదయ శ్చత్వారో భవంతి. వాఁగుచున్నాఁడు.

తె. వృ: అనర్థ వాక్యము కర్మముగాఁగల వద ధాతువునకు వాఁగ-కూస-వదర-పదర అను నాదేశములు వచ్చును. వాఁగుచున్నాఁడు-.

127 సూ. చిలుక చినుక చల్ల కురసా వృషేః

వృ: వృష సేచనే ఇత్యస్య చిలుకాదయ శ్చత్వారో భవంతి. చిలుకుచున్నది.

తె. వృ: వృష (= సేచనే) అను ధాతువునకు చిలుక-చినుక-చల్ల-కురస అను నాదేశములు వచ్చును. చిలుకుచున్నది.

128 సూ. మ్రోఁగ మొరసౌ ణదేః

వృ: ణద అవ్యక్తే శబ్ద ఇత్య స్యైతౌ భవతః. మ్రోఁగుచున్నది.

తె. వృ: ణద (= అవ్యక్తే శబ్దే) అను ధాతువునకు మ్రోఁగ-మొరస అను నాదేశములు వచ్చును. మ్రోఁగుచున్నది.

129 సూ. మేస మెసవౌ ఘాసే

వృ: ఘాసాదౌ కర్మణి త స్యైతౌ భవతః. మేయుచున్నది.

తె. వృ: ఘాసాదులు కర్మగానున్న ఘస ధాతువునకు మేస-మెసవ అను నాదేశములు వచ్చును. మేయుచున్నది.

130 సూ. వ్రేస తోస వైచా న్యసేః

వృ: నిపూర్వస్య అసు క్షేపణ ఇత్య స్య వ్రేసాదయ స్త్రయో భవంతి. వ్రేయుచున్నాఁడు.

తె. వృ: 'ని' యను నుపసర్గతోఁ గూడిన అసు (= క్షేపణే) అను ధాతువునకు వ్రేస-తోస-వైచ అను నాదేశములు వచ్చును. వ్రేయుచున్నాఁడు.

131 సూ. ఆచ్ఛదేః మూస కమ్మ కప్పాః

వృ: ఆఙ్ పూర్వస్య ఛద అపవారణే ఇత్యస్య మూసాదయ స్త్రయో భవంతి. మూయుచున్నాఁడు.

తె. వృ: ఆఙ్ పూర్వకమైన ఛద (= అపవారణే) అనుధాతువునకు మూస-కమ్మ-కప్ప అను నాదేశములు వచ్చును. మూయుచున్నాఁడు.

132 సూ. లిఖే ర్వ్రాసః

వృ: లిఖ లేఖన ఇత్య స్యాయ మాదేశః. వ్రాయుచున్నాఁడు.

తె. వృ: లిఖ (= అక్షర విన్యాసే) అను ధాతువునకు 'వ్రాస' అని యాదేశ మగును. వ్రాయుచున్నాఁడు.

133 సూ. ఖండయతేః కోస నఱకౌ

వృ: ఖడి ఖండన భేదనయోః ఇత్య స్యైతౌ భవతః. కోయుచున్నాఁడు.

తె. వృ: ఖడి (= ఖండన భేదనయోః) అను ధాతువునకు కోస-నఱక అనునవి యాదేశము లగును. కోయుచున్నాఁడు.

134 సూ. కుడుచో భుజేః

వృ: భుజ పరిపాలనాభ్యవహారయో రిత్య స్యాయ మాదేశః స్యాత్. కుడుచుచున్నాఁడు.

తె. వృ: భుజ (= పరిపాలనే-అభ్యవహారే చ) అను ధాతువునకు 'కుడుచే" అని యాదేశమగును. కుడుచుచున్నాఁడు.

135 సూ. కృఞః శ్చేసః

వృ: డు కృఞ్ కరణ ఇత్యస్య చేస ఇత్యాదేశః స్యాత్. చేయుచున్నాఁడు.

తె. వృ: (డు) కృ (ఞ్) = (కరణే) అను ధాతువునకు 'చేస' యను నాదేశము వచ్చును. చేయుచున్నాఁడు.

136 సూ. మొఱఁగ టక్క పిక్కా వంచనాయామ్

వృ: వంచనాయాం కర్మణి తస్యైవ మొరగాదయ స్త్రయో భవంతి మొఱఁగుచున్నాఁడు.

తె. వృ: వంచన కర్మగా గల కృధాతువునకు మొఱఁగ - టక్క - పిక్క అను నాదేశములు వచ్చును. మొఱఁగుచున్నాఁడు.

137 సూ. ఒత్త్రాదమౌ సంవాహనే

వృ: సంవాహనే కర్మణి తస్యై వైతా వాదేశౌ భవతః. ఒత్తుచున్నాఁడు.

తె. వృ: సంవాహన కర్మకమగు కృధాతువునకు ఒత్త - అదమ యనునవి యాదేశము లగును. ఒత్తుచున్నాఁడు.

### 138 సూ. గొరగః క్షౌరే

వృ: క్షౌరే కర్మణి గొరగ ఇత్యాదేశః స్యాత్. గొరుగుచేస్నాఁడు.

తె. వృ: క్షౌర కర్మకమగు కృధాతువునకు 'గొరగ' అనునది యాదేశ మగును. గొరుగుచేస్నాఁడు.

### 139 సూ. ఎరగ మ్రొక్కౌ ప్రణామే

వృ: ప్రణామే కర్మణి తస్యైవ వైతౌ భవతః. ఎరగుచేస్నాఁడు.

తె. వృ: ప్రణామ కర్మకమగు కృధాతువునకు ఎరగ - మ్రొక్క అనునవి యాదేశము లగును. ఎరగుచేస్నాఁడు.

### 140 సూ. ప్రామ రాస పూ సాలకా లేపనే

వృ: లేపనే కర్మణి తస్యైవ ప్రామాదయ శ్చత్వారో భవన్తి. ప్రాము చేస్నాఁడు.

తె. వృ: లేపన కర్మకమైన కృధాతువునకు ప్రామ - రాస - పూస - అలక అను నాదేశములు వచ్చును. ప్రాముచేస్నాఁడు.

### 141 సూ. తరణే ఈదః

వృ: తౄ ప్లవన తరణయో రిత్యస్య ఈద ఇత్యాదేశః స్యాత్. ఈదు చేస్నాఁడు.

తె. వృ: తౄ ( = ప్లవన తరణయోః) అను ధాతువునకు 'ఈద' యని యాదేశమగును. ఈదుచేస్నాఁడు.

### 142 సూ. బెరస డాస పొంద చెంద చేర తారసా వ్రజేః

వృ: వ్రజ గతా విత్యస్య బెరసాదయః షడాదేశాః. బెరయుచేస్నాఁడు.

తె. వృ: వ్రజ( = గతౌ) అనుధాతువునకు బెరస - డాస - పొంద - చెంద - చేర - తారస అను నాదేశములు వచ్చును. బెరయుచేస్నాఁడు.

### 143 సూ. కలఁగో వైక్లబ్యే

వృ: వైక్లబ్యే కర్మణి కలఁగ ఇత్యాదేశః. కలఁగుచేస్నాఁడు.

తె. వృ: వైక్లబ్య కర్మకమగు వ్రజధాతువునకు కలఁగ యని యాదేశ మగును. కలఁగుచేస్నాఁడు.

### 144 సూ. తగ్గ హెచ్చ్చౌ న్యూనతాధిక్యయోః

వృ: ఏతయోః కర్మణోః ప్రవజేః క్రమేణ తగ్గ హెచ్చ్చౌ భవతః తగ్గుచున్నాఁడు. హెచ్చుచున్నాఁడు.

తె. వృ: న్యూనత, ఆధిక్యము కర్మలుగాఁగల ప్రవజధాతువుకు వరుసగా తగ్గ - హెచ్చ్చ అను నాదేశములు వచ్చును. తగ్గుచున్నాఁడు. హెచ్చు చున్నాఁడు.

### 145 సూ. కొదక తమక బెదర జంక జడస వెర చౌలకా భయే

వృ: భయే కర్మణి ప్రజేః కొదకాదయః సప్తాదేశాః స్యుః. కొదకుచున్నాఁడు.

తె. వృ: భయము కర్మగాఁగల ప్రవజధాతువునకు కొదక - తమక- బెదర - జంక - జడస - వెరచ - అలక యను నాదేశములు వచ్చును. కొదకు చున్నాఁడు.

### 146 సూ. పూనో వహేః

వృ: పూనుచున్నాఁడు.

తె: వృ: వహ ధాతువునకు 'పూన' యాదేశ మగును. పూను చున్నాఁడు.

### 147 సూ. క్రాఁ గోడక మరగా స్తపేః

వృ: తప సంతాపే ఇత్యస్య క్రాఁగాదయ స్త్రయ ఆదేశాః స్యుః. క్రాఁగు చున్నాఁడు.

తె. వృ: తప ( = సంతాపే) అను ధాతువునకు క్రాఁగ - ఉడక - మరగ యను నాదేశములు వచ్చును. క్రాఁగుచున్నాఁడు.

### 148 సూ. ఒరఁగ వంగ మ్రొగ్గ వాల వీగా అనమేః

వృ: ఆఙ్పూర్వస్య నమేః ఒరగాదయః పంచాదేశా భవంతి. ఒరఁగుచున్నాఁడు.

తె. వృ: ఆఙ్ పూర్వకమైన నమ ధాతువునకు ఒరఁగ - వంగ - మ్రొగ్గ - వాల - వీగ అనునాదేశములు వచ్చును. ఒరఁగుచున్నాఁడు.

### 149 సూ. సురగ బెగడ తిరగా శ్చరేః

వృ: చర గతా విత్యస్య సురగాదయ స్త్రయ ఆదేశాః. సురగుచున్నాఁడు.

తె. వృ: చర (=గతౌ) అను ధాతువునకు సురగ-బెగడ-తిరగయని యాదేశములగును. సురగుచున్నాఁడు.

150 సూ. అలగ కినుసౌ రుషేః

వృ: రుష్యతే రేతౌ భవతః. అలుగుచున్నాఁడు.

తె. వృ: రుష (=రోషే) అను ధాతువునకు అలగ-కినుస యని యాదేశము లగును. అలుగుచున్నాఁడు.

151 సూ. ధ్వసే స్తునగ తునస విఱగాః

వృ: ధ్వస అధఃపతన ఇత్యస్య తునగాదయ స్త్రయో భవంతి. తునుగుచున్నది.

తె. వృ: ధ్వంసు (=అవస్రంసనే) అనుధాతువునకు తునగ-తునస-విఱగ అను నాదేశములు వచ్చును. తునుగుచున్నది.

152 సూ. పొడచేః ప్రహరణే

వృ: ప్రహరణే పొడచే ఇత్యాదేశః స్యాత్. పొడుచుచున్నాఁడు.

తె. వృ: ప్ర పూర్వక హృధాతువునకు పొడచ అని యాదేశము. పొడుచుచున్నాఁడు.

153 సూ. దున్నః కృషేః

వృ: కృష విలేఖన ఇత్యస్య దున్న ఇత్యాదేశః స్యాత్. దున్నుచున్నాఁడు.

తె. వృ: కృష (=విలేఖనే) అను ధాతువునకు 'దున్న'యని యాదేశము. దున్నుచున్నాఁడు.

154 సూ. క్రచ్చే కోర వేడాః కమేః

వృ: కము కాంతా విత్యస్య క్రచ్చాదయ స్త్రయో భవంతి. క్రచ్చుచున్నాఁడు.

తె. వృ: కము (=కాంతౌ) అను ధాతువునకు క్రచ్చె-కోర-వేడ అనునవి యాదేశము లగును. క్రచ్చుచున్నాఁడు.

155 సూ. అడగః పృచ్ఛేః

వృ: పృచ్ఛ తే రడగ ఇతి స్యాత్. అడుగుచున్నాఁడు.

తె. వృ: పృచ్ఛ (=జ్ఞీప్సాయామ్) అనుధాతువునకు 'అడగ' అని యాదేశము. అడుగుచున్నాఁడు.

156 సూ. అనుకృఞః పోలః

వృ: అను పూర్వస్య కృఞో౽య మాదేశః స్యాత్. పోలుచేన్నాఁడు.

తె.వృ: అను పూర్వకమైన కృ ధాతువునకు 'పోల' అని యాదేశము- పోలుచేన్నాఁడు.

157 సూ. గణే రెన్నః

వృ: గణ సంఖ్యాన ఇత్య స్యాయ మాదేశః స్యాత్. ఎన్నుచున్నాఁడు.

తె. వృ: గణ (= సంఖ్యానే) అను ధాతువునకు 'ఎన్న' యని యాదేశము-ఎన్నుచేన్నాఁడు.

158 సూ. అల్ల వాడ పన్నా రచేః

వృ: రచయతేః అల్లాదయ స్త్రయో భవంతి. అల్లుచేన్నాఁడు.

తె. వృ: రచ (= ప్రతియత్నే) యను ధాతువునకు అల్ల-వాడ-పన్న యనునవి యాదేశములు. అల్లుచున్నాఁడు.

159 సూ. ఒప్ప మిర కామర వెలగ తనర మెరస వెల సాలరాః కాశే

వృ: కాశృ దీప్తా విత్యస్య ఒప్పాద యో౽ష్టావాదేశా భవంతి. ఒప్పుచేన్నాఁడు.

తె. వృ: కాశృ (= దీప్తౌ) అను ధాతువునకు ఒప్ప-మిరక-అమర-వెలగ-తనర-మెరస-వెలస-అలర అను నాదేశములు వచ్చును. ఒప్పుచేన్నాఁడు.

160 సూ. పొరలో లుఠేః

వృ: లుఠతే రయ మాదేశః. పొరలుచేన్నాఁడు.

తె. వృ: లుఠ ధాతువునకు 'పొరల' యని యాదేశము. పొరలుచేన్నాఁడు.

161 సూ. కంపతే ర్వడఁక కదల మెదలాః

వృ: కపి చలన ఇత్యస్య వడఁకాదయ స్త్రయో భవంతి. వడఁకుచేన్నాఁడు.

తె. వృ: కపి (= చలనే) అను ధాతువునకు వడఁక-కదల-మెదల యనునవి యాదేశము లగును. వడఁకుచేన్నాఁడు.

### 162 సూ. తేల ఆప్లవేః

వృ: ఆఙ్ పూర్వస్య ప్లవేః తేల ఇత్యాదేశః స్యాత్. తేలుచున్నది.

తె. వృ: ఆఙ్ పూర్వమయిన ప్లవధాతువునకు తేల యని యాదేశము. తేలుచున్నది.

### 163 సూ. భ్రమేస్తిరగః

వృ: అస్యాయ మాదేశః స్యాత్. తిరుగుచున్నాఁడు.

తె. వృ: భ్రము ( = చలనే) అనుధాతువునకు 'తిరగ' అని యాదేశము. తిరుగుచున్నాఁడు.

### 164 సూ. మ్రింగో గ్రసేః

వృ: గ్రసతేః మ్రింగ ఇత్యాదేశః స్యాత్. మ్రింగుచున్నాఁడు.

తె. వృ: గ్రస ( = అదనే) అను ధాతువునకు 'మ్రింగ' అని యాదేశము. మ్రింగుచున్నాఁడు.

### 165 సూ. క్రోల త్రావ ఆన కతకాః పిబేః

వృ: పిబతేః క్రోలాదయ శ్చత్వారో భవంతి. క్రోలుచున్నాఁడు.

తె. వృ: పా ( = పానే) యను ధాతువునకు క్రోల-త్రావ-ఆన-కతక యను నాదేశములు వచ్చును. క్రోలుచున్నాఁడు.

### 166 సూ. ఊఁగః ప్రేంఖోలేః

వృ: ప్రేంఖోలేః ఊఁగ ఇతి స్యాత్. ఊఁగుచున్నాఁడు.

తె. వృ: ప్రేంఖోల ధాతువునకు 'ఊఁగ' యను నాదేశము వచ్చును. ఊఁగుచున్నాఁడు.

### 167 సూ. రో (సః) వెతకౌ మృగేః

వృ: మృగ అన్వేషణ ఇత్య స్యైతౌ భవతః. రోయుచున్నాఁడు.

తె. వృ: మృగ ( = అన్వేషణే) అను ధాతువునకు రో (స?)-వెతక యని యాదేశములు. రోయుచున్నాఁడు.

168 సూ. పునకొంట పట్ట ముట్ట తాఁక నివరాః స్పృశేః

వృ: స్పృశతేః పునకాదయః షడాదేశా భవంతి. పునుకుచేన్నాఁడు.

తె. వృ: స్పృశ ధాతువునకు పునక-అంట-పట్ట-ముట్ట-తాఁక-నివర యనునవి యాదేశములు. పునుకుచేన్నాఁడు.

169 సూ. ఏల ప్రోచ కాచ ప్రోవగ (?) సాకా రక్షేః

వృ: రక్షతే రేలాదయః పంచాదేశా భవంతి. ఏలుచేన్నాఁడు.

తె. వృ: రక్ష ధాతువునకు ఏల - ప్రోచ-కాచ-ప్రోవగ (?)-సాక అనునవి యాదేశము లగును. ఏలుచున్నాఁడు.

170 సూ. ఎక్క ప్రాకా వారుహేః

వృ: ఆరోహతే రేతౌ భవతః. ఎక్కుచేన్నాఁడు.

తె. వృ: ఆఙ్ పూర్వక రుహ ధాతువునకు ఎక్క-ప్రాఁక యనునవి యాదేశము లగును. ఎక్కుచేన్నాఁడు.

171 సూ. క్రుంకోఽస్తమయే

వృ: క్రుంకుచున్నాడు.

తె. వృ: అస్తమయార్థమున 'క్రుంక' యని యగును. క్రుంకు చేన్నాఁడు.

172 సూ. నీలగో జృంభణే

వృ: అస్యాయ మాదేశః. నీలుగుచేన్నాఁడు.

తె. వృ: జృంభణార్థమున 'నీలగ' యని యగును. నీలుగు చేన్నాఁడు.

173 సూ. ధావేః పార పరచౌ

వృ: ధావు గతౌ విత్య స్యైతా వాదేశౌ భవతః. పారుచేన్నాఁడు.

తె. వృ: ధావు ( = గతౌ) అను ధాతువునకు పార-పరచే అనునవి యాదేశములు. పారుచేన్నాఁడు.

174 సూ. చేఱచే కొట్టాడఁచౌ స్తడేః

వృ: తడ ఆఘాత ఇత్య స్యైతే త్రయో భవంతి. చేఱచేచేన్నాఁడు.

తె. వృ: తడ (= ఆఘాతే) అను ధాతువునకు చేఱచే-కొట్ట-అడఁచే యనునవి యాదేశములు. చఱచేచేన్నాఁడు.

175 సూ. దాట గడచౌ వతిక్రమే

వృ: అతి పూర్వస్య క్రమే రేతౌ భవతః. దాటుచేన్నాఁడు. గడచే చేన్నది.

తె. వృ; అతి పూర్వకమైన క్రమ ధాతువునకు దాట-గడ చేయనునవి యాదేశములు. దాటుచేన్నాఁడు. గడచేచేన్నది.

176 సూ. చలే శ్చెల్లః

వృ: చలతే రయ మాదేశః. చెల్లుచేన్నది.

తె. వృ: చల ధాతువునకు 'చెల్ల' యని యాదేశము. చెల్లు చేన్నది.

177 సూ. విద్రవే ర్బి(ర్ద్రి)ద్దః

వృ: విద్రవతే ర్బి(ర్ద్రి) ఇత్యాదేశః స్యాత్. బి(ది) ద్దుచేన్నది.

తె. వృ: విపూర్వక ద్రు ధాతువునకు 'బి(ర్ద్రి)ద్ద' యని యాదేశము. బి(ర్ద్రి)ద్దుచేన్నది.

178 సూ. కరఁగో ద్రవేః

వృ: అస్యాయ మాదేశః. కరఁగుచేన్నది.

తె. వృ: ద్రు (= ద్రవే) అను ధాతువునకు 'కరఁగ'అని యాదేశము. కరఁగుచేన్నది.

179 సూ. ఆనయతే స్తెచ్చేః

వృ: ఆనయతే రయ మాదేశః. తెచ్చేచేన్నాఁడు.

తె. వృ: ఆఙ్ పూర్వక నయ ధాతువునకు 'తెచ్చే' యని యాదేశము. తెచ్చేచేన్నాఁడు.

## 180 సూ. మఱచో విస్మరేః

వృ: విస్మరతే ర్మఱచ ఇతి స్యాత్. మఱచుచేసున్నాఁడు.

తె. వృ: విపూర్వక స్మృ ధాతువునకు 'మఱచ' యని యాదేశము. మఱచుచేసున్నాఁడు.

### అథ ణిజంతరూపాణి

## 181 సూ. ణిచ శ్చ

వృ: హేతుమతి చేత్యాదిభి ర్విహితస్య ణిచః స్థానేఽపి ఇంచుక్ స్యాత్.

తె. వృ: హేతుమతి చ (పా. 3.1.26) మొదలగు సూత్రములచే విధింపఁబడిన ణిచ్ ప్రత్యయ స్థానమునఁగూడ ఇంచుక్కు వచ్చును.

## 182 సూ. చ స్యేంచుః పః

వృ: అంగ సంబంధిన శ్చుగించు క్సంబంధినశ్చ చకారస్య పకారః స్యా దించుకి. పోషింపుచేసున్నాఁడు. అతాలవ్యస్య-పోషింపింపుచేసున్నాఁడు.

తె. వృ: అంగమునకు (ప్రకృతికి) సంబంధించినదియు, చుక్-ఇంచుక్ అను ప్రత్యయములలోనిదియు నగుచకారమునకు ఇంచుక్కు పరమయిన యెడల పకారము వచ్చును. పోషింపుచేసున్నాఁడు. "అతాలవ్యస్య" (6 సూ.) పోషింపింపుచేసున్నాఁడు.

## 183 సూ. ణిజర్థస్య కృఞ్

వృ: ణిజర్థస్య కృఞనుబంధో వా స్యాత్. పోషింపఁజేయుచేసున్నాఁడు.

తె. వృ: ణిజర్థమునకు కృఞాదేశము వికల్పముగా ననుబంధముగా వచ్చును. పోషింపఁజేయుచేసున్నాఁడు.

## 184 సూ. ణా వకర్మకాత్ స్వార్థేంచుకః

వృ: అకర్మకా ద్ధాతోః స్వార్థేంచుకో లుక్ స్యాత్ ణిచి పరే. కీర్తి విస్త రింపుచేసున్నాడు. ఆజ్ఞాపింపుచేసున్నాఁడు-ఇత్యాదౌ పుగాదయః.

తె. వృ: అకర్మక ధాతువునకు ణిచ్చు పరమైనవుడు స్వార్థమున వచ్చిన ఇంచుక్కు లోపించును. కీర్తివిస్తరింపు చేసున్నాఁడు. ఆజ్ఞాపింపు చేసున్నాఁడు మొ. వానిలో పుగాగమాదులు గ్రహించునది.

వృ: అథ దేశ్యాః.

తె. వృ: ఇంక దేశ్యములు-

185 సూ. చే స్యేంచే కి పః

వృ: తలపింపుచున్నాఁడు.

తె. వృ: ఇంచుక్కు పరమైనప్పుడు చకారమునకు పకార మాదేశమగును. తలపింపుచేన్నాఁడు.

186 సూ. గవే ర్యఉ (?) రించుకి చ

వృ: ఇంచుకి వలోపో నేష్యతే. పొదివింపుచేన్నాఁడు. అతా భ్వసాగమాం కాలేరాః. రావింపుచేన్నాఁడు. భువేః-కావింపుచేన్నాఁడు.

తె. వృ: ఇంచుక్కు పరమయినపుడు వకారలోప మిష్టముకాదు. పొదివింపుచేన్నాఁడు. "అతా భ్వసాగమాం కా-లే-రాః" (33 సూ.) ఆగమధాత్వాదేశమునకు - రావింపుచేన్నాఁడు. భూధాత్వాదేశమునకు కావింపుచేన్నాఁడు.

187 సూ. గ్రహాదే రిపుక్

వృ: గ్రహాద్యాదేశస్య ఇపుగాగమః స్యా దించుకి. కొనిపించుచేన్నాఁడు.

తె. వృ: గ్రహాదుల యాదేశములకు ఇంచుక్కు పరమగునపుడు ఇపు గాగమము వచ్చును. కొనిపించుచేన్నాఁడు.

188 సూ. ఉండ వీడ చూ డాడ నురమాడ పూడ వాడః

వృ: ఉండాదీనాం డకారాత్పరతః ఇంచుకశ్చుగ్వా స్యాత్. ఉంచుచేన్నాడు. ఉండింపుచున్నాడు. వసే రున ఇత్యాదినా నత్వమ్. వీడ్చుచున్నాడు. వీడించు చున్నాడు.

తె. వృ: ఉండ-వీడ-చూడ-ఆడ-నురమాడ - పూడ - వాడ అను వాని డకారమునకు పరమందు ఇంచుక్కుకు బదులు వికల్పముగా 'చుక్' వచ్చును. ఉంచుచేన్నాడు. ఉండింపుచేన్నాఁడు. ఇక్కడ "వసేరున" ఇత్యాది (74 వ) సూత్రముచే నత్వము. వీడ్చుచేన్నాఁడు. వీడించుచేన్నాఁడు.

189 సూ. ఇంచేకో ల శ్చుగ్వా

వృ: అసంయుక్తా ల్లవరా త్పరస్య ఇంచుక శ్చుగ్వా స్యాత్. వదల్చు చున్నాడు. వదలించుచేన్నాడు.

తె. వృ: అసంయుక్తమైన లవర్ణమునకుఁ బరమయిన ఇంచేక్కుకు బదులు వికల్పముగా చేక్కు వచ్చును. వదల్చుచేన్నాఁడు. వదలించు చేన్నాఁడు.

## 190 సూ. గురోర్నః

వృ: గురోః పరతః స్థితా న్నకారా త్పరస్య ఇంచేక ష్చుగ్వా స్యాత్. పూన్చుచేన్నాఁడు. పూనించేచేన్నాఁడు.

తె. వృ: గుర్వక్షరముమీఁది నకారమునకు బరమయిన ఇంచేక్కు నకు వికల్పముగా చేక్కు వచ్చును. పూన్చుచేన్నాఁడు. పూనించే చేన్నాఁడు.

## 191 సూ. స్వార్థే కనః

వృ: కన ఇత్యస్య దీర్ఘః స్యాత్ స్వార్థేచేకి. కాంచుచేన్నాఁడు. ఎన్న ఇత్యస్యాపి స్వార్థ ఏవ చుగ్వా. ఎంచుచేన్నాడు. ఎన్నుచేన్నాఁడు.

తె. వృ: స్వార్థమున చేక్కు పరమగునపుడు 'కన' కు దీర్ఘము వచ్చును. కాంచుచేన్నాఁడు, 'ఎన్న' కును స్వార్థముననే 'చేక్కు' వికల్పముగా వచ్చును. ఎంచేచేన్నాఁడు. ఎన్నుచేన్నాఁడు.

## 192 సూ. రోఽకమాదౌ

వృ: కమాది వర్జిత క్రియాదేశసంబంధినో రేఫా త్పరత స్తథైవ. తార్చు చేన్నాఁడు-తారించేచేన్నాఁడు. అకమాదా వితి కిమ్? కోరించుచేన్నాఁడు.

తె. వృ: కమాదులుగాక తక్కిన క్రియాదేశముల రేఫకుఁ బరమందును స్వార్థమున చేక్కు వికల్పముగా వచ్చును. తార్చుచేన్నాఁడు-తారించేచేన్నాఁడు. 'అకమాదౌ' అనుటవలన-కోరించుచేన్నాఁడు మొ. వానిలో స్వార్థమున చేక్కురాదు.

## 193 సూ. గేన ద్రవాదేః

వృ: ద్రవాదేశా ద్గకారేణ సహ చుగ్వా స్యాత్. కరంచేచేన్నాఁడు. కరఁగించేచేన్నాఁడు. ద్రవాదే రితి కిమ్? నీలిగించేచేన్నాఁడు.

తె. వృ: ద్రు (= ద్రవే) అను ధాతువున కాదేశమగు 'కరఁగ'లో గకారము లోపించిచేగాగమము వికల్పముగా వచ్చును. కరంచే

చేన్నాఁడు-కరఁగించుచేన్నాఁడు. ద్రవాదేః అనుటవలన తదితరముల కీవిధి వర్తింపదు. నీలిగించుచేచున్నాఁడు.

## 194 సూ. ఆనమే ర్దీ రించుకి

వృ: ఆనమే రాదేశస్య దీర్ఘః స్యా దించుకి. వాంచుచేన్నాడు. వంగించుచే చేన్నాఁడు.

తె. వృ: అనమ ధాత్వాదేశమగు 'వంచే' కు ఇంచుక్కు చేరినపుడు అకారమునకు దీర్ఘమగును. వాంచుచేన్నాఁడు. వంగించుచేచున్నాఁడు.

## 195 సూ. చేన దృశ్యాదే ర్లిత్

వృ: దృశ్యాదే రాదేశే చేన సహ చుగ్, లిత్వం స్యాత్. పత్వమ్. చూపు చేన్నాఁడు.

తె. వృ: దృశి మొదలయిన ధాతువుల యాదేశములందు చకారము లోపించి చేగాగమము వచ్చును. అది లిత్తుగా నుండును. లిత్తు గాన దీనికి వికల్పము లేదు. * పత్వము (6 వ సూ.) చూపుచేన్నాఁడు.

## 196 సూ. చేచ్చే ను ట్పః

వృ: చచ్చు ఇత్యస్య చేగాదేశ సంబంధినః పస్య నుడాగమః స్యాత్. చంపు చేన్నాఁడు.

తె. వృ: చేచ్చే అనుదాని చేగాదేశమునకు సంబంధించిన పకార మునకు నుట్-ఆగమముగా వచ్చును. ఇది టిత్తుగాన పకారమునకు ముందు వచ్చును. † చేంపుచేన్నాఁడు.

## 197 సూ. తాలస్య ధాఞః స్వార్థే

వృ: డుధాఞ్ ధారణ పోషణయో రిత్యస్య స్వార్థే తాలాదేశః చేక్చ. తాల్చుచేన్నాఁడు.

తె. వృ: (డు) ధా (ఞ్) (= ధారణ పోషణయోః) అను ధాతు వునకు స్వార్థమున 'తాల' అను నాదేశమును చేగాగమమును వచ్చును. తాల్చుచేన్నాఁడు.

---

*ప్రాయో లితి న వికల్పః-వాల్మీ. సూ. 1-1-14
†ఆద్యన్తౌ టకితౌ—పా. 1-1-46

## 198 సూ. ఏడో రుదేః

వృ: రుదిర్ అశ్రువిమోచన ఇత్యస్య తథైవ ఏడాదేశః చుక్చ. ఏడ్చు చేన్నాఁడు. ద్విత్వం. చేకారస్య పత్వం వేతి కేచిత్. మెచ్చింపుచేన్నాఁడు. ఆలసింపుచేన్నాఁడు. చలింపుచేన్నాఁడు. దంతురింపుచేన్నాఁడు–ఇత్యాదీని కరోత్యర్థే ణిజంతరూపాణి, ఇష్ఠ వద్భావేతు – ప్రథింపుచేన్నాఁడు. స్పృజింపుచేన్నాఁడు. బలింపుచేన్నాఁడు. క్వచి దవ్యయా దపి. అహమింపుచేన్నాఁడు. అంతరింపు చేన్నాఁడు. తద్భవా దపి. వక్కరింపుచేన్నాఁడు. వల్లింపుచేన్నాఁడు.

తె. వృ: రుదిర్ (= అశ్రు విమోచనే) అను ధాతువునకును పైన జెప్పినట్లే స్వార్థమున 'ఏడ' అను నాదేశమును, చుగాగమమును వచ్చును. ఏడ్చుచున్నాఁడు. ద్విత్వమును చేకారమునకు పత్వమును వికల్పముగా నగునని కొందఱ మతము. మెచ్చింపుచున్నాఁడు. మెప్పింపుచేన్నాఁడు. ఆలసింపుచేన్నాఁడు. చలింపుచున్నాఁడు. దంతురింపుచేన్నాఁడు–ఇటు వంటివి 'చేయుట' యను నర్థమున ణిజంత రూపములు. ఇష్ఠ వద్భావము* వచ్చిన చోట – ప్రథింపుచున్నాఁడు. స్పృజింపుచున్నాఁడు. బలింపు చేన్నాఁడు. అందందు అవ్యయము మీఁదఁగూడ ఇంచుక్కు వచ్చును– అహమింపుచేన్నాఁడు. అంతరింపుచున్నాఁడు. తద్భవములకుఁగూడ– వక్కరింపుచేన్నాఁడు. వల్లింపుచున్నాఁడు.

## 199 సూ. గలక్ కరోతౌ దేశ్యాత్

వృ: దేశ్యా త్ప్రాదా దలగాగమః స్యాత్ కరోతీత్యర్థే విహితే ఇంచుకి పరే. ఓడుగలింపుచేన్నాఁడు – వరగలింపుచున్నాఁడు. శాస్త్రస్యా నిత్యత్వా త్క్వచిన్న. ఇనుమడింపుచేన్నది. సరబడింపుచేన్నది. అనుకరణవిశేషాదపి న గుబాళింపుచేన్నది. దువాళింపుచేన్నది.

తె. వృ: 'చేయుచున్నాఁడు' అనునర్థమున విహితమైన ఇంచుక్కు పరమైనపుడు దేశ్య ధాతువునకు 'గలక్' అను నాగమము వచ్చును. ఓడు గలింపుచున్నాఁడు. వరగలింపుచేన్నాఁడు. ఆగమశాస్త్ర మనిత్య మను పరిభాషను బట్టి కొన్ని యెడల నీ గలగాగమము రాదు. ఇనుమడింపుచేన్నది. సరబడింపుచేన్నది. అనుకరణవిశేషముమీఁదఁగూడ గలగాగమము రాదు. గుబాళింపుచేన్నది. దువాళింపుచున్నది.

---

* ప్రాతిపదికా ద్ధాత్వర్థే బహుల మిష్ఠవచ్చ. పా. వా. 3–1–26.

### 200 సూ. క్వచి న్నామ్నః

వృ: క్వచి న్నామ్నోపి ఆచారాద్యర్థేషు ఇంచుక్ స్యాత్. శబ్దింపుచేన్నాఁడు. కలహింపుచేన్నాఁడు. ఉపమానాత్తు-వ్యాఘ్రింపుచేన్నాఁడు. హేమింపుచేన్నది. ఆదిగ్రహణా దభూతతద్భావే చ - దూరింపుచేన్నాఁడు. ఆసన్నింపుచేన్నాఁడు.

తె. వృ: ఒక్కొక్క యెడ నామమునకుఁ గూడ ఆచారాద్యర్థములలో ఇంచుగాగమము వచ్చును. శబ్దింపుచేన్నాఁడు. కలహింపుచేన్నాఁడు. ఉపమానము మీఁద - వ్యాఘ్రింపుచేన్నాఁడు. హేమింపుచేన్నది. ఆచారాద్యర్థములని ఆదిగ్రహణము చేయుటవలన అభూత తద్భావమునఁగూడ ఇంచుగాగమము నామముపై వచ్చును. దూరింపుచేన్నాఁడు, ఆసన్నింపుచేన్నాఁడు.

### 201 సూ. గు గుణాత్

వృ: గుణవాచకా ద్దేశ్యపదా ద్గుగాగమఃస్యా దించేకి. తెల్లగింపుచున్నది. సన్నగింపుచేన్నది క్వచి ద్దేశ్యా దపి. ఖారగింపుచేన్నది.

తె. వృ: గుణవాచకమగు దేశ్యశబ్దముమీఁద ఇంచేక్కు పరమైనపుడు 'గుక్' ఆగమముగా వచ్చును. తెల్లగింపుచేన్నది. సన్నగింపుచేన్నది. ఒకానొకయెడ దేశ్యశబ్దముమీఁద గూడ నీ యాగమము వచ్చును. ఖారగింపుచేన్నది.

అథ భావకర్మణో రూపాణి
ఇంక భావకర్మ రూపములు.

### 202 సూ. భావే ట

వృ: భావార్థే టవర్ణకః స్యాత్. "ట చే గ్రహి షూత్," (౭వ సూ.) రామునిచే ప్రభవిల్లుట. ఉండుట.

తె. వృ: భావమును దెలుపునపుడు ట వర్ణకమగును. "ట చే గ్రహి షూత్" అను (౭వ) సూ. ను బట్టి క్రియకు ఉకారము వచ్చును. రామునిచే ప్రభవిల్లుట. ఉండుట.

### 203 సూ. పతతేః కర్మణి పడుధాత్వాద్యేః

వృ: కర్మార్థే విహితస్య ధాతోః పడ్వనుబన్ధోఁ భవతి - పోషింపఁబడుచేన్నాఁడు. పలుకఁబడుచేన్నారు.

తె. వృ: కర్మార్థమునఁ జెప్పబడిన ధాతువునకు 'పడు' అను నను బంధము వచ్చును. పోషింపఁబడుచేన్నాఁడు. పలుకఁబడుచేన్నారు.

## 204 సూ. క్రియార్థాంతరేచ

వృ: ఏకస్మిన్నర్థే విహితో ధాతుః యథాప్రయోగ మర్థాంతరేచ స్యాత్. జయించె రిపుల. ప్రణమిల్లె హరికి. మగువ నాథుని జింతించె. మగువచింతిల్లె.

తె. వృ: ఒక యర్థమునఁ జెప్పఁబడిన ధాతువు ప్రయోగానుసారముగా అర్థాంతరమునఁగూడఁ జెల్లును. జయించె రిపుల. ప్రణమిల్లె హరికి. మగువ నాథుని జింతించె. మగువ చింతిల్లె.

## 205 సూ. సుసః పల్లవాత్

వృ: క్వచి త్ప్రథమాంతాత్ పల్లవసంజ్ఞితా చ్ఛబ్దాదపి పరతః క్రియా యథాయోగ మర్థాంతరే చ స్యాత్. దిక్కుసెడు. పదనెక్కు. తెంపరు. తళుకొత్తు - ఇత్యాదావకర్మకత్వమ్. వివాహమగు. చెట్టబట్టు. కాలుద్రొక్కు, చేన్నాడు ఇత్యాదౌ సకర్మకత్వమ్. చేకొను, దాకొను, దీకొను ఇత్యాదయో బహవః ప్రథమానిపాతాదేశాః. అంగలించు, ప్రుగ్గలించు, ఓగలించు, చెంగలించు, తురంగలించు, బెంగలించు, తొంగలించు, రంగలించు. వెలడు, తవడు, ఏతెంచు, పుత్తెంచు, అరుదెంచు - ఇత్యాదీనాం బహుళం వర్ణలోపాగమాదేశాః గ్రాహ్యాః.

తె. వృ: ఒకానొక యెడ పల్లవమని పేర్కొనఁబడిన శబ్దమునకుఁ బరమైన క్రియయు ప్రయోగానుసారముగా నర్థాంతరమున నుండును. దిక్కుసెడు, పదనెక్కు, తెంపరు, తళుకొత్తు - ఇత్యాదులందు అకర్మకత్వము. వివాహమగు, చెట్టబట్టు, కాలుద్రొక్కు, చేన్నాడు - ఇత్యాదులందు సకర్మకత్వము. చేకొను, దాకొను, దీకొను - మొదలైన పెక్కులు ప్రథమానిపాతముల కాదేశములు. అంగలించు, ప్రుగ్గలించు. ఓగలించు, చెంగలించు, తురంగలించు, బెంగలించు, తొంగలించు, రంగలించు, వెలడు, తవడు, ఏతెంచు, పుత్తెంచు, అరుదెంచు - మొదలగు వానియందు వర్ణలోపాగమాదేశములు బహుళముగా గ్రహింపఁదగియున్నవి.

## 206. సూ. ఉ గాదేర్లః

## 207. సూ. పూనగే వా

వృ: పూనాది ష్వాదేర్లో వా లుక్ స్యాత్. ఊనుచున్నది-పూనుచున్నది. పూన, నెసగ, పొదవ, పొనర, పొలస, పొంద, పగల, కరంగేత్యాదిషు ప్రథమ స్వరలోపాదయోఽన్యతోఽవగంతవ్యాః. తథా చ కరంగె, మొరంగె, మురగె, మొరసె, వరసె, తరచె-ప్రథమ స్వరలుక్. పరతో యది దీర్ఘగతిః. ప్రథవేల్లఘుపూర్వకస్యతస్య చ వా సరళః. అస్యాయ మర్థః. కరంగాదిషు ద్వితీయస్వరస్య

దీర్ఘో వా చేత్తు హ్రస్వస్వరస్య లుగ్వా. క్రాఁగుచున్నది. కరఁగుచున్నది-ఇత్యాది. లఘుపూర్వమక్షరం యస్య స తకారః సరళో వా స్యాత్. గదుకుచున్నది. గతుకుచున్నది. బ్రదుకుచున్నది-బ్రతుకుచున్నది.

తె. వృ: పూను మొ. వానియందు తొలి హల్లు వికల్పముగా లోపించును. ఊనుచున్నది-పూనుచున్నది. పూన, నెసగ, పొడవ, పొనర, పొలస, పొంద, పగల-ఇవి పూనాదులు. కరంగ-మొ. వానియందు ప్రథమ స్వరలోపాదుల నితర గ్రంథములనుండి యెఱుంగునది. కరంగె, మొరంగె, మరగె, మొరసె, వరసె, తరచె-వీనియందుఁ బ్రథమస్వరలోపము. ప్రథమస్వరలోపము వచ్చినప్పుడు ద్వితీయ స్వరము దీర్ఘమగును. ఇది వికల్ప విధి; కాఁబట్టి క్రాఁగుచున్నది-కరఁగుచున్నది. మొ. వెనుక లఘ్వక్షరముగల తకారము వికల్పముగా సరళమగును. గదుకుచున్నది, గతుకుచున్నది. బ్రదుకుచున్నది-. బ్రతుకుచున్నది.

గద్య

ఇతి శ్రీమద్బాలగోపాల కరుణాకటాక్ష సంప్రాప్తాష్టభాషాకవిత్వ
సామ్రాజ్య పట్టభద్రేణ మంచెళ్ల వంశార్ణవపౌర్ణిమాచంద్రేణ
హిరువన్నగ సేతు మధ్యమహీవలయ విరాజమాన
నానావిధ విద్యాప్రవీణ విద్వత్కవితా వితాన
సంస్తూయమాన పాండితీమణినా వాసుదేవ
కవినా విరచితాయాం వైకృత
చంద్రికాయాం తిజంత విభాగః
సమాప్తః

## 3. కృదన్త విభాగః

### 1 సూ. భావే కృత ష్టః

వృ: భావార్థే విహితస్య కృత ష్టవర్ణకః స్యాత్. పోషించుట. పలుకుట.

తె. వృ: భావార్థమున విహితమైన కృ(త్ప్ర)త్యయస్థానమున టవర్ణక మగును. పోషించుట. పలుకుట.

### 2 సూ. అగ తగ న గేంక పుట్టేభ్యో వుశ్చ

వృ: అగాదే ష్టవర్ణకస్య వుశ్చ స్యాత్. అగువు. చకారాత్-అగుట.

తె. వృ: అగ-తగ-నగ-ఇంక-పుట్ట ధాతువుల టవర్ణకమునకు వువర్ణకమును నగును. అగువు. 'వుశ్చ' అని సముచ్చయముతోఁ జెప్పుట వలన-అగుట.

### 3 సూ. తెగా ద్వః

వృ: టస్యే త్యనువర్తతే. తెగేత్యస్మాత్ తస్యైవ వః స్యాత్. తెగువ.

తె. వృ: టవర్ణకమున కని యనువర్తించును. తెగ యను ధాతువునకు టవర్ణకమునకు బదులు 'వ' వర్ణకము వచ్చును. తెగువ.

### 4 సూ. లు క్చిదకే

వృ: చిదకాదేష్టస్య లుక్ స్యాత్. చిదకు. కొదకు. నా.........రుపూర్వా త్కోపధా త్సర్వస్మా ద్భవ తీతి కేచిత్.

తె. వృ: చిదక మొ. వానికి ట వర్ణకమునకు లోపము వచ్చును. చిదకు కొదకు ......... రుపూర్వకమైన కకార ముపధగాఁగల యెల్ల ధాతువులకును నగునని కొందఱ మతము.

### 5 సూ. ఆడ పాడ పండ వండ మండానా మంత్యస్య

వృ: ఆడాదీనా మంత్యవర్ణస్య సాచ్కస్య లుక్ స్యాత్ టవర్ణకే. ఆట.

తె. వృ: ఆడ-పాడ-పండ-వండ-మండ యను ధాతువులకు ట వర్ణకము పరమగునపు డచ్చుతోఁగూడిన తుదిహల్లు లోపించును. ఆట. పాట మొ.

6 సూ. పుక్ చ సోః.

వృ: అంత్యయో శ్చసోః పుక్ స్యాత్. మొలపు. తడపు.

తె. వృ: ధాతువు చివరి చ, సలకు బదులు 'పు' వచ్చును. మొలచ-మొలపు. తడస-తడపు.

7 సూ. ఇచ్చ చచ్చయోః విశ్వుశౌ

వృ: ఏతయో రంత్యస్య యుక్తవర్ణస్య విశ్, వుశ్ ఇత్యేతౌ భవతః. ఈవి. చావు.

తె. వృ: ఇచ్చ-చచ్చ యను ధాతువులకు తుది సంయుక్తాక్షరమునకు బదులు క్రమముగా విశ్, వుశ్ అను వర్ణకములు వచ్చును. ఇవి శిత్తులగుట వలన పూర్వస్వర దీర్ఘము వచ్చును. * ఈవి. చావు.

8 సూ. వగచ నగగ(?) పెనచ కొలచాం లుక్

వృ: వగ చాదీనా మంత్యస్య లుక్ స్యాత్. వగ-వగపు.

తె. వృ: వగచ - నగగ(?) - పెనచ - కొలచ ధాతువులకు అంత్యలోపము. వగ-వగపు.

9 సూ. పుచ్చ నొచ్చయోః ప్పిక్

వృ: ఏతయోః ప్పిక్ స్యాత్. పుప్పి. నొప్పి.

తె. వృ: పుచ్చ-నొచ్చ ధాతువులకు చివరి సంయుక్తాక్షరమునకు లోపమును 'ప్పి' గాగమమును వచ్చును. కకారమిత్తు ఆగమము చివరం జేరునని తెలుపును.† పుప్పి. నొప్పి.

10 సూ. చొచ్చస్య రవః

వృ: చొచ్చ ఇత్య స్యాంత్యస్య రవ ఇతి స్యాత్. చొరవ:

తె. వృ: చొచ్చ ధాతువునకు తుది సంయుక్తమునకు బదులు 'రవ' వచ్చును. చొరవ.

---

*శితి దీర్ఘః-వాల్మీ-సూ. సంజ్ఞ. 16

†ఆద్యన్తౌ టకితౌ-పా.

11 సూ. అలస కూస మేస మ్రోస మూస ప్రాస కోస వ్రాస వేస పోసానాం తజ్

వృ: అలసాదే రంత్యస్య తజ్ స్యాత్. అలత, పక్షే-అలపు.

తె. వృ: అలస-కూస-మేస-మ్రోస-మూస-ప్రాస-కోస-వ్రాస-వేస-పోస ధాతువులకు తజాదేశము. జకార మిత్తు. ఆదేశముతుది యక్షరము నకని తెలుపును.* అలస-అలత. పక్షాంతరమున. అలపు.

12 సూ. ఈద కలఁగోనానాం

వృ: ఈదాదేః తజ్ స్యాత్. ఈత.

తె. వృ: ఈద-కలఁగ-ఊన ధాతువులకు తజాదేశము. ఈత.

13 సూ. తినో డిజ్

వృ: తిన ఇత్యస్య డిజ్ స్యాత్. 'హైకాచ' ఇత్యాదినా బిందుః. తిండి.

తె. వృ: తిన ధాతువునకు డిజ్ వచ్చును. ఇది జిత్తు గనుక బిందుక పూర్వకము. 'హైకాచ' ఇత్యాది (సంధి-38) సూత్రమును బట్టి బిందుకమునకు బదులు బిందువు. తిండి.

14 సూ. మెలగ వే గాడఁగాం కువజ్

వృ: మెలగాదేః కువజ్ స్యాత్. మెలఁకువ.

తె. వృ: మెలగ-వేగ-అడఁగ ధాతువులకు కువజాదేశము. మెలఁకువ.

15 సూ. తగ్గే-చ్చోః కువజ్

వృ: ఏతయోః కువజ్ స్యాత్. తక్కువ.

తె. వృ: తగ్గ-ఎచ్చ ధాతువులకు కువజాదేశము. తక్కువ. ఎక్కువ.

16 సూ. ఎఱగ గొరగ కాగ వీఁగాలగ కినస తునస మొలచాం కః

వృ: ఎఱదేః కః స్యాత్. ఉత్కమీతి కవర్ణ మాత్ర సాధారణ్యాత్ పూర్వ స్యోత్వమ్. ఎఱుక.

---

*జిచ్చ - పా1-1-53

తె. వృ : ఎఱగ-గొరగ-కాగ-వీఁగ - అలగ-కినస-తునస-మొలః ధాతువులకు కవర్ణకాదేశము. అలోఽన్త్యస్య-పా.1.1.52 అను నాద వ్యాకరణ పరిభాషను బట్టి కవర్ణకము ధాతువు నంత్య వర్ణమున కాదే మగును. ఉత్కమిత్యాది ( ) సూత్రమును బట్టి క వర్ణమాత్రము సాధ రణముగ నుండుటవలన పూర్వవర్ణమునకు ఉత్వము. ఎఱుక.

17 సూ. గ మ్యాగమో ర్వ్యతిరేకాత్

వృ: ఏతయోర్వ్యతిరేకరూపాత్ స్వార్థే కః స్యాత్. రాక-పోక.

తె. వృ: గమ-ఆగమ ధాతువుల యాదేశముల వ్యతిరేక రూపముః మీఁద స్వార్థమున కవర్ణకము వచ్చును. రాక. పోక.

18 సూ. చెడ పడో ష్టుశ్

వృ: ఏతయో ష్టుశ్ స్యాత్. చేటు. పాటు.

తె. వృ: చెడ - పడ ధాతువులకు టుశ్ ఆదేశము. చేటు-పాటు ప్రత్యయము శిత్తు గనుక పూర్వ దీర్ఘము.

19 సూ. పొడచే డేన

వృ: పొడచే ఇత్యస్య డేన సహ లుక్ స్యాత్. పోటు.

తె. వృ: పొడచే ధాతువున టుఙ్ సన్నియోగమున 'ఉ' తోఁగూడ "చే" లోపించును. పోటు.

20 సూ. దున్నః కిర్

వృ: దున్న ఇత్యస్య పరతః కిర్ స్యాత్. దుక్కి

తె. వృ: దున్న ధాతువునకు కిర్ ఆదేశమగును. దుక్కి.

21 సూ. ఇకి వినః

వృ: విన ఇత్యస్య ఇకి భవతి. వినికి.

తె. వృ: విన-ధాతువునకు ఇకి ప్రత్యయ మగును. వినికి.

22 సూ. చూచో వ్యతిరేకవ దలుక్

వృ: చూచ ఇత్యస్య వ్యతిరేకవద్భావః. తత ఇకి స్యా దలుక్చ. చూడికి.

తె. వృ: చూచ ధాతువునకు వ్యతిరేకవద్భావమును దానిపై ఇకి ప్రత్యయమును డకారమునకు లోపాభావమును వచ్చును. చూడికి.

23 సూ. పూన కోర పోలాదే రికశ్చ

వృ: పూనాదేః పరతః ఇకో భవతి. చకారా దికిశ్చ. పూనిక. పూనికి.

తె. వృ: పూన-కోర-పోల మొ. ధాతువులకు 'క' వర్ణకమును, చకారమువలన పైఁజెప్పిన 'ఇకి' ప్రత్యయమును వచ్చును. పూనిక-పూనికి.

24 సూ. ఎన్న పన్న చేర తీరామర పొరల కదలాల్ల తేలాడ వాడ బడలాత్

వృ: ఎన్నాదేః పరతః ఇకః స్యాత్. ఎన్నిక.

తె. వృ: ఎన్న - పన్న - చేర - తీర - అమర - పొరల - కదల- అల్ల - తేల - ఆడ - వాడ - బడల ధాతువులకు ఇక ప్రత్యయమగును. ఎన్నిక.

25 సూ. తిరగ విరగ కలఁగ మ్రింగ పొసఁగా దుడుః

వృ: తిరగాదేః పరతఉడుః స్యాత్. తిరుగుడు.

తె. వృ: తిరగ - విరగ - కలఁగ - మ్రింగ - పొసఁగ ధాతువులకు ఉడు ప్రత్యయము వచ్చును. తిరుగుడు.

26 సూ. సర్వస్మాద్ వ్యతిరేకే మిః

వృ: సర్వస్మాద్ ధాతోః వ్యతిరేకార్థే మిః స్యాత్. పోషింపమి. పలుకమి.

తె. వృ: ఎల్ల ధాతువులకును వ్యతిరేకార్థమున మి - ప్రత్యయము వచ్చును. పోషింపమి. పలుకమి.

27 సూ. ధాతో ర్వేడ్వేడయ స్తద్ధర్మే

వృ: సర్వస్మా దాతోః తద్ధర్మార్థే ఉ - ఎడు-ఎడి ఇత్యేతే వర్ణకా భవంతి. దీనుల పోషించు దేవుండు. పోషించెడు వేల్పు. పోషించెడి దేవత. త్రయాణా మసమస్తత్వమపి.

తె. వృ: ఎల్ల ధాతువులకును తద్ధర్మార్థమున కృత్ - స్థానమున ఉ - ఎడు - ఎడి వర్ణకములు వచ్చును. దీనులఁ బోషించు దేవుఁడు. పోషించెడు వేల్పు. పోషించెడి దేవత. ఈ మూడు రూపములును సమస్తములు గాను, అసమస్తములుగాను ప్రయోగింపఁబడును.

28 సూ. వ్యతిరేకే నిః

వృ: సర్వస్మా ద్ధాతో ర్వ్యతిరేకార్థే నిః స్యాత్. పోషింపని దేవత. రక్షింపని వేల్పు.

తె. వృ: ఎల్ల ధాతువులకును వ్యతిరేకార్థమున (తద్ధర్మమున) ని వర్ణకమగు. పోషింపని దేవత. రక్షింపని వేల్పు.

29 సూ. భూతే నః

వృ: భూతార్థే నవర్ణకః స్యాత్. పోషించిన దేవుండు. ప్రోచిన వేల్పు.

తె. వృ: ఎల్ల ధాతువులకును భూతార్థమున న వర్ణక మగును. పోషించిన దేవుండు. ప్రోచిన వేల్పు.

30 సూ. గ్రహ పత్యాదే ర్లుగ్వా

వృ: గ్రహాదేశ పత్యాదేశయోః భూతే న వర్ణకస్య లుగ్వా స్యాత్.

తె. వృ: గ్రహ - పత ధాతువుల యాదేశములగు కొన - పడ ధాతువులకు భూతార్థమునఁ బరమయిన న వర్ణకమునకు వికల్పముగా లోపమగును.

31 సూ. గ్రహ పత్యాదే రితోఽత్

వృ: గ్రహాదేః పత్యాదేశ్చ ఇతోఽత్ స్యా న్నవర్ణక లోపే.

తె. వృ: గ్రహ - పత ధాత్వాదేశములకు న వర్ణక లోపము వచ్చినప్పుడు ఇకారమునకు అకారమగును.

32 సూ. నలుకి ద్విత్వం గ్రహాదేః

వృ: గ్రహాదేః పత్యాదేశ్చ ద్విత్వం స్యాత్ నకారస్య లోపే. పోషించి కొన్నవాఁడు. పోషించికొనినవాఁడు ఇత్యాది.

తె. వృ: న వర్ణకలోపము గలిగినప్పుడు కొన - పడ - మెు. ధాతువుల తుది యక్కరములు జడ్డలగును. పోషించికొన్నవాఁడు, పోషించి కొనినవాఁడు. పోషింపఁబడినవాఁడు. పోషింపఁబడ్డవాఁడు.

వృ: ''ఉండే ష్టిజి చ'' (75వ సూ.) ఉన్నజనుండు.

తె. వృ: ''ఉండే ష్టిజి'' అను (75వ) సూత్రము వలన నకారాదేశము. ఉన్న జనుండు.

33 సూ. అస్తే ర్గినా

వృ: అస భువీతి ధాతోః గినా సహ నస్య లుక్ స్యాత్. .................
నలోపో ధకారస్యా ...................................... ఉవర్ణ ప్రకృతౌ.
కర్మార్థస్య కర్తృతాయా మనుబంధస్య పతే ర్నిత్యం లుక్ స్యాత్. రాముఁడు
పోషించు.................జనుడు రాముఁడు పోషించిన జనుఁడు. ............
.........................................................

తె. వృ: అస (= భువి) యనుధాతువు నాదేశమగు కలగ ధాతువు
మీద న వర్ణకము చేరిన రూపము కలిగిన. ఇందు 'గిన' లోపించును.
పోషింపఁగలదేవత ..................................................
.................. కర్మార్థము కర్తయైనపుడు అనుబంధమైన పతధా
త్వాదేశము నిత్యముగా లోపించును. రాముఁడు పోషించు జనుఁడు.
రాముఁడు పోషించిన జనుఁడు. రాముఁడు పోషింపఁగల జనుఁడు.

34 సూ. క్త్వ ఇత్

వృ: క్త్వా ప్రత్యయస్య ఇకారాదేశః స్యాత్. పోషించి. పలికి.

తె వృ: క్త్వా పత్యయమునకు ఇకారాదేశము. పోషించి. పలికి.

35 సూ. క వ్యతిరేకే క్త్వః

వృ: వ్యతిరేకార్థేక్త్వాప్రత్యయస్య క వర్ణకః స్యాత్. పోషింపక...
దయోఽర్థ త్రయేఽపి సంభవంతీత్యాది
సర్వమన్యత్సుగమమ్.

తె. వృ: వ్యతిరేకార్థమున క్త్వా పత్యయమునకు క వర్ణక మగును.
పోషింపక. ..............................................
మొదలగునవి యర్థత్రయమునను వచ్చునను నీ మొదలగు నితర విషయమెల్లను
సులభముగ గహింపఁదగినది.

గద్య

ఇతి శ్రీ మద్వ్యాలగోపాల కరుణాకటాక్ష సంప్రాప్తాష భాషాకవిత్వ
సామ్రాజ్య పట్టభద్రేణ మంచెళ్ల వంశార్ణవ పూర్ణిమా చంద్రేణ
హిమవన్నగ సేతుమధ్య మహీవలయవిరాజమాన నానావిధ
విద్యాప్రవీణ విద్వత్కవితా వితాన సంస్తూయ
మాన పాండితీమణినా వాసుదేవకవినా
విరచితాయాం వైకృత చంద్రికాయాం
కృదంతవిభాగః సమాప్తః.

---

# అకారాది సూత్రానుక్రమణిక


| సూత్ర సంఖ్య | సూత్ర ప్రారంభం | ప్రకరణం | పుట సంఖ్య |
|---|---|---|---|
| 13 | అ ఏ అవధారణే | స్వాది, అవ్యయ | 69 |
| 60 | అకర్మకా | తిఙంత | 170 |
| 10 | అఖోర్ద్విత్వ | తద్భవ | 105 |
| 2 | అగ తగన | కృదన్త | 201 |
| 39 | అంగారనాళ | పైశాచీ | 143 |
| 36 | అచ ఉపధాయా ఋకి | సంధి | 21 |
| 25 | అచ్ ప్రాణః | సుబంత, సంజ్ఞా | 10 |
| 68 | అచః క్రియాంత్య | తిఙంత | 172 |
| 44 | అచ్చ హేత్సిందూరే | తద్భవ | 112 |
| 10 | అచేతనానాం | స్వాది, హలంత | 55 |
| 20 | అజడాత్సంఖ్యే | తద్ధితాదేశ | 99 |
| 155 | అడగః పృచ్ఛేః | తిఙంత | 188 |
| 5 | అత్ ద్రోణీ | పైశాచీ | 136 |
| 38 | అత్ సంతోషే | ప్రాకృత | 130 |
| 1 | అంత్యస్య | స్వాది, హలంత | 52 |
| 85 | అంత్యస్యచో | తిఙంత | 176 |
| 33 | అతా భ్య సాగమాం | తిఙంత | 163 |
| 6 | అతాలవ్యస్య | తిఙంత | 157 |
| 13 | అత్పుళింద | అపభ్రంశ | 149 |
| 40 | అంత్యేఽస్మదః | సమాస | 95 |
| 25 | అతో ద్రుతే | సంధి | 18 |
| 1 | అతోలుగంత్య | ప్రాకృత | 123 |
| 2 | అతోలుగాదే | పైశాచీ | 136 |
| 1 | అథసమాసాః | సమాస | 86 |
| 25 | అదితోర్య్యా | తద్ధితాదేశ | 100 |
| 12 | అద్రుతేసుపి | విభక్త్యర్థ | 83 |
| 39 | అ-ది-దారాదేః | స్వాది, అజంత | 35 |
| 40 | అ-ది-వర్ణకేభ్యోడుజ్ | స్వాది, అజంత | 35 |
| 9 | అందు కికు చుకావా | సంధి | 15 |
| 21 | అందు జిపః | స్వాది, అజంత | 30 |
| 82 | అదేస్తినమెక్కో | తిఙంత | 175 |
| 17 | అందౌ | సంధి | 17 |
| 25 | అందౌను మోవికల్పః | స్వాది, అజంత | 31 |

| సూత్ర సంఖ్య | సూత్ర ప్రారంభం | ప్రకరణం | పుట సంఖ్య |
|---|---|---|---|
| 78 | అనపలకాడ | తిజంత | 174 |
| 11 | అనః ప్రియంగౌ | చూళికా | 146 |
| 11 | అనమోనః | సమాస | 88 |
| 27 | అన్యథాత్వమహత్వమ్ | స్వాది, అజంత | 31 |
| 6 | అనాదేస్తదః | సమాస | 87 |
| 19 | అనార్యాంబ | సమాస | 90 |
| 10 | అనితో న్వమః | స్వాది, అజంత | 27 |
| 20 | అనిశ చిహ్న | పైశాచీ | 139 |
| 21 | అనిశపూర్ణిమయో | పైశాచీ | 139 |
| 156 | అనుకృజః పోలః | తిజంత | 189 |
| 2 | అనుక్తం సంస్కృతవత్ | సుబంత, సంజ్ఞా | 5 |
| 38 | అనుబంథేకః | తిజంత | 164 |
| 31 | అన్యేస్థిరాః | సుబంత, సంజ్ఞా | 11 |
| 17 | అనౌపవిభక్తి కేచ | విభక్త్యర్థ | 84 |
| 3 | అప్రాణిన్యావా | స్త్రీప్రత్యయ | 75 |
| 12 | అపి యద్యోరేని | స్వాది, అవ్యయ | 69 |
| 34 | అపూర్వం వికృతం | సుబంత, సంజ్ఞా | 12 |
| 6 | అబద్ధే ఖో | అపభ్రంశ | 148 |
| 33 | అంబా తాంబూల | తద్భవ | 120 |
| 11 | అమహాతాం దట్ | స్వాది, హలంత | 55 |
| 33 | అమంత్య వదనస్య | సమాస | 93 |
| 27 | అమ్మ సో ర్ద్విత్వం | స్వాది, హలంత | 60 |
| 67 | అమాదా | స్వాది, అజంత | 44 |
| 35 | అయో భువేస్తు | తిజంత | 163 |
| 21 | అయ్యో కట్టా | స్వాది, అవ్యయ | 72 |
| 17 | అరః పథమస్య | తిజంత | 159 |
| 74 | అరః పితరి | స్వాది, అజంత | 47 |
| 27 | అర్ధబిందు ర్బిందుకః | సుబంత, సంజ్ఞా | 10 |
| 27 | అర్థవిశేషేదః | తిజంత | 161 |
| 87 | అర్ధస్యసమేఽంశే | తద్భవ | 121 |
| 99 | అర్హతేస్తగః | తిజంత | 179 |
| 1 | అరిమీమ్కా | తద్ధితాదేశ | 96 |
| 103 | అర్పేరిచ్చెడ | తిజంత | 179 |
| 150 | అలగ కినుసారుషేః | తిజంత | 188 |
| 11 | అలస కూస | కృదన్త | 203 |
| 124 | అలెసస్రుక్క | తిజంత | 183 |
| 158 | అల్ల వాడ | తిజంత | 189 |
| 43 | అలి జేః | సంధి | 23 |

| సూత్ర సంఖ్య | సూత్ర ప్రారంభం | ప్రకరణం | పుట సంఖ్య |
|---|---|---|---|
| 91 | అళీక తిత్తిరి | తద్భవ | 122 |
| 3 | అవర్ణ స్యాలా పురుక్ | సంధి | 13 |
| 1 | అవ్యయాని | స్వాది, అవ్యయ | 66 |
| 24 | అవ్యవహితః | సుబంత, సంజ్ఞా | 10 |
| 76 | అవావౌ | స్వాది, అజంత | 47 |
| 80 | అపుండోరనః | తిజంత | 174 |
| 48 | అవ్వో ద్వై పయోర్వ్యః | ప్రాకృత | 131 |
| 3 | అ దేశా[illegible]ద్ధాతో | తిజంత | 156 |
| 59 | అ[illegible]ంఖ్యాసంఖ్యే | స్వాది, అజంత | 42 |
| 32 | అస్యా[illegible] | సంధి | 20 |
| 13 | అస్తి ర్వ[illegible]త్తః | తిజంత | 158 |
| 14 | అ[illegible]స స్వపోవా | సంధి | 16 |
| 33 | అస్త్రేగినా | కృదన్త | 207 |
| 12 | అస్త్రేః కలగః | తిజంత | 158 |
| 35 | అక్ సం[illegible]దావదోః | స్వాది, హలంత | 64 |
| 96 | ఆగమే వచ్ఛః | తిజంత | 178 |
| 131 | ఆచ్ఛదేః | తిజంత | 184 |
| 5 | ఆడ పాడ [illegible]ండ | కృదన్త | 201 |
| 22 | ఆ [illegible] | స్వాది, హలంత | 59 |
| 17 | ఆత్మ్నవేధసో | స్వాది, హలంత | 57 |
| 4 | ఆనః పతిజ్ఞాతే | శౌరసేనీ | 133 |
| 30 | ఆతో సుక్తాపుటస్య | పైశాచీ | 141 |
| 28 | ఆతో లుక్ | అపభ్రంశ | 152 |
| 67 | ఆద్భవ సమయయోః | తద్భవ | 117 |
| 9 | ఆదిః ఋః | సుబంత, సంజ్ఞా | 7 |
| 16 | ఆదోతో సోలాయామ్ | సమాస | 89 |
| 194 | ఆనమేర్ధి | తిజంత | 196 |
| 2 | ఆ మామః | తద్ధితాదేశ | 96 |
| 46 | ఆ స్లూ[illegible]లః | ప్రాకృత | 131 |
| 179 | ఆనయతే స్త్రైచ్ఛః | తిజంత | 192 |
| 44 | ఆరడీ ఖిజా | ప్రాకృత | 131 |
| 18 | ఆర్యాదే రంత్యే | సమాస | 89 |
| 65 | ఆవహం నిర్వహోర్యే | తిజంత | 171 |
| 15 | ఆశ్చ రోర్యన్త | ప్రాకృత | 126 |
| 62 | ఆవ్యాసంవసో | తిజంత | 170 |
| 21 | ఇకి వినః | కృదన్త | 204 |
| 7 | ఇచ్చ చచ్చయోః | తిజంత | 202 |

| సూత్ర సంఖ్య | సూత్ర ప్రారంభం | ప్రకరణం | పుట సంఖ్య |
|---|---|---|---|
| 9 | ఇచ్చ్త లఘుకేకః | ప్రాకృత | 124 |
| 189 | ఇంచుకోల | తిజంత | 194 |
| 18 | ఇజః ఖురే | అపభ్రంశ | 150 |
| 31 | ఇత ఇత్ | సంధి | 20 |
| 22 | ఇత్ కన్యకా గోళక | పైశాచీ | 140 |
| 3 | ఇత్కష్టేఽంత్యస్య | మాగధీ | 135 |
| 4 | ఇత్కురువకేవః | తద్భవ | 103 |
| 40 | ఇతః పింఛస్యదిః | తద్భవ | 14 |
| 23 | ఇతః శుక్తి | ప్రాకృత | 127 |
| 50 | ఇతః | స్వాది, అజంత | 39 |
| 42 | ఇత్ సుపోఽనలాతః | సంధి | 23 |
| 51 | ఇతో జసాదావుత్ | స్వాది, అజంత | 39 |
| 7 | ఇతో దిర్వ్యార్హా | శౌరసేనీ | 134 |
| 28 | ఇతో వినీ | తద్ధితాదేశ | 101 |
| 18 | ఇతో హేత్పితృ | తద్భవ | 106 |
| 20 | ఇతో హేత్కోకిలే | అపభ్రంశ | 150 |
| 5 | ఇతో హేన్మృగ | చూళికా | 144 |
| 13 | ఇద మద | స్వాది, హలంత | 55 |
| 24 | ఇద్వ ధూనికాయా | పైశాచీ | 140 |
| 21 | ఇదీతా వూరోస్సే | సమాస | 90 |
| 10 | ఇ దూ ర్ణానిశా | పైశాచీ | 137 |
| 16 | ఇదే తేఖర్జూ | అపభ్రంశ | 149 |
| 19 | ఇద్యే మలేమ్లోః | అపభ్రంశ | 150 |
| 62 | ఇదోక స్సందేహ | తద్భవ | 116 |
| 46 | ఇన్మృత్యు భీరుకయోః | తద్భవ | 112 |
| 19 | ఇమనిచోవా | స్వాది, హలంత | 57 |
| 53 | ఇమ్యాదేః | స్వాది, అజంత | 40 |
| 43 | ఇయగ్భవేత్ | తిజంత | 165 |
| 38 | ఇయోహేత్ | స్వాది, అజంత | 34 |
| 12 | ఇరి స్నాతిణః | తద్ధితాదేశ | 98 |
| 30 | ఇరు న లోర్న్యా రౌనః | సమాస | 92 |
| 3 | ఇవార్థే | స్వాది, అవ్యయ | 66 |
| 23 | ఇస్సీశ్వరస్మరణే | స్వాది, అవ్యయ | 72 |
| 105 | ఈగార తీ | తిజంత | 180 |
| 12 | ఈత్ ఖోః శ్మశ్రుణి | ప్రాకృత | 125 |
| 27 | ఈతః ఖలీనేహః | ప్రాకృత | 128 |
| 45 | ఈ తో జంబీ | తద్భవ | 112 |

